# ఈ సంపుటంలో

ఆదర్శ శిఖరాలు : నాటికలు

సునీధ
భిక్షాపాత్ర
పాదుసంఘం
యాదవ ప్రళయం
డమడమాల బండి
తమ్మపడగ
దానధార
విధినిర్ణయం
ధమ్మిల్లం
ప్రతిక్రియ
ఫ్రెంచికామెడీ
స్వర్గమా, నరకమా?
ఆదర్శ శిఖరాలు

నాటకాలు :

ప్రతిమ
బొమ్మ ఏడ్చింది

## జి. వి. కృష్ణరావు రచనలు

ఒకటో సంపుటం : సాహిత్య విమర్శ (కావ్యజగత్తు, ఇతర వ్యాసాలు)

రెండో సంపుటం : Studies in Kalapurnodayam

మూడో సంపుటం : నవలలు పాపి కొండలు

నాలుగో సంపుటం : నవలలు : కీలుబొమ్మలు, జఘనసుందరి, రాగరేఖలు,

ఐదో సంపుటం : నాటికలు – నాటకాలు
(ఆదర్శ శిఖరాలు, ప్రతిమ, బొమ్మ ఏడ్చింది.)

ఆరో సంపుటం : పద్యాలు, కథలు, ఇతరాలు

ఏడో సంపుటం : తాత్త్వికం – విగ్రహ వ్యావర్తని, ప్లేటో, కాంట్ ఇతర తాత్త్విక వ్యాసాలు

# ఆదర్శ శిఖరాలు

జి.వి. కృష్ణరావు

సంపాదకుడు

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

A GIFT FROM A DAUGHTER
IN MEMORY OF HER FATHER, THE WRITER

ప్రభాస పబ్లికేషన్స్
బోసురోడ్ - తెనాలి

ఆదిత్య శిఖరాలు
ప్రతిమ
బొమ్మ ఏడ్చింది



పునర్ముద్రణ : జనవరి, 1999

వెల రూ. 125/-

ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
దుర్గయ్య వీధి, గవర్నరుపేట,
విజయవాడ - 500 002.

గ్రాఫిక్స్ - ప్రింటర్స్ . కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్,
ఆర్ టి సి క్రాస్‌రోడ్స్, ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020

# సంపాదకుని మాట

ఒక రచయిత తన రచనల ద్వారానే ఎల్లకాలం సజీవంగా జనాళిలో ఉండగలడు ఎప్పుడు? ఆయన రచనలో గ్రంథరూపంలోనో, మరో రూపంలోనో అందుబాటులో ఉన్నప్పుడే కాని దురదృష్టవశాత్తు కృష్ణరావుగారి రచనలు చాలా కాలంగా లభ్యంకావడం లేదు ఆయన సాహిత్యం మీద పరిశోధనలు చేసే వారంతా, నేను ఆయనకు సన్నిహిత మిత్రుణ్ణి కావడంతో, నన్ను కలిసి, ఆయనను గురించి, వారి గ్రంథాలు లభ్యమయ్యే విధం గురించి అడుగుతూ ఉంటారు గ్రంథాలు లేక పోవడంతో నేనూ వారికి ఏమీ చేయలేని వాడినయ్యాను

కృష్ణరావుగారి కొమారితలిద్దరూ – ఉమాదేవి, శోభాదేవి – ఎప్పుడు అమెరికానుంచి తెనాలి వచ్చినా, వారిదగ్గర వారి తండ్రిగారి గ్రంథాల ప్రచురణ గురించి ఈ అవసరంతో ప్రస్తావిస్తూ ఉండేవాణ్ణి వారు ఎప్పుడూ సుముఖతనే వ్యక్తం చేశారు కాని అది కార్యం రూపం ఆమధ్య జనవరి **1998**న వారు తెనాలి వచ్చినప్పుడు, దాల్చింది ప్రచురణ బాధ్యతలు నేను స్వీకరిస్తానంటే వారు 'సరే' అన్నారు నేను దానికి, కృష్ణరావుగారిమీద నాకున్న ఎనలేని గౌరవాభిమానాలను పురస్కరించుకొని, వెంటనే అంగీకరించాను

ఈ కార్యంలో నేను చాలా మందికి కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది

తొలుదొల్తగా, తమ అమూల్యమైన సలహాలిచ్చి, జి వి కె ని స్థూలంగా పరిచయంచేసే వ్యాసాన్ని వ్రాసి ఇచ్చిన హితశ్రీ గారికి, కృష్ణరావుగారి గ్రంథాలనూ, వ్యాసాలనూ, అందించిన విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ ఆర్ట్స్ కాలేజి సిద్ధార్థ కళాపీఠం సంచాలకులు నాగళ్ళ గురుప్రసాద రావుగారికి, అలాగే డి టి పి ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ విషయాలలో అడుగడుగునా నాకు కుడిభుజమై నిలిచిన సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహితీ విమర్శకులు బి తిరుపతిరావుగారికి, జి వి కృష్ణరావుపై పరిశోధన చేసి పిహెచ్ డి పొందిన, తెలుగు అకాడమీ లో పనిచేస్తున్న, మాణిక్య లక్ష్మిగారు కృష్ణరావు గారి వివిధ రచనల కాలాలను తెలియ జేశారు – వారికి, గ్రంథాకృతిని గురించి సలహాలు ఇచ్చిన డా పి.వి రమణ గారికి, గ్రంథ సేకరణలో అత్యంతంగా సహాయసహకారాలందించిన డా వెలగా వెంకటప్పయ్య గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ హైదరాబాద్ వారికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను

– సంపాదకుడు

# ప్రకాశకుల మాట

మా నాన్నగారు జీవించి ఉన్నప్పుడే ఆయన రచనలకు మలికూర్పు రాక పోవడం వల్ల అవి దొరకడం దుర్లభంగా ఉండేది ఆయనమీద పరిశోధనలు సాగించేవారు గ్రంథాలు దొరకక చాలా ఇబ్బందులకు గురయ్యారు ఏ హితశ్రీగారో, రెడ్డిగారో తమ వద్ద ఉన్న మా నాన్నగారి రచనలను వారికి ఇచ్చి వారి అవసరాలు తీర్చేవారు ఆవిధంగా వారి దగ్గర కూడా గ్రంథాలు లేకుండా పోయాయి

తరువాత మా నాన్నగారు గతించి నప్పటినుంచి, ఆయన రచనలన్నీ ఒకమారు ఉప్పొత్తించాలని రెడ్డిగారు మాకు సూచిస్తూనే ఉన్నారు మాకూ అదే తలంపు ఉంది చూస్తుండగానే చాలకాలం గడిచింది

**1998** జనవరిలో మేము భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి గారు మళ్ళీ ఆ ప్రస్తావన తీసుకొచ్చారు మేము 'సరే' అన్నాం రెడ్డిగారిని అచ్చుపని చూడవలసిందిగా అభ్యర్థించాం వారికి మా నాన్నగారితో ఉన్న స్నేహ సంబంధాలను పురస్కరించుకొని, సంతోషంతో 'సరే' అన్నారు ఎంతో శ్రమించి, ఎక్కడెక్కడో వెతికి, దొరకని రచనలను దొరికించుకొని, ఏడు సంపుటాలలో ముద్రణా నిర్వహణను విజయవంతంగా నిర్వహించినందుకు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు

అలాగే ఈ గ్రంథాలు వెలికి రావడంలో చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం

జి. ఉమాదేవి

జి శోభాదేవి

# జీవితం, రచనలు

- హితశ్రీ

ఒక రచయితను అంచనా వేయడానికి, అతడు నిశ్వసించింది ఉచ్ఛ్వసించింది ఏమిటో తెలియాలి అతడు నిశ్వసించింది - అతడు చదివిన చదువు, పొందిన శిక్షణ అతడు ఉచ్ఛ్వసించింది అతడు కావించిన సృష్టి, రాసిన రాతలు

ఆయన ఎంతో చదివారు చదవక రాయడం కుదిరేపనికాదు ప్రాక్పశ్చిమ రససిద్ధాంతాలను, సాహిత్యాన్ని, దర్శనాలను లోతుగా చదివారు

ప్రాక్పశ్చిమ రస సిద్ధాంతాలను ఆస్వాదించారు అంటే అటు అరిస్టటిల్ కావ్యాను శాసనం, ప్లేటో రామణీయకతనుంచి కాంట్ పరతత్వవాదం వరకు, ఇటు బరతుని నాట్య శాస్త్రంతో మొదలెట్టి బామహ, ఉద్భట, బట్టనాయక, బట్టలొల్లట, ఆనందవర్ధన, ఇందు రాజ, అబినవగుప్త, క్షేమేంద్ర, మహిమబట్ట, మమ్మటుల దాకా బారతీయ రస సిద్ధాంతాలను ఔపోశన పట్టారు

అర్థరాహిత్య రంగస్థలిని (Theatre of the Absurd) అర్థం చేసుకొన్నారు ''సప్తబంగుల అస్పష్టత' (Seven Types of Ambıgnıty) లోని స్పష్టతను ఎరిగారు పాక్పశ్చిమ దర్శనాలను మదించారు ఆర్య నాగార్జున నిసాపెక్ష వాదంలో జెనో "Flyıng arrow ıs at rest" (ఎగురుతున్న బాణం నిశ్చల స్థితిలో ఉంది) ను చూశారు

మార్క్సు గతి తర్కం గతిని పరిశీలించి యన్ యమ్ రాయ్ మానవత్వాన్ని (Human-ness) గుర్తించారు

మార్క్సు, హెగెల్ల వ్యవస్థలలో (దర్శనాలలో) వ్యక్తిలుప్తమైనాడని, సార్త్ర్ అస్తిత్వంలోని మనిషి అస్తిత్వ వేదనను పట్టుకొన్నారు ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని బారతీయ ధ్వని సిద్ధాంతంతో ముడిపెట్టారు ప్రవర్తన వాదాన్ని, గెస్టాల్ట్ సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించారు

ఇదీ క్లుప్తంగా ఆయన విస్తృత కాన్వాస్ దీని మీద ఆయన ఉలితో ఉల్లేఖించారు

సాహితీ మేరువు డాక్టర్ జీ వి కృష్ణరావు పూర్తిపేరు గవిని వెంకటకృష్ణరావు వారి స్వస్థలం తెనాలి తాలూకా కూచిపూడి గ్రామం నివాసస్థలం తెనాలి వారు కూచిపూడిలో 1914లో జన్మించారు వ్యవసాయ కుటుంబం తురుమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళలో పాఠశాల విద్య అబ్యసించారు యస్ యస్ ఎల్ సి నాటికే ఒక చిన్న నవల, ఒక శతకం రచించారు గుంటూరు ఏ సి కాలేజిలో బి ఏ వరకు చదివారు కాలేజిలో చదివేరోజుల్లోనే ''వరూధిని'

ఖండకావ్యం రచించారు 1937లొ బి ఏ డిగ్రీ పొందారు గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు

తెనాలి ఆ రోజుల్లో ఒకసాహితీకేంద్రం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది సాహిత్యచర్చలు జరుగుతుండేవి గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాబిలాష, ఎం ఎన్ రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పదం అలవడ్డాయి కొన్నికదలు, నాటికలు రాశారు

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది నిరాశా నిస్పృహల అనుబవాలతొ ''బిక్షాపాత్ర'' నాటిక రాశారు ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం మార్క్సిస్టు దృక్పదంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ బాషల్లొకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయింలో ఎం ఏ ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు ఆంగ్ల సాహిత్యాద్యయనంలో మునిగి తెలారు ఎం ఏ చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రందం రచించారు దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందొ ఇందులో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు ఇది చాలా ప్రసిద్దమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం ఏ పరిక్షలు రాయకుండానె 1941లో తిరిగి వచ్చారు

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు కొంతకాలం మిత్రులతో కలిసి ఓప్రెస్, ఓ ఫర్నీచర్ షాపు నడిపారు అవేవీ విజయవంతం కాలేదు ఇంతలో ''ఆంద్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది నర్ల, శ్రీశ్రీలతో పాటు '' ఆంద్ర ప్రబ'' సంపాదక వర్గంలో పనిచేశారు ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంధ్రప్రభ'' నుండి వైదొలగారు దేశాబిమాని, విజయప్రభ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్ డి డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోదనకు పూనుకొన్నారు పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రందాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోదనలో నిమగ్నులయ్యారు ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రందాల్ని తిరగేశారు జేగంటలు–కాంట్ పరతత్వవాదం, ప్లేటో–ప్రచురించారు తాత్విక చింతన స్వంతంత్ర విచారానికి దారి తీసింది

తత్ఫలితమే 1951లో ' కీలుబొమ్మలు'' నవలా రచన ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచే ప్రచురింపబడింది వ్యక్తిలో కర్తవ్య జిజ్ఞాసని రేకెత్తించటమే ఈ నవల లక్ష్యం

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు '' నాటికల సంపుటి ప్రచురించారు ఇది విలువల కాణాచి

మద్రాసు విశ్వవిద్యాలయం "Studies in Kalapurnodayam" ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లో పిహెచ్ డి డిగ్రీ ప్రదానం చేసింది ''కళాపూర్ణోదయం''లొ కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రంధంలో కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సరసన నిలబెట్టారు 1952లో కృష్ణరావు తెనాలిలొ వి యస్ ఆర్ కాలేజిలో అధ్యాపకునిగా చేరారు ఈ రోజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జునుని గ్రంధాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు అవి పోయాయి ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల భూమికతొ ప్రచురించారు కెంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రంధాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతొ తెలుగు చేశారు ''రాగరేఖలు'' నవలరాశారు

1962లో పరిస్థితులతొ రాజీపడలేక కాలేజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు మళ్ళీ నిరుద్యోగం ఈ సమయంలో ''పాపికొండలు'' నవల ప్రారంబించారు అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది అదికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందొ వివరించటం ఈ నవల ఇతివృత్తం ఇందులొ కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైభవంతో నిక్షేపించారు ఇది ఒక రసగంగ స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నదిష్టించారు ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలొ కొనసాగారు రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు కొన్ని కవితలు, కదలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారోగ్య కారణాలవల్ల అర్ధంతరంగా ఆగిపోయింది ఇది తెలుగువారి దురదృష్టం 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది ఇది ఆర్యనాగార్జుననికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబందించిన ఇతివృత్తంతో రాసిన నాటకం రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం

ఖండకావ్యం రచించారు 1937లో బి ఏ డిగ్రీ పొందారు గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు

తెనాలి ఆ రోజుల్లో ఒక సాహితీకేంద్రం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది సాహిత్యచర్చలు జరుగుతుండేవి గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాభిలాష, ఎం ఎన్ రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పదం అలవడ్డాయి కొన్నికదలు, నాటికలు రాశారు

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది నిరాశా నిస్పృహల అనుబవాలతో ''బిక్షాపాత్ర'' నాటిక రాశారు ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం మార్క్సిస్టు దృక్పదంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ బాషల్లోకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం ఏ ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు ఆంగ్ల సాహిత్యాద్యయనంలో మునిగి తెలారు ఎం ఏ చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రందం రచించారు దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు ఇది చాలా ప్రసిద్ధమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం ఏ పరీక్షలు రాయకుండానె 1941లో తిరిగి వచ్చారు

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు కొంతకాలం మిత్రులతో కలిసి ఓ ప్రెస్, ఓ పర్నీచర్ షాపు నడిపారు అవేవీ విజయవంతం కాలేదు ఇంతలో ''ఆంద్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది నర్ల, శ్రీశ్రీలతొ పాటు ''ఆంద్ర ప్రబ'' సంపాదక వర్గంలో పనిచేశారు ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు ఇది ప్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంద్రప్రభ'' నుండి వైదొలగారు దేశాబిమాని, విజయప్రబ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్ డి డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోదనకు పూనుకొన్నారు పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రందాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోధనలో నిమగ్నులయ్యారు ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రందాల్ని తిరిగేశారు జేగంటలు–కాంట్ పరతత్వవాదం, ప్లేటో–ప్రచురించారు తాత్విక చింతన స్వాంతంత్ర విచారానికి దారి తీసింది

తత్ఫలితమే 1951లో ''కీలుబొమ్మలు'' నవలా రచన ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచె ప్రచురింపబడింది వ్యక్తిలొ కర్తవ్య జిజ్ఞాసని రెకెత్తించటమె ఈ నవల లక్ష్యం

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు '' నాటికల సంపుటి ప్రచురించారు ఇది విలువల కాణాచి

మద్రాసు విశ్వవిద్యాలయం "Studies in Kalapurnodayam" ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లొ పిహెచ్ డి డిగ్రీ ప్రదానం చెసింది ''కళాపూర్ణోదయం''లో కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రంధంలొ కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సంసన నిలబెట్టారు 1952లో కృష్ణరావు తెనాలిలో వి యస్ ఆర్ కాలేజిలో అధ్యాపకునిగా చేరారు ఈ రొజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జునుని గ్రంధాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు అవి పోయాయి ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల భూమికతో ప్రచురించారు కెంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రంధాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతొ తెలుగు చేశారు ''రాగరేఖలు'' నవలరాశారు

1962లో పరిస్థితులతో రాజీపడలేక కాలేజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు మళ్ళీ నిరుద్యోగం ఈ సమయంలొ ''పాపికొండలు'' నవల ప్రారంభించారు అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది అధికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందో వివరించటం ఈ నవల ఇతివృత్తం ఇందులో కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైభవంతొ నిక్షేపించారు ఇది ఒక రసగంగ స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లొ ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నదిష్టించారు ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలొ కొనసాగారు రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు కొన్ని కవితలు, కదలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారొగ్య కారణాలవల్ల అర్ధంతరంగా ఆగిపోయింది ఇది తెలుగువారి దురదృష్టం 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది ఇది ఆర్యనాగార్జునునికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబంధించిన ఇతివృత్తంతో రాసిన నాటకం రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం

తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి ఆధ్వర్యంలో డాక్టర్ జి వి కృష్ణరావుకి తెనాలిలో మార్చి 30 1979 తేదిన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి అధ్యక్షతన ఘన సన్మానం కన్నుల పండుగగా జరిగింది తరవాత వారు ఎక్కువ కాలం జీవించలేదు కృష్ణరావు ఆగష్టు 23, 1979 తేదిన తుది శ్వాస విడిచారు

## రచనల వైశిష్ట్యం

కృష్ణరావు సంస్కృతాంధ్ర ఆంగ్ల బాషల్లో విద్వాంసులు ఆయా బాషా సాహిత్యాల్లో నిష్ణాతులు వ్యాకరణ సూత్రాల్ని, అలంకార శాస్త్రాన్ని లోతుగా తరచి ఆకళింపు చేసుకొన్నవారు ప్రాచ్య పాశ్చాత్య తత్వ శాస్త్రాల్ని మదించిన వారు సామాజిక, రాజకీయనైతిక, మనోవైజ్ఞానిక శాస్త్రాల్ని అవలోడించిన వారు ప్రాక్ పశ్చిమ దేశాల విబిన్న సంస్కృతుల్ని అవగాహన చేసుకొన్నవారు అనన్య ప్రతిబావ్యుత్పత్తులతో, బహుముఖ పరిజ్ఞానంతో, సునిశిత ఆలోచనలతో కృష్ణరావు ఉత్తమ కవితల్ని, నాటక నాటికల్ని, కదల్ని, నవలల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని రచించి తమ సాహితీ చైత్ర రదాన్ని 1963 శోబాయమానం చేశారు ఆ పూదోట సర్వాంగ సుందరం, పరిమళబరితం

కృష్ణరావు జీవితాన్ని, రచనల్ని పరిశీలిస్తే వారి జీవితంలో, రచనల్లో అంతర్వాహినిగా బారతీయత ప్రవహించటం గోచరిస్తుంది ఎర్రగా, సన్నగా, పొడుగ్గా, గరుడనాసికతో తీక్షణమయిన కనుదోయితో ఎప్పుడూ తెల్లని లాల్చి, గ్లాస్కో దోవతి దరించి అచ్చం బారతీయుడుగా, ఆంధ్రుడుగా కృష్ణరావు కనపడేవారు వివిద సంస్కృతుల్ని పరిశీలించి వారు చివరకి బారతీయ సంస్కృతి వైపే మొగ్గు చూపారు ఆంగ్లంతో పాటు సంస్కృతాంధ్రాలను చక్కగా చదువుకొన్నారు ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల రచనల్ని సమీకరించారు మన సామాన్య ప్రజానీకం విలువలన్ని రామాయణ బారతాల నుంచి వారసత్వంగా వచ్చినవేనని అబిబాషించారు అలంకార శాస్త్రంలో బారతీయ ద్వని సిద్ధాంతమే పరమ శిరోదార్యంగా బావించారు వారినాటికల్లో అనేకం బారతీయ సాంస్కృతిక ఇతివృత్తంలో కలవే నాగార్జున మాధ్యమిక వాదాన్ని అభిమానించారు బాస ప్రతిమ నాటకాన్ని అనువదించారు కళాపూర్ణోదయం మీద దీసిస్ రాశారు సృజనాత్మకరచన సద్యః పర నిర్వృతి నివ్వాలని బారతీయ లాక్షణికులతో ఏకీబవించారు అయితే బారతీయమంతా ఆమోదయోగ్యమని కృష్ణరావు బావించేవాడు ఏ విషయాన్నయినా కార్యకారణాలతో తర్కించి నిగ్గు తేల్చే హేతువాది కృష్ణరావు తన పరీక్షకి నిలబడిన వాటినే స్వీకరించారు మొదట మార్క్సిస్టు ప్రబావానికి లోనయ్యారు త్వరలోనే ఆ ప్రబావంనుంచి బయట పడ్డారు ''డమడమాలబండి'' నాటిక వారి కనువిప్పుకి రూపకల్పన వ్యష్టిలో సమిష్టినీ, సమిష్టిలో వ్యష్టిని గుర్తించినప్పుడే ఏ రాజకీయ

వ్యవస్థ అయినా అభ్యుదయం సాధిస్తుందని కృష్ణరావు భావించారు లేకపోతే అది వట్టి నినాదాల డమడమాలబండె అలాగే ''కార్యజగత్తు''లోని మార్క్సిస్టు దృష్టిమారి వారి సాహిత్య విమర్శనా ప్రతిభ కళాపూర్ణోదయ సిద్ధాంత గ్రంధంలో వెల్లి విరుస్తుంది

కృష్ణరావు ఆదర్శం దర్మం ఆశయం వ్యక్తి స్వాతంత్ర్యం ''దర్మం'' దర్మం కొసమె, ఆదర్మమే మానవ జీవితం అంటారు కృష్ణరావు ''కీలుబొమ్మలు'' నవలలో దర్మానుష్ఠానంలోనే ఆనందం ఉన్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుందని కృష్ణరావు విశ్వాసం వ్యక్తులకి స్వతంత్ర విచారం ఉండాలి వ్యక్తికి అంతఃకరణం ఉంటుంది అది వివేక చోదితం పరిస్థితులు చుట్టు ముట్టినప్పుడు ప్రతి వ్యక్తీ స్వతంత్రాలోచనతో తన అంతఃకరణం సాక్షిగా ప్రవర్తించి తన దర్మాన్ని తాను నిర్వర్తించాలి లేనినాడు అదర్మం ప్రవర్తిల్లి సమాజం సంక్షోభం చెందుతుంది ఇదే ''కీలుబొమ్మలు'' నవల సందేశం అంతేకాని వ్యక్తులు పరిస్థితుల కీలుబొమ్మలని కాదు వ్యక్తి దర్మం లుప్తమై తేనే దేశం శప్తమవుతుంది వ్యక్తి స్వాతం త్ర్యాన్ని ఉద్దీప్తం చేయటం రచయిత బాద్యత అని కృష్ణరావు తలచారు ఈ వ్యక్తి స్వాతంత్ర్య చెతనే ''పాపికొండలు'' నవలలో మరింత స్పష్టమవుతుంది ఇందులోని కొన్ని పాత్రలు పరిస్థితులకు ఎదురునిలచి తాము నమ్మిన దర్మాన్ని అనుసరించి తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటాయి ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో ఆర్య నాగుర్జునల పాత్ర అలాంటిదే

కృష్ణరావు దృష్టిలొ జివితం, కళా వేరువేరు కావు అవి రెండూ ఒకటే జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లెవు అది అనంతం దాన్ని అర్ధం చెసుకొటానికి ఉపకరించే ఆద్యంత సహిత జివిత శకలమె కళ – అంటారు వారు

కళాత్మకమైన రచన జీవితపు విలువల్ని నిర్దేశించి వెలుగునివ్వాలని కృష్ణరావు తాత్పర్యం విలువ అంటె ఏ వస్తువులొ నయినా మన మెప్పుకి పాత్రమైన గుణం జీవితపు విలువలనేకం వాటిని ఆర్ధిక, నైతిక, సామాజిక, తాత్విక విలువలుగా వర్గీకరించవచ్చు విలువలకి ఆధిక్యతా క్రమం ఉంటుంది తాత్విక విలువలు పై విలువ లైతే ఆర్ధిక విలువలు కిందివి సామాజిక నైతిక విలువలది మధ్యస్థానం భారతీయ సంస్కృతి తాత్విక విలువల్ని జివిత ధ్యేయాలుగా ఆదరించి జివితావశ్యకాలైనా ఆర్ధిక విలువల్ని విస్మరించింది ఇది దారిద్ర్యానికి దారితీసిందనే అబియోగం ఉంది ఇది కృష్ణరావుని కలవం పెట్టింది డిగ్రీ పుచ్చుకొన్నతరువాత నిరుద్యోగం కర్కశ నిజమై చికాకు పరచింది వ్యాసుడు గుండెల్లోంచి పైకి వచ్చి శాపజలం అందుకొన్న దృశ్యం కళ్ళముందు 'భిక్షాపాత్ర'' నాటిక ఆవిర్భవించింది అది ఆకలి పోలికేక మార్క్సిస్టు దృక్పధంతొ ఆర్థిక విలువల్ని హైలైట్ చెసిన రచన కృష్ణరావు నిజ జీవితంలొ విలువల్ని అపారంగా గౌరవించారు సమ్మాన విలువల కొసం ఉద్యోగాల్ని తృణప్రాయంగా చూశారు కృష్ణరావు

దృష్టిలో విలువలన్నీ సమాదరణీయాలె వారి `ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటిలో నాటికలన్నీ విలువల దీప్తి రేఖలే ఈ సంపుటిలో మొదటిది 'భిక్షాపాత్ర'' వివరిది లాత్విక విలువల్ని ప్రతిపాదించే ''ఆదర్శ శిఖరాలు'' ఇది మహాశిల్పి జక్కణచార్యుల కద మధ్యలో వన్ని ఇతర విలువల్ని ప్రతిపాదించేవి ఇవన్నీ వ్యక్తి ధర్మాన్ని ప్రబోదించే విలువల వెలుగులు ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువల సమాహారాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని మానవ వ్యక్తి సంపూర్ణ సమగ్ర చరితార్ధత సంతరించుకోవాలని కృష్ణరావు ధ్వని

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికి విలువలకీ సంబందించిన కొన్ని మౌలిక దారుణ విషయాలను స్పృశిస్తుంది మతం అంతిమ విలువ అది కొంత వైయక్తికం, కొంత నైతికం నైతిక విలువలూ ఒక విదంగా సామాజికాలే అందువల్ల సామాజిక స్పర్శ ఉన్నమేరకు ప్రభుత్వం మతంతో ప్రమేయం కల్పించుకోవచ్చు ఆ పరిదిని దాటి రాజ్యం వాటి విలువలతో సంబంధం పెట్టుకోరాదు ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో రాజు గౌతమి పుత్రశాతకర్ణి హిందూ మతాను యాయి బౌద్ధుల్ని బాదిస్తాడు ఆర్య నాగార్జునల ఉపదేశం పెడచెవిని పెడతాడు నాగార్జునులకు దేశ బహిష్కరణ శిక్ష విదిస్తాడు ఈ అధర్మానికి బొమ్మ ఏడుస్తుంది ఈ బొమ్మ బౌద్ధుల ఆరాధ్య దేవత షట్పారమితా దేవి ఓ పాత్ర ద్వారా ''ఆ బొమ్మ మానవుల మనస్సుల్లో మెదిలిన నాడె లోకకళ్యాణం'' అంటారు కృష్ణరావు ఇది ప్రస్తుత సమాజానికి అన్యాప దేశమైన కర్తవ్య బోధ

కృష్ణరావు కొన్ని సాహిత్య వ్యాసాల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని, తాత్విక వ్యాసాల్నీ రచించారు వాటిలో వారి నిశిత మేదాశక్తి, సహేతుకత, అంతర్ దృష్టి అంతర్లీనంగా ద్యోతకమవుతుంది కృష్ణరావు శైలి తెలుగు నుడికారపు ఇంపుసొంపులకి పట్టు కొమ్మ

జీవితం నిరంతర స్రవంతి సమాజం నిత్య పరిణామ శీలం గలది వ్యక్తి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడు బావజీవి సంస్కృతి పరంపరా గతమైంది సాహిత్యం సౌందర్య సంబంధి సౌందర్యం వస్తుగతం, హృదయ గతం కూడా ఇవన్నీ పరస్పర ఆశ్రితాలు కృష్ణరావు సాహిత్యం మానవసంబందాల్ని పరామర్శించి వాటిలోని అంతరార్దాన్ని వెలుగులోకి తెస్తూ, పాఠకుడిలో సమాధ్యాసన కల్పిస్తుంది ఆనందమిస్తుంది ఆలోచన రేకెత్తిస్తుంది లోకకల్యాణ మార్గం సూచిస్తుంది ఇది సహృదయ హృదయైక వేద్యం

## పాత్రలు :

నందకుమార్

ప్రతీహారి

ప్రధమ సైనికుడు

ద్వితీయ సైనికుడు

బుద్ధఘోషుడు

సునీధ

తారనాధుడు

సునంద

( రాజభవనంపైన పిట్టగోడ కానుకొనికొందరు సైనికులు క్రిందికి చూస్తుంటారు. కుడివైపున మెట్లున్నాయి. ఎడమ వైపు లోహనిర్మితమైన ప్రాచీనపు డిగ్గియ వుంది. వెన్నెల )

నంద . సునీధ యీ వెన్నెల్లో ఎంత అందంగా వుంది!

ప్రతీ . నెలవంక చూడు ఎంత ఆశ్చర్యకరంగా వుందో! సమాధి నుంచి లేచి వస్తున్న జీవివలె ఉన్నది. విగతజీవులకోసమన్వేషిస్తున్నట్లున్నది

నంద : విచిత్రంగా తోస్తున్నది. లలితనృత్యం చేస్తున్నట్లున్నది.

ప్రతీ : ముక్తజీవి లాగావుంది. ( క్రింద ధ్వని)

ప్ర సై : అబ్బా ఏమిరొద! ఈ ఘోషిల్లుతున్న జంతువులు ఎక్కడివి?

ద్వి సై : హిందువులు. ఎప్పుడట్లాగే ప్రవర్తిస్తుంటారు. మతాన్నిగూర్చి తర్కిస్తున్నారు.

ప్ర సై : మతాన్ని గూర్చి ఎందుకు తర్కించుకుంటారు?

ద్వి. సై : నేను చెప్పలేను. ఎప్పుడూ అంతే. కొందరు ద్వైత మంటారు, కొందరు అద్వైతం చెప్పుతారు, కొందరు విశిష్టాద్వైత మంటారు.

ప్ర. సై · అలాంటి విషయాల్ని గూర్చి తర్కించుకొనటం హాస్యాస్పదమనుకొంటాను. 3

నంద . సునీధా రాజకుమారి యీ రాత్రి ఎంత అందంగా వుంది!

ప్రతీ : ఎప్పుడదే పనిగా ఆమెవంక చూస్తున్నావు. అలా చూడటం అటే మంచిది కాదు.

నంద : ఈ రాత్రి ఆమె చాల అందంగావుంది.

ప్ర సై : తారానాథుడు విషాదంగా చూస్తున్నాడు.

ద్వి సై : ఔను, విషాదంగా చూస్తున్నాడు.

ప్ర. సై : అతడు దేనివైపో చూస్తున్నాడు.

ద్వి. సై · ఎవరివైపో చూస్తున్నాడు.

ప్ర సై : ఎవరివైపు?

ద్వి. సై : చెప్పలేను.

నంద : రాజకుమారి ఎంత వివర్ణంగావుంది! ఎన్నడూ అంత వివర్ణయై ఉండగా చూడలేదు రజతదర్పణంలో బింబించిన తెల్లగులాబీ నీడలాగా వుంది

ప్రతీ · ఆమె వంకకు చూడగూడదు ఊరకచూస్తున్నావు

ప్ర. పై : సునంద తారనాధుని పానపాత్ర నింపింది

ద్వి. పై : తారనాధునకు పానీయాలంటే ఎంతో యిష్టం. నానా దేశాలనుంచి తెప్పిస్తుంటాడు.

(బుద్ధఘోషుని కంఠస్వరం)

నా తరువాత నాకంటె మహాపురుషుడు ప్రభవిస్తాడు. అతని పాదరేణువునకు నేను అర్హుడనుకాను. అతని ఆగమనంతో ఏకాంతప్రదేశాలు ప్రసన్నము లౌతవి. పొందామరలవలె ప్రఫుల్లములౌతవి. బధిరాంధులు అనుగృహీతులౌ తారు. నిర్భయంగా శిశువు కోడెత్రాచులతో ఆటలాడుకొంటుంది. జటాచ్ఛ టల్ని తెమల్చి సింహాలను ఈడ్చుకొస్తుంది.

ద్వి. పై : నోరు మూయించలేవూ? ఎప్పుడూ అసందర్భ ప్రలాపాలే.

ప్ర. పై : వద్దు. వద్దు. అతడు భిక్షువు సత్వగుణ ప్రధానుడు. భిక్ష పెట్టినప్పుడల్లా దీవిస్తూవుంటాడు.

ద్వి. పై : ఎక్కడనుంచి వస్తుంటాడు?

4 ప్ర. పై : బౌద్ధవిహారంనుంచి. భయంకరంగా ఉండేవాడు. అతనికి శిష్యులుకూడ వున్నారు.

నంద : రాజపుత్రి తాలవృంతంమాటున ముఖందాచుకొన్నది. ఆమె కరాలు తరం గాహతాలైన అరవిందాలులాగా చలిస్తున్నాయి.

ప్రతీ : అదిఅంతా నీకెందుకు? ఆమెవైపునకు ఎందుకుచూస్తావు? చూడగూడదు... ప్రమాదమేమైనా కలుగవచ్చును.

ద్వి. పై : (డిగ్గియవైపు చూస్తూ) విచిత్రమైన కారాగారం!

ప్ర. పై : ప్రాచీనవు డిగ్గియ.

ద్వి. పై : అనారోగ్యకరమనుకొంటాను

ప్ర. పై : లేదు. తారనాధుని అన్న వంద్రెండేండ్ల కారాగార వాసం అందులోనే అను భవించాడు. చావలేదు. తుదికి గొంతు నులిమివేయించ వలసి వచ్చింది.

ద్వి. పై : గొంతు నులిమివేశారా? ఎవ్వరు చేయగలిగారు?

ప్ర. పై : తలారి.

ద్వి. పై : భయపడలేదా?

---

ప్ర. సై : తారనాధుని ఆజ్ఞ.

ద్వి. సై : రాజు గొంతు నులిమివేయటం ఘోరం.

ప్ర. సై : ఎందుకని? రాజులకూ ఒకటే తల!

ద్వి. సై : నాకు భయంకరంగా తోస్తున్నది.

నంద : రాజకుమారి లేచింది అక్కడనుంచి బయలుదేరి వ్యధాకులితయైనట్లు కనబడుతున్నది ఇటే వస్తున్నది. ఎంత వివర్ణగావుంది! ఎప్పుడు అంత వివర్ణయై వుండగా చూడలేదు.

ప్రతీ : ఆమెను చూడకు. బ్రతిమాలుతున్నా, ఆమెను చూడకు

నంద : ఎరిగిన రాజహంసిలాగ ఉన్నది. సువర్ణకుసుమములాగ ఉంది. (సునీధ ప్రవేశిస్తుంది).

సునీ : నేనుండను; నేనుండలేను. చలిత పక్ష్మాంతర్వవర్తులైన ఆ తిలకాంకిత కనీని కలతో నన్నెందుకు చూస్తాడు? నా సోదరీ నాధుడట్లాచూడటం విచిత్రంగా వుంది. అర్థం కావడం లేదు.

నంద : రాజకుమారీ! సభామండపంనుంచి వస్తున్నావా? 5

సునీ · ఈ మొలక తెమ్మెరలు ఎంతకమ్మగా ఉన్నాయి! ఇక్కడ మాత్రం వూపిరాడు తూవుంది. అక్కడ వారణాసీ సమాగతులైన హిందువులు రక్కుకొంటు న్నారు ఆవెలిమిడి పూతలు, ఆ రుద్రాక్ష మాలలు, టెంకాయ కొప్పులవలె నిగుడుకుని వున్న ఆ పిలకలు, ఆ పొడుగాంటిగోళ్ళు, ఆ నస్యపు బుఱ్ఱ కాయలు దుస్సహంగా ఉన్నవి. సభా భవనమంతా నస్యంతో పాడుచేస్తున్నారు.

నంద : రాజపుత్రీ కూర్చోవా?

ప్రతీ : ఆమెను ఎందుకు పలకరిస్తావు ? ఎందుకు చూస్తావు? ప్రమాద మేదో కలుగు తుంది.

సునీ : జాబిల్లి ఎంత అందంగావుంది. వెండిపూవులావుంది. చల్లదనం వెదజల్లు తున్నది. అవివాహిత యువతీ సౌందర్యమచ్చుట తాండవిస్తున్నది.

(బుద్ధఘోషుని కంఠస్వరం)

భగవానుడవతరించాడు. సంతమసాలు దిగంతాలనుంచి కూడ తరలి పోయినవి. దెసలు తెలివి తాల్చినవి

సునీ : ఆ ఉద్ఘోషించేదెవ్వరు?

ద్వి. సై : బౌద్ధభిక్షువు రాజపుత్రీ!

సునీ : బౌద్ధభిక్షువు! ఇతని కేనా తారనాథుడు భయపడుతుంటాడు?

ద్వి. సై : ఆ సంగతి మాకు తెలియదు. అది బుద్ధఘోషుని కంఠస్వరం

నంద : ఉద్యానవనం ఈరాత్రి ఎంతో బాగుంది. షికారు వెళ్ళటానికి గుర్రాన్ని తెప్పించేదా?

సునీ : నా సోదరినిగూర్చి ఘోరంగా చెబుతుంటాడు కాదా?

ద్వి. సై : రాజకుమారీ! అతడు చెప్పేది మాకు అర్థం కాదు.

సునీ : ఆమెను తీవ్రంగా ఆక్షేపిస్తుంటాడు.

(పరిచారిక ప్రవేశిస్తుంది.)

పరిచారిక: తారనాథులు లోనికి రమ్మంటున్నారు.

సునీ . నేను రాను.

నంద : క్షమించు, రాజపుత్రీ! పోకుంటే విపత్తు వాటిల్లవచ్చును.

సునీ- · భిక్షువు వృద్ధుడా?

నంద : పోవడం మంచిది లోనికితీసికొని వెళ్ళేదా?

సునీ : ఈ భిక్షువు .... వృద్ధుడా?

ప్ర. సై . లేదు. పరిపూర్ణయౌవనుడు.

కంఠస్వరము : భరతవర్షమా! చిన్మయరూపము అదృశ్యమైనదని సంతోషించకు.

సునీ : విచిత్రస్వరం. అతనితో మాట్లాడాలి.

ప్ర. సై : అది సాధ్యం కాదు రాజకుమారీ! ఎవ్వరూ అతనితో మాట్లాడ రాదని ప్రభువుల ఆజ్ఞ. పురోహితుడుగూడ అతనితో మాట్లాడరాదు.

సునీ : అతనితో మాట్లాడాలి.

ప్ర. సై : సాధ్యం కాదు రాజపుత్రీ!

సునీ : అతనితో మాట్లాడుతాను.

నంద : లోనికి వెళ్ళటం మంచిదికాదా?

సునీ : ఆ భిక్షువుని తీసికొనిరా. (పరిచారిక వెళ్ళుతుంది.)

ప్ర. సై : మేము సాహసించలేము.

సునీ : (డిగ్గియ సమీపించి లోనికిచూస్తూ) అడుగున ఎంత అంధకారబంధురంగా వుంది! ఇట్లాంటిచోట ఉండటం దుష్కరం. కేవలం సమాధి వలె ఉన్నది. (సైనికులతో) వినలేదా? భిక్షువుని తీసికొనిరండి అతన్ని చూడాలి.

ద్వి. సై : క్షమించాలి.

సునీ : ప్రతీక్షింప జేస్తున్నారు

ప్ర. సై : మా ప్రాణాలు మీవి, కాని .... దీనికి మమ్మల్ని నియోగించవద్దని మనవి.

సునీ : (నందకుమార్ వంకచూస్తూ) నందకుమార్!

ప్రతీ : ఏమి సంభవిస్తుందో? ఏదో విపత్తు వాటిల్లుతుంది.

సునీ : (నందకుమారుని దగ్గరకు వెళ్ళి) నందకుమార్! దాన్ని నాకోసం చేసిపెట్టవా! నాకోసము చేసిపెడతావు. నిన్నెప్పుడూ కనికరించాను. నాకోసము చేస్తావు. ఊరికే ఒక్కసారి, ఊరికే, ఆవిచిత్ర బౌద్ధభిక్షువును చూస్తాను. అతన్ని గూర్చి విచిత్రంగా చెప్పుకొంటున్నారు. తారనాథుడు గూడ అతన్ని గూర్చి ప్రసంగిస్తాడు. అతనికి భయపడతాడనుకొంటాను. నీకూ భయమేనా నందకుమార్!

నంద : నాకు భయంలేదు రాజపుత్రీ! మానవ మాత్రుడికి నేను భయపడను. ఈ డిగ్గియమూత తీయరాదని తారనాథుని శాసనం.

సునీ : దాన్ని నాకోసం చేస్తావు నందకుమార్. రేపు నేను వాహ్యాలికి వెళ్ళేటప్పుడు ఒక చక్కనిపూవు–మల్లెపువ్వు నీమీద–వేస్తాను.

నంద : నేను చేయజాలను.

సునీ : నాకోసం చేస్తావు నందకుమార్. నీవు చేస్తావని నీకు తెలుసు. రేపు వాహ్యాలికి వెళ్ళేటప్పుడు పల్లకీ తెరల్లో నుంచి చూస్తాను. నందకుమార్! చిరునవ్వులు చిలికే చూపులతో చూస్తాను. మందహాసంచేస్తాను. నావంకచూడు, నంద కుమార్, నావంకచూడు. నాకోరిక నెరవేరుస్తావని నీకూ తెలుసు. నీకు బాగా తెలుసు... నీవు చేస్తావని నాకు తెలుసు.

నంద : (మూడో సైనికునితో) భిక్షువునిరానీ! ... రాజపుత్రి చూడగోరుతున్నది.

ప్రతీ : నెల ఎంత విచిత్రంగా వుంది!

నంద : నీలిజలతారు ముసుగులోనుంచి నవ్వు రాజపుత్రి ముఖంలాగా వుంది. (భిక్షువు డిగ్గియనుంచి వస్తాడు. సునీధ అతన్ని అవలోకించి మెల్లగా ఒకటి రెండడుగులు వెనుకకు వేస్తుంది.)

బుద్ధ : ఆ పాపి, ఆ ఆనన్ను మరణుడెక్కడ?

సునీ : ఎవ్వరినిగూర్చి మాటాడుతావు?

నంద : నీ వెన్నడు చెప్పుకోలేవు రాజపుత్రీ.

బుద్ధ : ఆ మోహాంధులెక్కడ?

సునీ : నా సోదరినే అంటున్నాడు.

నంద : రాజకుమారీ! కాదు.

సునీ : నా సోదరినే. సందేహం లేదు.

బుద్ధ : శౌర్య మపేక్షించి ఆంధ్రులను, నానావస్త్రాలంకార సౌష్టవంకోరి మాగధుల్ని, సౌందర్యమపేక్షించి కాశ్మీరవాసుల్ని కామించిన ఆపతితురాలెక్కడ? పశ్చాత్తాప మునొంది దైవానుగ్రహము పొందునుగాక!

సునీ : భయంకరుడు! భయంకరుడు!!

నంద : రాజపుత్రీ! ఇక్కడ నిలువవద్దు. బ్రతిమాలుకుంటున్నా.

సునీ : అన్నిటికంటె ఆతనినేత్రాలు భయంకరాలు. హిమశైలంలోని కుహరాలవలె ఉన్నాయి. నల్లకోడెత్రాచుల నికేతనాలు లాగా ఉన్నాయి నాగులు కుబుస మూడ్చే బుయ్యారపు కోవలులాగా ఉన్నాయి. తరపివెన్నెలచే తరువబడుతున్న తమస్సరస్సుల్లాగా ఉన్నవి... అతడు మరల మాట్లాడుతాడనుకుంటావా?

నంద : నిలువవద్దు రాజకుమారీ ఇచట క్షణము నిలువవద్దు.

సునీ : ఎంత కృశించి పోయాడు. వలుచని గండారపు బొమ్మలాగా ఉన్నాడు. ఉదయాద్రిమంచి వస్తున్న హిమకిరణంలాగా ఉన్నాడు. ఇంకా దగ్గరకుపోయి చూస్తా.

నంద : వద్దు, వద్దు, రాజకుమారీ!

సునీ : దగ్గరకు పోయి చూస్తాను.

నంద : రాజకుమారీ! రాజకుమారీ!

బుద్ధ : ఈమె ఎవ్వరు నన్ను చూస్తున్నది? ఆమె చూడడం నాకిష్టంలేదు ఆ చకిత వీక్షణాలతో నాపై కెందుకు దండెత్తుతున్నది? ఎవ్వరో ఎరుగను. ఎవ్వరో తెలిసికోనవసరం లేదు. పొమ్మనండి. ఆమెతో గాదు నేను మాట్లాడవలసింది

సునీ : సునందా సోదరిని.

బుద్ధ : పో దుశ్శీలాసోదరీ .. దూరంగా పో. ఈ భిక్షువునుండి తొలగిపో. నీ సోదరి చేసినపాపాలు భగవానుని చెవిన వడ్డవి.

సునీ : ఘోష్! ఏదీ మరొకసారి. నీకంఠం మృదుమధురం.

నంద : రాజపుత్రీ! రాజపుత్రీ! రాజపుత్రీ!

సునీ : మళ్ళా మాట్లాడు! మళ్ళా మాట్లాడు! ఘోష్ నేనేం చెయ్యాలో సెలవిమ్ము.

బుద్ధ : సునందా సోదరీ, దగ్గరకు రాకు! పశ్చాత్తాపతప్తవై భగవంతుని వేడుకో.

సునీ : అతడెలా వుంటాడు, నీలాగా అందగాడా ఘోష్?

బుద్ధ : వెనకకు వెళ్లు. రాజసౌధంలో మృత్యువశ చటచ్చటారావాలు వినబడు తున్నాయి

నంద : రాజకుమారీ! లోనికి పో. వేడుకొంటున్నాను.

బుద్ధ : భగవాన్! ఎవ్వరి నుపసంహరింప నుద్దేశించావో అతని చావు సమీపింపలేదు.

సునీ : ఘోష్!

బుద్ధ : ఎవరది?

సునీ : ఘోష్! నీ శరీరాన్ని నేను ప్రేమిస్తున్నాను. నీ శరీరము లేతగులాబీ పూవులను వెక్కిరిస్తూవుంది కాంచన కేతకీ కుసుమ గర్భదళోదరాలుగాని, తామరాకుల మీద పారాడుతున్న ప్రభాతలక్ష్మి పాదాలుకాని, కెరటాల తొట్టిలో ఉయ్యాలూ గుతున్న తరిపి జాబిల్లిగాని, నీ దేహానికి సరిరావు ఏదీ నన్నొకసారి తాకనీ.

బుద్ధ : పోదూరంగాపో నీవు స్త్రీవి. నాతోమాట్లాడకు. నేను వినను.

సునీ : నీ శరీరం అసహ్యంగా కుష్ఠదేహంలాగ ఉంది. పాపకోడెలు ప్రాకిన గోడలాగ ఉంది వృశ్చికములు తావలము లేర్పరచుకొన్న కుడ్యంవలె ఉన్నది. అసహ్యం . నీ దేహ మసహ్యం. నీ జడల్ని ప్రేమిస్తున్నాను ఘోష్. ద్రాక్షారామమునందు వ్రేలాడు ద్రాక్షాగుళుచ్ఛాలవలె ఊగుతున్నవి. కృష్ణా పులినాంతరములందు విహరించే సింహాలకీ, తస్కరులకీ, పగలు ఆశ్రయమిచ్చే పింగళలతానికుంజ పుంజములవలె ఉన్నాయి. తారాశశాంక పరిహృతమైన ఘోరనితాంత నిశా గర్భములు, నీ జడలకంటె గరీయములుకావు ప్రపంచంలో నీ జడల నీలిమ మించిన నీలిమ లేదు .. ఏదీ నన్నొక్కసారి తాకనీ

బుద్ధ : తాకకు సునందాసోదరీ, తాకకు. ఈ పవిత్రాలయాన్ని మలినం చేయకు

సునీ : నీజడలు భయంకరాలు, ధూళిధూసరితములు, పంకిలములు నీ కంఠము చుట్టూ మెలివేసికుంటున్న నల్లత్రాచుల్లాగా ఉన్నాయి నీ జడల్ని ప్రేమించటం లేదు– నీ అరుణాధరాలు ప్రేమిస్తున్నాను ఘోష్ చందనతరువుమీదిబింబాలు

లాగా ఉన్నవి రాజులకోసమై సంధ్యాసమాయాల్లో సముద్రావగాహమొనరించి తెచ్చిన పవడాలులాగా ఉన్నవి నీ యధరాల్ని నన్ను ముద్దుపెట్టుకోనీ

బుద్ధ : ఎన్నటికీ వల్లగాదు సునందాసోదరీవల్లగాదు.

సునీ . ముద్దెట్టుకుంటాను, ఘోష్, నీ పెదవుల్ని ముద్దెట్టుకుంటాను

నంద : రాజకుమారీ! రాజకుమారీ! సౌందర్యారామమైన నీవతని వంక చూడకు, చూడకు. అలాంటి మాటలాతనితో చెప్పకు వాటిని నేను సహించలేను... రాజపుత్రీ! రాజపుత్రీ! యిలాంటివి మాట్లాడకు.

సునీ : నీ పెదవుల్ని ముద్దెట్టుకుంటాను ఘోష్!

నంద :- హా!!...

(పొడుచుకొని సునీధా బుద్ధఘోషుల మధ్య పడిపోతాడు.)

ప్రతీ : నందకుమారు డాత్మహత్య చేసి కొన్నాడు! సైన్యాధి నేత ఆత్మహత్య చేసుకున్నాడు! నా స్నేహితుడు గతించాడు! సుగంధద్రవ్యాలు, మణికుండలాలు ఇంతకు ముందే ఇచ్చాను. అయ్యో, ఏదో విపత్తు వస్తుందని అతడు మొదటనే మొత్తుకున్నాడు. నేనూ చెప్పాను, అనుకొన్నంతా జరిగింది జాబిల్లి విగత జీవులకోసము వెదుకుతున్న దనుకొన్నాను ఇతని నని మాత్రము తలపనైనా తలపలేదు అయ్యో! ఈవిషమయ చంద్రికలనుంచి ఇతన్ని ఎందుకు దాయక పోయాను! ఏ గుహలో దాచినా ఇతన్ని చూచి యుండక పోవునే!

ప్ర సై : రాజపుత్రీ! సైన్యాధి పతి పొడుచుకుని గతించాడు.

సునీ : నీ పెదవుల్ని ముద్దెట్టుకోనీ.

బుద్ధ : స్వైరిణీసోదరీ, భగవంతుడు నిన్ను కనిపెట్టుతూనే ఉన్నాడు అతన్ని అన్వేషించు. పాపవిమోచనం కోరుకో.

సునీ : నీ పెదవుల్ని ముద్దెట్టుకోనీ.

బుద్ధ . పతితవు, పో.

సునీ ఘోష్, నీ పెదవుల్ని ముద్దెట్టుకోనీ.

బుద్ధ నీ వంక చూడరాదు నీవంక చూడను. పాతకీ, పో వెళ్ళిపో

( అతడు డిగ్గియలోకి వెళ్ళుతాడు )

సునీ · నీ పెదవుల్ని ముద్దెట్టుకుంటాను ఘోష్ నీపెదవుల్ని ముద్దెట్టు కుంటాను

ప్ర సై : ఇంకోచోటికి కళేబరాన్ని చేర్చాలి. తాను సంహరించిన వాళ్ళను తక్క తక్కిన కళేబరాల్ని తారనాధుడు చూడడు.

ప్రతీ : సోదరుడు సోదరునికంటె అధికంగా ప్రేమించేవాడు. సుగంధ ద్రవ్యాన్ని, అంగులీయకాన్ని ఇచ్చాను. ఎప్పుడూ ఇరువురము కలసి మెలసి తిరిగే వాళ్ళము సాయంకాలము కృష్ణానదీ తీరాన మామిడిగున్నల తోపుల్లోకి వెళ్ళే వాళ్ళము. ఎప్పుడు తనదేశపు సంగతులు మాట్లాడేవాడు. అతని స్వరము వీణానాదములాగా ఉండేది. నదీజలాలలో తన నీడని చూచుకొనటాని కెంతో ముచ్చట పడేవాడు. దానికి నేను మందలిస్తుండే వాణ్ణి.

ద్వి. సై : నీవు చెప్పింది నిజమే. ఈ కళేబరాన్ని తీసివేయాలి. తారనాధుడు చూడరాదు.

ప్ర. సై : తారనాధుడిక్కడికిరాడు. ఈ ఉపరిభాగానికి ఎప్పుడూ రాడు. భిక్షువులంటే భయం.

(సునందా తారనాధులు వస్తారు.)

తా : రాజపుత్రి, సునీధ ఎక్కడ? రమ్మని ఆజ్ఞాపిస్తే ఎందుకు రాలేదు? ఆ! అదిగో అక్కడవుంది.

సున : ఆమెవంకకు చూడరాదు! ఎప్పుడూ ఆమెవంకకే చూస్తున్నావు!

తా : చంద్రరేఖ విచిత్రంగా కనబడుతూవుంది. సర్వత్ర కాముకుల కోసము వెదుకు తున్న కాముకిలావుంది. దిగంబర. సంపూర్ణ దిగంబర. నీలమేఘాలు దిగం బరత్వాన్ని ఆచ్ఛాదింపచూస్తున్నవి. కాని ఆచ్ఛాదింపనీయటం లేదు ఆ మేఘ శకలాల్లో ఆమె మధుపానలాగ తూలిపోతున్నది కాముకులకోసము వెదకు తున్నది. సందేహములేదు. మధుపానం చేసిన యువతివలె తూలిపోవటం లేదా?

సున లేదు; చంద్రరేఖ చంద్రరేఖలాగానేవుంది. లోనికి వెళ్ళుదాము పద .. నీకిక్క డేమిపనిలేదు.

తా : నేనిక్కడే ఉంటాను పరిచారికా, తివాసీలు పరచి, దివ్వెల్ని వెలిగించు. హాయిగా గాలివీస్తూవుంది.

సున : గాలికోసముగాదు నీవిక్కడ వుండదలచింది.

తా : ఔను! కేవలం గాలికోసమే, రా సునందా. ఆ. .. కాలుజారింది రక్తంలో కాలు జారింది. అపశకునం అపశకునం. ఇక్కడ రక్తమెందుకున్నది? ఈ కళేభరమెవరిది?

ప్ర. సై : ఏలినవారి సైన్యాధిపతిది. నందకుమారునది

తా : అతన్ని చంపమని ఆజ్ఞయివ్వలేదే.

ద్వి. సై . ప్రభూ! ఆత్మహత్మ చేసికొన్నాడు

తా : ఎందుకు? సైన్యాధిపతినిచేశానే.

ద్వి. సై : తెలియదు, ప్రభూ ఆత్మహత్య చేసికొన్నాడు.

తా · ఆశ్చర్యకరంగావుంది. ఆత్మహత్యకు లోబడటం పరిహాసాస్పదము అతని మృత్యువు విచారకరంగా వుంది కన్నులకు విందు గూర్చేవాడు. ఉన్మత్తపు చూపులతో చూచేవాడు. సునీధనుగూడా ఆ ఉన్మత్తపు చూపులతో చూచే వాడనుకుంటాను. ఎక్కువగా ఆమె వంకకు చూస్తూవుండేవాడనుకొనేవాణ్ణి

సున . ఆమెను అధికంగా చూచేవాళ్ళు ఇంకా వున్నారు.

తా . అతని తండ్రి ప్రభువు. అతన్ని రాజ్యాన్నుంచితరిమివేశాను. అతని భార్యను నీవు దాసిగా ఉంచుకున్నావు అతడు నాకిక్కడ అతిధిగా ఉన్నాడు. అందుకనే అతన్ని సైన్యాధి పతిని చేశాను అతడు గతించినందుకు విచారంగావుంది ఇంకా కళేబరాన్ని ఎందుకు ఉంచారు? తీసివేయండి. (వారు శవాన్ని తీసి

12 వేస్తారు) ఇక్కడ చలిగావుంది. గాలివీస్తున్నది వీయడంలేదా?

సున . గాలి లేదు.

తా : గాలి వీస్తున్నది... గాలిలో ఏవో విపుల పక్షచటచ్చటారావం వినవస్తున్నది నీకు వినబడటం లేదా?

సున : నాకేమీ వినబడటం లేదు.

తా : ఇప్పుడు నాకే వినబడటం లేదు. ఇంతకుముందు విన్నాను. గాలిమోత, సందేహం లేదు. పోయినది లేదు. మళ్ళీ వినబడుతున్నది. నీకు వినబడటం లేదా? రెక్కలచప్పుడులాగా వున్నది

సున : ఇక్కడ ఏమీలేదు. జబ్బుగా ఉన్నట్లున్నది. లోనికి వెళ్లుదాము పద

తా : నాకు జబ్బులేదు, గిబ్బులేదు. నీ చెల్లెలు జబ్బుగావుంది. ఎప్పుడూ అంత వివర్ణయై ఉండగా చూడలేదు

సున : ఆమెను చూడవద్దన్నాను.

తా : ఎవరురా అక్కడ? పానీయం (పానీయం తెస్తారు) సునీధా! నీవుకూడా కొంచెము పానీయం త్రాగుదువుగాని రా అనన్యపానీయమిది కొంచెం నీ యరుణాధరాలతో స్పృశించు నేను త్రాగేస్తాను.

సునీ : దాహంగాలేదు – తారనాథ్!

తా . నీ చెల్లెలు ఎట్లా సమాధానమిస్తున్నదో వింటున్నావా!

సున : అది ఉచితంగానే ప్రవర్తిస్తున్నది. నీవెప్పుడు దానివంక కెందుకు చూస్తావు?

తా : వక్ష్యఫలాల్ని తీసికొనిరా. (పండ్లువస్తవి) సునీధా! వచ్చి నాతో వీటిని తినేసై. ఈ ఫలము కొంచెము కొఱుకు మిగిలింది నేను తింటాను.

సునీ : ఆకలిగా లేదు తారనాథ్!

తా : నీ చెల్లెల్ని ఎట్లా పెంచావో చూస్తున్నావా?

సున మేము రాజకుల సంభూతులము; నీ తండ్రి వచ్చిదొంగ.

తా . అబద్ధ మాడుతున్నావు

సున నిజమని నీకు తెలుసు

తా · సునీధా, వచ్చి నా ప్రక్కనుకూర్చో, నీ సోదరీ సింహాసనము నీకిచ్చి వేస్తాను.

సునీ విరక్తి జనింపలేదు తారనాథ్.

సున నిన్ను గూర్చి ఏమనుకుంటున్నదో గుర్తించావా?

తా · తీసికొనిరా – ఏమిచెప్పాను? మరచాను. ఓ .. ఓ... జ్ఞాపకం వచ్చింది

బుద్ధ కాలము సమీపించినది నేను చెప్పిన జ్యోతిషం సమీపించిందని భగవానుడు చెప్పుచున్నాడు.

సున : నోరుమూయించు. అతని కంఠనాదం నేనువినను. ఎప్పుడూ నన్ను దూషిస్తున్నాడు

తా : నిన్నే మనలేదు. అతడు గొప్ప బౌద్ధభిక్షువు

సున · నే నా భిక్షువుల్ని నమ్మను. ముందేమి జరుగుతుందో మానవుడు చెప్పగలడా? ఎవ్వరికీ తెలియదు పైగ నన్నెప్పుడూ దూషిస్తున్నాడు. నీవతనికి భయపడుతున్నావనుకొంటున్నాను నిజంగా భయపడుతున్నావు

తా : నేనతనికి భయపడటం లేదు మానవ మాత్రుడికి నేను జడియను

సున : భయపడుతున్నావు భయపడకుంటే ఆరునెల్లనుంచి వేధిస్తున్నా, అతన్ని హిందువుల కెందు కప్పగించవు?

తా : అతడు మహాపురుషుడు. దైవసందర్శనం చేసికొన్న మహానుభావుడు

కంఠ : పాపి! కులటా! దాన్ని చంపివేయండి.

సున    అతని నోరు మూయించు

కంఠ : యోధులు కృపాణములతో పొడిచి ఖేటకముల క్రింద చిదిమి వేయుదురుగాక!

సున : లేదు, అగౌరవము.

స్వర : ప్రపంచాన్ని నిష్కళంకం చెయ్యటానికిదే మార్గం మహిళాలోకం ఆమెనను సరింపగూడదని నేర్చుకొంటుంది.

సున : నన్నేమంటున్నాడో వింటున్నావా? నీ భార్యని అట్లా భంగపరుస్తూ వుంటే అంగీకరించి ఊరుకుంటున్నావు.

తా . నీ పేరెత్తలేదు

సున : పేరెత్తక పోతేనేమి? నన్నుద్దేశించి అంటున్నాడని నీకు తెలుసు. నేను నీ భార్యను కానా?

తా . అదంతా ఎందుకు? పోనీ, గోస్తనీరసాన్ని నింపిన ఆ పాత్రను అందుకో (అందిస్తుంది త్రాగి) చూచావా, నీ చెల్లెలెంత వివర్ణగా వున్నదో?

సున : అది వివర్ణగా ఉన్నా, లేకున్నా నీకెందుకు?

14 తా · ఇంతకుముందు అంత వివర్ణగా చూడలేదు.

సున    దాని వంక చూడగూడదు

స్వర    ఆరోజున సూర్యుడు కేశంబంధంలాగా పరిణమిస్తాడు చంద్రమండలము శోణత్వము వహిస్తుంది! నక్షత్రాలు జలజల రాలుతవి, రాజులు విహ్వలు లౌతారు.

సున . శీతాంశు బింబము రక్తిమ వహిస్తుందట. చుక్కలు రాల్తాయట. మధుపాన మత్తుడు మాట్లాడుతున్నాడు. ఆస్వరాన్ని సహించలేను. కర్ణకఠోరంగా ఉంది మాట్లాడవద్దని ఆజ్ఞాపించు.

తా    ఆజ్ఞాపించను. ఏమి చెబుతున్నాడో అర్థం కావడంలేదు. అది శకునంకావచ్చు

సున · శకునాల్ని నమ్మను లాహిరిగొన్నవాడివలె మాట్లాడుతున్నాడు.

తా    భగవద్భక్తుడు కావచ్చును.

సున : మహాభక్తుడు!

తా . (సునీథవైపు చూస్తూ సైనికునితో) నందకుమార్.

ప్ర సై    ప్రభూ! నందకుమార్ ఏమిటి!

తా · నిన్ను అడుగలేదా? నిన్నేమడగాలో మరచాను.

సున . అదిగో, నా చెల్లెలివంక చూస్తున్నావు. దానివంకచూడకు. ఆసంగతి ఇదివరకే చెప్పాను.

తా అంతకన్నా చెప్పగలిగిందేమున్నది?

సున అదే మళ్ళీ చెబుతున్నా

తా నందకుమార్ చనిపోయేటప్పుడేమన్నాడో?

సున · తబ్బిబ్బుగా మాట్లాడుతున్నావు. లోనికి వెళ్ళుదాముపద

తా సునీధా, నృత్యం చెయ్యి.

సున నేను చేయనీయను.

సునీ . చెయ్యాలని ఇచ్ఛలేదు తారనాథ్

తా : సునందాసోదరీ, నాకోసమై నృత్యం చెయ్యి

సున · ఆమె ఇచ్ఛానుసారం పోనీ.

తా : నృత్యం చేయటాని కాజ్ఞాపిస్తున్నాను.



సునీ · నేను చేయను తారనాథ్.

సున . (నవ్వుతు నీ యాజ్ఞ ఎట్లాపాలిస్తున్నదో చూచావా?

తా . నృత్యం చేస్తే యెంత, చేయకపోతే యెంత? ఈ రాత్రి సుఖంగావున్నాను. ఇంత సుఖంగా ఎప్పుడూ లేదు.

ప్ర. సై విషాదవీక్షణం తారనాథుని నేత్రాల్లో మెరుస్తున్నది.

ద్వి. సై . ఆః

తా : నేనెందుకు సుఖంగా ఉండగూడదు? శత్రువుల కోటల్లో జిల్లేళ్ల మొలిచాయి. నా సౌఖ్యాన్ని ఆటంకపరిచేది ఏమీలేదు.

స్వర : అత డీ సింహాసనాసీనుడౌతాడు. జాంబూనదాభరణాలం కృతుడౌతాడు. అతని పాపం పండిపోతుంది యమదూత లాతనిని చిదిమివేస్తారు. క్రిమి కీటకాలు పీల్చి పిప్పిచేస్తవి.

సున · ఏమంటున్నాడో విన్నావా? క్రిమికీటకాదులు నిన్ను తినివేస్తవంటున్నాడు

తా : నన్ను గూర్చికాదు నన్నెప్పుడనడు. అది నా శత్రువుల్ని గూర్చి

సున · ఆ గొడవెందుకు లోనికి వెళ్లుదాం పద.

ద్వి. సై : తారనాధుని ముఖంలో ఎంతవిషాదం తాండవిస్తున్నది

ప్ర. సై : యధార్థము

తా : సునీధా! సునీధా! నాకోసం నృత్యం చేయి బ్రతిమాలుకొంటున్నాను. ఈ రాత్రి ఏదో దిగులు దిగులుగా ఉంది ఇక్కడికి వచ్చినప్పుడు రక్తంలో జారాను గాలిలో విపుల పక్షచటచ్చటారావాలు విన్నాను ఏమి సంభవిస్తుందో ఎరుగను విషాదంగా ఉంది. నాకోసము నృత్యంచెయ్యి సునీధా. బ్రతిమాలుతున్నాను. నృత్యంచేశావంటే నీవు కోరింది ఏమైనా ఇస్తాను. అర్థరాజ్యమైనా సరే

సునీ : (లేస్తూ) నే నేమడిగినా యిస్తావా తారనాథ్?

సున : అమ్మాయి, నృత్యం చేయకు

తా : ఏమైనా ఇస్తాను, అర్థరాజ్యమైనా సరే!

సునీ : ప్రమాణం చేయి, తారనాథ్

తా : చేస్తాను.

సున : చెల్లీ నాట్యం చేయవద్దు

సునీ : దేనిమీద ప్రమాణం చేస్తావ్!

తా : నాజీవితమ్మీద, నా కిరీటముమీద, నాకులదైవతముల మీద ప్రమాణంచేస్తాను. నీవు నృత్యం చేస్తేచాలు; ఏమైనాఇస్తాను. అర్థరాజ్యమైనాసరే! సునీధా, సునీధా! నాకోసం నృత్యం చేయి.

సునీ : ప్రమాణం చేశావు, తారనాథ్.

తా : ఔను, చేశాను.

సునీ : ఇదే అడుగుతున్నాను, నీయర్ధరాజ్యమైనా ఇస్తావుగా!

సున : చెల్లీ, వద్దు.

తా : అర్థరాజ్యమైనసరే కోరుకొన్నావా చక్కనిరాణివౌతావు. రాణివైతే బాగుండదా! చలిగా ఉంది. శీతవాయువు వస్తున్నది . . . ఓ ఈ వృధుపక్ష చటచ్చటారావాలు ఎక్కడనుంచో వినవస్తున్నవి. ఓ! అంధతమస సదృశమైన భేరుండము ఈ రాజసౌధములో ఎగురుతున్నట్లున్నది దీనిని ఎందుకు చూడలేకుండా ఉన్నాను. పక్షచటచ్చట ధ్వనులు భయంకరంగా ఉన్నాయి పక్షోద్ధూతవాతము బెడిదంగావుంది. ఉచ్ఛ్వాసమాడటం లేదు కరముల మీద పన్నీరు చిలకరించండి ఊరుకోండి. ఈ ఆచ్ఛాదనాలని తీసివేయండి. వద్దు–ఊరు

కోండి. ఈ గ్రైవేయకము - అరుణకుసుమ రచితమైన ఈగ్రైవేయకము కరుస్తూ వుంది. ఈ పువ్వులన్నీ చింతనిప్పుల్లాగా ఉన్నాయి. ఒళ్లుకాల్చివేశాయి. (గ్రైవేయకాన్ని త్రెంచి ఆసనంమీద వేస్తాడు.) ఊపిరాడుతున్నది. రేకులు ఎంత ఎఱ్ఱగా ఉన్నాయి! అదంతా ఎందుకు? తెల్లని వలువమీద నెత్తురు చుక్కల్లాగా ఉన్నాయి. పోనీ! చూచిందానిలో నెల్లా దుశ్శకునాల్ని తడవట మెందుకు? అట్లయితే జీవితమే దుర్భరమౌతుంది. రక్తబిందువుల్ని గులాబీ రేకులను కోవడము మంచిది. పోనీ! ఆ ప్రసంగమే మానుకొందాము నేను సుఖంగా ఉన్నాను. నేను సుఖంగా ఉంటానికి పాత్రుడను కానా! నీ సోదరి నృత్యం చేయబోతున్నది. నా కోసము నృత్యం చేయవా సునీధా! ప్రతిజ్ఞ చేశావు.

సున : నా చెల్లిల్ని నృత్యం చేయనివ్వను.

సునీ : నీ కోసము నృత్యం చేస్తాను తారనాథ్.

తా : నీ సోదరి ఏమంటున్నదో విన్నావా? నాకోసము నృత్యం చేయబోతున్నది. నృత్యం చేసి మేలు చేస్తున్నది. సునీధా నృత్యం చేసిన తరువాత నీవు కోరుకొన్నది అడుగు మరచిపోయేవు సుమా! నీవేమి కోరినా, నా యర్ధరాజ్య మైనా ఇచ్చివేస్తాను. ప్రతిజ్ఞ చేశాను గదూ!



సునీ : ప్రతిజ్ఞ చేశావు తారనాథ్.

తా : ఎప్పుడూ ప్రతిజ్ఞ భంగం చేయలేదు. నేను అలాంటి వాణ్ణికాను. ఎట్లా అబద్ధ మాడాలో నాకు చేతగాదు. నా ప్రతిజ్ఞకి నేను దాసుణ్ణి. నా ప్రతిజ్ఞ రాజప్రతిజ్ఞ. ఎందుకు ఆలస్యం చేస్తావు సునీధా?

సునీ : నృత్యోచిత వస్తుధారణకోసము చూస్తున్నాను. పరిచారికలు కింకిణీ నూపు రాలతో నాపాదాలలంకరించటానికి వస్తున్నారు.

(పరిచారికలు సజ్జీకృతచేసి తీసుకొనివస్తారు.)

తా : నీ కోమల పాదాలతో నృత్యం చేయబోతున్నావు. ధన్యుణ్ణి, ధన్యుణ్ణి, నీ మృదు పాదాలు తరుపత్రాలమీద నృత్యం చేస్తున్న పువ్వుల్లాగా వుంటవి .. లేదు, లేదు. రక్తములో నృత్యం చేయబోతున్నవి. నాట్యరంగమంతా రక్త సిక్తంగా ఉందని ఆమె రక్తంలో నృత్యం చేయకూడదు. అపశకునము.

సున : ఆమె రక్తంలో నృత్యంజేస్తే నీకేమి? ఆ రక్తములో ఈదిన నీకు ఇది ఒక లెక్కలోనిదా?

తా : నెలవంక చూడు! నెత్తురుజొత్తు. భిక్షువు సరిగ్గా చెప్పాడు. నెలవంక నెత్తురు జొత్తు అవుతుందన్నాడు. చెప్పలేదా? మీరంతావిన్నారు మీ కది యథార్థంగా కనిపించటము లేదా?

సున : కనిపించకేమి? నక్షత్రాలు జలజలా రాలుతున్నాయి. సూర్యుడు కేశబంధం లాగా పరిణమించాడు. రాజులు విహ్వాలులయ్యారు. అది ఒకటైనా కనబడు తుంది జీవితంలో. ఒక్కసారి మాత్రం భిక్షువు యథార్థం చెప్పాడు ధరణీ నాథులు విహ్వాలులవుతున్నారు... లోనికి వెళ్ళుదాము పద జబ్బుగా ఉన్నారు లోనికి వెళ్లదాము పద.

స్వర : ఆ నడిచేదెవరు? ఆ ఔద్ధత్యం దేనికి? ఆ అరుణవస్త్రాలు దేనికి?

సున : లోనికి వెళ్ళుదాము. ఆ భిక్షువు వాక్యాలు నన్ను ఉన్మత్తురాల్ని చేస్తున్నాయి అతడు ఎప్పుడూ చెవిక్రిందగోలచేస్తుంటే నా సోదరిని నృత్యం చేయనీయను నీవు ఈవిధంగా దాన్ని ఆలోకిస్తుంటే నేను నృత్యం చేయనీయను ఒకటే మాట. నేను నృత్యం చేయనీయను.

18 తా : కదలకు, ఆమె నృత్యం చేసేదాకా నేను రాను. నృత్యం చేయి సునీథా, నృత్యం చేయి.

సున : చెల్లీ, వద్దు.

సునీ : సిద్ధంగా ఉన్నాను తారనాథ్. (లలితంగాని ఉద్ధతంగాని చేస్తుంది )

తా : అమోఘము! అమోఘము! చూచావుగా నీసోదరి నాకోసం నృత్యం చేసింది దగ్గరకురా! సునీథా, దగ్గరకురా; నీవు కోరింది స్వీకరింతువుగాని నర్తకులకు నేనెప్పుడు స్వల్ప సత్కృతి చెయ్యలేదు. రాజోచితంగా చేస్తాను. నీవేమి కోరినా ఇస్తాను. నీకేమి కావాలి? కోరుకో.

సునీ : (మోకరిల్లుతూ) బంగారు పళ్ళెరంలో.

తా : (నవ్వుతూ) బంగారు పళ్ళెరంలోనా? అలాగే. ఆమె అందంగా ఉంది (సునందతో) లేదా? సునీథా, నీకేమి కావాలి? బంగారు పళ్ళెరంలో ఏమి తెప్పించమంటావు చెప్పు. ఏమైనా ఇస్తాను. నా బండార మంతా నీదే నీకేమి కావాలి సునీథా!

సునీ . (లేస్తూ) బుద్ధఘోషుని శిరస్సు

సున : ఆ! బాగా కోరావు!

తా   వద్దు, వద్దు

సున : చెల్లీ, బాగా కోరావు.

తా : సునీధా! వద్దు, వద్దు. అది నన్నడగ వద్దు. మీ అక్కయ్య మాటవినకు. చెడు మార్గానికి తీస్తున్నది. ఆమెను లెక్కపెట్టకు.

సునీ : మా అక్కకోసం కాదు నాసుఖం కోసమే దాన్ని కోరుతున్నాను నీవు ప్రతిజ్ఞ చేశావు తారనాథ్. మాట తప్పకు

తా · నిజమే కులదైవతాల సాక్షిగా ప్రతిజ్ఞ చేశాను బాగా ఎరుగుదును సునీధా! ఇంకేమైన కోరమని అడుగుతున్నాను. నా అర్ధరాజ్యం కోరుకో, నీకిచ్చి వేస్తాను. నీవు ఇంతకుముందు కోరింది కోరవద్దు.

సునీ : నేను బుద్ధఘోషుని శిరస్సునే కోరుకుంటున్నాను.

తా : వద్దు; వద్దు; నాకిది ఇష్టంగా లేదు.

సునీ : ప్రతిజ్ఞ చేశావు తారనాథ్.

సున . ఔను. ప్రతిజ్ఞచేశావు, అందరిముందు వాగ్దానం చేశావు. అందరూ విన్నారు.

తా : నోరుకట్టిపెట్టు! నీతోగాదు నేను మాట్లాడుతున్నది.   19

సున : నా సోదరి చక్కగా కోరుకొన్నది నన్నితడు దూషించాడు. తనసోదరిని అది ప్రేమిస్తున్నదని ప్రతివాడెరుగును. ఒప్పుకోకు, సోదరీ ఒప్పుకోకు అతడు ప్రతిజ్ఞచేశాడు. అతడు ప్రతిజ్ఞ చేశాడు.

తా : ఆగు, నాతో మాట్లాడకు... రా సునీధా, ఆలోచించి కోరుకో; నన్ను నిర్దాక్షిణ్యంగా చూడకు. నిన్నెప్పుడూ ప్రేమించాను.... నిన్నధికంగా ప్రేమించ వచ్చును. ఇటువంటిది కోరకు. ఈలాంటి భయంకరమైన దాన్ని నిర్దాక్షిణ్యంగా కోరకు. నిజంగా పరిహాస మాడుతున్నావనుకొంటున్నాను. నరికిన కర్పరాన్ని చూడటం హేయంకాదా! నీలాంటి కన్య చూడగూడదు. అందులో నీకేమి సుఖముంది ఏమీలేదు. వద్దు వద్దు నీకు కావలసింది అదికాదు. నేను చెప్పేది విను. నాదగ్గర సార్వభౌముడు ప్రసాదించిన అమూల్య వజ్రముంది. ఎంత దూర వస్తువులనైనా అందుట్లోనుంచి చూడవచ్చును సార్వభౌముడు మహార్నవమి దినాల్లో ఖేలనా రంగానికి తీసికొని పోతూవుండేవాడు. అతని వజ్రము నా దానికంటె చిన్నది. ప్రపంచంలో దానికన్నా పెద్దవజ్రం లేదు. అది నీకు బాగుంటుంది. దాన్ని కోరుకుంటావా? కోరుకో, ఇచ్చివేస్తాను

సునీ : నేను బుద్ధఘోషుని శిరస్సు కోరుతున్నాను.

తా : వింటంలేదు. వింటం లేదు. సునీధా! నన్ను మాట్లాడనీ.

సునీ : బుద్ధఘోషుని శిరస్సు.

తా : వద్దు, వద్దు నీకది ఇష్టంకాదు. ఈ సాయంకాలమంతా నిన్ను చూచినందుకు నన్ను వేధించ దలచావు. దేనికి యిలా అడుగుతున్నావు. ఈ సాయంకాల మంతా నీవంక చూశాను నీ సౌందర్యంవల్ల కలవరపడ్డాను నీవంక అధికంగా చూచాను. ఇక నీవంక చూడను. వస్తువులవంక గాని, మనుష్యులవంకగాని చూడగూడదు. ఆదర్శాల్లోనే చూడాలి గోస్తనీరసము! గోస్తనీరసము! రావూ!... సునీధా, సునీధా, కోపమెందుకు. రా... ఏమి చెప్పదలచాను? ఏమి చెప్పాను? ఆఁ! జ్ఞప్తికి వచ్చింది. సునీథా, వద్దు–దగ్గరకురా! వినవని భయపడుతున్నాను – సునీధా, నా సువర్ణ మయూరాల్ని, నాసువర్ణ మయూరాల్ని చూచావుగా. ఆ గుబురుగా వుండే బాలరసాల సాలల్లో ఆడ్తాడుతూవుంటే, బంగారపు చంచువులూ, సిందూరపు కాళ్లు – తినేది బాగరపు గింజలు, తోకలు విప్పితే కాలేయ కాదంబినులు నీలాకాశములో ప్రత్యక్షమౌతాయి; గొంతెత్తి కూస్తే తొలకరిచినుకులు చిటపటా, చిటపటా రాలుతవి. జంటలు జంటలుగా అశోకసహకారపు నీడల్లో మందగమనంతో బయలుదేరతాయి. ప్రతిదాన్ని ఒక్కొక్క సేవకుడు కాపాడుతుంటాడు. అప్పుడప్పుడుదర్శనీయంగా చెట్లమీదుగుండా సరోవరప్రాంతాన వాలుతాయి ప్రపంచంలో అంతకన్నా విచిత్రపు పులుగులు లేవు. ప్రపంచంలో ఏరాజు దగ్గర నైనా అలాంటి పులుగులు లేవు. సమ్రాట్టుకు కూడ లేవు. అందులోనూ ఇచ్చి వేస్తాను. నీవు ఎక్కిడికి పోయినా గుడుసువెట్టుకొని వస్తుంటాయి. అప్పుడు నీ వెట్లావుంటావో కొంచము ఊహించుకో. విశద శరన్మేఘాంతర చంద్ర చంద్రికలాగా వుంటావు. నాకు శతద్వితయముంది. అన్నింటినీ నీకిచ్చి వేస్తాను. అన్నింటినీ నీకిచ్చివేస్తాను. నన్ను ప్రతిజ్ఞా విముక్తుణ్ణి చెయ్యాలి! అంతే. (చషకాన్ని ఖాళీచేస్తాడు)

సునీ : బుద్ధఘోషుని శిరస్సు.

సువ : బాగా అన్నావు. ఆ మయూరాలు నీకేమి చేసుకోను?

తా : హష్ ఊరుకో! ఎప్పుడూ కాంద్రుమంటూనే ఉన్నావు. ఆహారము కోసము వెదుకుతన్న వ్యాఘ్రిలాగ గోంద్రు వెడుతున్నావు. నీ కంఠం దుర్భరం. ఊరుకో... సునీధా నీవేమి కోరుతున్నావో ఆలోచించుకో. అతడు మహా

పురుషుడు కావచ్చును. అతడు పునీతుడు. అతనిలో భగవానుడుండవచ్చును. అతడు గతించిన నాకు విపత్తు వాటిల్లవచ్చును అతని మరణంతో ఒకనికివిపత్తు కలుగుతుందన్నాడు. అది నాకే. నేనిక్కడికి వచ్చేటప్పుడు రక్తంలో జారాను. గుర్తుంచుకో, పక్షచటచ్చుటారావాన్ని విన్నాను. అవి అన్నీ అవశకునాలు. ఇంకా ఉన్నాయి నేను చూడకపోయినా ఇంకా ఉన్నాయి. సునీధా, నాకు విపత్తువాటిల్లటం నీకిష్టము లేదుకదూ! నీ వలాకోరవు. నేను చెప్పిందివిను.

సునీ : బుద్ధఘోషుని శిరస్సు.

తా : వింటము లేదు. నెమ్మదిగావిను. నేను.....నేను శాంతంగా ఉన్నాను నేను ప్రశాంతంగా ఉన్నా, విను. నీ సోదరికూడా ఎన్నడూ చూచియెరుగని ఆభరణాలని ఇక్కడదాచాను. అనన్యములైన ఆభరణాలు. నాలుగుపేటల తారహారమున్నది. బంగారపువలలో చంద్రుల్ని బంధించినట్లుగా ఉంటుంది. పసిండిరొమ్మున ఒకానొక రాణి తాల్చింది. దాన్ని ధరించావంటే మహారాజ్ఞివలె వుంటావు శార్దూల నేత్రగోళాల్లాగా మెరిసే హరితరత్నాలున్నాయి. మార్జారాంబకములవలె తళతళలాడే పచ్చలున్నాయి. శిశిరార్చుల వెదజల్లే వజ్రాలున్నాయి. ఉదయాస్తమయాలతో పరివర్తనచెందే చంద్రకాంతాలున్నాయి నీలోత్పలాల వంటి నీలాలున్నాయి. ఇంకా, ఇంకా కిమ్మీరరత్నాలున్నాయి కావాలంటే అన్నీయిస్తాను. మృదుతూలికా తల్పాతున్నాయి. ఒక రత్నముంది. దాన్ని తలలో అలంకరించుకుంటే ఎలాంటి భావనా ప్రపంచంలోనికైనా వెళ్లవచ్చును. ఇంకా నానాదేశ రాజన్యులంపిన అమూల్య వస్త్రాలున్నాయి. కావాలంటే అన్నీ ఇచ్చివేస్తాను. ఇంతకన్నా నీకేమి కావాలి సునీధా? నీకేమికావాలి చెప్పు. ఆ ఒక్కటి తక్క ఏమికావాలన్నా ఇచ్చివేస్తాను. ఒక్క ప్రాణంతప్ప సర్వస్వమూ నీకిచ్చివేస్తాను. నా కిరీటమిచ్చివేస్తాను.

సై, ప్రతీ ఆ! ఆ!

సునీ బుద్ధఘోషుని శిరస్సు కావాలి.

తా (ఆసనములో క్రుంగిపోయి) ఆమె అభీష్టము నిర్వర్తితమవుతుంది గాక! నిజంగా ఆ పెద్దపులి తోబుట్టువు!

(ప్రథమ సైనికుడు సమీపిస్తాడు. సునంద రాజాంగులీయకాన్ని తీసిస్తుంది. సైనికుడు తలారికిస్తాడు అతడు పవిత్రంగా చూస్తాడు.)

ఉంగరాన్ని ఎవ్వరుతీశారు? నాకుడిచేతిని ఉంగరముండేది. నా ఈ చషకములోని ద్రాక్షారసమెవరు త్రాగారు? ఏదో విపత్తు – ఎవరికో వాటిల్లుతుంది.

(తలారిడిగ్గియలోకి వెళ్ళుతాడు) అహా! నేనెందుకు ప్రతిజ్ఞ చేశాను? రాజులు ఎన్నడూ ప్రతిజ్ఞ చేయగూడదు ప్రతిజ్ఞా పాలనము భయంకరము, ప్రతిజ్ఞా భంగము భయంకరమే

సున : నా సోదరి మంచిపని చేసింది

తా : ఏదో విపత్తు వాటిల్లుట నిశ్చయం.

సునీ : (డిగ్గియ మీదకు వంగి వింటుంది) చప్పుడేమీలేదు నాకేమీ వినబడటం లేదు ఈతడెందుకు రోదించడు? నన్నెవ్వరైనా చంపటానికివస్తే పెద్దపెట్టున రోదిస్తాను, తన్నుకొంటాను, నేనూరుకోను .. నరుకు, నరుకు, దండధర్, నరికివేసెయ్. నాకేమీ వినబడటంలేదు. ప్రశాంతంగా వుంది. భయంకర ప్రశాంతి. అదిగో! ఏదో క్రిందబడింది, ఏదో క్రిందబడ్డట్టు విన్నాను. అది తలారి కృపాణము, నీచుడు భయపడ్డాడు, కత్తిని జారవిడిచాడు వధించ టానికి సాహసించలేకపోయాడు. వట్టి బంకు. సైనికులు ప్రేషితులవుదురు గాక (ప్రతీహారిని చూచి అతనితో) ఇటురా! మృతుని స్నేహితుడవు కాదా? పోయి తారనాథుడు ప్రతిజ్ఞ చేసినదాన్ని, నేనుకోరుకొన్నదాన్ని, ఆ తల, తల తెమ్మని సైనికులతో చెప్పు. (అతడు నిర్ఘాంతపడిపోతాడు. ఆమె సైనికుల వైపు తిరిగి) సైనికులూ! ఇక్కడ పోయి భిక్షువు తలతెండి (సైనికులుస్తబ్ధు లౌతారు) తారనాథ్, తారనాథ్, నీ సైనికులకు అతని కర్పరాన్ని తెమ్మని ఆజ్ఞాపించు.

(తలారి నీలదీర్ఘ బాహువు బౌద్ధభిక్షువు శిరస్సుతోవున్న రజత ఖేటకం వహించి డిగ్గియ వెలువడుతుంది. సునీధ లాక్కొంటుంది తారనాథుడు కౌశేయాంచలముతో ముఖము కప్పుకొంటాడు సునంద నవ్వుతూ విసురు కొంటుంది)

నీ యధరాల్ని చుంబింపనీవు ఘోష్! మంచిది! ఇప్పుడు ముద్దెట్టు కుంటాను. పండును కొరికినట్లుగా ఇప్పుడు నీ పెదవుల్ని కొరికి వేస్తాను నీ పెదవుల్ని ఇప్పుడు ముద్దెట్టుకుంటాను ఘోష్ నేను అన్నాను చెప్పలేదా? చెప్పాను ఆఁ! ఇప్పుడు ముద్దెట్టుకొంటాను. నావంక కెందుకు చూడవు ఘోష్, భయంకరములై, క్రోధారుణములై, అసహ్యాభావ సూచకములైన నీనేత్రాలు ఇప్పుడు మూసికొన్నాయి. ఎందుకు మూసికొన్నాయి కళ్లు తెరువు ఘోష్ నావంక కెందుకు చూడవు! నాకు భయపడి కన్నులు మూసు

కొన్నావా? అరుణ నాగిని వలే విషజ్వాలలు గ్రక్కుతుండే నీ జిహ్వ కదలటం లేదు, ఏమీ మాట్లాడటం లేదు అతి విచిత్రం కాదా? ఆ యరుణాశీ విష మెందుకు చలించటం లేదు? నేను నీకవసరం లేదు. నీవు నన్ను పరిత్య జించావు. నన్ను అనరాని మాటలన్నావు. నన్ను పతితురాల్నిగా, కులటగా చూచావు నీ మస్తకము నాకు వశమైంది; దీన్ని నా యిష్టము వచ్చినట్లు చేస్తాను. కుక్కలికి పారవేయగలను, పక్షులకు పారవేయగలను; కుక్కలూ పక్షులు మాత్రము ప్రేమించే నిన్ను... ... నిన్నొక్కణ్ణే నేను ప్రేమించాను. మిగిలిన మానవుల్ని అందర్ని అసహ్యించుకొంటున్నాను నీవు మాత్రము సౌందర్య వంతుడివి. నీ శరీరము గండారవు బొమ్మ. తామరస బహుళమైన ఆరామము. ప్రపంచంలోని జటా నీలమకంటే నీలిమలేదు నీయధరాలకంటే అరుణతర మైనది వేరొకటి లేదు. నీ కంఠస్వరము మురళీనాదము. నిన్ను చూచినప్పుడు విచిత్రగానాన్ని ఆలకించేదాన్ని. నన్నెందుకు చూడవు ఘోష్? నీ కరాల చాటున నీ శాపాల మాటున ముఖము దాచుకొన్నావు నీదైవాన్ని చూచావు గాని, నన్ను చూడలేదు. నన్ను చూడలేదు. నన్ను చూచే ఉన్నట్లయితే ప్రేమించే వాడివే. నేను, నేనునిన్ను చూచానుఘోష్, చూచి నిన్ను ప్రేమించాను. నిన్నెంత ప్రేమించాను? ఇప్పటికీ ప్రేమిస్తున్నాను ఘోష్! నీ సౌందర్యం కోసం దప్పిగొని ఉన్నా నీ దేహం కోసము ఆకలి గొన్నా. ఆసవాలు గాని, ఫలాలుగాని నా దాహాన్ని తీర్చజాలేవికావు. నేనిప్పుడేమి చెయ్యాలి ఘోష్? వేణులు కాని, వెల్లువలు కాని నాకామాన్ని చల్లార్చలేవు. నేను రాజపుత్రికను, అసహ్యించుకొన్నావు. నేను కన్యను నా కన్యాత్వాన్ని పీటుపుచ్చావు. బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించాను నీవు నా నరనరాల్లో జాజ్వల్య మాన వహ్నిని రగుల్కొల్పావు . .. నావంక కెందుకు చూడవు ఘోష్? నా వంకకు చూచి ఉన్నట్లయితే ప్రేమించి ఉండేవాడివి గదా! నీవు ప్రేమించి వుండేవాడవని నాకు తెలుసు. ప్రణయరహస్యము మృత్యురహస్యంకంటే గరీయము ప్రేమనుగూర్చే విచారించాలి.

: నీ సోదరి క్రూరవ్యాఘ్రి మహాపాపం చేసింది. అగోచరుడైన దైవమువట్ల మహాపరాధమొనర్చింది

: నా సోదరి మంచిపనిచేసింది ఇక ఇక్కడే ఉంటాను

: (లేస్తూ) మహాపాతకి మాట్లాడుతున్నది లోనికి వెళ్లదాము రా! నేనిక్కడ ఉండను రా! చెబుతున్నాను రా ఏదో విపత్తు కలుగుతుంది సందేహం

లేదు దివ్వెల్ని ఆర్పివేయండి నేనా వస్తుసముదాయాన్ని చూడలేను వీటికి నేను దర్శనమియ్యలేను ఆర్పివేయండి చంద్రుణ్ణి కప్పండి. చుక్కల్ని దాయండి. సౌధంలో దాగుకొందమురా! సునందా. నాగుండె కంపిస్తూ ఉంది

(పరిచారికలు దివ్వెలు ఆర్పుతారు. నక్షత్రాలు సురిగిపోతవి. నీలాంబుద ఖండము చంద్రుణ్ణి పూర్తిగా కప్పివేస్తుంది. రంగము కటికచీకటిగా ఉంటుంది. తారనాథుడు మెట్లెక్కుతుంటాడు.)

సునీ : ఇదిగో! నీ పెదవుల్ని ముద్దెట్టుకొన్నాను ఘోష్! నీ పెదవుల్ని ముద్దెట్టుకొన్నాను. నీ పెదవులు చేదుగావున్నాయి. అది రక్తపు రుచా? లేక ప్రణయపు రుచా? ప్రణయము చేదుగా వుంటుందంటారు. ఐతే ఏమ్? ఐతే ఏమ్? నీ పెదవుల్ని ముద్దెట్టుకొన్నాను ఘోష్

(చంద్రాంశువు సునీథపైబడి వెలుతురిస్తుంది.)

తా : (వెనక్కి తిరిగి సునీథనుచూచి) దాన్ని చంపివేయండి.

(సైనికులు ముందుకు దుమికి తమ ఖేటకాలక్రింద సునందాసోదరి అయిన సునీథను చంపివేస్తారు.)



(తెర)

*1935, నవంబరు*

## పాత్రలు :

వ్యాసుడు
జైమిని
దేవలుడు
నందీశ్వరుడు
వైశంపాయనుడు
సుమంతుడు
భృగువు
విశ్వనాథుడు
అన్నపూర్ణ
ప్రమధనాధుడు

ఇంకా ఇద్దరు బ్రహ్మచారులు

## కా శీ న గ ర ం :

1 గురుకులం

2 బ్రాహ్మణవాటిక

3 విశ్వనాథుని ఆలయం

(మణికర్ణిక. ప్రక్కనే గురుకులం చాలా విశాలంగా వుంటుంది. దూరాన్నుంచి చూస్తే చెట్లతోపుగా కనిపిస్తూ వుంటుంది ఎక్కువగా వేపచెట్లు, వటవృక్షాలు. గురుకులంలో ఒకమూలగా వేపచెట్టుకు దగ్గరలో వ్యాసుని కుటీరం. దానికి కొంచెం దూరంలో జైమిని కుటీరం దానికి ప్రక్కనే విద్యార్థులు చదువుకోటానికి రెల్లుతో నేసిన పాకలు పదిపన్నెండు ఉన్నాయి ఈ కుటీరాలమధ్య పెద్ద అశోకవృక్షం గురుకులమంతా అప్పుడప్పుడు ఇక్కడే కలుసుకొంటూ వుంటుంది. వ్యాసుని ఉపన్యాసాలకు విద్యార్థులంతా ఇక్కడికే వస్తారు. దీన్నే ముక్తిమంటపి అంటారు పురాణపరనం మహర్షుల వేదాంత చర్చలు ఇక్కడే జరుగుతాయి. వ్యాసుని గ్రంధాలకు ప్రతులు ఇక్కడినుంచే వ్రాసుకపోతారు.

ముక్తిమంటపికి ముందు అక్కడక్కడా చెట్లున్నాయి. మధ్య మధ్య మందార వృక్షాలు, మల్లెతీగలు, గులాబి మొక్కలు, సన్నజాజి పొదలు, వాసంతీకుంజాలు ఉన్నాయి బ్రహ్మచారులు చెట్లక్రిందచేరి పాఠాలు వల్లించుకొంటూ వుంటారు

ఈ చెట్లలోవున్న మామిడిగున్న క్రింద సుమంతుడు, భృగువు, నందీశ్వరుడు, దేవలుడు కూర్చుంటారు. హెచ్చుతగ్గుగా వీరందరూ సమవయస్కులు. అందరికీ గోష్పాదవు పిలకలున్నాయి. నూనూగు మీసాలు, మెళ్ళో రుద్రాక్ష మాలలు, చెవులకు 27
రుద్రాక్షకుండలాలు. అందరివీ పింజలు వోసి కట్టిన నీరుకావి దోవతులు, మీను మీసాలవంటి యజ్ఞోపవీతాలు, ఒంటినిండా విభూతి రేఖలు.

సుమంతుని విభూతి రేఖలు చెమటతోమాసి కనబడకుండా వుంటాయి. కన్నులు వెలవెల పోతుంటాయి. నందీశ్వరుడు ప్రక్కన వున్న మల్లెతీగవంక చూస్తూ వుంటాడు భృగువు, ముఖంతిప్పి విచారంగా చూస్తూవుంటాడు దేవలుడు చిరాకుగా వుంటాడు మంచి తెలివి తేటలున్నాయి. ఇతడంటే బ్రహ్మచారులకందరికి అసూయ, ఒక విధమైన గౌరవం, అసహ్యత. ఇతని దగ్గర నందీశ్వరుడు తప్ప ఇతరులు నోరువిప్పటానికి జంకుతారు.

రెండు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడరు. అంతా ప్రశాంతంగా వుంటుంది. మణికర్ణికనుంచి వచ్చే ధ్వని విషాదంగా ఆ ప్రశాంతాన్ని దుస్పహంచేస్తూ వుంటుంది. ఉండివుండి సుమంతుడొకసారి పెద్దగా ఆవలిస్తాడు అందరు ఒక్కసారి అతనివైపు తిరుగుతారు.)

సు : ఆకలి! ఆకలి!

భృ : బ్రహ్మసూత్రాలు వల్లించు జైమిని గురువుల వాఖ్యానం ఒకసారి మననంచెయ్యి

దే : దానితో ఆకలి తీరుతుంది పరమాన్నం తిన్నట్లే

నం : వాల్మీకుల రామాయణం, వ్యాసుల వేదాంతసూత్రాలుంటే ఇంకాఏమి కావాలి!

సు : భాగవాన్, కడుపు మండిపోతూవుంది. శరీరం శుష్కించి పోయింది. కన్నులు పీక్కుపోయినవి. ఇంకా ఎంతకాలం ఈ ఉపవాసం? ఏడు రోజాలనుంచి తిండి లేదు.... ప్రేవులతో సహా తరుక్కుపోతున్నాయి. ఏమిచిక్కినా ఒక్క కబళంలో మింగివేస్తాను

దే : (ఇంతవరకూ సుమంతుని అనుకుని కూర్చున్నవాడు దూరంగా జరిగి) నన్ను మాత్రం మింగివేయకు

సు : ఇంకా రెండురోజాలదాకా భిక్ష దొరక్కపోతే నీవు చెప్పినంతా చేస్తా అబ్బబ్బ! ఆకలి. నోటిలో ఇంతకుముందే గుంజుకొచ్చిన శరీరంచెమటతో నానిపోతున్నది ఇక నేను కూర్చోలేను

(శరీరం కృష్ణాజినం మీద వ్రాలుస్తాడు, అనతి దూరంలో మఱ్ఱిచెట్టు కిందకు జేరిన బ్రహ్మచారుల మధ్యనుంచి 'అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా' అని పెద్దగా వినిపిస్తూ వుంటుంది.)



సు : దేవలా! తలనొప్పి ప్రారంభించింది వాళ్ళను కొంచెం మెల్లగా చదువుకో మనరాదూ?

దే : ఏయ్, ఎవరక్కడ! మెల్లగా చదువుకోండి.

(వినిపించుకోకుండానే పెద్దగా చదువుతుంటారు. సుమంతుని చెవులు గింగురుమంటాయి. చెవుల్లో వేళ్లు పెట్టుకొని భృగువువంక దీనంగా చూస్తాడు.)

భృ : (పెద్దగా) మీకే చెప్పేది, వినపట్టంలా?

(పెద్దగా వల్లిస్తున్న బ్రహ్మచారుల మధ్యనుంచి తలెత్తివైశంపాయనుడు కాసేపు చూస్తాడు.)

వై : ఇది అధ్యయన సమయం. కాదనటానికి నీ వెవ్వరివి?

దే : వట్టి జంతువు! (పెద్దగా) మీ అధ్యయనాన్ని ఎవ్వరు మానుకోమన్నారు? మెల్లగా చదువుకోమన్నాము

వై : జాగ్రత్త! మా యిష్టం వచ్చినట్లు చదువుకొంటాం, మీకెందుకు?

భృ : కోపగించకు. సుమంతుడు అవస్థ పడుతున్నాడు అందుకని మిమ్మల్ని మెల్లగా చదువుకోమన్నాము, అంతేనా?

వై · అంతేనా? మేము వినలేదనుకున్నారా ఏమిటి? నేను జంతువునా?

(దేవలుడున్న చోట్కికివస్తారు లోపలికి పీక్కుపోయి జేవురించిన కన్నులతో దేవలుడు వైశంపాయనుణ్ణి ఎగాదిగా చూస్తాడు. బ్రహ్మచారులంతా చుట్టూ మూగుతారు.)

భృ : ఊరక రౌద్రమూర్తివైతే ఎలాగోయి? చూడు, మన సుమంతుడు ఆకలితో చచ్చిపోయేట్టున్నాడు ఆబాధ చూడలేక ఏదోఅని వుంటాడు. అంతమాత్రానికే..

సు : దాహం! దాహం!... గురుదేవా... గురుదేవా!

(దేవలుడు అతురతతో నీళ్ళకోసం ప్రక్కన వెదుకుతాడు. వైశంపాయనుడు ఇంతకుముందు కూర్చున్నచోటికి పరిగెత్తికెళ్లి కమండలం తెచ్చి సుమంతునికి అందిస్తాడు. అతడు వణకుతున్న చేతుల్తో అందుకొని పుక్కిలించి గ్రుక్కెడు నీళ్ళు త్రాగబోతాడు. గొంతులోనుంచి నీళ్ల జారక కళ్ల తేలవేస్తాడు. అంతా తత్తరపాటుతో సుమంతునిచుట్టూ మూగుతారు. వైశంపాయనుడు వాళ్ళనందర్నీ దూరంగా వుంచి సుమంతుని తల ఒళ్లో పెట్టుకొని గుండె సవరిస్తాడు. అలా సవరించగా సవరించగా మింగుడుపడని నీళ్ళు లోపలికి జారుతాయి. 'అమ్మా' అని నిట్టూర్చి సుమంతుడు కన్నులు మూస్తాడు మిగిలిన వాళ్ళంతా ఒకరిముఖం ఒకరు చూచుకుంటూ వుంటారు. ఇదంతా చూస్తున్న దేవలుని హృదయం మండుతుంది.)

దే : అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా! అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా! బాధపడుతున్నా బ్రహ్మజిజ్ఞాసే, ఒక ప్రక్కచస్తున్నా బ్రహ్మజిజ్ఞాసే! ఆనాడే గురువులతో వాదించాను. మానవునికి తిండి అవసరం ఆర్థిక సౌమ్యస్థితి ఏర్పడాలి. మానవుని చరిత్ర ఆర్థికనేమిపై దొర్లుతూవుంటుంది.

నం : పిచ్చివాడా జగత్తే మిథ్య. మానవులు బుద్బుదప్రాయులు.

దే : మానవులు బుద్బుదప్రాయులైనా, మానవుడు నిత్యుడు; అమర్త్యుడు.

నం . (వినిపించుకోకుండానే) మొగ్గలు పుష్పించి రాలిపోతాయి. మేఘాలు గుమిగూడి వర్షించి విచ్ఛిన్నమౌతాయి నాలుగురోజులు పచ్చికబయళ్లలో తిరిగి నశిస్తుంటాయి. లోకాన్ని పండువెన్నెలతో నింపి పూర్ణిమాతారకరాజు కుహూశార్వరిలో అదృశ్యుడౌతాడు మానవుడూ అంతే రెండు రోజులు ఈ ప్రపంచ మనేనాటకశాలలో నటించి పోతాడు శాశ్వతమేమీ లేదు బ్రహ్మమొక్కటే నిత్యము, నిర్గుణము, నిర్వికారం.

దే : అంతా వట్టి అబద్ధం

భృ,
వై, } నీవు నాస్తికుడిలాగా కనిపిస్తున్నావు, జాగ్రత! గురుదేవులతో చెపుతాం
బ్ర :

దే : నందీశ్వరుడు ఇంతసేపు చెప్పినా, ఒక్కటే చెప్పింది అదీ సహేతుకంగా లేదు

భృ . సహేతుకంగా లేదా!

వై . గురుదేవునిలాగా చెప్పాడు

దే : మూర్ఖులకు వాగిందే పది తడవలు వాగితే సహేతుకమై పోతుంది. వేరేప్రమాణా లక్కరలేదు.

అం . (చురచురచుస్తూ) మేమంతా మూర్ఖులం!

దే : మీకు కోపం రావడంలో ఆశ్చర్యమేముంది? ప్రపంచం ఒక్క ప్రతిభను మాత్రం ఎప్పుడూ సహించలేదు.

నం అతనితో ప్రత్యేకంగా వాదించడందేనికి? నేను పదిరోజుల క్రితం బ్రహ్మ పదార్థాన్ని విశదీకరిస్తూ భిక్షాపాత్రమీద సహస్రనామాలు వ్రాశాను, వినిపిస్తాను

దే · తప్పకుండా వినాలసిందే. గురుకులమంతా ఆకలిచిచ్చుతో మలమల మాడి పోతూవుంది! నకనకలాడే పొట్టలతో అవశ్యం వినండి. ఆకలి తీరుతుంది జన్మతరిస్తుంది

నం : ఈ శరీరం నిత్యం కాదు ఈ శరీరానికి కలిగేకష్టసుఖాలు అంతకంటే నిత్యం కావు పరబ్రహ్మ మొక్కటే నిత్యం కాబట్టి పరమార్థచింతనమే మానవుడికి కర్తవ్యం.

సు . (నాలుక చప్పరిస్తూ) దాహం! దాహం!

దే . ఓయీ, పిచ్చివాడా! విను, విను. మన నందీశ్వరుడు పరమపదామృతాన్ని కటాక్షిస్తున్నాడు. ఒక పుడిసెడు పుచ్చుకో. లేచి కూర్చుంటావు!

భృ ఒకప్రక్క ప్రాణాలు పోతూవుంటే ఈ వెక్కిరింపులేమిటి?

దే మరి ఈ వేదాంత బోధనలో?

నం · నీవు అధఃపతితుడవౌతావు ఎంత పూర్వపుణ్యమో వుంటేగాని ఆర్షసూక్తాలు అర్థం కావు; అమరత్వం ప్రాప్తించదు

దే . స్వల్పమైన ఈ నూరేండ్ల జీవితంతోనే వేగలేకుండా ఉన్నాను అలాంటప్పుడు ఈ అమరత్వం దేనికి?

వై ఎవరి గొడవ వారిదిగావుంది సుమంతుడు మళ్లా కన్నులు తేలవేస్తూ ఉన్నాడు భృగూ! త్వరగాపోయి ఈకమండలువుతో జలం తీసుకురా

(భృగువు కమండలంతో వ్యాసుని కుటీరానికి పరుగెత్తుకెళ్లుతాడు దేవలుడు నందీశ్వరుడు తప్ప తక్కినవారంతా దిగులుపడి సుమంతునిచుట్టూ కూర్చుంటారు. వైశంపాయనుడు ఉత్తరీయంతో సుమంతునికి విసురుతూ వుంటాడు )

నం . (దేవలునిమీద కోపంతో భిక్షాపాత్ర తత్వాన్ని తోడివిద్యార్థులకు ఉపన్యసించాలని గొంతుసవరించుకొని) దేవలుడు నానాటికి అధోగతిపాలవుతున్నాడు

దే : కాదు, క్షణక్షణానికి

నం సరిగా చెప్పావు. క్షణక్షణానికి అధోలోకానికి దారితీస్తున్నాడు నాస్తికత్వం అతన్ని ఆవేశించింది నీచాతి నీచమైన భౌతికతత్వాన్ని బోధిస్తున్నాడు. ఐహికాలైన భోగాలు, ధనధాన్యాలు శాశ్వతంకావు మానవునకు పరమాపధులు కావు. అవే పొందవలసినవైతే, జంతువులకూ, మానవులకూ భేదం లేదు నిరుపాధికసత్తార్థమైన ఆనందం, సచ్చిత్స్వరూపమైన ఆనందం ఒక్కటే వివేచనా బుద్ధిగలిగిన మనుజానికి ఆదర్శం. ఆ ఆనందమే బ్రహ్మం.

దే బలే, చక్కనిఉపన్యాసం! గురుదేవులనుండికూడా ఇలాంటి వాగ్ఝరి ప్రవహించలేదు. 31

నం : (వినిపించుకోకుండా మళ్ళీ) పక్వమనస్కులు ఆ బ్రహ్మంకోసం అన్వేషిస్తారు ఈభోగాలు వారికి ఒక లెక్కలోనివి కావు ఇందుకుపూజ్యపాదులే తార్కాణం ( ఆవేశంతో) సామ్రాజ్యాలు వారిచేతుల మీదుగా నడిచాయి. కురుపాండవుల మధ్య నిష్కాములై ప్రవర్తించారు సింహాసన మధిష్ఠించిన ఆ లలితారుణ పాదములు ఈనాడు భిక్షకోసం బ్రాహ్మణవాటిలో వీధివీధిలో సంచరిస్తున్నాయి ఏవి బంగారు గంటంతో భారత సంహితాకృతిని కవితాకన్యచేత లలిత నృత్యం చేయించాయో, ఏవి లోక సంగ్రహార్థం పదునెనిమిది పురాణాలు ఏకధాటిని రచించాయో, ఆ అంగులీ సనాథములైన పల్లవాంగుళులు భిక్షాపాత్ర కీలించాయి వేదవిభాగంచేసి, మనోజ్ఞంగా వల్లించే ఆ మృదుకంఠం ''భిక్షాం దేహీ, భిక్షాం దేహీ,'' అని ముక్తకంఠంతో నీలమేఘపథాలలో మొరసే గర్జనలాగ కాశీ వీధుల్లో మారుమ్రోగుతుంటుంది. అలాంటి మహర్షులే నారాయణ స్వరూపమైన దారిద్ర్యాన్ని స్వీకరించి సంయములై ఉన్నారు. అలాంటివారే మెదలకుండా వుంటే మీకెందుకు ఈ తహతహ?

సు : నీళ్లు! . .. నీళ్లు! . ...

బ్రహ్మచారులంతా : భృగువు నీరు తేబోయాడు త్వరలోనే వస్తాడు

సు . అబ్బా!.....

దే : మన నందీశ్వర ముష్టింపచులవారి ఉపన్యాసమైనాముగియలేదు. అప్పుడే ఎలావస్తాడు?

వై : ఈపాటికి వస్తూవుండాలి. చాలాసేపైంది.

సు . ప్రాణాలుకడబట్టుతున్నాయి.... ఇలా దాహజ్వాలల్లో మాడి చావవలసిందేనా?

దే ఎందుకు చావాలి? మన నందీశ్వరుడు ఉన్నాడు (అతని వైపు తిరిగి) ఏదీ, మీ ఉపన్యాసామృతాన్ని ఒక్కసారి యీసుమంతునిమీద ప్రోక్షించి బ్రతికించుదురూ, పుణ్యముంటుంది.

వై . ఇప్పటికే సగం చచ్చిపోయాము ఇక మమ్మల్ని బ్రతక నివ్వవా ఏమిటి?

దే అలాకాదు. నిరుపాధికసత్తార్థమైన ఆనందం యొక్క స్వరూపాన్ని తెలుసుకోవాలి అదే మానవజన్మ ఎత్తినందుకు ఫలం

32 మొ.బ్ర· నందీశ్వరుడు గురుకులం విడిచివెళ్ళి కుడిచి వచ్చినట్లున్నాడు. లేకపోతే యీ చర్చకు దిగడు

దే అతడు సాక్షాత్తు నందీశ్వరుడు. ఆకలిదప్పులు అతనికి ఉండవు.

రెం.బ్ర అంటే హిమాలయాల్లో మేసివచ్చాడనేగా?

దే : అలాగని నేను చెప్పానా? ఆ పాపం నాకెందుకంటగడతారు?

నం : వట్టి పశువు! పొరపాటున.....

దే : సంయములు ఇలా అంతశ్శత్రువులకు వశంకావడమేనా?

వై : దేవలా! శ్రుతిమించి పోతూ వుంది ఇంత నీచంగా మనమెప్పుడైనా ప్రవర్తించామా? "బుభుక్షితః కిన్న కరోతి, పాపం?" అదిగో పూజ్యపాదులు వస్తున్నారు

మొ బ్ర· శరీరం బడలి ఉంది.

రెం.బ్ర : కన్నులు నెత్తురుజొత్తుల్లాగా ఉన్నాయి

దే బ్రహ్మవర్చస మొలికేముఖం వాడి మలిన మేఘావృతమైన చంద్రబింబంలాగ వుంది.

వై	వ్యాకుల హృదయులుగా కనిపిస్తున్నారు

మొ బ్ర	పూజ్యపాదులతో ఇంకా ఎవరో వస్తున్నట్లున్నది

రెం బ్ర	ఎక్కడో చూచాము.

మొ బ్ర	వారి సంగతి ఎలా వున్నా, వారి నడకలోని ఊపు ఎక్కడో చూచాము

దే	· జైమినులు.

వై	: ముఖంలో మార్పు కలిగింది

మొ బ్ర	నుదుట ముడుత లేర్పడ్డాయి.

రెం బ్ర · కరి నోపవాసాలు! అలాంటి దృఢశరీరులుకూడ చలించిపోయారు.

దే	. ఇస్! పూజ్యపాదుల కన్నులనుండి రెండశ్రువులు రాలాయి.

వై	: ఎప్పుడూ వారి కన్నులు చెమ్మగిల్లలేదు.

దే	. దుర్భరం, ఆ విశాల నేత్రాంచలాలనుంచి వెడలే ఆ చూపులు శల్యతుల్యాలై నా హృదయ కుహరాన్ని చీల్చి వేస్తున్నాయి. ఆ పవిత్రాధరాలు చలిస్తున్నాయి.. ఏదో మాట్లాడుతున్నారు

వై	ముఖంమీది మడతలు విషాదభరంతో ఎక్కువయ్యాయి.

దే	ఇస్, విను విను.

(వ్యాసుడు జైమినితో మాట్లాడుతూ వస్తుంటాడు. మంచి ఒడ్డు పొడవులున్న మనీషి వయస్సు మళ్లినా యోగాభ్యాసంవల్ల శరీరం, బలిష్ఠంగా వుంది ఏడు రోజులనుంచి తిండి లేకపోవడం వల్ల ముఖం వసివాడిపోయివుంది అయినా బ్రహ్మతేజమింకా మ్లానం కాలేదు జడలు దట్టంగా పొడ్డుగ్గా వేలాడుతూవుంటాయి. గడ్డంబొంపంగా ఉన్నా అంతాపొడుగ్గా లేక ముఖం గంభీరంగా, అందంగా కనిపిస్తుంది చెవులకు రుద్రాక్ష కుండలాలు, మెడలో రుద్రాక్షమాల ఉన్నాయి కాళ్ళకు పాదుకలు, బిళ్ళగోచి దోవతి, (ఆరోజుల్లో కౌపీనంతో కాశీవీధుల్లో భిక్షాటనం చేసినా, యీనాటి నాటకరంగం మీద అలా కనిపించటానికి వీల్లేదు.) చెక్కిళ్ళు విశాలంగా ఉంటాయి ముక్కు కోటేరులాగా వుంటుంది కన్నులు ఎదుటివారి హృదయం చీల్చి చదివేటట్టుగా వుంటాయి ముఖవికాసం సమగ్రమైన ప్రపంచానుభవాన్ని, బ్రహ్మజ్ఞాన సంపత్తినీ వెల్లడిస్తూ వుంటుంది చూడగానే అతడు మహాకవి అని కూడ తెలుస్తుంది

జైమిని వ్యాసుని అంత పొడగరికాడు. కాని అతనికంటె లేతవాడు వ్యాసుని దగ్గరే చదువుకున్నాడు. అచ్చంగ గురువు లాగ తరిపీదయ్యాడు గురుకులమంతా ఇతని

ఆజ్ఞానుసారం నడుస్తుంది. వేదాధ్యయనం, వేదాంత బ్రహ్మ సూత్రార్థబోధనలు ఇతడే నడుపుతుంటాడు. అంటే వ్యాసుడు గురుకులానికి ప్రిన్సిపాల్ ఐతే, జైమిని వైస్ ప్రిన్సిపాల్. వ్యాసుడు ఎప్పుడూ వ్రాస్తూనో, ఆలోచిస్తూనో ఉంటాడు అందువల్ల క్లిష్టమైన విశేషాలు తెలుపవలసి వచ్చినప్పుడు మాత్రమే అతని ఉపన్యాసాలుంటాయి

భృగువు వారివెనుక గురువుల కమండలువు, భిక్షాపాత్ర పట్టుకొని వస్తూ వుంటాడు.

వ్యా : జైమినీ!

జై : (నిద్రలోనుంచి మేలుకొన్నట్టుగా) ఏమి గురూ!

వ్యా : పురాణాలకు ప్రతులు వ్రాసుకుంటున్నారా!

జై : వ్రాసుకోవడమైంది. ఇంటింటా చదువుతున్నారు.

వ్యా : భారతమో?

జై . పురాణాలకంటె భారతంప్రతులు కోకొల్లలుగా లోకంలో వ్యాపించాయి ఎందుకు అలా అడుగుతున్నారు?

34 వ్యా · వేదాంత సూత్రాలుకూడ చేయిదాటిపోయిన వన్నమాట!

జై : మీ హృదయం అర్థం కావటం లేదు

వ్యా · (నిట్టూర్చి తనకు తానుగా) ఉన్న అవకాశంకూడ పోయింది.

జై · ఏ అవకాశం పోయింది? నేడేదో మీలో మార్పు కనిపిస్తూవుంది.

వ్యా : నా పుస్తకాలు లోకం చేతిలో పడకుండా వుంటే ఎంత బాగుండేది?

జై : (వ్యాకులంగా) ఎందుకిలా మాట్లాడుతున్నారు? మీకావ్యాలు మహత్తరమైనవి లోకం మీ కావ్యాల్ని సృష్టించలేదు. మీ కావ్యాలు లోకాల్ని సృష్టించాయి. భావి కవులకు వలసినంత వస్తువును అందిస్తవి మీరు సృష్టించినన్ని ఘట్టాలు, చిత్రించినన్ని పాత్రలు మరేకవీ చేయలేదు. మీ సృష్టి బాహుళ్యానికి భవిష్యత్తులో పండితులు అసూయాపరవశులై మీకు బహుత్వ మాపాదిస్తారు. ఇదినిజం మీ ప్రతిభ అనన్యం ఇలాంటి పుస్తకాలు లోకంలో ప్రచారం కావాలి మీరు ఆ ప్రచార నిషేధం ఎందుకు కోరుతున్నారో అర్థం కావటం లేదు.

వ్యా : ఇప్పుడు కూడ నా పుస్తకాలు అలాగే కనిపిస్తున్నాయా!

జై · ఇప్పుడే కాదు, ఎప్పటికీ నిత్యనూతనాలు శబ్ద బ్రహ్మస్వరూపం తెలిసినవాడెవ్వడూ మీ కృతుల్ని కాదనలేడు మీ ప్రతిభకు చెలియలికట్టలేదు మీ

కవిత్వానికి జరామయములు లేవు. గురూ, గురూ! మీవాక్యాలు చదువుతూ వుంటే నేనీ ప్రపంచాన్నే మరచిపోతాను నా హృదయంలో ఏవో భావాలు పరుగెడుతుంటాయి. ఒక బ్రహ్మాండమైన విజ్ఞాన తేజస్సు నన్నావరిస్తుంది వన్ను నేను మరచిపోతాను.

వ్యా : (విషాదంగా నవ్వుతూ) ఈ ఉపవాసంలో కూడ నీ కలాగే కనిపిస్తున్నవా?

జై : ఆ గ్రంథాలు దగ్గరుండబట్టే నాకు కష్టమనిపించటం లేదు.

వ్యా : నా వంక చూడు. జీరలో జీర మలగివున్న నీ కన్నులు నిర్మలాకాశపు నీలినీడలు ప్రసరిస్తున్నాయి. అవ్యక్తబాధను సూచిస్తున్నాయి.

జై : లేదు, నాకేబాధ లేదు.

వ్యా : నీకు తెలీదు. నీవు బాధపడుతున్నావు.

జై : విచిత్రంగా మాట్లాడుతున్నారు ఇంతవరకు పూజ్యపాదులు ఇలా మాట్లాడగా వినలేదు. క్రొత్తగా కనిపిస్తున్నారు.

వ్యా : (నెమ్మదిగా) నీకేకాదు, నాకు నేనే క్రొత్తగా ఉన్నట్లున్నది (విషాదంగా), జైమినీ! జైమినీ! నా పుస్తకాలు లోకంలో లేకుండా చేయటానికి వీల్లేదా?



జై : మీ కృతులను గూర్చి ఇంతగా ఆరాటపడుతున్నారు దేనికి? ఇంత వ్యాకుల పడవలసిన అవసరం కనిపించటం లేదు.

వ్యా : వత్సా! అలాకాదు. నా పూర్వతత్వమంతా నాటుకుపోయి నీ హృదయం కర్కశమై పోయింది. నీ యువహృదయం అంతకు మించిపోదు. ఇంకా నీ కనుభవం కావాలి. నా కావ్యవిపంచీ నాదంతో తన్మయుడవై పోయావు తన్మయుడవై పోయినంతకాలం నీకు లోటు కనిపించదు.

జై : సర్వతోముఖాలైన మీకావ్యాల్లో లోటులా! అసంభవం. నేను ఒప్పుకోలేను. మీరు రసజ్ఞులనీ, గంభీర హృదయులనీ, సూక్ష్మబుద్ధులనీ, గురుకులం, వారణాసి, భరత వర్షం చెప్పుకుంటున్నాయి.

వ్యా : గురుకులం కాదు. భరతవర్షం కాదు. నీలోని యువహృదయం చెబుతూ వుంది. నీవు ప్రతిభాశాలివని చెప్పుకోటానికి నన్ను గొప్పవాణ్ణి చేస్తున్నావు నా పుస్తకాలు మహత్తరమైనవని అంటున్నావు.

జై : (ముఖం ఎర్రబడుతుంది) మీ పుస్తకాలు చాలా గొప్పవి. కూలంకషంగా మానవుణ్ణి చిత్రించాయి మీరేమన్నా సరే, ఏ లోటుపాటులూ వాటిలో లేవు.

వ్యా : పిచ్చివాడా! నా వీణానాదంలో శ్రుతి తంతువునే లగించలేదు.

జై . ఆఁ! (విస్తుపోయి, రెండు నిమిషాలు మొగాన నెత్తురు చుక్కలేకుండా చూచి) శ్రుతి తంతువు లగించలేదు! శ్రుతి తంతువునే లగించలేదు

వ్యా : నేటికి తెలిసివచ్చింది!

జై : పూజ్యపాదుల హృదయం బ్రహ్మ పదార్థంలాగా కనిపిస్తోంది

వ్యా : భృగూ! (ఆలోచిస్తున్న వ్యాసుడు ఒక్కసారిగా కఠినంగా పిలుస్తాడు. పిలుపుతో హడలిపోయి భృగువు వణికిపోతూ వుంటాడు.) ఏదీ నా భిక్షాపాత్ర! (భృగువు వణకుతున్న చేత్తో భిక్షాపాత్ర అందియ్యబోతాడు. జారి క్రిందబడి వ్రక్కలయ్యేదే. జైమిని పట్టుకుంటాడు.)

జై . (కోపంతో) ఓరి అప్రాచ్యుడా!

(ఈ మందలింపుతో తత్తరపాటెక్కువై కమండలువు కిందబడి బ్రద్దలౌతుంది. వ్యాసుని ముఖంలో విషాదరేఖ కనిపిస్తుంది )

జై : అపశకునం! అపశకునం! ఇకమీదట గంగాతీర్థం లభించదు కాబోలు! మహదేవ్! మహదేవ్! మేమేమిపాపం చేశాము? తిండిలేకపోయినా, ఈ పవిత్ర భాగీరథి జలంతో పొట్టలు నింపుకుంటున్నాము దీనికికూడా నోచుకోలేదా?

వ్యా : ఎందుకు దూపటిల్లుతావు? కాశీనివాసానికే నోచుకోలేదు.

జై : ఆఁ! ఆఁ! ఏమి సెలవిచ్చారు! శివ శివా! గురువుల ముఖంనుండి వచ్చిన వాక్కు వ్యర్థం కాదు.

వ్యా : వ్యర్థం కాదు! అలా నిర్దిష్టమై కనిపిస్తూనే వుంది. (ఒక్క అశ్రుకణం చేతిలోవున్న భిక్షాపాత్రలో పడుతుంది. వ్యాసుని ముఖంమీద ముడతలెక్కువౌతాయి. జైమిని ఖిన్నుడై ఆతురతతో గురువు ముఖంలోకి చూస్తాడు.) ఈ జారిన అశ్రుకణమే ఇదివరకే యీ భిక్షాపాత్రలో వర్షించి ఉన్నట్లయితే!.. జారలేదు. అందుకనే శ్రుతిలేనిరాగ మాలపించాను. ఈముర్ఖలోకం పరవశమైతలవూపింది.

జై · (అర్థంకాక) శ్రుతిగలిపి ఇప్పుడు నూతనరాగం ఎందుకు ఆలపించరాదు?

వ్యా : వెనుకటి కంఠమాధుర్యం నశించింది. అయినా యీ దేశంలో పాడే అవకాశం పోయింది అనాగరికులమధ్య పాడినా ఫలంలేదు.

జై : క్షణక్షణం మీ హృదయానికి దూరమౌతున్నట్లున్నాను. ఇతనితో మీ హృదయం చెప్పగూడదా?

వ్యా

మొ

(అర్థం లేని చూపులతో చూస్తూ భిక్షాపాత్రలో) నా జీవిత ప్రభాతకాలంలో నీలో అశ్రుకణం రాలలేదు. చివరికి పిడుగన్నా పడలేదు పడినట్లయితే, ఎంత వికాసం కలిగేది! ఎంతచైతన్యం కలిగేది! నాకు సచ్చిదానందమైన దృష్టి యేర్పడేది ఆ గంభీరహృదయుడైన కృష్ణుణ్ణి, అక్కురు పాండవుల్ని, తక్కిన రాజుల్ని, మానవుల్ని అర్థంచేసుకొని ఉండేవాణ్ణి. దేవతాకోటి సహితం నమోవాకం చేసి ఉండేది లేదు, ఆ పుణ్యానికి నోచుకోలేదు ఆ ఉదారదృష్టి లేకపోవడంవల్లనే యీ గురుకులాన్ని, ఈ నిర్భాగ్య మానవ లోకాన్ని కష్టాల: పాలుచేశాను ఈ మానవులకు చాతుర్వర్ణ్యం విధించాను. బీదలకు ద్రోహంచేసే కర్మ సిద్ధాంతమూ, అవతారవాదము బోధించి దాస్యం అంగీకరింపజేశాను నా గీత ఈ కర్మభూమిలో ఎంతకాలముంటుందో అంతవరకు నివృత్తి లేకుండా చేశాను. ఈ సంఘమే మారిపోకుండా ఆశాసించాను ఈ భిక్షాపాత్రతో ఆ కష్టజీవుల్ని జీవించమన్నాను. మహాపరాధం చేశాను. మానవునిలో ఇంత అధికారపిపాస, ఇంత అహంకారం ఉంటుందని అనుకోలేదు ఈ అహంకారభూయిష్ఠమైన హృదయాన్ని నమ్మి, హృదయ పరివర్తనంకోసం పాటుపడమన్నాను ఆధ్యాత్మికమనే పేరుతో తుచ్ఛభౌతిక తత్వాన్ని ఉపదేశించాను. ఆదర్శప్రాయంగా ఇలాగే భిక్షాపాత్ర నిచ్చి విద్యావంతుల్ని పాడుచేశాను. జైమినీ! జైమినీ! ఆ బ్రహ్మచారులవంక చూడు: ఆ పాలుగారేచెక్కిళ్లు ఎలాపాలి పోయాయో! విద్యాబుభుక్షువులైన ఆనేత్రాలు ఎలా దీనంగా ఉన్నాయో! దుర్భరం! నేను వారి ముఖం ఎలాచూచేది! తల్లిదండ్రులను వదలి నన్ను నమ్ముకొని ఆశ్రయించారు. విద్యాభిక్షకోరారు. నిత్య శుశ్రూష నెరపుతూ వున్నారు. ప్రతిఫలంగా ఏమి ఇస్తున్నాను . ఏడు రోజులనుంచి తిండి తిప్పలు లేకుండా పస్తుంచాను! ఇకమీద కూడ వారికేమిఉపదేశం చెయ్యబోతున్నాను? ఈ భిక్షాపాత్ర ధరించి ఆకటి చిచ్చుతో దిగంతాలదాక తిరగండని ఉపదేశమి య్యబోతున్నాను అబ్బా, విప్లవ హృదయాన్నే చిదిమివేస్తున్నాను. (కంఠం రుద్ధమౌతుంది జైమిని విషాదంతో మాట్లాడలేక పోతాడు. ముగ్గురూ మెల్లగా బ్రహ్మచారులవైపు నడుస్తూ వుంటారు దేవలుడు, వైశంపాయనుడు సుమంతునికి ఉపచారాలు చేస్తూ వుంటారు )

బ్ర. ఎండ ప్రచండంగా కాస్తూవుంది.

రెం బ్ర : సుడిగాలి రేగింది గురుకులంలోని తీగలు, కొమ్మలూ ఎగిరిపోతూ వున్నాయి

మొ బ్ర : ఎన్నడూ యింత భయంకరంగా గాలివీచలేదు. ఇంత కణకణలాడే నిప్పులు సూర్యుడు ఇంతకుమున్ను వర్షించలేదు

రెం బ్ర ప్రకృతే ఉత్పాతకరంగా వుంది

నం పూజ్యపాదుల చేతిలోని భిక్షాపాత్ర కంపిస్తున్నట్లున్నది

రెం. బ్ర : ఏదో జరుగుతుంది?

దే (అందుకొని) ఈ గురుకులవాసుల సంగతి ఎలావున్నా పూజ్యమైన భిక్షాపాత్ర కేదో విపత్తు వాటిల్లుతుంది?

(ఇంతలో వ్యాస జైమినులు, భృగువువస్తారు. సుమంతుడు తప్ప అంతా నిల్చుని నమస్కారం చేస్తారు వ్యాసుడు విషాదంతో గంభీరంగా వుంటాడు )

జై . సుమంతు డెలాగున్నాడు?

దే : (కోపం కనబడకుండా) ఇంకాచావలేదు (భయంతో ఒకరి ముఖం ఒకరు చూచుకుంటూ వుంటారు.)



జై . అవజ్ఞ! గురుద్రోహం!

(సుమంతుడు పెద్దగా మూలుగుతాడు )

దే . ఒకప్రక్క ప్రాణాలు పోతున్నాయి. అవజ్ఞట, అవజ్ఞ! (వ్యాసుడు ముఖం తిప్పుకుంటాడు )

వై . నేడైనా ఒక కబళం దొరికితే....

నం : ఇక్కడ కూర్చుంటే ఎలా దొరుకుతుంది? కర్మచెయ్యాలి లేకపోతే ధర్మహాని

దే ప్రాణం కాదు పోయేది, ధర్మం.

జై (వ్యాసుని ముఖంలోకి చూస్తూ) గురూ, త్వరగా భిక్షకువెళ్ళి వస్తాము. మీరు ఆశ్రమంలో ఉండండి.

వ్యా (తీక్షణంగా జైమినివంక చూస్తూ) రండి!

(ముందు నడుస్తాడు. అక్కడున్న బ్రహ్మచారులంతా వెంట నడుస్తారు జైమిని కరవల్లి మంత్రచరణం ఎత్తుకుంటాడు. వ్యాసుడు తప్ప తక్కినవారంతా గొంతులుకలిపి పాడుతూ బయలుదేరుతారు )

# రెండు

(బ్రాహ్మణవాటికలోని బజారు తిన్నగా పొడుగ్గా వుంటుంది. బజారు సగంలోకి పోయింతరువాత హట్టం ప్రక్కనే పెద్దమేడ ఇందాకటివారంతా వల్లిస్తూ బయలు దేరుతారు )

బ్రహ్మచారులంతా:

యఏషసుప్తేషు జాగర్తి
కామం కామం పురుషోనిర్మిమాణః,
తదేకం శుక్రం తద్బ్రహ్మ
తదేమృత ముచ్యతే.
తస్మింల్లోకా శ్రితా స్సర్వే
తదునా త్యేతికశ్చన.

జై · ఏత ద్వైతత్

బ్ర. అందరూ : అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,

జై : ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ.

దే : భిక్షాం దేహి.

గేస్తురాలు : (సమాధానం రాదు.)

(అంతా నడుస్తూ వుంటారు)

బ్రహ్మచారులు : వాయు ర్యథైకోభువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ

జై : ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ.

దే : (ఇంకో ఇంటిముందు ఆగి) భిక్షాం దేహి!

గేస్తురాలు 2· ఇంకా వంట కాలేదు.

వై . నిన్నటిగతే ప్రాప్తించేటట్లుంది

నం : పూజ్యపాదుల ముఖంలో దుర్నిరీక్ష్యతేజం కనిపిస్తోంది

మొ.బ్ర. కన్నులు కుసుంభకుసుమాలుగా ఉన్నాయి

బ్ర.అం: సూర్యోయథాసర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః,

జై : ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః.

దే : భిక్షాం దేహి!

వై : భిక్షాం దేహి!

గేస్తురాలు 3 : మళ్ళీరండి.

రెం.బ్ర : ప్రొద్దు ఎదురయేట్లేవుంది.

నం : గురుదేవుల భ్రూకుటి ముడివడుచున్నది.

భృ : కన్నులనుండి విస్ఫులింగాలు వెలువడుతున్నాయి

మొ.బ్ర: జైమినుల ముఖం జేగురువారింది.



భృ : వెనుకబడుతున్నాము నడవండి.

దే : (ఇంకో మేడగుమ్మంలో నిలిచి) భిక్షాం దేహి!

వై : భిక్షాం దేహి!

జై : పూజ్యపాదాయ వేదవ్యాసాయ భిక్షాం దేహి!

గేస్తురాలు 4 : భిక్ష కూడదు.

భృ : భగవాన్, నేడుకూడా ఉపవాసమే.

మొ బ్ర· పూజ్యపాదులు అందరికంటె ముందు వెళ్లారు.

రెం.బ్ర : ఆపాదమస్తకం కంపించిపోతున్నారు.

నం : ప్రళయార్కతేజం పుంజీభవించినట్లున్నారు. ఆరౌద్రాకృతి చూస్తూవుంటే నా కాళ్లు వణికిపోతున్నాయి.

భృ : జైమినులు వెన్నంటిపోవాలనినడుస్తున్నారు కాని కలుసుకోలేకుండా ఉన్నారు

వై · కాలంతమేఘము ఉరిమినట్లున్నది ఫాలనేత్రుడు హుంకరించినట్లున్నది అదిగో.

వ్యా : భిక్షాం దేహి!

గాలు 5 లేదు

లేదు – వేదవిభాగంచేసిన మేధావికి భిక్షలేదు మానవాదర్శం నిరూపించి చెప్పిన తత్త్వవేత్తకు భిక్షకూడదు. అష్టాదశపురాణ నిర్మాతకు భిక్షకూడదు పంచమ వేదము వ్రాసిన మహాకవికి భిక్షకూడదు. బ్రహ్మసూత్రాలు వ్రాసిన మనీషికి భిక్షలేదు దారుణం, దారుణం! విద్యాగరీయసియైన యీపురిలోనే ప్రతిభకు తావులేకపోతే ప్రపంచంలో ఇంకెక్కడుంది? దుర్భరం ఈ పుర బ్రాహ్మణ్యం దేనికి? ఈ విశ్వనాథుడు దేనికి, కాల్చనా? ఒక్కొక్క నెత్తురు బొట్టుతో ఒక్కొక శ్లోకం వ్రాసి అన్ని మహాకావ్యాలు లోకానికందించిన మహా కవికి తిండిలేదు ఏడురోజులనుంచి తిండిలేదు. మంజులశ్లోకాల నాలపించే ఆ మహోదాత్త ముఖం ఆకలిదప్పులతో వాడిపోవలసిందేనన్నమాట! ఆవేదఘోషా సనాథమైన ఆ గంభీరకంఠం ప్రావృణ్మేఘ దుందుభి విచ్ఛిన్నం కావాలన్నమాట! లోకంలో కళ, కవిత్వం, మనీష, సౌందర్యం, సౌకుమార్యం నిలువున ఎండి పోవలసిందేనన్నమాట! వాటికి తావేలేదు ఇంతవరకు భ్రాంతి పడ్డాను.

అహో! అహో! భయానకం! భయానకం! వజ్రాహతి చిద్రుపలై ధ్వనించే మహోన్నత పర్వతంలాగావుంది అజాండభాండములు డీకొని వ్రక్కలైనట్లున్నాయి, భిక్షాపాత్రిక బ్రద్దలైంది. అధరితమై చలించే కర్కోటకుని ఫణాఫలకంలాగా ఆశాపాంజలి భయంకరంగా వుంది. ఆ కోపానికి విచ్ఛిన్నమైన పాత్రికాలవములుకూడ చలించిపోతున్నాయి

: ఆవేశంతో పూజ్యపాదులకు శాపజల మందుకోటానికి కేలు సాగటం లేదు.

: జైమిని ఎందుకడ్డు తగులుతాడు? మూర్ఖుడు ఇలాంటి నీచలోకమే అతనికి కావాలి. పూజ్యపాదులు ఇలాంటి లోకాన్ని సహించలేరు.

: ఓ, పుష్కలావర్తకాదులు అటుతినికి ఇటుతినికి గర్జించినట్లుగా వుంది కఠోరం!

: మాభూత్త్రై పూరుషీ విద్యా!
మా భూత్త్రైపూరుషం ధనమ్!
మాభూత్త్రైపూరుషీ భక్తిః!
(ఆ ఉద్వేగంవల్ల కంఠంలో ఏదో అడ్డుతగులుతుంది)

: గురుదేవా! గురుదేవా!

వ్యా . (కంఠం సవరించుకోటానికి హుంకరిస్తాడు)

అన్న : ద్వైపాయనా! ద్వైపాయనా! (ఆ స్వరం అవ్యక్త మధురం వ్యాసుడు ప్రక్కకు తిరుగుతాడు. శాంతరసము మూర్తీభవించినట్లు అన్నపూర్ణ ప్రక్కనున్న సౌధద్వారంలో కనిపిస్తుంది ఆమె చూపుల్లో ఒకవిధంగా వ్యాసుని కోపోద్రేకం సల్లగిల్లింది అలాంటి ముఖం అన్నపూర్ణది వేదకాలపు ముత్తైదువులాగా వుంటుంది పచ్చని శరీరం, నుదుట పెద్ద కుంకుమబొట్టు, చేతులకు కంకణాలు, పాదాలకు అందెలు, వేళ్ళకు మట్టెలు, ఉంటాయి చెంపకు చేరడేసి కన్నులు. 'వీణాక్వాణ పాణింధమమైన' ఎలుగు ) వత్సా! (ఆ పిలుపులోని మాధుర్యంతో వ్యాసుడు నిలువున నీరౌతాడు.)

దే : కథ అడ్డు తిరిగింది.

సం : ఆ మహా తల్లిని చూస్తూ వుంటే కడుపునిండుతూ వున్నట్లుంది.

దే . కవిత్వం!

అ . లోకాన్ని అర్థం చేసుకొన్న ఋషివి మానవులకు ఆదర్శప్రాయుడివి! మానవ కర్తవ్యం నిరూపించావు!



దే : రెండూ, మూడు, నాలుగు.

వై : ఏమిటీ లెక్క?

దే : విను, విను.

అ : విద్యాదాతవు? పైగా మహాకవివి. లోక సంగ్రహార్థం నీయావచ్ఛక్తిని వినియోగిస్తున్నావు. నీ భుక్తికి కావలసింది చాల స్వల్పం ఇంతవరకు సహించావు!

దే : తొమ్మిది.

సం : ఏమిటి తొమ్మిది?

దే . భిక్షాన్నర్హతకు కారణాలు.

భృ . గుండెలు బ్రద్దలు చేస్తున్నావు

దే : నేనుకాదు, ఆ తల్లివాక్కులు

అ : వత్సా, ఇంకా ఆలస్యం దేనికి? నేడు నీకు మాయింట భిక్ష మావారు ఎదురు చూస్తూ వుంటారు.

వ్యా (ముఖం ప్రక్కకు తిరిగేవుంటుంది) నాకే భిక్ష! (ఒక్కొక్క అక్షరం ఉచ్చరిస్తాడు)

అ  (జైమిని ప్రక్కకు తిరిగి) మీకుకూడా

జై  . గురుకులంలో చాలమంది ఉన్నారు

అ  . మీ గురుకులవాసుల్ని అందర్నీ ఆహ్వానిస్తున్నా వేళ అతిక్రమిస్తూ వుంది పాపం, ముఖాలుకూడ వాడినట్లున్నాయి.

దే  : (బాధతో మెల్లగా) ఖూనీ! ఖూనీ! త్రాచుపాముకొరతో హృదయాన్ని గ్రుచ్చి ఎత్తుతూ వుంది ఈ దాక్షిణ్యం కంటె మరణం మేలు

అ  : రండి, ఆలస్యం దేనికి? (ఆ ప్రశాంతంలో నడుస్తూ వున్న ఆమె పాదనూపురాలు విషాదంగా ధ్వనిస్తుంటాయి అందరూ విషాదచ్ఛాయల్లాగా గృహంలోకి వెళ్లుతారు.)

## మూడు

(విశ్వనాధుని ఆలయం. విశాలంగా వుంటుంది. ఆలయంలోని కంబాలు చక్కని శిల్పం చాటుతూ వుంటాయి అరటాకులు పరచి వుంటాయి. దేవలుడు, భృగువు, వైశంపాయనుడు, ఒక ప్రక్క కూర్చుంటారు జైమిని వ్యాసునికి దగ్గరలో కూర్చుంటాడు. మిగిలిన బ్రహ్మచారులంతా ఒక ప్రక్కన కూర్చుంటారు. అన్నపూర్ణ వడ్డన సాగించబోతూ వుంటుంది. 

ఇంతలో కాశీపతి విశ్వనాధుడు ఒక్కసారి ఊడిపడతాడు ముఖం జేవురించి వుంటుంది తొలకరిమబ్బుల్లో కునికే రాయంచలాగ జటాజూటంలో తురిమివున్న చంద్రరేఖ చలిస్తుంటుంది. ఒడలినిండా విభూతి కాలకంఠకఠోర నీలరేఖలు ప్రచరిస్తూవుంటాయి. నిర్నాభి బిలంగా వున్న వీగు బొజ్జమీది కాషాయవస్త్రం జారుతుంది. ప్రమధ నాధుడు శస్త్రధారియై వెనక ఉంటాడు అంతా సంభ్రమంతో లేచి నిలబడతారు. వ్యాసుడు మేరు శిఖరంలాగ వుంటాడు.)

విశ్వ  : తుచ్ఛుడవు, నీచాతినీచుడవు నీ ముఖం చూస్తేనే పాతకం చుట్టుకొంటుంది ఎంత కాలంనుంచో నీకు, నీ గురుకులానికీ భిక్షాదానం చేస్తున్న యీపునీత నగరాన్ని ధ్వంసం చెయ్యడానికి సిద్ధమయ్యావు నీ వంటి కృతఘ్నుడు ఇంకొకడు లేడు. ఒక రెండుపూటలు భిక్షదొరకకపోతేనే నాశనం చెయ్యటానికి సిద్ధపడ్డావు. ఈపురాతన పట్టణాన్ని, ఈ విద్యానిలయాన్ని పేరైనా లేకుండా చేయదలచావు. నిన్ను ఇన్ని సంవత్సరాలు పోషించినందుకు ఫలితం? ఏమన్నావు? మాభూాత్తై పూరుషంధనమ్! ఈ భూస్వర్గంలో నీవు ఉంటానికే యోగ్యుడవు కావు (కోపావేశంతో మాటలురాక తీవ్రంగా జూస్తుంటాడు)

వ్యాసుడు దేవలుడు తప్ప తక్కినవారంత (నమస్కారం చేసి) క్షమించండి, క్షమించండి.

విశ్వ : ఏది సహించినా అధర్మాన్ని క్షమించలేను నారాజ్యంలో వర్ణధర్మచ్యుతి జరుగుతుంటే సహించలేను. వేదాధ్యయనం, జపము, తపము, యోగనిష్ఠ మీకునిర్దేశింపబడ్డాయి. అంతవరకే, మిగిలిన వాటితో మీకు నిమిత్తం లేదు

జై : ఆకలిబాధ. ఏడురోజుల నుండి తిండిలేదు

విశ్వ : తిండిలేకపోతే! న్యాయాన్ని నీచేతిలోకి లాక్కుంటావన్నమాట!

దే : అధికార మత్తుడు మాట్లాడుతూ వున్నాడు? సంఘం యీ రాజుల్ని, యీధనికుల్ని తలదన్ని పోతుందని యీ మూఢునికేం తెలుసు?

వై : (దేవులుణ్ణి అదిమిపట్టి రహస్యంగా) ప్రాణాలు పోతాయి

ప్ర. నా : (విని,) ఏమంటున్నావ్? నీతల వ్రక్కలు చేస్తాను. (కత్తిదూస్తాడు)

విశ్వ : ప్రమథనాథ్. ఆగు. ఈ విప్లవాన్ని అలా త్రుంచి వేయటానికి వీల్లేదు. ఆవెధవ బ్రతికికంటె చచ్చి విప్లవాన్ని సాధిస్తాడు (ప్రమథనాథుడు అలాగే నిలబడిపోయాడు) నారాజ్యంలో అసలు విప్లవం తల ఎత్తటానికి వీల్లేదు.

44

జై : (ఆశ్చర్యంగా) మేము విప్లవం లేవదీస్తున్నామా?

విశ్వ : (వ్యాసునివంకజూస్తూ) ఆవిషదావాగ్ని నుంచి విస్ఫులింగాలు ఈ యెండు కట్టెల్లో పడలేదు. నయం, త్వరలో మేలుకున్నాం; లేకపోతే ... ఈ దేశమంతా సంక్షోభించిపోయేది.

వ్యా : ఇప్పటికింకామించిపోలేదు. నా గంటం వాడిగానేవుంది.

విశ్వ : (మండిపడుతూ) ఇక రెండుఝాములకు కాశీకి పదియోజనాల దూరంలో వీరిలో ఎవరు కనిపించినా, వెంటనే శిరస్సు ఖండించివేయమని నీ ప్రమథులకు చెప్పు. ఇది విశ్వనాథుని ఆజ్ఞ.

ప్ర. నా : చిత్తం.

వ్యా : ఇలాంటి మూర్ఖునిరాజ్యంలో మాగురుకులం ఉండటానికి యోగ్యంకాదు మేమే యీ దేశాన్ని బహిష్కరించవలసివుంది దేవలా! (వ్యాసుడు అలయం వెలువడుతాడు దేవలుడు, జైమిని, పైలుడు, నందీశ్వరుడు,వైశంపాయనుడు, వెనుక బ్రహ్మచారులు, వారి వెనుక శస్త్ర ధారియై ప్రమథనాథుడు నడుస్తూవుంటారు ఎవ్వరూ మాట్లాడరు )

నం (బిక్క మొగంతో) ఇకమీద 'శ్రీవిశాలాక్షి కెంజేతి భిక్ష' దొరకదు కాబోలు!

దే భిక్షసంగతి ఎట్లా వున్నా కెంజేతభిక్ష సంగతి ఆలోచించవలసిందే.

(విశ్వనాధుని ఆలయంనుంచి ఘంటానాదం విషాదంగా వినబడుతుంది )

దే . ఏదో వినిపిస్తూవుంది!

స్వస్తి ప్రజాభ్యఃపరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు
కాలేవర్షతు పర్జన్యః, పృధివీ సస్యశాలినీ.
దేశోయం క్షోభరహితో, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః.

వ్యా · ఇదీ లోకం!

(తెర సవ్వడి లేకుండా జారుతుంది )



*ఏప్రిల్, 1938*

పాత్రలు :

పురుషోత్తం — ప్రసాదు

సత్యనారాయణ — వెంకన్న

మహేశం

(పెద్దహాలు ముందు వరండా వరండాలోకి బయటి నుంచి ఎక్కిరావటానికి నాలుగైదుమెట్లు మెట్లకు పదిగజాల దూరంలో బజారు.

వరండాలో పూలమొక్కల తొట్లు, రెండుకుర్చీలు, హాలులో దక్షిణపు కిటికీవద్ద పెద్దటేబులు, కుర్చీ. హాలు దక్షిణ భాగంలో గోడలకానించి ఏడెనిమిది సోఫాలు, గోడల మీద విశ్వరూపసందర్శనం, శ్రీకృష్ణుని గీతోపదేశం, గాంధి బొమ్మ వేలాడుతుంటాయి. హాలులోనుంచి లోపలి ఇంట్లోకి వెళ్ళటానికి కుడివైపున ఒకవాకిలి, ఎడమవైపున ఒక వాకిలి హాలు ఉత్తర భాగంలో చిన్న టేబులుమీద ఫోను ఉంటుంది.

వెంకన్న మోకాళ్ళదాక పంచె ఎగగట్టి బనియను తొడుక్కొని వాటర్ కాన్‌తో వరండాలోని పూలతొట్లలో వంగి నీళ్ళ పోస్తుంటాడు. బుజంమీదనుంచి జారే తుండుగుడ్డను పైకి లాక్కొంటూ ఉంటాడు. వయస్సు 56 సంవత్సరాలకు తక్కువ ఉండదు తల రాగడి, బుగ్గపుస్తీలు పూర్తిగా నెరసివుంటాయి.

సత్యనారాయణ అప్పుడేవచ్చి వీధిలో నిలబలతాడు. అతడు అంత పొడుగూకాదు, పోట్టీకాదు కళ్ళకు లావాటి అద్దాలు, కాళ్ళకు బూట్లు, పైజమా, పొడుగాటి అరచేతుల చొక్కా ఉంటాయి. వయస్సు 32 దాకా ఉంటుంది.)

వెం · (తేరిపారజూస్తూ) ఎవరది? .... సత్తెం ఆఁ ఆఁ, బాబుగారా;? యన్నాళ్ల కెన్నాళ్ళకు చూశాను పరాయివాళ్ళల్లే అలా యీదిలో నిలబడ్డారేంది? రండి. సత్తెంబాబుగారూ, రండి



స . (ముందుకువచ్చి వరండామెట్లమీద నిలబడి) పెద్దబాబుగారున్నారా?

వెం · రండిబాబుగారూ, లోపలికిరండి. యంత కాదనుకున్నా; యంత మాట పట్టింపులువచ్చినా, ఇంటి అల్లుడివిగందా. గుమ్మంయెక్కకుండా అలావిల బడితే... లోకుల సంగతి అలా ఉంచండి ముందు మీరు గుమ్మం యెక్కక పోయారా నన్ను చంపుకుతిన్నట్టే.

స అదేమిటి వెంకన్నా, పనుండి వచ్చినవాడు రాకుండా పోతాడా? (వరండా కుర్చీలో చతికిలబడుతూ) ఇంతకూ పెద్దబాబుగారు ఉన్నారో లేదో చెప్పావు గావేఁ?

వెం : అదిగో, ఇక్కడ కూర్చుంటారు? (చెయ్యిపట్టుకొని) రండి లోపలికి.

స : బలవంతం చేస్తేనేగాని రానాయేమిటి?

వెం . ఏమో నమ్మకమెట్లా? నిజంగా వచ్చేవాళ్ళే అయితే యిన్నేళ్లు యిటుకేసి యెందుకు తొంగిచూడకుండా వుంటారు. దూరాబారం అయితే అనుకో ఎచ్చు. వూళ్లోనేగందా వుంది!

స : తీరిక ఉంటే గంటగంటకు వద్దును.

(వెంకన్న వెనకనే వెళ్ళి హాలులో పెద్దటేబులుకు దగ్గర్లో వున్న సోఫాలో కూర్చుంటాడు )

వెం ఇదిగో, యిటుచూడండి, యేదీ. నవ్వకుండా చెప్పాలి.

స . (నవ్వుతూ) ఏమి చెప్పమంటా?

వెం : ఈ ఆరేళ్ళనుంచి మీకు ఒక గంటసేపు వీలు చిక్కకపోయిందా? అసలు కడుపులో వుండాలిగాని.

స : కడుపులో లేక ఏడకు పోతుంది వెంకన్నా!

వెం : య్యెందుకు చెబుతారు యీ కబుర్లు! పెద్దబాబుగారూ, మీరూ యేదో అనుకున్నారే అనుకోండి; సత్తెంబాబుగారు, మిమ్మల్ని యింతప్పటినుంచి యెత్తుకు మోశానుగందా! తిప్పమన్న చోటికల్లా తిప్పానుగందా! ఈ ముసలాడు యామయ్యాడో, యలావుండాడో, అసలుఉండాడో ఊడాడో కనుక్కున్నారా? యెందుకులెండి ..

స : అన్నీ తెలిసినవాడివి నువ్వే అలా నిష్ఠురాలాడితే

50 వెం : అవునులెండి, అత్తగారి చావులకు రానివారు, యీ ముసలాణ్ణి చూట్టానికి వస్తారటలెండి. యిక్కడే వుండండి. ఇప్పుడేవస్తా పోయారంటె వొట్టు (హాలు ఎడమవాకిలి దగ్గరకు వెళ్ళుతుంటాడు.)

స : ఇంతకూ పెద్ద బాబుగారున్నారో, లేరో చెప్పావుకావేం?

వెం : బయటికెల్లారు. యెల్లి చాలాసేపయింది యీపాటికి వస్తుండాలికూడా (సత్యనారాయణ సోఫానుంచి లేచి నిలబడతాడు) బయలు దేరుతున్నారేమిటి, యీల్లేదు.

స : కాదు వెంకన్నా, పనుంది. మళ్ళీ వస్తానుగా.

వెం : (తిరిగివచ్చి సత్యనారాయణ చేయిపట్టుకొని) యీల్లేదు. యిన్నేళ్ళకు వచ్చి గుక్కెడుకాపీ అన్నా తాక్కుండా పోతానంటే? లేదు, యీల్లేదు. యీ ముసలాడి గొంతులో వూపిరుండగా అలా యీల్లేదు. ముమ్మాటికి యీల్లేదు

స : (నవ్వుతూ) నిజంగా కొట్టేట్టున్నావే.

వెం · కొడతానో లేదో తరవాత సంగతి. ముందు కాపీ తాగందే కదలటానికి యీల్లేదు.

(లోపలినుంచి ఒక లేతగొంతు ఒక ముదురుగొంతు వినిపిస్తాయి )

---

లేతగొంతు   వచ్చాను మామయ్యా, వచ్చా!

ముదురుగొంతు   ఎవరు రమ్మంటే వచ్చావురా?

లే గొం   నువ్వు రమ్మంటే రావటానికి, పొమ్మంటే పోవటానికి నీ యింట్లో జీతగాణ్ణను కొన్నావా?

ము.గొం   అబ్బో, చాలదాకా ఉందే వ్యవహారం!

స   · (కుడివైపు తలుపువంక చూస్తూ) ఎవరది వెంకన్నా?

వెం   : చినబాబుగారుకాదూ, మీరు వచ్చారని చెబుతా.

(కుడివేపు తలుపుదగ్గరకు వెళ్లతాడు.)

స   : ఇప్పుడు దేనికిలే మీపెద్ద బాబుగారితో ఒంటరిగామాటాడవలసి ఉందికూడా.

వెం   : సరే. నేను కాఫీ తెస్తా యీలోగా పోయేరు. పోతే తెలుసుగా, ప్రాణాలతో కాకపోయినా, చచ్చి, దయ్యంగానైనా పట్టుకుంటా. తరువాత మీ యిష్టం.

(సత్యనారాయణ వంక చూస్తాడు.)

స   : సరే తప్పేదేముంది?

(వెంకన్న యీ మాట చెవినివేసుకొని ఎడమవేపు తలుపు తెరుచుకొని లోపలికి వెళ్ళుతాడు. కుడివైపు తలుపు గుండా వెనకటి రెండు గొంతులు మళ్ళీ వినిపిస్తాయి)

లే గొం   తాతయ్యేడి? ఎక్కడకు పోయాడు?

ము.గొం · కాస్త గుర్రాన్ని కట్టెయ్యి.

లే గొం   ఎక్కడకు పోయాడంటె? (సత్యనారాయణ చెవులు రిక్కించి వింటూ ఉంటాడు )

ము.గొం . ఏం గిరాకి?

లే గొం. పనుందిగా చెప్పు

ము.గొం   ఏమిటాపని నాతో చెప్పరాదు?

లే.గొం   నువ్వు తాతయ్యవైతే అలాగే చెబుదును.

ము గొం   కాసేపు తాతయ్యనే అనుకో.

లే గొం·   నిజంగానా?

ము గొం . నిజంగానే   అబ్బబ్బ ఒరే పిట్టపిడుగా వదలరాజాట్టు.

లే.గొం   కాసేపు తాతయ్యనే అనుకోమన్నావుగా.

ము గొం · అంటేమాత్రం?

లే గొం . తాతయ్యతో నాకున్న పనేయిది

ము గొం . జుట్టు గుంజటమా?

లే.గొం. గుంజటమేమిటి, పిలక పీకి నాబెయ్యక పోయానా?

ము.గొం : చేసినతప్పేమిటి మహాప్రభూ?

లే.గొం: నన్ను రమ్మని యింటికాడ లేకుండాపోతాడా మరి?

ము.గొం . ప్చ్ప్చ్ ఎంత పొరపాటుజరిగింది

(వెంకన్న ఒక చేత ట్రేలో ఇడ్లీవళ్ళెం పచ్చడిగిన్నె, సాసరు, కప్పూ, పాలకూజా, పంచదారగిన్నె, రెండుస్పూన్లు, రెండోచేత వెండిచెంబుతో మంచినీళ్ళ వెండిగ్లాసు తెచ్చి పెద్ద టేబులుమీద పెడతాడు. సత్యనారాయణ కుడివేపు తలుపు కేసిచూస్తూకూర్చోటం వల్ల వెంకన్న తెచ్చినవి చూడడు )

స : వెంకన్నా ఎవరాపిల్లాడు? గొంతు ప్రసాదుకు మల్లే ఉందే

వెం -: (కాస్త తటపటాయిస్తూ) యేడీ, యేడీ ప్రసాదువచ్చాడా? యెబ్బే రాందే

52 లేవండి, చేతులు కడుక్కోని కాపీ పుచ్చుకోండి

స · కాఫీకి చేతులు కడుక్కోవటం దేనికి?

మెం . కాస్తపలారంకూడా తెచ్చాను (సత్యనారాయణ టేబులు వైపు తిరిగి ట్రేలోని యిడ్లీని కళ్ళతో లెక్కపెడుతుంటాడు.) యేమిటి అలాచూస్తారు?

స : (సాగదీస్తూ) ఒకటీ, రెండూ, నాలుగు, ఆరు.

వెం : యిడ్డెన్లేగా?

స : దేశం అలోలక్షణా అని అఘోరిస్తూ వుంటే. .

వెం · ఏ కాపీహోటలు యిడ్డెన్లు మానేసింది గనక? సీరంగనీతుల కేమి, చాల ఉన్నాయి. కానీండి

స : ఇటుచూడు వెంకన్నా, నీది కన్నకడుపే కష్టసుఖాలేమిటో నీకూ తెలుసు ఒకసారి ఆలోచించు నీకు డబ్బు ఉందని దేశంలో ధాన్యమంతా నీవేకొని తిన్నంత తింటూ మిగిలింది యిష్టంవచ్చిన ధరలకు అమ్ముకొంటావా? కోటాను కోట్ల పేదసాదలకు, పిల్లజెల్లలకు, ముసలీముతకకూ తిండి లేకుండా చేస్తావా?

వెం   అనుకొన్నట్టు అంతా చేస్తే బూలోకం సొర్గం అయిపోతుంది సత్తెంబాబుగారు! కానీండి ఆరిపోతాయి

స  . నాకు తినే ఓపికలేదు పెద్దవాడివి వీల్లేదంటున్నావు కనక యీ కాఫీ తాగుతాలే.

(కుడివేపు తలుపు దభేలున తెరచుకొని ప్రసాదువస్తాడు. వయస్సు తొమ్మిదేళ్ళు, కాకినిక్కరు, తెల్లని చొక్కా, నడుముకుబెల్టు, కాలికి జోడు. ఎక్కడా జంకు గొంకూ ఉండదు తండ్రి సత్యనారాయణను చూడకుండానే)

ప్ర  : వెంకన్నతాతా, వెంకన్నతాతా! ఇడ్లీ పెట్టమంటే ఒకటిచ్చి అయిపోయాయని మిగిలినవన్నీ యిక్కడ దాచావా? అమ్మదొంగా! ఉండు ఆనిక్క నీపని చెబుతాలే

వెం  : (ప్రసాదు వైపుకు తిరిగి నాన్నగారున్నారు జాగ్రత్త అన్నట్టుగా ముక్కుమీద వేలెట్టుకొని) ఇస్!

స  : అరే ప్రసాద్!

ప్ర  నేనే నాన్నగారు!

స  . (కోపంతో) వెంకన్నా వీడెలా వచ్చాడిక్కడికి?  53

వెం  : మరిగత్తే ...

ప్ర  : నేనేవచ్చా నాన్నగారూ, రాగూడదా?

స  : ఎవరితో చెప్పి వచ్చావురా గాడిదా? చెప్పాపెట్టకుండా రావటమేనా? అమ్మ నీకోసం దేవుళ్ళాడదూ?

ప్ర  : (తప్పుచేసినవాడికి మల్లే నీళ్ళు నమలుతూ) అమ్మతో చెప్పాను, నాన్నగారూ! చెప్పకుండా ఎలా వస్తాను?

స  : నిజంగా అమ్మతో చెప్పే బయలుదేరావా? ఏదీ యిటు చూడు . అమ్మ నిన్ను నిజంగా పొమ్మందీ?

వెం  : నోరూవాయిలేని పసివాణ్ణి ఎందుకు ఇలాగదుముతారు? నేనే వచ్చి తీసు కొచ్చాను.

స  : (వెంకన్న చెప్పేది వినిపించుకోకుండానే) చెప్పవేమి మొద్దా! అమ్మ నిన్ను నిజంగా ఇక్కడికి పొమ్మందీ?

ప్ర  : (బిత్తరబోయి) నిజంగా నాన్నగారూ అమ్మ పొమ్మంటేనే నేను ఇక్కడికి వస్తున్నా

స : ( ఆశ్చర్యంగా) ఎన్నిరోజులనుంచి వస్తున్నావేమిటి?

ప్ర : అప్పుడప్పుడూ వస్తూనేవున్నా.

వెం : పసికాయను యెందుకలా కోప్పడతారు? పెదబాబుగారు ప్రసాదును చూడందే వుండలేరు. అందుకని పది పదేను రోజులకోసారి నేనే వచ్చి తీసుకొస్తున్నా పిల్లకాయ తప్పేముంది సత్తెంబాబుగారు?

స పాముచుట్టం, పడగ పగ–బాగానే ఉందివ్యవహారం. అరే ప్రసాద్ నీకేచెప్పేది! తిన్నగ ఇంటికి నడు.

ప్ర . ఇప్పుడే వెళ్ళుతున్నా నాన్నగారూ, (నిక్కరు రెండు జేబుల్లోకి రెండు చేతులు పోనిచ్చి లోన ఉన్నవి ఒక్కొక్కటీ బయటికిలాగుతూ ఇదిగో వెంకన్న తాతా, మొన్న పానయ్య దగ్గర యీ బొంగరం తీసుకన్నాను. నాకు తిప్పటం చేతగా వటంలా. ఈ తడవ వచ్చినప్పుడు నేర్పుకుంటాగాని, యివిగో రంగుచాక్పీసులు, ఎఱ్ఱయ్యి రెండు పసుపువచ్చియ్యి రెండు ఆకుపచ్చది ఒకటి తెల్లయ్యి మూడు ఇదిగో ట్వైనుదారం. గాలిపటం కడతానన్నాడు. నేను మళ్ళీ వచ్చేటప్పటికి కట్టమను. ఇవన్నీ యిస్తావుగాదు? గూటిలోపెట్టి మరచిపోతావా? మళ్ళీ వచ్చి

54 కనుక్కుంటాగా? మొత్తం పదకొండు.

వెం · (ఏడుపు బిగబట్టుకొంటూ) యవరికిచ్చేది బాబు?

ప్ర : ఎవరికేమిటి. పానయ్యకి.

వెం · (తుండుగుడ్డ ముఖాన వేసుకొని బావురుమంటూ) యింకేడ పానయ్య నాయనా?

ప్ర : ఏమయ్యాడు, ఊరికి పోయాడా? వచ్చింతరువాతనే యియ్యిలే. వెంకన్న తాతా మొత్తం ఉరువులు పదే, పదకొండు కాదు. జాగ్రత్తగా యివ్వవని అలా అన్నాలే

స : ఈ ముసలివాణ్ణి ఎందుకు వేధిస్తావురా. ఆ పిచ్చివాగుడు కాసేపు కట్టెయ్యి.

ప్ర : నేనేం చేశాను నాన్నగారూ? పానయ్యకు ఇవి యిమ్మన్నాను. ఈ బొంగరం పానయ్యదే. అతని బొంగరం అతనికిచ్చెయ్యకపోతే తప్పుకాదూ?

స : పానయ్య లేడురా.

ప్ర . నేను చాక్పీసులు తేచ్చేదాకా ఎక్కడికీ పోనన్నాడు నాన్నగారూ. పానయ్యమాట అన్నాడు అంటే అంతే. చేసి తీరతాడు. మీకుతెలీదు కామాలు.

స : అబ్బబ్బ! నీతో వేగలేకుండా ఉన్నానురా పానయ్య చచ్చిపోయాడు.

ప్ర : అంటే.

స : చచ్చిపోయాడంటే చచ్చిపోయాడు. ఏమిచెప్పేది నీనెత్తీ నానెత్తీని.

ప్ర : పానయ్యకేం వెంకన్నతాతా? క్రిందటిసారి వచ్చినప్పుడు మేమిద్దరం ఆడుకున్నాము. బొంగరం ఎంత బాగా వేశాడని!

వెం . అప్పుడు బాగానే ఉన్నాడుబాబు.

స : పానయ్యంటే నీ మనుమడుకాదు? పాపం. ఏమివచ్చింది?

వెం : ఏమి చెప్పేది బాబు? గిలకలాగాతిరిగి ఆడుకుంటూ ఉండేవాడు. అలా ఆడుకొనే వాడికి నాలుగురోజులు మంటజెరం పుట్టుకొచ్చింది బాబు. నాకు మొదటినుంచి అదేమిటో గాని డక్కుడక్కు మంటూనే వుంది. అందుకని పెదబాబు గారి డాకటేరు దగ్గరి కెళ్ళితే ఆయన ఎదోయిన్ని మందు నీళ్ళు యిచ్చాడు. అయి పోస్తూనే వచ్చాం. అయిదోరోజుకల్లా మాట పలుకు లేకుండా అంకెళ్ళు పడిపోయాయి.

స : డాక్టరుకు చూపించలేదా?

వెం : లబలబలాడుతు అయిదోరోజు సాయంకాలం వాణ్ణి బుజాన వేసుకొని డాకటేరు దగ్గరకు తీసుకెళ్ళాం. ఆయన చూసి చప్పుడించాడు. నేనూ మా బుడ్డది ఏడుస్తూ ఆయన కాళ్లమీదపడ్డాం. మందు తెచ్చుకోండని మూడు గొట్టాలు రాసిచ్చాడు. ఆ చీటి పట్టుకొని బజారుకుపోతే ఒకచోట నలభై రూపాయలు పుచ్చుకొని ఒకటే గొట్టం యిచ్చి యిక లేవన్నాడు. పక్కకొట్లలో కనుక్కొంటే నూటయిరవై, నూటముప్పై చెప్పారు. చూడండిబాబు, యాడుందో నాయం! యింకేమి చేసేది. చేతిలోవున్న నాలుగురాళ్లు పెట్టి ఆ రెండు గొట్టాలుకూడా కొన్నాను. ఆరోనాటి సాయంకాలానికల్లా మందుతాగి కూడా పోయాడు బాబుగారు! కుర్రాడికి కుర్రాడికి చెడ్డాను డబ్బుకు డబ్బూ చెడ్డాను.

స : ఇదీ సంఘం! పచ్చి నెత్తురు తాగే మెకమన్నా నయం.

ప్ర : డబ్బంతా ఖర్చుపెట్టావా తాతా? రేపు రోగమో నొప్పో వస్తేనో?

వెం : యింక ఎన్నుమీదికి యాగాడికూడా లేదుబాబు. లేదనుకుని లాబం యేముంది ముందెట్టా జరగాలిసుందో అట్టా అవుద్ది. ఇంకా యేమి చెయ్యను.

స : ఇంకా చేసేదేమిటి. పిండాకూడు! సంఘమంతా యీ మూలనుంచి ఆ

మూలదాక కుళ్ళి లుకలుక లాడుతుంటేను దయ, ధర్మం, మంచీ, చెడ్డా యేనాడో అంతరించాయి వెంకన్నా, నీవంటివాడికి ఈసంఘంలో తావులేదు, నిజంగాలేదు ఇలాంటి సంఘాన్ని నిర్మూలంగా పెరికి వేయకుండా ఉండటం నీదేతప్పు ముమ్మాటికీ నీదేతప్పు.

వెం : (పై తుండుగుడ్డతో కళ్ళు తుడుచుకొని) మాదేముంది బాబు? చదువా; సంధ్యా? గొడ్లయెంతో మేము అంతే గందా, మా సంగతి పోనీండి. మీరంటే చక్కగా చదువుకున్నారు చుట్టరికం చూదామా లక్షాధికారికి అల్లుళ్ళు. మీకింత అవస్థ ఎందుకు వచ్చినట్టు ఒకరకంగా చూస్తే నావనే బాగుందేమో ననుకుంటాను.

స : (నవ్వుతూ) అదేమిటి వెంకన్నా, నాకన్నా నువ్వు ఎందుకు బాగుండగూడదు? నిజంగా నీకులేని సుఖం నాకెందుకుండాలి?

వెం : ఎందుకు దాస్తారు? నాకు తెలుసులెండి. యాలకు బొక్కె డన్నమన్నా తింటున్నాను సత్తెంబాబుగారు, నేను కళ్ళారా చూస్తున్నాను. ఇంట్లో ఉప్పు కుంటే పప్పుకు లేక, పప్పుకుంటే బియ్యానికి లేక అమ్మాయి ఆవజీవాలు కుంగిపోతూ వుంది. కలవారింటి ఆడబడుచుకు పిల్లల చొక్కాలకు, పసిపాప పాలబుడ్డికి లేకపోతే మనస్సు యలావుంటాదో చూడండి. మానవురాలు యక్కడన్నా పొక్కుతుందా? ఆ యీశ్వరుడికూ్కడా తెలుసునంటే నాకు నమ్మకం లేదుబాబు రేషను తగ్గించాక యిచ్చే నాలుగ్గింజలు పిల్లలికే సరి పోతుండాలి. యింకా యెంతకాలానికి యీచెర విరగడౌద్ది సత్తెంబాబూ?

స : ఏమి చెయ్యమంటావు వెంకన్నా? ఈ ఆరేళ్ళునుంచి ఉద్యోగం దొరుకుతుందే మోనని తిరుగుతూనేవున్నా. సూదిమోపే సందైనా కనిపిస్తేనా?

వెం · బాబు నామాట వినండి ఎప్పుడో ఏదో అనుకొన్న మాటలు పట్టుకు ప్రాకు లాడటం దేనికి చెప్పండి? లోకం యట్టాపోతే యేమి పోయింది. మీరు రెక్కలు విరుచుకొని కడుపు మాడ్చుకొంటే మాత్రం బాగుపడద్దా బాబు?

(మహేశం లోపలినుంచి వెంకన్నా అని పిలుస్తూ కుడివేపు తలుపు తెరచుకొని వస్తాడు ఎర్రగా కొంచెం బొద్దుగా వుంటాడు. వయస్సు 28 దాకా వుంటుంది. వెనక బిళ్ళగోచీ, ముందు నేలకు జీరుకాడే కుచ్చెళ్లు, సన్ననిలాల్చీ, కోటేరు లాంటి ముక్కు, కాళ్ళకు ఇంట్లోవేసుకు తిరిగే ఆకు చెప్పులు, చేతిలో వేలు పుటలమధ్య పెట్టి పట్టుకున్న పుస్తకం)

మ  వెంకన్న, నీళ్ళుపెట్టు ఎన్ని రోజులైంది. స్నానంచేసి! ఈ సాయంకాలంచేదాం ఈ సాయంకాలంచేదాం అనుకుంటూ ఉండగానే మూడు సాయంకాలాలు గడచిపోయాయి.

స  · ఇంకా నాలుగురోజులు అలాగే వుండు. ఏం వరవాలేదులే. ( ఉలిక్కిపడి సత్యం వేపు చూస్తాడు) ఎందుకు అలా ఎగా దిగా చూస్తావు?

మ  : (నవ్వుతూ) బావేనా అని.

స  . పెద్దవాడివి అయిపోయావు కాదూ – చూపు ఆనదులే.

మ  : బావ వచ్చాడని చెప్పలేదేం వెంకన్నా ఎంత సేపయింది వచ్చి?

స  : ఇప్పుడేరా.

మ  : ఇప్పుడేనా? ప్రసాదు పావుగంటసేపునుంచి మెదలకుండా వుంటే ఏమిటా అని చూస్తున్నాను. ఇదా సంగతి!

ప్ర  : ఏమి గోలచేశాను మామయ్యా! అన్ని కల్పనులుగాని.

స  · కల్పన చేయందే కవి యెట్లా అవుతాడురా?

మ  : అప్పుడే బాబు కొడుకులు ఏకమయ్యారు? కానీండి! సరేకాని వెంకన్నా చుట్టంవస్తే కాళ్ళకు నీళ్ళిచ్చుకోరు? 

వెం  · మతిపోయింది చినబాబుగారు యేదో మాటల్లోపడి మరచిపోయాను వుండండి తెస్తా

స  : నీకు నిజంగా మతిపోయింది వెంకన్నా. కాఫీ కూడా అయితే ఇప్పుడు కాళ్ళకు నీళ్ళెందుకు? అదిగో ముద్దుల బావమరిది రాసి రాసి ఆవురావురుమంటూ వస్తాడని యిడ్డెన్లుకూడా అట్టిపెట్టాను.

మ  : బావ మాటలకేమిగాని, నీవుపోయి నీళ్ళపెట్టు వెంకన్నా.

వెం  : వేన్నీళ్ళు పెట్టేదా చన్నీళ్ళు పెట్టేదా? వేన్నీళ్ళయితే కాస్త ఆలస్యం అవుద్ది.

మ  : నీ యిష్టం వచ్చినవి పెట్టు.

వెం  : అయితే వేన్నీళ్ళే పెడతాలెండి. (ఎడంవైపు తలుపు తెరుచుకొని లోపలికి వెళ్ళిపోతాడు)

మ  · ఏమిరా ప్రసాద్, మూలచేరి చాల బుద్ధిమంతుడులాగా కూర్చున్నావే! నాన్నగారు వచ్చారనా?

ప్ర : నాన్నగారు వస్తేమాత్రం ఏమంటారు?

స : ఏమిరా మహేశం, ఏమిటి విశేషాలు? ఒకనాడన్నా వచ్చి తొంగి చూచావుకావే? మీ నాన్నగారు పోవద్దన్నారా? లేక వస్తే ఒక పూటన్నా అన్నం పెట్టలేమనుకున్నావా?

మ : నువ్వు, నాన్నగారు పోట్లాడుకుంటే మధ్య నాకేమిటి? అంత యిష్టం లేకపోతే ఆయన రాకపోతాడు. ఆయన గుమ్మం నువ్వు తొక్కక పోతావు. అంతేగాని నన్ను పోవద్దనటానికి ఆయన యెవరు?

స : కొయ్యకు కోతలు. ఆయనతో అను యీ ముక్క.

మ : అనాలని అంటున్నావుకాని నిజం నీకు తెలీదా?

స : అయితే ఒకసారి కాకపోతే ఒకసారన్నా యెందుకురాలేదు?

మ : వస్తేమాత్రం నువ్వు ఇంటిదగ్గిర దొరుకుతావా, పెడతావా? ఎప్పుడూకూలీలనీ, నాలీలని, మీటింగులనీ, అవనీ, యివనీ, తిరుగుతుంటావయితివి. పోతే ప్రసాదును చూస్తూనే ఉన్నాగా?

58 స : ఏదో సాకు చెబుతున్నావు కాని మీ అక్కయ్య లేదటరా? ఎప్పుడూ తమ్ముడు కోసం కలవరిస్తుంటుందే!

మ : నిజం చెబితే ఏమనుకోవుగదా!

స : అనుకోటం దేనికి?

మ : నాకు మనస్సు ఏమీ బాగుంటంలేదు.

స : ఒకప్పుడు బాగుంది కనకనా?

మ . అలాకాదు బావా, చూడగా చూడగా ఏమిటేమిటో అనిపిస్తూవుంది

స : ఒకసారి విశాఖపట్నం పోయిరాకపోయావా?

మ : నీకు నిజం చెబితే నవ్వికేలుగా ఉంటుంది.

స : ఇంతకూ ఏమంటావు?

మ ఈ లోకం బాగాలేదు.

స · పరలోకానికి వెళ్లుతానంటావా ఏమిటి కొంపదీసి? ముందుగా చెప్పు. ముసలాడికి సద్దుకోవలసింది చాల ఉంటుంది

మ నువ్వు ఏమన్నా అను ఈ సంఘం ఉందే, యీ సంఘం నఖశిఖపర్యంతం కుళ్ళి గబ్బుకొడుతూవుంది

ప్ర : ఏమిటి మావయ్యా?

మ : ఈ సంఘం నఖశిఖ పర్యంతం కుళ్ళి పోయిందిరా అబ్బాయి? ఈ మాట మామయ్య చెప్పాడని జ్ఞాపకముంచుకో.

స : ఏమిటి, అప్పుడే అప్పగింతలుకూడా మొదలెట్టావు?

మ : నీకు అన్నీ యెకచెకాలు బావా? నీ మట్టుకు నీకు కనిపించటంలేదా?

స : అసలు సంగతి యేమిటి? ఏదో కుళ్లుతున్నదంటున్నావు. గబ్బుకొడుతున్న దంటున్నావు నాకెలా అర్థమౌతుంది?

మ : బావా నీవేమన్నా అను ఒకటిమాత్రం స్పష్టంగా కనిపిస్తూవుంది ఈ ప్రపంచం ఎంతసేపటికి గొర్రెదాటుగా పోతున్నది తప్ప ఏమాత్రం ఆలోచించటం లేదు ఆలోచించక పోతే ఆలోచించక పోయింది. కనీసం ఆలోచించేవాళ్ళనన్న చూస్తూ వూరుకోవటం లేదు. దేశద్రోహులనీ, రాజద్రోహులనీ, పరజాతికి మానసపుత్రులనీ, అంటున్నది వీలైతే ప్రాణాలనుకూడా అపహరించటానికి కూడా వెనుకంజవేయదు. జ్ఞానానికి తూర్పు పడమరలనీ, ప్రాచీనత ఆధుని కతలనీ, స్పృశ్యతా అస్పృశ్యతలనీ ఉన్నాయా? అసలు ఈ భావాలు యీ ప్రపంచానికి ఎక్కడనుంచి వచ్చాయి సొంతంగా ఆలోచిస్తేనే వచ్చాయా. లేదు తెలుసునన్న యీ దురహంకారం పోయి జిజ్ఞాస యేర్పడేటంత వరకు, పరులు ఏమి చెబుతున్నారో విందామన్న సహనం ఏర్పడేటంతవరకు యీ సంఘం లాభంలేదు. కుళ్లుతూ అలా గబ్బు కొట్టాలిసిందె ఈ అనంత మహాప్రపంచం ఉందేయిది నినాదాలతోను, సూత్రాలతోను అర్థమయ్యేది కాదు ఈ సంఘంలో ఈ నినాదీకరణం, ఈ సూత్రీకరణం శల్య శల్యంలో, నాళ నాళంలో ఎక్కిపోయింది. లాభంలేదు. దీన్ని సమూలంగా పెకలించి శతసహస్ర సముద్రాల్లో నానవేసినా యిప్పుడున్న కల్మషంపోదు.

వెం : (లోపలనుంచి) చినబాబుగారు! నీళ్ల పెట్టానండి.

మ : ఇక మొదలెట్టాడు లాభం లేదు. పిలవగానే పోకపోతే మనిషికి చెడ్డచికాకు. ఇప్పుడే స్నానం చేసివస్తాను. ఉంటావుగా?

స : పనుందా?

మ : లేకపోతే ఉండగూడదా?

స . సరే చూదాము, స్నానం చేసిరా

(మహేశం ఎడమవైపు తలుపు తెరచుకొని వెళ్ళిపోతాడు )

స : ఏమిరా ప్రసాద్, అలా కూర్చున్నావే? పదిక

ప్ర : తాతయ్య వచ్చినాక పోతా నాన్నగారు

స : ఏమిటి విశేషం! దేవరహస్యాలున్నాయా?

ప్ర : వచ్చి కనపడకుండాపోతే బాగుంటుందీ?

స : ఇంతలావు పెద్దమనిషివికాదూ, పోతే కొంపలు ముంచుకుపోతాయి

వెం : (ఎడమవేపు తలుపు తెరుచుకొని సరాసరి వరండాలోకి వెళ్ళి వచ్చి) పెదబాబు గారు వస్తుండారు.

(కప్పులు, సాసరు వగైరా ట్రేలోకి సర్ది ట్రేలోని పాత గుడ్డతో టేబులుతుడిచి కుర్చీ టేబులుదగ్గరకు సరిగానెడతాడు ట్రే ఎడమచేతిలోకి తీసుకొని కుర్చీకి దూరంగా నిలబడతాడు. పురుషోత్తం వెంకన్నను పిలుస్తూ వస్తాడు అతడు ఎర్రగా బక్కపల్చగా, పొడుగ్గా ఉంటాడు. కాళ్ళకు సన్న చెప్పులు, ఖద్దరు దోవతి, పొడుగాటికోటు, నెత్తిన తెల్లనిటోపి. టోపీతీస్తే సన్నపిలక కనిపిస్తుంది మెడకు జరీఅంచుల ఉత్తరీయం. కళ్ళకు

 జోడు, నున్నగా చేయించిన గడ్డం, తెల్లనిమీసాలు వయస్సు అరవైదాకా ఉంటుంది టోపీతీసి ఒకచేత పట్టుకుంటాడు. రెండోచేతిలో కఱ్ఱ ఉంటుంది.)

పు : వెంకన్నా, వెంకన్నా!

(సత్యనారాయణ టేబులుదగ్గరకున్న సోఫాలోనుంచి లేచి కొంచెం ఎడంగా వున్న సోఫాదగ్గరకు వెళ్ళి నిలబడతాడు పురుషోత్తం ఆశ్చర్యపడి చూచి) ఆఁ.... ఎవరు! (అంతలోనే గిరుక్కున వెంకన్నవైపుకు మళ్ళి) ఎప్పుడు రావటాలు వెంకన్నా?

వెం : ఒక పావుగంట అయిందోలేదో మీరు అటు వెళ్ళారు. సత్తెంబాబుగారు ఇటువచ్చారు.

పు : ( టోపీ తిరిగి పెట్టుకొని కుర్చీలో కూర్చుంటూ) పిల్లాజెల్లా బాగున్నారటనా?

ప్ర : బావ్!

పు : ఓహో! నువ్వుగూడా వచ్చావన్నమాట!

ప్ర : వచ్చానుతాతయ్యా, వచ్చా (తాతయ్య కాళ్ళు కావులించుకొంటాడు)

పు : ఎందుకు వచ్చా?

ప్ర . (చటుక్కున తాతయ్యను వదలి వెంకన్న దగ్గరకు పోయి కోపంతో మొఖమింత చేసుకొని) ఏయ్ నన్నెందుకు ఇక్కడికి తీసుకొచ్చా? చెప్పవేఁ?

వెం : (ఆతురతతో) ఏమిటిబాబు, ఏమిటిబాబు?

ప్ర : చెప్పవేం, నన్నెందుకు తీసుకువచ్చా యీ కొంపలోకి? చెప్పవేం? (ట్రే పట్టుకొన్న చంకలోని గుడ్డ లాగుతాడు ట్రే దభేలున క్రిందపడి కప్పులు, సాసరు, గిన్నెలు బద్దలౌతాయి.)

పు : ఏమిటిపాపా, ఏమిటిపాపా!

స : (నిల్చునే) ఏమిటి ఆ ఆగడం!

ప్ర · ( ఏడుస్తూ వెంకన్నను వదలి దూరంగా ఉన్న సోఫాదగ్గరకు పోయి) అందరూ ఊఁ ఊఁ అడిగేవాళ్ళే. ఊఁ ఊఁ వీళ్ళని ఊఁ ఊఁ ఎవరు తీసుకురమ్మన్నారో! ( ఏడుస్తూనే సోఫాలో కూలబడతాడు.)

వెం : (ప్రసాదు దగ్గరకు వెళ్ళి వంగి సముదాయిస్తూ) బాబుగా, యాడవకు, ఎందు కేడుస్తా? యేదో పిల్లవాడవని నవ్వితే యేడుస్తారా?

ప్ర : నవ్వికీలా? మామయ్యమట్టుకు మామయ్యా అలా అనే, తాతయ్యమట్టుకు తాతయ్య అలా అనే. నువ్వు నన్నసలు ఎందుకు తీసుకురావాలి



వెం : బాబుగా ఊరుకో

ప్ర : నన్నింటికి తీసుకెళ్ళుతావా లేదా? (వంగిన వెంకన్న వీపుమీద గుద్దుతాడు.)

వెం : మాబాబుగా, ఊరుకో. నాన్నగారు కోప్పడతారు. అవిగో ఆ పెంకులు యారనీ. (పోయి పెంకులు ఏరి ట్రేలో పోస్తాడు)

ప్ర : ఇంకొక్కనిమిషం ఉండను. తీసుకెళ్ళుతావా; లేదా?

వెం : ఈ పెంకులు పారేసివచ్చి... (ప్రసాదు గునుస్తూ ఉంటాడు)

స · నోరుముయ్ వెధవా, ఎప్పుడూ ఒకటే అల్లరి! ప్రసాద్ కుయ్ కయ్ మనకుండా కూర్చుంటాడు )

(వెంటే పట్టుకొని ఎడమచేతి తలుపు తెరుచుకొని వెళ్ళిపోతూ.)

వెం : సత్తెంబాబుగారు అలా నుంచున్నారేం కూచ్చోండి పెదబాబుగారూ, మీతో మాట్లాడాలటండీ

పు ఎవరు మాట్లాడవద్దన్నారు వెంకన్నా?

స వెళ్ళిపోయిన వెంకన్న యెలాసమాధానమిస్తాడు? ఎదురుగా ఉన్న వాళ్ళను వదలి వెళ్లిపోయినవాళ్ళను పట్టుకొని ప్రయోజనమేముంది?

పు : ఎవరిని పట్టుకుంటే ప్రయోజనమట?

స : ఆసంగతి మీరే ఆలోచించుకోవాలి తరువాత రెండో విషయం నేను ఇంటి అల్లుడినన్న ఉద్దేశంతో మీదగ్గరకు రాలేదు

పు : ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయని బోర్డు కట్టలేదే?

స : మీదగ్గర ఉద్యోగం దేవురించేగతి యింకా రాలేదు.

పు : అయినప్పుడు రావటం దేనికి?

స : మీ మిల్లుకూలీలసంగతి మాట్లాడుదామని వచ్చాను.

పు : అయితే పోవలసింది ఆఫీసుకు. మిల్లు ఆవరణంలో రెండంతస్తుల మేడ ఉంది అందులో పైన దక్షిణపు గదిలో మీరు కలుసుకొని మాట్లాడవలసినతను ఉంటాడు. ఎర్రగా బక్కపల్చగా పొడుగ్గా ఉంటాడు. పురుషోత్తం పేరుచెబితే అక్కడ యెవరన్నా చూపిస్తారు అతగాడు ఒక్క ఆదివారంతప్ప ప్రతిరోజు ఉదయం 10 గంటలనుంచి సాయంకాలం ఆరింటిదాకా అక్కడే ఉంటాడు. ఇవాళ్ళ ఆదివారంకదూ? అందువల్ల మీకు అక్కడదొరకడు సోమవారం వెళ్ళినా, మరోరోజు వెళ్ళినా నేను చెప్పిన కాలంలో వెళ్ళితే మీకు కనిపిస్తాడు. సావకాశంగా మీరు చెప్పవలసినవన్నీ చెప్పవచ్చును. అతగాడు చేయగలిగింది ఉంటే తప్పకుండ చేస్తాడుకూడా.



స మీ సలహాకు ఆజన్మం కృతజ్ఞుణ్ని కాని....

పు · ఇక్కడ నాతో మాట్లాడే దేముంది?

స మనవి చేసుకుంటాను. మీ అల్లుడు మీతో మాట్లాడటం లేదని ఒకసారి చెప్పుకున్నాను. మీరు ఆలోచనలో ఉండి సరిగా వినలేదేమో.

పు : పరాయివాళ్ళు వచ్చినాతో మాట్లాడ వలసిందేమిటబ్బా? నాకుఅప్పూ సప్పూ లేదు. ఒకళ్ళను ఆశ్రయించుకొని బ్రతకటం లేదు. అయినవీ, కానివీ నెత్తిన వేసుకొని తిరగటం లేదు. పెళ్ళాము బిడ్డల్ని తిండికి మాడ్చటం లేదు గుడ్డకు వాచిపోయేటట్టు చేయటం లేదు. ఇంక ఎలాంటిలావా దేవీలుకూడా లేవే!

స : పెద్దలు, చాల అద్భుతంగా సెలవిస్తున్నారు.. ఆసంగతి పోనీండి నేను కాస్త తొందరగా పోవాలి. ఇలాగే ధోరణి సాగితే పెద్దలకు కాలం వ్యర్థమైపోతుంది మీరు మిల్లు నోటిసివ్వకుండా కట్టివేయటం ఉందే

పు · అన్యాయం? అంతేగా? మీటింగులుపెట్టి నన్నూ, నా కుటుంబాన్నీ, నా మేనేజర్లను దుమ్మెత్తి పోయటానికి ఆసేతుహిమాచలం ఖాళీగా ఉంది నిరసన ప్రదర్శనాలు జరపటానికి వీధులన్నీ ఊరకనే అఘోరిస్తున్నాయి ఇంకా అంతకన్నా ఏమికావాలి?

స : కొంచెం ప్రశాంతంగా ఆలోచించండి. వేలకొలదిగా ఉన్న కార్మికులు అనవసరంగా మాడిపోతారు దీనివల్ల మీకు వచ్చేలాభం ఏమీలేదు వాళ్ళ మలమల మాడిపోతే మీకువచ్చే సుఖమేమిటి? అది అలా ఉంచండి దేశమంతా గుడ్డలేక అలమటించి పోతూ వుంది. తిండిలేక అలోలక్ష్మణా అంటూఉంది గుడ్డసప్లయి చేస్తే ఆహారధాన్యాలు ఎగుమతిచేసే దేశాలున్నాయి. ఆలోచించండీ. బాగా లాభి స్తున్న యీ సమయంలో మిల్లు కట్టివేసుకుంటే ఎంత నష్టమో చూడండి. కేవలం పగసాధించటం కోసమని జాతినంతను యిల్లాచేయటం ఏమంత భావ్యం? ధర్మం ధర్మమంటారే యిదేనా ధర్మం? ముప్పూట గీతాధ్యయనం చేస్తారు కామాలు. ఈపనే గీతచెయ్యమంటున్నదా?

పు . (బిగ్గరగా) ఒరే వెంకన్నా, వెంకన్నా?

వెం : (తలుపు తెరుచుకొనివచ్చి) పిలిచారా పెదబాబుగారూ? 63

పు : వెంకన్నా, గీత ఎవరికి ఎవరు చెప్పారురా? (వెంకన్న బిత్తరపోయి చూస్తాడు) అలా చూస్తావేమిరా?

వెం : (నత్తులు గొడుతూ) కుష్ణభగవాన్లు అర్జనిడికి.

పు : నీళ్లు నమలుతావు దేనికి? నేనడిగే వాటికన్నిటికీ సరిగ్గా చెప్పు. కృష్ణ భగవాన్లు ఏమి చెప్పాడు?

వెం : ధర్మం.

పు : అర్జునుడువిని ఏమిచేశాడు?

వెం : కౌరవుల్ని చావమోదాడు. ఎందుకండి పెద్దబాబుగారు అలాఅడుగుతున్నారు?

పు : ఏమీలేదు పో (వెంకన్న అలాగే నిలబడి ఉంటాడు) తటపటాయిస్తావేం పోక. (వెంకన్న తలుపు తెరుచుకొని వెళ్ళిపోతాడు.)

స . సరే అర్థమైంది. చెప్పవలసినబాధ్యత ఉంది కాబట్టి చెప్పాను అవతల నన్నని ప్రయోజనం లేదు. పురుషోత్తంగారు, సెలవు తీసుకొంటాను ఎప్పుడన్నా ఉద్యోగానికని మీకు అప్లికేషను పెట్టుకుంటానేమో, అల్లుణ్ణి, కాస్త కనికరం ఉంచండి. మరచిపోరుకదు (విసురుకొని పోతుంటాడు )

పు . (తెల్లబోయి) ఆఁ!

స : (పోతూ పోతూ వెనకకు తిరగకుండానే) సంఘం నఖశిఖ పర్యంతరం కుళ్ళి చితచితలాడుతున్నది. వాళ్ళకు గత్యంతరం లేదు. (బయటికి వెళ్ళిపోతాడు )

పు : (బిగ్గరగా) వెంకన్నా, వెంకన్నా! కళ్లు కనపట్టం లేదా? కొంప చీకటి బుయ్యారంగా ఉంటే లైట్లు వేసుకోరూ? (వెంకన్న తడువుకుంటూ వెళ్ళి టిక్కు టిక్కున రెండు లైట్లు వేస్తాడు.) జన్మానికొకసారి సిసలైన ముక్క చెప్పాడు, నిజంగా చితచిత లాడిపోతున్నది.

వెం : నిజమే పెదబాబుగారు.

పు : ఏమిటిరా?

వెం : చితచితలాడిపోతున్నదండి.

పు : చితచితలాడిపోయేదేమిటి నీ మొఖం నీ మోరాను

(మహేశం లోపలినుంచి తలుపు తెరుచుకొని వస్తాడు నున్నగా వెనక్కు దువ్విన తడితల, పొట్టిచేతుల చొక్కా. ముదుగుదోవతి కట్టు మొదట్లోలాగానే
64 ఉంటుంది. కాళ్ళకు ఏమీ ఉండవు బుజాన చిన్నతుండుగుడ్డమాత్రం ఉంటుంది. పురుషోత్తం ఎగదిగా చుస్తాడు.

మ : నాన్నగారు వెళ్ళుతున్నా.

పు : (ఆశ్చర్యంగా) ఈ చీకట్లో ఎక్కడికి, నాటకానికా?

మ : కాదు. నాటకంలోనుంచి బయటికి.

పు : అలాగా ఎంతకాలంనుంచి ఆడుతున్నావేమిటి?

మ : ఆడిస్తుంటే ఆడుతున్నాను. కావాలని నేనాడలేదు. అందుకనే బయలుదేరింది.

పు : జ్ఞానోదయం అయిందన్నమాట!

మ : జ్ఞానోదయమో అజ్ఞానోదయమో అయింది బావకు మీకు జరిగిన కథచాటున ఉండి వింటూ ఉంటే కళ్ళు తెరిపిళ్లు పడ్డాయి. అప్పుడే తెలిసింది.

పు · ఏమి తెలిసింది?

మ . గీతాధర్మం. డబ్బుతో మానవుల్ని హింసించటం. మానవత్వాన్ని రూపు మాపటం ఇంటికి వచ్చినవాళ్ళ ముఖంమీద కాండ్రించి ఉమ్మి వేయటం దాన్ని ధర్మమనటం అలాంటి ధర్మసంస్థాపనవనకోసం కంకణం కట్టుకోవటం

పు    ఈనాటికైనా తెలిసిందికదా, సంతోషం

మ  · ఇక వస్తాను

పు  : ఇది నాటకం కాదని తెలుసుగదా?

మ  : తెలయకపోవటమే తెలుసు తెలుసు ఈ ధర్మానికి తల్లిఅనీ, బిడ్డనీ, బంధువనీ, శత్రువనీ, మేలనీ కీడనీవివక్ష ఏ కోశాన లేదు దానికి ఒక్కటే లక్ష్యం. ఎప్పుడూ ఒకటే మంత్రం జపిస్తుంటుంది లాభం లాభం. లాభం. అంతకు తప్ప మరేమీ లేదు వీడికి చదువు చెప్పించాను. ఎంతాలాభం ఉంటుంది? ఈ మందు మార్కెట్లో పెట్టాను, ఎంతలాభం వస్తుంది? ఈ పుస్తకం అచ్చువేయించాను; ఎంతలాభం గిడుతుంది ఇదే దాని ఆలోచన. వాత్సల్యం, మైత్రి, దయా దాక్షిణ్యం, ఔదార్యం, దానిముందు పాటమరించనన్నా పాటమరించవు. సెలవు, వెంకన్నా, వెళ్ళివస్తాను.

వెం  : (విస్తుపోయి) ఎక్కడికి చినబాబుగారు?

మ  : వాస్తవ ప్రపంచంలోకి (బయటికి వెళ్ళిపోతాడు పురుషోత్తం కళ్ళప్పగించి చూస్తూంటాడు.)



వెం  . (దగ్గరకు వచ్చి) బాబుగారు, బాబుగారు! చినబాబుగారు పోతున్నారెక్కడికి?

పు  : నువ్వుకూడా పోతానంటావా? పో పొండి, పొండి! అంతాపొండి! ఇంకా నుంచున్నావెందుకు?

వెం  : (దీనంగా) ఎక్కడికి పొమ్మంటారు బాబుగారు?

పు  · (వెటకారంగా) సోషలిజం చెయ్యటానికోయ్! కొత్త పెపంచం పిలుత్తోంది!

వెం  : అదేంటో నాకు తెలీదు బాబుగారు. ఇన్నేళ్లువచ్చాక యాడకుపోతాను. ఇక్కడే పడుండనీండి బాబుగారు. మీ కాళ్లు పట్టుకొంటాను. నన్ను తరిమేయకండి. ఈ ముసలి తనంలో యాడకుపోయేది? యవరుచూస్తారు?

పు    (టోపీ మెల్లగాతీసి టేబులుమీద పెడుతూ) ప్రసాదు నిద్రపోయాడా?

వెం  . లేదు మేలుకొనే ఉన్నాడు (ప్రసాదు ఉన్న సోఫాదగ్గరకు వెళ్ళి) బాబూ! తాతయ్య పిలుస్తుంటే పలకవేం? (కూర్చున్నవాణ్ణి కూర్చున్నవళంగా ఎత్తుకెళ్ళి పురుషోత్తానికి దగ్గరగా ఉన్న టేబులుమీద కూర్చోబెడతాడు.)

పు  : మాబాబు అలిగాడు, మానాన్నగా, దా, కన్నతండ్రిగా ఊరికే నవ్వితే అలుగుతారా లే! మా అమ్మగా లే! గిలిగిలి చక్కిలి గిలిగిలి

ప్ర : (నవ్వుతూ) నన్ను తాకావంటేనా తాతయ్యా....

వు : నువ్వుకూడా నామీద అలిగితే నేను బ్రతకొద్దూ లేదు, నా చిట్టితండ్రికి నామీద కోపం లేదు. నేనువడే శ్రమంతా వాడికేగా! వెంకన్నా చిట్టిబాబుకు నీళ్లతోడు ఒళ్ళంతా చెమటపోసింది, పో, తొందరగా పో.

ప్ర : మిల్లు కట్టివేశారా తాతయ్యా?.....

వు : ఆఁ.

ప్ర : ఎందుకని?

వు : సంఘం చెడిపోయింది బాబు. చిత చిత లాడుతున్నది దేవుడూ లేడు. దైవం లేడు పాపం లేదు. పుణ్యం లేదు.

ప్ర : అంటే.

వు : ఇటుచూడుబాబు. ఈ చొక్కా నీదేనా?

ప్ర : నాదికాక మరెవ్వరిది తాతయ్యా?

వు -. కాదు; సంఘందిట!

66 ప్ర : అలాగా, సరేకాని తాతయ్యా, సంఘం అంటే ఏమిటి? (తాతయ్య చేతులు పట్టుకొంటాడు.)

వెం : చిట్టిబాబు, నీళ్లపోసుకుందువుగాని రా.

వు : పిచ్చివాడ, ఎందుకు నాచేతులుచూస్తా? పోయి నీళ్లపోసుకురా. (ప్రసాదు తాతచేతులు వాసనచూస్తాడు.)

ప్ర : సంఘం అంటే ఏమిటి తాతయ్యా?

వు : నీకు చేతులెందుకురా. అదంతా....

వెం : చిట్టిబాబు, వెళ్లుదాముర.

(గలగల మోగించుకుంటూ నాలుగైదు పెద్దకార్లు వెళ్లతూన్న చప్పుడు వినిపిస్తోంది )

ప్ర : తాతయ్యా, తాతయ్యా ఫైర్ యింజన్లు పోతున్నాయి.

వెం : ఎక్కడో ఏదో మునుగుతున్నట్టున్నది పెదబాబుగారు.

వు : (చిరాకుతో) నీవుపోయి వాణ్ణి స్నానం చేయించు.

వెం : వెళ్లుదాము రా చిట్టిబాబు

---

(పురుషోత్తానికి దూరంగా వెంకన్న ప్రసాదు వెళ్ళుతుంటారు.)

ప్ర : వెంకన్నతాతా, నాచేతులు వాసనచూడు

వెం : మా చిట్టిబాబు చేతులకేం కమ్మగున్నాయి.

ప్ర : నీ చేతులేయి? సబ్బువాసన కొడుతున్నాయి. సరేకాని తాతా, నాన్న చేతులు వాసన లేవు. నా చేతులు వాసనలేవు నీచేతులు వాసనలేవు. కుళ్ళుతున్నదెవరు?

వెం : ఎవరు కుళ్ళుతున్నారు?

ప్ర : నాన్నా అన్నాడు నువ్వు అన్నావు. మామయ్యా అన్నాడు. తాతయ్యా అన్నాడు.

వెం : (నవ్వుతూ) పిచ్చిబాబూ, బిచ్చిబాబూ, సంఘం కుళ్ళుతున్నదన్నారు కాని మనమా?

ప్ర : మరి సంఘం ఎక్కడుంది తాతా?

వెం : నాకు తెలీదుబాబూ, నువ్వు నీళ్ళు పోసుకుంటూ ఉండు. తుండు గుడ్డ పక్క గదిలో ఉంది తీసుకొస్తా. ఆపట్నే కూచునేవు. ఇప్పుడేవస్తా. ( ఇద్దరూ లోపలికి వెళ్ళుతారు. హాలులో ఫోను మ్రోగుతుంది ) 67

పు : వెంకన్నా, వెంకన్నా ఒక్క నిముషమయినా ప్రశాంతంగా కూర్చోటానికి నోచుకోలేదుగదా?

వెం : (హాలులోకివచ్చి ఫోను తీసుకొంటూ) అయ్యా.... ఎవరది.... మేనేజరా..... వేనా వెంకన్నని.... ఏమిటి సంగతి...... ముట్టుకొందీ..... గిడ్డంగులా... ఇంకేముంది బాబుగారూ ఇంకేముంది బాబుగారూ?

పు : (కఠినంగా) ఏమిటీ ఆ అమ్మమ్మ శోకాలు.

వెం : తగలడుతోంది. తగలడుతోంది.

పు : ఏమిటిరా తగలడుతోంది చెప్పవేం?

వెం : గిడ్డంగులు...

పు : ప్రసాదెక్కడా?

వెం : స్నానం చేస్తుండాడు. ఇంకేముంది పెదబాబుగారు. పదండి. పదండి

పు : ఏడి ప్రసాద్ వెంకన్నా?

వెం : స్నానాలగదిలో ఎదిలొచ్చానండి ఎ క్కడికిపోతారు. మీరు మిల్లుకాడికి

బయలుదేరండి.

పు : (పెద్దగా) ప్రసాద్. ప్రసాద్ (సమాధానం రాదు) వెంకన్నా, చిట్టిబాబు ఎక్కడకు పోయాడో చూడు.

వెం : నేను ప్రసాద్‌ను చూస్తానులెండి. మీరు ముందు పదండి బాబు

(మళ్ళీ ఫైర్ యింజన్లమోత వినిపిస్తుంది )

పు : చూడరా ముసలిదెయ్యమా! (వెంకన్న గూడా ప్రసాద్ అని కేకలు పెడుతూ రెండు మూడుసార్లు లోపలికిపోయి వచ్చి) ఏడీ ప్రసాదు?

వెం : ఇంకెక్కడిమిల్లు!

(కాసేపు నిశ్శబ్దం)

ప్ర : (వీధిలో పరిగెడుతూ) ఓ సంఘం, ఓ సంఘం, ఓ సంఘం!

(తెర)

## పాత్రలు :

| | |
|---|---|
| కృష్ణుడు | శతధన్వుడు |
| కృతవర్మ | బలరాముడు |
| సాత్యకి | వసుదేవుడు |
| సత్యభామ | దారుకుడు |

(సముద్రం ఘోషిస్తూ ఉంటుంది. సముద్ర జలానికి అందీ అందని తావున విశాలమైన రాతిబండ ఉంటుంది ఆ బండకు అడ్డంగా ముమ్మొన తుంగపట్టె ఉంటుంది. సముద్ర తీరంవైపు వచ్చేవారికి బండమీద కూర్చున్నవారు కనిపించరు ఆ బండమీద ఒకప్రక్క కృష్ణుడు, మరొక ప్రక్క సత్యభామ కూర్చుని ఉంటారు కృష్ణుడు వేణువు ఊదుతూ ఉంటాడు. ఆనాదం హృదయాంతరాలలో అవ్యక్తవిషాదం ఉబికిస్తూ ఉంటుంది. ఇంతలో దారుకుడు వ్రాలిన ముఖంతో అక్కడికి వస్తాడు కృష్ణుడు మురళీనాదం ఆకస్మికంగా ఆపివేస్తాడు.)

సత్య : దారుకా! దారుకా! అలా ఉన్నావేం?

కృ : అనర్థమేమీ వాటిల్లలేదుగదా?

దా : ఫలాంటివారికి చావున్నది కాని నాకు లేదు. ఈ దుర్వార్త చెప్పటానికే కామాలు విధి నన్ను బ్రతికించింది.

సత్య : ఏమి జరిగింది? ఏమి జరిగింది?

దా : సుగ్రీవశైబ్య వలాహక మేఘపుష్పాలు.. .

స : ఏమయ్యాయి. రోగగ్రస్థాలయ్యాయా?

దా : ఈ దారుకుడుండగా అలాంటి పని జరగదు.

స : మరేమయ్యాయి?

దా : కట్టు త్రాళ్లు కట్టుపట్లనే వున్నాయి.

కృ : గుర్రాలుమాత్రం కనిపించటం లేదు. విచిత్రంగా లేదా దారుకా?

దా : విచిత్రమని మెల్లగా అంటారేమిటి?

స : అశ్వశాలలన్నీ వెదకింపలేదా?

దా : వెదికించానుతల్లీ అశ్వశాలలు, పరిసరాలు అన్నీ వెదికించాను. ఎక్కడా కనిపించలేదు అసలు ఆనవాలుకూడా చిక్కలేదు. ఏమనుకోవాలో కూడా తోచటం లేదు. మరొకటీ మరొకటీ అయితే తిరిగి సంపాదించుకోవచ్చును. కాని ఆ సుగ్రీవాదులవంటివి మరెన్ని జన్మలకైనా లభించవు తల్లీ. ఏమిధాటి, ఏమి పౌరుషం, ఏమి జవసత్వాలు వాటిని తేరులకుపూన్చి అదలిస్తే భూన భోంతరాలు దద్దరిల్లేవి పగతులగుండెలు బ్రద్దలయ్యేవి. ఆ తురగ ఖరఖుర ఘరట్టనలతో జయలక్ష్మి ప్రత్యక్షమయ్యేది సత్యం ధర్మం, శౌచం, నృత్యం చేసేవి ఆ మ్రోత వినగానే అవిగో సుగ్రీవశైబ్యవలాహక మేఘపుష్పాలు! అదే

దారుకుడు, అదే కృష్ణుడు అనేవాళ్ళు వీటిని చూడగానే ఆర్తులకు మనస్థి మితత్వం లభించేది తల్లీ! ఆ గుర్రాలు పోయాయి ఈ నిర్భాగ్యుడు మాత్రం మిగిలాడు.

స : దారుకా! విచారించి చేసేదేమున్నది. భటులను పంపించి వెదికించు. సుగ్రీవాదుల సంగతి తెలిపినవారికి బహుమతి యిస్తామని ప్రకటించు.

దా : ఆయుష్మంతుని అభిప్రాయ మేమిటి? ఏమి ఆలోచిస్తున్నారు?

కృ : ఆలోచించుట కేమున్నది? దారుకా సుగ్రీవాదుల పోకడ మాత్రం పొక్కనీకు ఈ వార్త వెల్లడికాకుండానే వాటి ఆచూకి మాత్రం తెలుసుకోటానికి ప్రయత్నించు. తరువాత చూసుకొందాము.

దా : మరొక దుర్వార్త. అదికూడా యీ నోటిమీదుగానే చెబితే తీరిపోతుంది.

స : ఏమిటి?

దా : ఆయుష్మంతుని చక్రం కనిపించుటలేదు. ఈ వార్త చెప్పలేక పరిజనం కాళ్ళు త్రొక్కుకొంటున్నది.

స : ఆ! దుశ్శకునం. దుశ్శకునం. మళ్ళీ ఎవరికో మూడినది. ఇంకను వాసుదేవునితో దుర్మార్గులు చెనకటానికి ప్రయత్నిస్తున్నారా? వాళ్ళకు జీవితం మీద ఆసలేదు కాబోలు!



కృ : విచారించి ప్రయోజనం లేదు. దారుకా నీవుపోయి ఈ చీటీ మహారాజునకిచ్చి తదనుగుణంగా నడిపించమను. త్వరగా పో.

దా : అలాగే. సెలవు తల్లీ పోయివస్తాను.

స : ఏమిటి ఆలోచిస్తున్నారు?

కృ : ఏమున్నది ఆలోచించటానికి, దారకుని వార్తలే.

స : విచిత్రంగా ఉంది. గుర్రములేమైనట్లు? చక్రం ఎలా పోయింది? నా హృదయం మాత్రం ఎలాగో ఉంది. ఎందుకో అశుభాన్ని శంకిస్తూవుంది. ఈయదు వృష్ణి భోజాంధక సాత్వతులకు ఏదో కీడువాటిల్లేటట్లుంది లేకుంటే యింత ప్రమత్తులై ఉండరు.

కృ : (నవ్వుతాడు)

స : మీకు అన్నీ నవ్వులాటలే ఒకప్రక్క ప్రళయం ముంచుకొనివస్తున్నా నవ్వులే. (దూరాననుంచి అన్నయ్యా! అన్నయా! అని సాత్యకి పెద్దగాపిలుస్తూ వుంటాడు)

కృ · అదుగో తమ్ముడు సాత్యకి వస్తున్నట్లున్నాడు అనవసరంగా అతని హృదయాన్ని కలతపెట్టకు

సా · అన్నయ్యా!

కృ : ఇటు. ఈతుంగ వట్టివెనుక ప్రక్కనే దారి ఉంది సాత్యకీ.

సా : (వచ్చి సత్యభామనుచూచి ఆశ్చర్యంగా) అదేమి, అలా ఉన్నారేమిటి?

కృ : (నవ్వుతూ) ఏమిలేదు మీ వదినకు ఒకకల వచ్చిందట. రక్తసముద్ర ముప్పొంగి ద్వారకను ముంచివేసిందట. ఆ ప్రవాహంలోవున్న నీవూ నేను కొట్టుకొని పోయామట. ఆ సంగతి ఇప్పుడే చెబుతూ ఉంది

సా : అసంభవం. ద్వారకను రక్తసముద్రంలో ముంచగలిగిన వీరుడు ఇంత వరకూ వుట్టలేదు. ఇక వుట్టనూ వుట్టడు. ఆ కలవల్లనేనా ఇంత దిగులు పడుతున్నది?

స : నాయనా సాత్యకీ! ఎన్నడూ నోరుతెరచి అడగని నీ వదిన నేడు ఒకటి కోరుతున్నది.

సా : ఏమది?

స : మీఅన్నగారిని విడిచిఉండనని మాటయిస్తేచాలు. అంతకంటె నాకుకావలసినది ఏమీలేదు. 73

సా : అలానే మీ ఆజ్ఞ శిరసావహిస్తాను

స : సరే, అన్నగారితో పనివడి వచ్చినట్లున్నది. లేకపోతే ఇలాటి సమయానరావు రహస్యాలైన రాజకార్యాలేమున్నవో, సరే నేనువస్తాను. (అందెలరవళి నిష్క్ర మణను సూచిస్తుంది.)

సా : ఇవాళ లేచినదగ్గరనుంచి అన్నీ విచిత్రంగా ఉన్నాయి.

కృ : ఏమి విచిత్రంగా ఉన్నాయి.

సా : ఇంతకుముందు వదిన అన్నమాట విచిత్రంగా లేదూ?

కృ : అందులో విచిత్రమేముంది? అది ఆమెహృదయస్థితి తెలుపుతున్నది. పోతే, యింకా విచిత్రాలున్నాయంటివే? ఏమిటి?

సా . అసలు సంగతి మరచిపోయాను యదువృష్ణిభోజాంధక సాత్వతప్రజయెల్ల గుబ్బటిల్లిపోతున్నది

కృ . నేను బయలుదేరునప్పుడు నగరమంతా ప్రశాంతముగా ఉందే

సా : మీరు ద్వారకనుంచి కాలు బయటపెట్టి ఉంటారో లేదో గందరగోళం బయలుదేరింది.

కృ : ఏమది?

సా : పొయ్యి మీదనుంచి అప్పుడేదించిన వంటకాలలో పురుగులుపుడుతున్నాయిట

కృ : వింతగా ఉన్నదే?

సా : వింతసంగతి ఎట్లున్నను ప్రజలు రెండురోజులనుంచి తిండి తిప్పలు లేక అల్లాడుతున్నారు.

కృ : వదంతులా?

సా : కాదు అన్నయ్యా, ఈ కళ్ళారా చూచాను. శతధన్వుని యింటికి వెళ్ళాను. వండి దించిన కూడు, కూరలు పెగపొగలు ఎగజిమ్ముతూనే ఉన్నాయి ఇలా చూదును గదా పురుగులు లుకలుక లాడుతున్నాయి.

కృ : నిజమేనంటావా?

సా : అన్నయ్యా నామాటలోకూడా నమ్మకంలేదా? అంతే కాదు. గాలి ఎలా ఉంటుంది?

కృ : ఎలా ఉంది?

సా : మామూలుగా చల్లగానో, వెచ్చగానో, నెమ్మిగానో, పాడిగానో, సుగంధం చిమ్ముతూనో లేక దుర్గంధం వెళ్ళగ్రక్కుతూనో ఉంటుందా? అలాలేదు

కృ : (విసుగుదలతో) మరెలా ఉంది?

సా : తియ్యగా ఉంది.

కృ : తియ్యగానా?

సా : తియ్యగా ఉంది. ప్రజలు కాళ్ళ తొక్కుకుంటున్నారు స్త్రీజనం కనులు చెమ్మ గిల్లుతున్నాయి. బాలవృద్ధులు అన్నంకోసం అలమటిస్తున్నారు. ఈ సంగతి చెబుదామని మీకోసం నగరమంతా వెదికాను కనిపించకపోతే యిటు వచ్చాను

కృ : నాన్నగారికి చెప్పలేదా?

సా : చెప్పాను. ఆయన పెద్దన్నయ్యను, మిమ్ము పిలుచుకురమ్మన్నాడు పెద్దన్నయ్య గారికోసం వెదికాను. కనిపించలేదు ఇటువచ్చాను. మీరు కనిపించారు.

కృ : విచిత్రంగానే ఉంది. మరి కర్తవ్యం?

సా : అందుకేగా మీ వద్దకు వచ్చింది

కృ : (గొంతు దూరాన్నుంచి వినిపిస్తుంది) కృష్ణా! ఆపద్బాంధవా! ఇవాళ దర్శనమే దుర్లభమా?

కృ : అబ్బబ్బ! యీ కృతవర్మతో వేగలేకుండా ఉన్నాను ముప్పొద్దులు పెట్టే పాదాభి వందనాలందుకోలేక పెద్దలు తలుపుకొస్తున్నారు. చూడగా చూడగా నా శత్రువులు నా మనస్సుపైన కూడా గూఢచారిని నియోగించినట్లు ఉంది కాని మరొకవిధంగా లేదు.

సా : సౌప్తిక సంహారంతో కృతవర్మ పాపం పూర్తిగా దెబ్బతిన్నట్లుగా పులిలాటి మనిషి నేడు మేకయిపోయాడు.

కృత : కృష్ణా! ఎక్కడున్నావుతండ్రీ! నీదర్శనంలేక ఈ హృదయానికి శాంతిలేదు. మధ్యాహ్నంనుంచి నీ ముఖారవిందం చూడనోచుకోలేదుకదా?

కృ : కృతవర్మా, కృతవర్మా యిటు యిటూ, యీ ముమ్మొన తుంగపట్టె వెనుక.

కృత : దారి కనిపించదే

కృ -: కుడివైపుననే కాలిబాట ఉంది.

కృత : అమ్మయ్య, బ్రతికాను ఈపూట నీదర్శనం లభించదుకాబోలునే అని చింతిస్తున్నాను కాని దొరికింది కృష్ణా నమస్కారం. అబ్బాయి సాత్యకికూడ యిక్కడే ఉన్నాడే! అనవసరంగా వచ్చి మీ యేకాంతానికి భంగం కలిగించానే! ఎంతపొరపాటు జరిగింది. కృష్ణా క్షమించు వస్తాను.

కృ : దేవరహస్యాలేమీ లేవు. సముద్రవాయువుకని ఇక్కడ కూర్చున్నాను. సాత్యకి కూడా ఇంతకుముందే వచ్చాడు. కాసేపుంటే అంతాకలసి పోవచ్చునుగదా.

కృత : మీరు మాట్లాడుకోటానికి ఇబ్బందిలేకపోతే ఇక్కడే చతికిలబడతాను.

కృ : అక్కడ కూర్చున్నావేమి కృతవర్మా? ఈ బండ చాల విశాలంగా ఉంది. ఇటు వచ్చి కూర్చో.

కృత : ఇక్కడే కూర్చుంటే నీముఖం తనివారచూస్తూ చెప్పేదంతా వినవచ్చును

కృ : కృతవర్మా, విశేషాలేమిటి?

కృత : సర్వాంతర్యామివైన నీకు తెలియనివేమున్నవి? పైగా అన్నలంతటివాడు సాత్యకి. మీకు తెలియనివి నాకెలా తెలుస్తాయి?

కృ : నీవుమాత్రం సామాన్యుడవా? మైత్రికోసం ధన ప్రాణాలను కూడా తృణ ప్రాయంగా త్యజించావు. అలాంటివారిముందు మేమెంత?

కృత : కృష్ణా! వద్దు వద్దు లేనిపోని ఈ గొప్పతనం నాకంటగట్టకు ఇంతవరకు చెడినదిచాలు.

కృ : నిజం వినటం కష్టమైతే పోనీ, వార్తలేమన్నా ఉంటే చెప్పు

కృత : అన్నట్లు దారుకుడు ఖిన్నుడై మీకోసం వెదుకుతున్నాడు. కనిపించాడా? దుర్వార్తలేమీ లేవుకదా?

సా : అన్నయ్యా దారుకుడు వచ్చాడా?

కృ : (నెమ్మదిగా) ఆ. నీవు వచ్చేముందే వెళ్ళిపోయాడు.

కృత : అనర్థకాలేమీ జరగలేదుగదా?

సా : యదుకులానికి కీడు తలపెట్టగల సాహసులున్నారా?

కృ : కీడుతలపెట్టటమే కాదు చేసి చూపించారు.

కృత : నిజమే?

కృ : నిజమో అబద్ధమో? సుగ్రీవాది అశ్వాలు, చక్రం అపహరించారు.

కృత : అపహరించడమే! ఎవరా పౌండ్రక వాసుదేవులు? జీవితం మీద విసువు పుట్టినట్లుంది.



సా : నిజమేనా అన్నయ్యా?

కృ : రేపు తల ఎగిరినా సందేహిస్తూనే ఉంటావు. కృతవర్మా నీతో హృదయంవిప్పి యీనాడు చెబుతున్నాను చెప్పటమే కాదు నీ సహాయం మనస్ఫూర్తిగా అర్థిస్తున్నాను.

కృత : నా సహాయమా (వికటంగా నవ్వుతూ) అహ్హహ్హ జగన్నాటక సూత్రధారికి అల్పాతి అల్పమానవుని సహాయమా? బాగు, బాగు.

కృ : కృతవర్మా! నవ్వికీలుకాదు. నిజంగా చెబుతున్నాను.

కృత : (మళ్ళీవికటంగా) అహ్హహ్హ

కృ : ఎందుకు నవ్వుతావు? వినబోయే విషయం కూడా హాస్యాస్పదంగా ఉందా?

కృత : కృష్ణా క్షమించు నిన్ను నవ్వగలవాణ్ణా! ఎంతమాట!

కృష్ణ : ఐతే విను. యెవరి తప్పులవల్లనైతేనేమి కురుపాండవ యుద్ధంజరిగింది. మైత్రిని బట్టి, బాంధవ్యాన్నిబట్టి, యదు, వృష్ణి, భోజాంధక, సాత్వతులు ఎవరికి తోచిన పక్షాన వారుచేరారు. యుద్ధ ప్రారంభముతో ధర్మాధర్మ విచక్షణ పోయింది.

అన్యాయం జరిగింది నేను ఒప్పుకుంటాను ఆ అన్యాయానికి రోసే నీవు సౌప్తిక సంహారంలో కృపాశ్వత్థామలకు తోడ్పడ్డావు. అదంతా అయిపోయింది గతానికి వగచి ప్రయోజనం లేదు చనిపోయిన దుర్యోధనాదులు ఎటూ తిరిగి రారు అలా యిప్పుడు మనలోమనం కలహాలు పెట్టుకోవడం వల్ల ప్రయోజన మేముంది? ముందు యుగాలవారు 'యాదవాదులకు సంస్కారం లేదు ధర్మంలేదు అధికారోన్మత్తులై దక్కినరాజ్యం అనుభవింపలేక కొట్టుకు చచ్చారం' టారు . చేతులార యీఅప్రతిష్ఠ మనంఎందుకు కొని తెచ్చుకోవాలి? నిజానికి మనలోమనం అసలు ఎందుకు దెబ్బలాడాలి?

కృత : ఆఁ మనవారికి అంతఃకలహాలు ప్రారంభమయ్యాయా? కృష్ణా! విచిత్రంగా ఉంది ఆ విపరీతిబుద్ధి ఎవరికిపుట్టింది సాత్యకీ?

సా : నాకూ విచిత్రంగానే ఉంది

కృ · ఇంతవరకు బయటికి పొక్కకపోయినా ఉపేక్షిస్తే రేపైనా రాకతప్పదు అది అలా ఉంచు. ఏకలవ్యుని బంధుమిత్ర పరివారం సంగతి తెలుసుగా. మనవారంటే మండిపోతున్నారు ఎప్పుడు అదనుచిక్కుతుందా ఎప్పుడు యాదవులను రూపుమాపుదామా అని తహతహలాడుతున్నారు ఇదిగో యిప్పుడు వాళ్ళకు సమయం కనిపిస్తున్నది విరుచుకుపడటానికి సిద్ధమౌతున్నారు.



సా · ఏకలవ్యుని పరిమార్చినా వాళ్ళకింకా సిగ్గురాలేదన్నమాట.

కృత ద్వారకపై దండెత్తిరావటానికి నిషాదులకు గుండెలున్నాయంటే నమ్మలేను శ్రీ కృష్ణ పరమాత్మ, బలభద్రుడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు మొదలయిన మహాయోధులుంటే ద్వారకను జయించాలనే? మళ్ళీ దేవకీగర్భాన పుట్టాలి

కృ : సరే నా మాటలలో యిద్దరికీ నమ్మకం లేదు. మరి రథాశ్వాలు, చక్రం ఎలా పోయాయి? పొయ్యిమీదనుంచి దించీ దించకముందుగానే కూడు కూరలో పురుగులు యెలా పుడుతున్నాయి? వాయువు ఎందుకు తియ్యగావుంటున్నది! ఈపనులు ఎవరుచేస్తున్నారు నిషాదులు కాకపోతే? కృతవర్మచెయ్యాలి, బలరామకృష్ణులు చెయ్యాలి, సాత్యకి చెయ్యాలి అంతేనా? మరొకమార్గం ఉందంటావా?

కృత . నువ్వు చెబుతున్నది చాలాఘోరంగా ఉన్నది. తొందరగా మేల్కొనకపోతే ద్వారక నిర్జనంకాక తప్పదు.

కృ . అందుకనే నీసహాయం అపేక్షించింది

కృత . నీ నిత్య దర్శనభాగ్య మొక్కటి అనుగ్రహిస్తే ఏమిచెయ్యమన్నా చేస్తాను.

కృ · యావజ్జాతికి ప్రమాదంరానున్న సమయంలో ఇలా పట్టుపట్టి కూర్చుంటేఎలా? నీవు, సాత్యకి సైన్యసమేతంగా వెళ్ళి నిషాదులకు మరొకసారి ద్వారకను గుర్తు చేసిరావాలి. అసలు ఆరాజ్యానికి నీవేరాజుగా ఉండటం నాకుఇష్టం నాకేకాదు అన్నయ్యకు కూడా. మొన్నమాటల సందర్భంలో అన్నాడు మహారాజు కూడా ఇందుకు కాదనడు. ఇది బాగాలేదా సాత్యకీ?

సా : నిషాద భూములను జయించటానికి కృతవర్మకంటె యోగ్యుడు మరెవ్వడూ లేడు.

కృత : ఇంత ఆదరాభిమానాలు చూపిస్తున్నందుకు నమస్కారం ఇదివరకు నేను నీకు చేసిన అపకారం మనస్సులో దూరి నన్ను కలవరపెడుతున్నది. అంతే కాదు, నిన్ను చూడని దినం ఘోర యుగంగా కనిపిస్తున్నది. అలాంటప్పుడు నన్ను ద్వారక విడచి ఆ మరుభూములకు పొమ్మంటే... కృష్ణా! క్షమించు మరేమీలేదు. నాపాపమే అలా పీడిస్తున్నది. నిజం చెబుతున్నాను. ముప్పూటా వచ్చి దర్శనం చేసుకొని పోతున్నానంటే హృదయశాంతికోసమే. నీవు చెప్పినది అవశ్యకర్తవ్యం! కాని యిదే అడ్డువడుతున్నది నీవు అగ్నిలో దూకమన్నా దూకుతాను. తలకోసి యిమ్మన్నా యిస్తాను. మరేమి చెయ్యమన్నా చేస్తాను కాని నిన్ను విడిచిపోవాలంటే...



కృ . ఎందుకంత కష్టం?

కృత : నా హృదయావస్థ నీకు ఎలా వ్యక్తం చేయగలను? నిన్ను విడిచి పోవడమంటే కంస, శిశుపాల, జరాసంధాదుల త్రోవను పోవటమనిపిస్తుంది ఆ బంధ మేమిటో నాకు తెలియదు. ఇలాంటి స్థితి ఎలా వచ్చిందో బోధబడదు ఈ వైక్లబ్యం మార్చుకోవాలని శతధాప్రయత్నించాను. కాని లాభంలేకపోయింది. కృష్ణా! నాకు విముక్తి ఎందుకు ప్రసాదించవు?

సా : అన్నయ్యా! కృతవర్మ పాపం వికలచిత్తుడై ఉన్నాడు

కృ . అయితే యాదవ ప్రళయం నీకిష్టమేనా కృతవర్మా?

కృత . స్వజన సంక్షయం ఏదుర్మార్గుడు కోరుకుంటాడు?

కృ · పోని నిషాద ప్రమాదాన్ని తెల్పి ద్వారకలో సైనిక శిక్షణకు యోగ్యులైనవారి నందరినీ యుద్ధ సన్నద్ధులను చేయగలవా?

కృత . ఆపనియెంత కృష్ణా! ద్వారక పోతుగడ్డ; కత్తితిప్పని బాలుడు, యుద్ధమంటే, ఉప్పొంగని యువకుడులేడు ఎంత సైన్యం కావాలన్నా నిమిషంలో ఆయత్తం చేస్తాను.

కృ : సరే. ఆపనేకానీ, మళ్ళా కనిపిస్తావుకాదూ? ద్వారక ఎంత గగ్గోలుగా ఉన్నదో! వస్తాను.

సా : అన్నాయ్యా నేనుకూడా వస్తున్నాను.

( ఇద్దరూ నిష్క్రమిస్తారు )

(సముద్రఘోష పెద్దగా వినిపించి క్రమశః సన్నగిల్లుతుంది. తరువాత ప్రశాంత సమయంలో మొదట ఒకయీల దానికిమారు మరొక యీల వినిపిస్తుంది.)

కృత : తమ్ముడూ శతధన్వా!

శతధ : నేనే నన్నయ్యా! ఎక్కడ?

కృత : ఇటు, ఈ ముమ్మొన తుంగపట్టె వెనుక, త్వరగా రా ఎవరికంటా పడకుండా – వచ్చావుకదా?

శతధ : అన్నయ్యా నమస్కారం. జాగ్రత్తగానే వచ్చాను.



కృత : ద్వారక వార్తలేమిటి?

శతధ : చాలా ఉన్నాయి. మొత్తం నగరమంతా అగేలుగా ఉంది. పెద్ద చిన్న తారతమ్యం లేదు. ధర్మాధర్మ వివేకంలేదు. మీసంవచ్చిన ప్రతిమగవాడు రొమ్ము విరుచుకొని తిరుగుతున్నాడు. నడివీధిలోనే తాగి తందనాలాడుతున్నాడు ఏ చదుకంలో చూచినా త్రాగుబోతుల కూనిరాగాలే! స్త్రీ జనమంతా లజ్జాభిమానాలు త్యజించి కట్టుతప్పి తిరుగుతున్నది.

కృత : ఘోరంగా ఉన్నదే! మహారాజు వసుదేవుడూరకున్నాడా? బలరామకృష్ణులు చేతకాని వాళ్ళయి చూస్తున్నారా?

శతధ : లేదు మహారాజు నగరమంతా చండశాసనం ప్రకటించాడు. ద్వారక నగర సీమలలో మధువు త్రాగినా, శరీర స్పృహ తప్పి ఉన్నా, కనీసం మాటలలో ఏమాత్రం తడబాటు కనిపించినా, నిశిత శూలారోపణకు పాత్రులౌతారని ప్రకటించాడు ఇదంతా మాయలమారి కృష్ణుని పనేనని యదువృష్ణి భోజాంధక సాత్వత కుమారులంతా అతని మీద కత్తులు నూరుతున్నారు.

కృత : భోజాంధకులు కూడా త్రాగుబోతులయ్యారా?

శతధ యదువృష్ణి కుమారులను చూచి భోజాంధక సాత్వతులు కూడా మొదలు పెట్టారు వారిలో యీ దుర్వ్యసనం వ్యాపించకుండా చేయటానికి శతవిధాల ప్రయత్నించాను కాని ఆగలేదు మహామారిలాగ వ్యాపించింది. సలిమినో బలిమినో ఆకట్టుదామన్నా వీలుగాలేదు దీనికి రెండే మంత్రాలు. ఒకటి వివేచన అది చాలాకాలం క్రితమే నశించింది పోతే అధికారం అది కృష్ణా యత్తం

కృత : అయితే యీ మన వంశాలకు వినాశం తప్పదన్నమాట.

శతధ : అదేమిటిఅన్నయ్యా అలాఅంటున్నావు? ఈ యదువృష్ణి వంశాలమీద అంత జాలిదేనికి? వీళ్ళు అధికారోన్మత్తులై చేయని దుండగంలేదే! భోజాంధకులను గడ్డికరపించారే. ఈనాటికికూడా అవమానిస్తున్నారే! బలవంతులైన నారాయణ గోపాలురనందరినీ రేపెన్నడైనా తిరగబడతారన్న కోపంతో కౌరవపక్షాన చేర్పించి ఈ మాయలమారి కృష్ణుడు ఊచకోత కోయించాడే! అన్నయ్యా! అలాంటి ఈ యాదవవార్ష్ణేయులమీదనా మమకారం? అందులో ఈ కృష్ణుని మీదనా?

80 కృత నిజమేతమ్ముడూ, అధికారజిగీషువై పాండవులను చేరదీసి నెయ్యము వియ్యము నెరపాడు కావలెనని కురుపాండవ యుద్ధం కల్పించాడు. దేశాన్నంతా నిర్వీర్యం చేసివేశాడు. రణధర్మంతప్పి దుర్యోధనాదులనందరినీ చంపించాడు. నూరుమంది కొడుకులనుకన్న గాంధారీ ధృతరాష్ట్రులను దిక్కులేని పక్షులను చేసివేశాడు. ఈనాడు పాండవులు కేవలం కృష్ణునిచేతిలో కీలుబొమ్మలు.

శతధ : అంతేకాదు అన్నయ్యా! ఈమధ్య జరుగుతున్న సంగతులు తెలియలేదు కాబోలు. చచ్చిన తన నూర్గురుకొడుకులకు తర్పణం విడుద్దామన్నా ధృత రాష్ట్రునకు పాండవులు, ముఖ్యంగా ఆ భీముడు పడనీయటం లేదట. ఆఖరుకు ఆ వృద్ధ దంపతులు పట్టెడు మెతుకులకు కూడా నోచుకోవటం లేదట. ఎప్పుడూ సూటీపోటీలేన్నట

కృత : ఎంతగతి పట్టింది? సార్వభౌమునితండ్రి పట్టెడు మెతుకులకు నోచుకోలేదా? వీరమరణం పొందిన పుత్రులకు అన్ని నీళ్ళు వదలటానికి గూడా గతిలేక పోయెనా? దారుణం! దారుణం!!

శతధ · మొన్న హస్తినకు వెళ్ళివచ్చాను గాంధారి కనిపించింది

కృత : ఏమన్నది?

శతధ  ఏమన్నది? ఏమీలేదు డగ్గుత్తికతో "మీ అన్నయ్యను అడిగినానని చెప్పు నాయనా" అన్నది అంతే, మరేమీ చెప్పలేదు.

కృత : వట్టి కృతఘ్నుణ్ణి

శతధ : అదేమి అన్నయ్యా?

కృత : ఏమీలేదు. సౌప్తిక సంహారానికి బయలుదేరేముందు అశ్వత్థామ నేను గాంధారి దేవిని సందర్శించాము. ఆతడు నిష్పాండవం చేస్తానని శపథంచేశాడు నేను ఈ భరత వర్షాన్ని నిర్యాదవం చేస్తానన్నాను. అశ్వత్థామ చాలవరకు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. పోతే నాప్రతిజ్ఞ నేను మాత్రము మిగిలాము. నా ప్రతిజ్ఞను పురస్కరించుకొనే గాంధారి కృష్ణుణ్ని శపించింది. ఇంతవరకూ ఆ ప్రతిజ్ఞ అలాగే ఉంది. అదే ఆ మహాతల్లి తిరిగి జ్ఞాపకంచేస్తున్నది.

శతధ : అలాగా? ఇంకా సంకోచం దేనికి? అన్నయ్యా! నీవు సరేనంటేచాలు. నీ ప్రతిజ్ఞ మూడురోజుల్లో నెరవేరుతుంది.

కృత : ఇది బాహుబలంతో జరిగేదికాదు. బలరామకృష్ణుల ముందు ముఖ్యముగా కృష్ణుని ముందు నీయాటలు సాగవు. ఆతడు దూరదర్శి, కార్యచతురుడు. కాకపోతే ఆవులను కాచుకొనే ఒక సాధారణవ్యక్తి యీ మహాఖండాన్ని గుప్పిట బిగించి ఎలా ఏలుతున్నాడు?

శతధ . అయితే మన మంత్రమంతా కృష్ణునికి తెలుసునంటావా?

కృత : ఎప్పుడో పసికట్టాడు. వేయికళ్ళతో చూస్తున్నాడు.

శతధ : నిజమేనా? హృదయాంతరాంతరాలుగూడా పెకలించి తీయగలడట్లుందే!

కృత : నిషాదరాష్ట్రాధిపత్యమిచ్చి నన్ను ద్వారకనుంచి పంపివేయటానికి ప్రయత్నించాడు. నేనందుకు అంగీకరించలేదు.

శతధ : అలాగా, నిరాకరిస్తే ఎలా వూరుకున్నాడు?

కృత : గత్యంతరం లేక? నన్ను తాకితే భోజకులమంతా కత్తులు దూస్తుందని అతనికి తెలుసు.

శతధ : అన్నయ్యా, అలాంటి అవకాశాలున్నప్పుడు పోగొట్టుకోవటం దేనికి?

కృత : మనస్సు ఎటూ తెగకుండ వచ్చింది. యదువృష్ణి, భోజాంధక సాత్వతులు ఎంతకాదనుకొన్నా సన్నిహితబంధువులు. చచ్చిన దుర్యోధనాదులు ఎటూ తిరిగిరారు కేవలం ప్రతిజ్ఞ కోసమని బంధుమిత్ర పరివారకోటిని సంహరించు

కోవటమా? కృతఘ్నుడను కావటమా? అటు కృష్ణుడు కూడా ఎన్ని అన్యాయాలు చేసినా, జాతికి మేలుచేశాడు. అద్వితీయమేధావి, తత్త్వవేత్త. ఘటనా ఘటన సమర్థుడు అలాంటివాని కెగ్గు తలపెట్టి జాతిద్రోహానికి పూను కోవటమా? కాని మరొకప్రక్క మిత్రధర్మము, ధర్మపక్షపాతము, ఆత్మ గౌరవము నిరంతరము పీడిస్తున్నాయి ఎటూ తోచకుండా ఉన్నది

శతధ : లేదు అన్నయ్యా. కృష్ణుడు సంపాదించి పెట్టిన అపూర్వ గౌరవ ప్రతిపత్తికి యాదవవార్ష్ణేయులు తగరు ఏమాత్రం తగరు. అలాంటి గౌరవప్రతిపత్తులు కాపాడుకోవాలంటే వారిలో ఆ ఉదాత్త సంస్కారం, విజ్ఞానం కావాలి. ఆ రెండూలేవు. జాతికంతకూ అలాంటి సంస్కారం విజ్ఞానం కలిగించటానికి కృష్ణుడు ఎన్నడూ ప్రయత్నించలేదు. అదే అతనికి ముప్పు తెచ్చింది అదే యాదవాదుల నాశనానికి కారణమౌతున్నది. అలాంటప్పుడు మాటచెల్లించు కోలేని వృద్ధుడని నీవు ఎందు కనిపించుకోవాలి? (కెవ్వుమని పక్షి తుంగపట్టెలో పడిపోతుంది )

కృత : ఏమిటిది?

82 శతధ : పక్షి. విచిత్రంగా ఉంది, అన్నయ్యా ఎక్కడా గాయాలు లేవు ఇప్పుడేకదా అరచింది. అప్పుడే దానికి ప్రాణాలు కూడా పోయాయి!

కృత : కారణమేమై ఉంటుంది?

శతధ : ఏమీ కనిపించటం లేదు. ఈ ముమ్మొన తుంగ తప్ప మరొకటిలేదే?

కృత : ఈ ముమ్మొనతుంగ విషమయం కాదుగదా?

శతధ : అన్నయ్యా, విషం, విషం, ఈ తుంగంతా విషమే. పురుగును పట్టుకొని తుంగమీద వేశాను. చచ్చిపడ్డది.

కృత : అయితే కృష్ణుడు చెప్పినదంతా నిజమై ఉంటుంది.

శతధ : ఏమి చెప్పాడు?

కృత : నిషాదులు మనలను నాశనం చేయటానికి ప్రయత్నిస్తున్నారని ఇది వారిపనే. లేకపోతే ఇలాంటితుంగ ఇక్కడికి ఎలా వస్తుంది?

శతధ : ఆఁ. ఇది విషమయమని కృష్ణునికి తెలుసునంటావా?

కృత : తెలుసునని గట్టిగా చెప్పటానికి వీలులేదు! ఎవరైనా చూస్తే అనుమానిస్తారు. పోదాంపద నీవు మాత్రం జాగ్రత్తగా ఉండు.

## రెండు

(సముద్రఘోష పెద్దగా వినిపించి క్రమశః సన్నగిల్లుతుంది )

కృ : అన్నయ్యా! అన్నయ్యా! లేదు. ఈ రెండు రోజులనుండి కనిపించడం లేదు విచిత్రంగా ఉంది. బలభద్రుడు ఎక్కడకు పోయినట్లు? ఒక్క క్షణం కూడా నన్ను విడిచి ఉండేవాడు కాదు నాతో చెప్పకుండా ఏపని చేసేవాడు కాదు. దారుకా! నీవటు తూర్పున ఉన్న చెట్లతోపులో చూచిరా సత్యా నీవటు పడమర దిక్కుకు పోయిరా. తమ్ముడూ సాత్యకీ, నీవటుపోయి చూచిరా.

సా : అన్నయ్యా!

కృ : ఆ యిద్దరు పోతూ ఉంటే నీవలా నుంచున్నావేం?

సా : వదినకు మాటయిచ్చానుగదా! నీ వెంటనే వస్తాను అన్నయ్యా.

కృ : అన్నీ కలిసివచ్చాయిలే, రా.

సా : కంగారు పడుతున్నట్లున్నదే!

కృ : పెద్దన్నయ్యకు నిజంగా కోపం వచ్చినట్లుంది. లేకపోతే యిలాచేసి ఉండేవాడే కాదు.

సా : మనవల్ల తప్పు జరగలేదుగదా?

కృ : చాలా పొరపాటు జరిగింది ఆయనతో సంప్రదించకుండానే ఆతురత కొద్దీ దారుకు ద్వారా చీటి పంపించి శాసనం చేయించాను. అది ఆయనకు కోపకారణమై ఉంటుంది.

సా : అన్నయ్యా! అన్నయ్యా అటు చూడు ఆచెట్టు క్రింద పండుకొన్న దెవరు? పెద్దన్నయ కాదుకదా!

కృ : అది తాలంకుడే సందేహంలేదు ఆ మహావిగ్రహం బలభద్రునిదే! ఆ ఒడ్డు పొడువులు మరొకనికి దుర్లభం. హంసతూలికాతల్పం వదలివచ్చి యీ మారుమూల కఠిన నేలమీద పండుకున్నాడు నీవిక్కడే ఉండు అన్నను పిల్చుకొస్తాను.

బల : ఎవరది? కాళ్ళు పిసుకుతున్నారు దేనికి? నేనివ్వ గలిగింది ఏమీలేదే అధర్మం కళ్ళముందు జరుగుతూ వుంటే చూస్తూ ఊరుకున్న మహాపాపిని లేదు బాబూ, నావల్ల యీషత్ప్రయోజనం కూడా ఉండదు.

కృ . అన్నయ్యా, నేనే అన్నయ్యా ఇటు చూడు

బల · ఎవరు కృష్ణా నీవా? ద్వారక ఏమైనది? యిలా వచ్చావు?

కృ · నీవులేని ద్వారక ఎవరికి కావాలి అన్నయ్యా!

బల ఓహోహో! కృష్ణునకు రాజ్యకాంక్ష లేదు – పులికి మేక మీద అభిలాష లేదు.

కృ : అన్నీ తెలిసిన మీరే అలా అంటే నేనేమి చేసేది?

బల : రాజ్యం.

కృ . మీతో చెప్పకుండా, సంప్రదించకుండా మద్యపాన నిషేధ శాసనం చెయ్యటం తప్పే, ఒప్పుకుంటాను కాని యదువృష్ణి భోజాంధక సాత్వతులలో త్రాగుబోతుతనం ఎక్కువై దురాగతాలు ప్రబలుతూ వుంటే కళ్ళముందే జాతిజాతి అంతా ధ్వంసమై పోతూవుంటే, చూడలేక శాసనం చేయించాను. త్వరలో మీతోమనవి చేయలేకపోయాను. మనవిచేయకపోవటం తప్పే. ఒప్పుకుంటాను.

బల : నేనుమాత్రం చేసినదేమున్నది? రాజాజ్ఞ ధిక్కరించలేక పట్టణం వెలుపల కొచ్చాను. ఆజ్ఞాధిక్కారం చేయకపోవటం తప్పేనా?

కృ : మీరలా అంటే నేనేమి చెప్పేది?

బల : నీకు తెలియనిదేమున్నది కృష్ణా? మొదటినుంచి అంతో యింతో మైరేయం అలవాటైపోయిన సంగతి నీకు తెలియనిది కాదు. ఇటీవల ఆప్తుడైన సుయోధను దుర్మరణం చూచి, ప్రబలిన అధర్మాన్ని చూచి, తమ్మునిమీద మమకారం స్మరించి, మనస్సులో బయలుదేరిన దుర్భర తాపాన్ని భరించలేక, ఆదుర భ్యాసం ఎక్కువైపోయింది అదే తగనిపని అనుకొంటూ వుంటే, రాజధిక్కార మెలా చేసేది? అందుకని యిలా వచ్చాను. యిక్కడకూడా నన్నుండనివ్వరా యేమిటి?

84

కృ : అన్నయ్యా, నీకు నేను చెప్పదగినంత వాడనుకాను. నువ్విలా నగరం వెలుపలకు వచ్చేశావన్న సంగతి ప్రజలకు తెలిసిందంటే ద్వారకలో ఒక్క పురుగుండదు. అంతా సముద్రతీరానికిచేరి త్రాడుగు మొదలెడతారు. ఇదివరకే యదుకృష్ణులకు, భోజాంధకులకు అంతఃకలహాలున్న సంగతి తెలియనిది కాదు. త్రాగిన మీదట ఏమి పుట్టి మునుగుతుందో ఎవరు చెప్పగలరు?

బల : ఇంతకూ నన్ను ఇక్కడకూడా ఉండవద్దంటావు. అంతేనా? ఈ మాత్రానికి ఇంతదూరం వచ్చావా? కాకిచేత కబురంపితే ద్వారకాధిపతి కురుసామ్రాజ్యాధిపతి తమ రాజ్యంలో ఎక్కడా త్రాగగూడదని శాసనంవేసి వేస్తారు కదా? నీ కెందుకు ఇంతశ్రమ? కృష్ణా ఇటుచూడు నా బ్రతుకేదో నేను బ్రతకటానికి కూడా వీలులేదంటావా?

కృ అలా ఎవరన్నారు?

బల మరి నీవంటున్న దేమిటి?

కృ . ఏమీలేదు. ద్వారకకు పోదాం రమ్మంటున్నాను. లెండి. లెండి. నాన్నగారు కూడా మీకోసమని వడివస్తున్నారు.

వసు . నాయనా బలభద్ర! ఇక్కడే ఉన్నావని సాత్యకి చెప్పి వెళ్ళాడే ఎక్కడరానాయనా?

కృ : ఇక్కడే నాన్నగారు, ఈ చెట్టుక్రిందనే.

వసు · నాయనా బలభద్రా, మమ్మల్నందర్నీ వదలి పెట్టి ఇక్కడకు వచ్చి కూర్చున్నావా?

కృ : అదే అంటున్నాను. ద్వారకకు రమ్మని బ్రతిమాలుతున్నాను. అన్నయ్య ససేమిరా అంటున్నాడు. మీరైనా చెప్పండి

వసు : నాయనా, బలభద్ర! నీకు నామీదేనా కోపం? అసలు నాకెందుకు వచ్చిన రాచరికం, రామా, కృష్ణా అనుకొనవలసిన యీ ముసలితనంలో నాకెందుకు అధికారం? లేక లేక మీరు కలిగినందుకు, మా చెర తప్పించినందుకు ఎంతో సంతోషించాను. కొడుకులు ముగ్గురు పెద్దవాళ్ళై ప్రయోజకులై మహారాజ్య సంపాదకులై పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తున్నారంటే మా జన్మలు తరించినవను కొన్నాను. లోకోత్తర పురుషులై మీరిద్దరుండగా శతవృద్ధునైన నాకెందుకు రాజ్యం? మతిలేని వాళ్ళ రాజ్యాధికారం వహిస్తే ఇటువంటి అవకతవకలే జరుగుతాయి. నాయనా, బలభద్ర! నేను తపస్సుకుపోతున్నాను. రాజ్యం మీ యిష్టం. నీ తమ్ముడు, నీవు, ఎలా చేసుకున్నాసరే. సర్వం తెలిసిన వాళ్ళకు నేను చెప్పవలసిన దేమున్నది? నాయనలారా వస్తాను. 85

కృ : అన్నయ్యా, అన్నయ్యా నాన్నగారు పోతున్నారు.

బల : నన్నేమి చేయమంటావు? ఇదివరకు నేను ఆయనకు సింహాసనం ఎక్కించిందీ లేదు. ఇప్పుడు దింపిందీలేదు వెనుకలేని నడమంత్రపు పెత్తనం ఇప్పుడు నాకెక్కడ నుంచివచ్చింది?

కృ : నాన్నగారు రాజ్యం మీకప్పగించారు

బల : ఇందులో నాకేమీ సంబంధంలేదు

(రోజాకుంటూ వచ్చి దారుకుడు)

దారు : కృష్ణా, కృష్ణా కొంప మునుగుతోంది. కొంప మునుగుతోంది. పుర్రెలు రాలి పోతున్నాయి. రక్తం ఏరులై ప్రవహిస్తోంది

కృ : ఏమిటి దారుకా?

దారు : ఇంకేముంది కృష్ణా! యాదవ వార్ష్ణేయు లోకప్రకాణ్క, భోజాంధక సాత్వతు లోకప్రకాణ్క చేరి నరుకుకొంటున్నారు

కృ : ఎందుకు? ఆవిపరీత బుద్ధి ఎందుకు పుట్టింది? ఎవరికి పుట్టింది?

దారు : ద్వారకనుంచి అంతా కల్లుకావళ్ళతో సముద్రపు ఒడ్డుకు చేరి తప్పదాగారు ఆమైకంలో గదసాంబులు సౌప్తిక సంహారాన్ని తడవి కృతవర్మనుఎత్తిపొడిచారు. కృతవర్మ తమ్ముడైన శతధన్వుడునిన్ను, సాత్యకిని సూటీపోటీ మాటలన్నాడు దానితో కడుపుమండి కూర్చుని ఉన్న కృతవర్మను గదసాంబులు నరికివేశారు ఇంకేముంది? అక్కడ ఉన్నవారంతా రెండుపాయలై యుద్ధం చేస్తున్నారు. భోజులు ముమ్మొన పోచలుబట్టి కొడుతూఉంటే యాదవ వార్ష్ణేయులు విలావిలా తన్నుకొని చచ్చిపోతున్నారు. కృష్ణా, కృష్ణా, గదసాంబులు, ప్రద్యుమ్నుడు అంతరించారు. సాత్యకికూడ పడిపోయాడు.

కృ : సాత్యకి చనిపోయాడా? ఇంతకుముందు ఈ ప్రాంతంలోనే ఉన్నాడే!

దారు : ఎప్పుడు వచ్చాడో తెలియదు. సాత్యకిచావు నాకళ్ళారా చూచాను. లాభంలేదు. త్వరగాపోవాలి కృష్ణా.



కృ : అన్నయ్యా ఇక్కడే ఉండు. ఇప్పుడేవస్తాను దారుకా ఎటుపోవాలి?

దారు : ఇటు ఇటు. (సముద్రఘోష మెల్లగా వినిపిస్తుంది)

కృ : ఇక లాభం లేదు. దారుకా నీవు త్వరగా హస్తినకు వెళ్ళి అర్జునునకు యీసంగతంతా చెప్పి తీసుకొనిరా. వారం రోజులకంటే ఈ ద్వారక నిలవదు. సముద్ర గర్భంలో కలిసిపోక తప్పదు. ఆ ప్రమాదం రాకముందే స్త్రీ, బాల, వృద్ధజనాన్ని హస్తినకు తీసుకొని వెళ్ళమని అర్జునుడికి చెప్పు పో. త్వరగా పో.

## మూడు

(సముద్రఘోష పెద్దగా బయలుదేరి క్రమశః సన్నగిల్లుతుంది అందెల రవళి వినిపిస్తుంది)

సత్య : అయ్యయ్యో, ఎంతఘోరం! ఎంతఘోరం! కన్నులముందే ఈ అప్రతిమాన ధనుర్ధరులు, ఈలోకోత్తరులు అంతరించారు ప్రళయరుద్రునికైనా భీరుముద్ర వైచి పంపగలిగిన మహావీరులంతా మ్రగ్గిపోయారు ద్వారక అంతా మహానది ప్రవాహ విప్లవితమైన నిమ్నభూమి అయిపోయింది ఇంకేమి ద్వారక, వట్టిరుద్ర

వాటిక. స్త్రీ బాలబాలికా వృద్ధుల ఆక్రందనంతో ఆకాశం దద్దరిల్లి పోతున్నది కృష్ణా కృష్ణా యీ పుణ్యభూమికి ఎలాంటిగతి పట్టింది! ఆర్తులు అనాధులైన స్త్రీబాల వృద్ధులకు గతి ఎవ్వరు? పుత్రశోక ఘూర్ణితచిత్తుడవై ఒక్కమగపురుగు కూడా మిగలకుండా చేశావా? కృష్ణాకృష్ణా! సర్వాగమవేదివే అంతశ్శత్రువులకు లొంగి ఆత్మీయజాతి సంక్షయానికే విజృంభించావా? చూస్తూచూస్తూ మృత్యు దేవతకు విజయంసమకూర్చావా! మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాను. యాదవ ప్రళయం వస్తుందని శంకించాను. కృష్ణా నీతో చెప్పాను గదా. రాజలోకంతో బొమ్మలాట లాడిన నీకు దీన్ని మార్చడానికి సాధ్యంకాక పోదనుకున్నాను. కాని ఇలా జరగుతుందని అనుకోలేదు. మీ అన్నగారైనా ఉంటే యింత ప్రమాదం జరగకపోయేదేమో? ఏడీ ఆ మహాత్ముడు? నీవూ ఆయనకోసమే యెదుకుతున్నావా? చల్లగా కాలికి తగిలిందేమిటి! అయ్యయ్యో ఎంత అపచారం! బలభద్రులు బలభద్రులు. నిద్రపోతున్నారా? నోటివెంట ఆ నురుగేమిటి? నొసట ఆకాటేమిటి? మహానాగం, మహానాగం, కాటందు కొని పోతున్నది. కృష్ణా కృష్ణా...

(పెద్దగా బయలుదేరిన సముద్రఘోష క్రమశః సన్నగిల్లుతుంది లోకమంతా కరిగిపోయేటట్లుగా కరుణరసం వెల్లవిరిస్తూ కాసేపు మురళిమ్రోగి ఆగిపోతుంది ) 

: రాజుల కిరీటాలతో బంతులాడాను. తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేశాను. ఈ నాటకమంతా ఎందు కాడాను? ఏమి జరిగింది? రసనిష్పత్తియైనా జరిగిందా? ఎవరైనా మిగిలితేగదా చెప్పటానికి? పాపం ఆ అర్జునుడు ఆ కురుక్షేత్రసంగ్రామ ప్రారంభంలోనే మొత్తుకున్నాడు. ఈ మహాకర్మక్షేత్రం శ్మశానవాటిక అయిపోతుందన్నాడు జాతిసాంకర్యం, ధర్మచ్యుతి, కర్మహాని జరుగుతుందని భయపడ్డాడు. అంతా జరిగింది. ఈ యాదవప్రళయం జరుగుతుందని ముందుగానే గ్రహించాను. కాని లాభమేముంది? చేసిన ప్రయత్నాలన్నీ వమ్మైపోయాయి. ఎందుకిలా జరిగింది? ( బర్‌న ధ్వనిచేస్తూ వచ్చి విషదిగ్ధమైన బాణం అంగుష్ఠాన నాటుతుంది.) ఇస్, అబ్బబ్బ ఎక్కడిదీ అమ్మ? ప్రాణాలను తోడేస్తోంది ఎవరదీ, నిషాదుడా? పిరికిపంద పారిపోతున్నాడు. అబ్బా బాధ ... దుర్భరం, దుర్భరం గొంతులో ఇన్ని నీళ్ల పోసేవాళ్ళు కూడా లేరుకదా? ఎంత దిక్కుమాలిన చావు! కళ్ళు తిరిగి

ఇప్పుడు అంగలార్చి ప్రయోజనమేముంది? కేవల అధికారోన్మత్తునకు ఇంత కన్నా ఉత్తమ సత్కారమేముంది? ఇస్

( అందెలరవళి క్రమశః పెద్దదవుతుంది )

సత్య : కృష్ణా! కృష్ణా! పోయావా? అన్యాయం కృష్ణా, ద్వారకానగర అంతఃపురాంగనల గతి ఏమి? నీచాతినీచులైన నిషాదులకు అప్పగించిపోయావా? అలా ఎన్నటికీ వీలులేదు నీవెంటనే వస్తున్నా. ఖడ్గపుత్రా దారి చూపవూ? (పడిపోయిన చప్పుడు.)

## పాత్రలు :

| | |
|---|---|
| వెంకన్న | ప్రవర్ధన్ |
| రాధ | కామేశ్వరరావు |
| ప్రసాద్ | సుబ్బమ్మ |
| జయ | లక్ష్మయ్య |

(ఫ్యాక్టరీలు కూస్తుంటాయి. టవరు గడియారాలు అయిదు గంటలు కొడతాయి. పూలోయి మల్లెపూలు అంటూ కుర్రవాళ్ళ కేకలు వినిపిస్తూంటాయి

ఇంటిముందు ఆవరణస్థలంలో ప్రసాదు డమడమాలబండి యీడ్చుకుంటూ ఉంటాడు. జయ ''రాజరాజుల బండి, రంగు రంగుల బండి, బలే షోకైనబండి'' అని పాడుతూ కాలిఅందెలు ఘల్లుఘల్లు మనిపించుకుంటూ వెంట నడుస్తూ ఉంటుంది మల్లెపూలో అన్న కేక దగ్గరలో వినిపిస్తుంది )

జ : అన్నాయ్, అన్నాయ్! ఇప్పుడే వస్తాను. ఇక్కడ ఉండు

ప్ర : నీకోసం బండి ఆగదు.

జ : ఇప్పుడే వస్తాగా.

ప్ర : అర మినిట్టుకూడా ఆగదు. (బండి గబగబా లాగుతాడు. డమడమా అని త్వరత్వరగా మ్రోగుతుంది.)

జ : (జాలిగా) అన్నాయ్!

ప్ర : (గంభీరంగా) ఆగదు.

జ : కాసేపు ఆపు అన్నాయ్. ఇటుచూడు కాసేపు ఇప్పుడే వస్తాగా. 91

ప్ర : (మొండిగా) ఆగదంటే ఆగదు. అంతే. రాగలిగితే రా. లేకపోతే పో. ఈబండి ఆగనూ ఆగదు, ఒకళ్ళు ఆపితేనూ ఆగదు

జ : (ఊ ఊ అని గునుస్తూ) అయితే అన్నాయ్ కొట్టాడని నాన్నగారితో చెబుతా.

ప్ర : నాన్నగారితో కాకపోతే మంత్రిగారితో చెప్పు. అర్డినెన్సు పెట్టించు ఈబండి ఆగితేనా!

జ : (అంతలోనే నవ్వుతూ) అన్నాయ్, ఒక మంచిమాట చెబుతా

ప్ర : నీ దొంగ వేషాలు ఎవరికి తెలియవులే. బండిమాత్రం ఆగదు (బండి బడబడా యీడుస్తాడు)

జ : ఆపకపోతే ఆపకపోయావులే. ఈమాటవిను. నువ్వు ఇక్కడేవుంటే నేనుపోయి.

ప్ర : ఎక్కడికి?

జ : అమ్మదగ్గరికి. అమ్మ నాకు మల్లెపూలు కొనిపెడతానన్నది అందులో సగం గుచ్చి బండికి చుడదాం. అప్పుడు ఎంత చక్కగా ఉంటుంది!

ప్ర : అయితే పో, తొందరగా పో.

జ : ఇక్కడే వుంటావుగా?

ప్ర : (నవ్వుతూ) ఆ. .. ఆ.

జ : నిజమేనా? అమ్మ, దొంగనవ్వు నవ్వుతున్నావ్ నిన్ను నమ్మగూడదు.

ప్ర : నవ్వటంలేదు, గివ్వటంలేదు తొందరగా పో. అమ్మే మంచి మల్లెపూలదండలు, ఎర్రని మల్లెపూలదండలు, కొత్త ఉరదాడుతో గుచ్చి ఒళ్ళంతా వేస్తుంది తొందరగా పో.

జ : అమ్మ నన్ను కొడుతుందీ!

ప్ర : ఎవరు కొడుతుందన్నారు? ఒంటినిండా ఎర్రమల్లెపూలదండలు వేస్తుందన్నాను. (బండి మళ్ళీ గబగబా యీడుస్తుంటాడు.)

జ : అరే అన్నాయ్ అమ్మ నిజంగా నన్ను కొడుతుందీ?

ప్ర : అబ్బే లేదు గారాల కూచివికాదూ! అందుకని బుగ్గలు సాగదీసి బూరెలు వండుతుంది.

జ : ( ఏడుస్తూ) ఊ ... ఊ అయితే యీ బండిని....

ప్ర : తొక్కితేనా? ఎందుకు చెప్పటం.

 జ : ఒక అమ్మాయి వీపు విమానం మోత మోగుతుంది. అంతేనా?

ప్ర : ఆ అమ్మాయికి అన్నీ తెలుసునన్నమాట. (బండి యీడుస్తూ) రాజరాజా బండి రంగు రంగులబండి.

జ : బలే షోకైనబండి (ఒక్కసారి ఎడమకాలితో బండిని ఒక్కతొక్కు తొక్కుతుంది. బండి ఫెళఫెళలు అందె ఘణఘణలలో కలిసిపోతాయి. జయ అందెల చప్పుడు, ప్రసాద్ కాలి సవ్వడి వారిద్దరి పరుగును సూచిస్తుంటాయి. రెండు సెకండ్లలో చప్పున వీపుమీద చరచిన చప్పుడు వినిపిస్తుంది. జయ ఏడుస్తుంటుంది.)

ప్ర : అలాగే కావాలి నా బండిని తొక్కేస్తే ఊరుకుంటానాయేమిటి? (జయ ఏడుపు స్థాయి పెరుగుతుంది) ఇంకేమి బండి? ఇంకేమి బండి? దీని ఎదాన పెట్టుకుంది (మళ్ళీ జయ వీపున ఒకటి చరుస్తాడు. తానుకూడా పెద్దపెట్టున ఏడుస్తుంటాడు )

ఇంట్లోనుంచి గొంతు : జయా. జయ! ఒరేప్రసాద్. ప్రసాద్ (పిల్లలిద్దరూవినిపించుకోరు.) అబ్బబ్బ. ఇల్లెగిరి పోతూవుంది కాసేపు ప్రశాంతంగా కూచోటానికి నోచుకోలేదు కదా! అమ్మా జయా ఇలారా. (జవాబువుండదు) నీకేనే చెప్పేది. వాణ్ని

తంతానులే నువ్విటురా ( జయ ఏడుపు తగ్గుతుంది. ప్రసాద్ ఇంకా పెద్దగా ఏడుస్తూ వుంటాడు )

బజారులోనుంచి గొంతు వెంకన్నగారూ, వెంకన్నగారూ. అరే అబ్బాయి మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?

జ · అన్నాయ్, నిన్నేరా పిల్చేది, ఏదో అడుగుతున్నారు చెప్పవేం?

ప్ర కావాలిస్తే నువ్వే చెప్పుకో

జ : నాన్నగారికి చెబితే ఎవరు చెప్పుకుంటారో తెలుస్తుంది

ప్ర : ఇంకా నాసంగతి తెలీదు కామాలు; ఈసారి నాజోలికివస్తే ముక్కెలిరగదంతాను.

బ గొం. వెంకన్నగారూ, వెంకన్నగారూ.

వెం . (పెద్దగా) ఒరే ప్రసాద్ బజార్లోనుంచి ఎవరో పిలుస్తున్నారు చూడు. నిన్నేరా! వాళ్ళని లోపలికి పిల్చుకురా. (ప్రసాద్ నుంచి ఆతీపతీ లేదు. ముందుకు నడచివస్తున్నప్పుడు) ఎవరదీ?

బ.గొం: వెంకన్నగారు ఇంట్లో ఉన్నారా?

వెం : కామేశ్వరరావుగారా .. రండి రండి ఈ పిల్లల రణగొణ ధ్వనిలో అసలు వినిపిస్తేనా? ఎంతసేపటినుంచి పిలుస్తున్నారేం? 93

కా : ఇప్పుడే మీ కుర్రవాణ్ణి అడుగుతున్నాను.

వెం : ఇంట్లోకి పదండి. అరే ప్రసాద్ నిన్ను అమ్మ యింట్లో పిలుస్తోంది.

జ : నాన్నగారు, నాన్నగారు. అన్నాయ్ మరిగత్తే అన్నాయి..

ప్ర · నా సంగతి తెలుసుగా.

జ . నాన్నగారు, నాన్నగారు! ఇవ్వాళ అన్నాయ్ బళ్ళోకి పోలేదు పరిగదా, ఆడపిల్లనుచేసి నన్ను కొడుతున్నాడు నాన్నగారూ వీడికింకా ఎప్పుడు జ్ఞానం వస్తుంది చెప్పండి?

ప్ర అన్నీ అబద్ధాలే నాన్నగారూ.

జ : అబద్ధాలా? మరి నేనెందుకేడ్చాను?

ప్ర · ఆ సంగతి నీకే తెలియాలి.

వెం : గోలచెయ్యకండి పొండి పెద్దమనుష్యుల ముందు అలా గోలచేస్తే బాగుంటుందీ? తప్పు రాధా, రాధా! వీళ్ళని తీసికెళ్ళు (లోపలనుంచి స్త్రీ కంఠం ప్రసాద్ అని పిలుస్తుంది)

జ : అరే అన్నాయ్, అమ్మ పిలుస్తోందిరా. నువ్వుపో

(లోపలి నుంచి మళ్ళీ జయా అని పిలుపు)

ప్ర : అమ్మ నిన్నుకూడా రమ్మంటోంది.

జ : అన్నాయ్ ఇంతకు ముందేడ్చింది అబద్ధం.

వెం : కొట్టదులే పొండి తొందరగా పొండి!

ప్ర : జయా నీకళ్ళు నువ్వుతుడుముకో, నాకళ్ళు నేను తుడుచుకుంటాను. జరిగిందేదో జరిగిపోయింది. నామీద నువ్వుగాని, నీమీద నేనుగాని అమ్మతో చాడీలు చెప్పవద్దు. సరేనా?

జ : నిజమే అన్నాయ్. నవ్వుకొంటూపోతే అమ్మ ఏమీఅనదు. అమ్మకేగాదు. నవ్వుతూ పేలుతూ ఉంటే పిల్లల్ని కొట్టటానికి ఎవరికీ చేతులురావు. పద. ఎంతెంతదూరం? ఎంతెంతదూరం? చెప్పు.....

ప్ర : కోసెడు కోసెడు దూరం.

జ : ఎంతెంత దూరం?

ప్ర : కోసెడు కోసెడు దూరం కూ... ధన్ ధన్ (రైలు ధ్వనిని అనుకరిస్తూ ఇద్దరూ లోపలికి వెళ్ళిపోతారు.)

వెం : ఈ వరండాలో నిల్చున్నారేం?

కా : ఇక్కడ చల్లగాలి వీస్తున్నది.

వెం : అలా నిలబడి ఉన్నారేం. ఆ కుర్చీలో కూర్చోండి.

కా : చాలావని ఉంది. తొందరగా పోవాలి. ఈ ఒక్కముక్కచెప్పేసి వెళ్ళుదామని వచ్చాను. (కుర్చీలోకూలబడుతూ) తెల్లవారు జామున మూడింటికి లేచి తిరిగినవాణ్ని తిరిగినట్లుగానే ఉన్నాను. నాలుగు నిమిషాలు కూర్చుందామన్నా తీరకవచ్చింది?

వెం : అసలు భోజనం చేశారా? ముఖంచూస్తే వాడి ఉంది అరే ప్రసాద్.

కా : ఇప్పుడేం భోజనంలెండి, రాత్రికిచేస్తాను.

వెం : ప్రసాద్ .. ప్రసాద్ అమ్మతో చెప్పి రెండుకప్పులు కాఫీ తీసుకురా.

(లోపలినుంచి ప్రసాద్... తెస్తున్నా నాన్నగారూ)

కా : ఇంతకు ముందే తీసుకున్నది

వెం : కాఫీయేకదా

కా : నేను తొందరగా పోవాలి అన్నట్లు నేను ఎందుకువచ్చాను? నానాటికీ నాకు మతికూడా పోతోంది. ఆఁ ఆఁ అసలు సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది కామ్రేడ్ ప్రవర్ధన్ వస్తున్నాడు

వెం : ఎవరు? కామ్రేడ్ ప్రవర్ధనా? ఎవరబ్బా, పేరు చాలాసార్లు విన్నట్లుంది?

కా : ఆ కామ్రేడునే ఎరగరా! విచిత్రంగా ఉంది ఆ మహావిప్లవకారుణ్ని ఆ మహా వీరుణ్ని యెరుగక పోవడమేమిటి? బ్రిటిష్ సామ్రాజ్యాన్ని మూడు చెరువుల నీళ్లు త్రాగించాడు. మెక్సికోలో విప్లవధ్వజం నెలకొల్పివచ్చాడు రష్యావిప్లవంలో లెనిన్ స్టాలిన్‌లకు కుడి భుజంగా పనిచేశాడు . జర్మనీలో నాజీలపై కత్తికట్టి హోరాహోరిగా పోరాడాడు అయిదుసంవత్సరాలు కాన్‌సెంట్రేషనుకాంపులో నరక యాతనకులోనై తుదకు ఒకచేయి ఒకకన్ను కోల్పోయి బయటపడ్డాడు పీడిత ప్రజానీక సముద్ధరణకోసం తన మాతృదేశంలో తిరిగిఅడుగుపెట్టాడు. అతని చూపులంతా పీడిత ప్రజానీకం మీదనే. తలపంతా శ్రామికవర్గ సముద్ధరణం మీదనే. ఆ ప్రతిభ, ఆ కార్యశూరత్వం, ఆగతితార్కిక భౌతికవాద కోవిదత్వం, ఆ త్యాగం, అనన్యాలు అన్నీ తెలిసిన మీకు నేను చెప్పడం దేనికి? 

వెం : ఆ కామ్రేడ్! వస్తున్నాడా?

కా : అవును, రోజూ చెబుదామనుకుంటూనే మరచిపోతున్నా. సాయంకాలం వస్తున్నాడు. మీరునన్ను క్షమించాలి.

వెం : ఎందుకు?

కా : కొన్ని కారణాలవల్ల వారికి వసతి యిక్కడ చేయాలని నిర్ణయమైపోయింది.

వెం : ఇక్కడనా! శిధిలావస్థలోవున్న యీ ఇంట్లో ఆ ప్రవర్ధన్ వంటి మహానాయకునికి విడిదా?

కా : అవును మీతో చెప్పటానికికూడా అవకాశం లేకపోయింది. స్థితిగతులు అలా వచ్చాయి. వాస్తవిక వాది వాటిని తెలుసుకుని ఆవశ్యకతను గుర్తించి మరి నడుచుకోవాలి. అప్పుడు స్వాతంత్ర్యం లభిస్తుంది. విప్లవంకోసం పాటుపడే మీరు ఇందుకు కాదంటారా? అది అలాఉంచి కామ్రేడ్‌ప్రవర్ధన్ చాలా నిరాడంబర జీవి. వ్యక్తిగతంగా అతనికి కావలసినవికూడా చాలా స్వల్పం సిగరెట్లు, కాఫీలు ఏర్పాట్లు సరిగా చేశారా లేదా అనికూడా చూడడు. అతనికి కావలసింది ఒకటే– విప్లవం, శ్రామిక నియంతృత్వం, ప్రజల అభ్యుదయం.

వెం . అంతటి మహానాయకునికి ఈ జీర్ణగృహంలో విడిది చేయించటం బాగుంటుందా అని ఆలోచిస్తున్నాను అంతకు తప్ప మరేంలేదు

కా : విచారం అనవసరం ఆ కామ్రేడ్ ఇంకొక పావుగంటలోనో అరగంటలోనో నేరుగా ఇక్కడికే వస్తాడు ఇదిగో ఈ ఫొటో ఒకసారి చూడండి. ఇదిచూస్తే మీరు వెంటనే గుర్తు పట్టవచ్చు

వెం : మీరు వుండరా ఏమిటి?

కా : ఎందుకు జంకుతారు?

వెం : కాస్త ఎరిగిన వాళ్లుంటే బాగుంటుందిగా.

కా : ఏం ఫరవాలేదు. అంత జంకు గొంకులుంటే విప్లవాలు ఎలా నిర్వాహక మౌతాయి. నేనింకా యీ వార్తకొంత మంది కామ్రేడ్లతో చెప్పి తీసుకువస్తాను. అందువల్ల కాస్త ముందూ వెనకా కావచ్చునన్న ఉద్దేశ్యంతో మీకుచెబుతున్నాను ఈసంగతే ఆ కామ్రేడ్ అడిగితే చెప్పండి. వస్తా.

వెం : కాఫీ తాగకుండానే వెళ్ళుతారా? ప్రసాద్ (లోపలికి వినబడేటట్టు పెద్దగా కేకవేస్తాడు )



కా : కాఫీ కేమిలెండి. మళ్ళీవస్తాగా (గబగబ పోబోతాడు.)

ప్ర : నాన్నగారూ, నాన్నగారూ కాఫీ వస్తూవుంది

వెం : ఇప్పుడు దేనికిరా? నెత్తిమీద పోసుకోనా!

ప్ర : కాదు. నోట్లో నాన్నగారూ!

రా : (తలుపు తెఱచుకొని ప్రవేశిస్తూ) పసివాణ్ణి కోప్పడుతారు దేనికి?

వెం : వాణ్ని కోప్పడాలి. లేదా నన్ను కోప్పడుకోవాలి, అంతే గాని రాణీగారిని కోప్పడడమే?

రా : (నవ్వుతూ) కోప్పడితే ఏమౌతుంది?

వెం : ఏమౌతుంది! ఇంట్లోతపేళాలూ, చెంబులూ, పిల్లలవీపులూ సరిగ్గాఉంటాయా?

రా : చాల్లెండి ఎవరన్నా వింటే నిజమనుకుంటారు!

వెం : అవును ఈ రోజుల్లో నిజము నిజమనుకోగూడదులే

రా . యీ బుద్ధి మొదటినుంచీ ఉందేకదా! ఇవాళ కొత్తగా అనుకోవటం దేనికి?

వెం : మరి కాఫీ తెమ్మంటే ఇప్పుడా తెచ్చేది?

రా  ఇంట్లో పాలుండనక్కర లేదా?

వెం . లేకేమయా ్యయి?

రా : నేనే తాగేవేశాను

వెం : ఆమాట అనలేదే

రా : కాకపోతే మీ ఉద్దేశం ఏమిటి? నిన్ననేకదా పాలవాడు క్రిందటి నెలకు డబ్బులు ఇవ్వలేదని పాలుపొయ్యటం మానివేశాడని చెప్పింది?

వెం . మరచిపోయ్యాను ఇవ్వాళ రాత్రికెలా? పైగా అతిధులు కూడా వస్తున్నారు?

రా : తాను దూర సందులేదు, మెడకో డోలుకూడానా?

వెం : తప్పనిసరి అయినప్పుడు మరేం చెయ్యాలి? (బ్రతిమాలుతూ) ఎలా గయినా రాత్రికి మర్యాద దక్కించుకోవాలి.

రా : ఈ కాస్త కాఫీ ఫ్లాస్కులోపోసి అట్టిపెడతాను. ఎలాగో సర్దుకోండి కాస్త రవ్వవుంది టిఫెన్ చేస్తాను. భోజనాలంటారా! రేషనింగ్ ఉన్నదని అందరికీ తెలిసిందేగా. హోటల్‌కి దయచేస్తారు. ఇంతకూ వచ్చే అంతలావు పెద్దమనిషి ఎవరు?



వెం : చెపితే మాత్రం నీకేమి తెలుస్తుంది?

రా : ఆ ఫొటోలో కనిపించే సన్న మనిషేకదూ?

వెం : అంత ఎగతాళిగా వుంది?

రా : (నవ్వుతూ) చాలా సన్నగా ఉంటేను అంటున్నాను.

వెం . అతడు ఎవరుకున్నావో? కామ్రేడ్ ప్రవర్ధన్. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఉగ్రూత లూపాడు. జర్మన్ గెస్టాపోను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించాడు శరీరమెంత స్థూలమో బుద్ధి అంత నిశితం; హృదయం అంత ఉదాత్తం.

రా : సరే బాగానే ఉంది. కాని.....

వెం : ఏమిటీ నీ సందేహం?

రా : నవ్వకుండావుంటే చెబుతాను.

వెం : ఆరే ప్రసాద్!

రా : వాడు దేనికీ?

వెం : ఏముందిలే.

ప్ర . ఎందుకు నాన్నగారూ!

వెం : నువ్వు డబ్బులు పట్టుకుపోయి రెండు సిగరెట్టుపెట్టెలు పట్టుకురా.

ప్ర : ఢమఢమాలు బండికూడా ఒకటి తెచ్చుకుంటా నాన్నగారూ?

రా నిన్ననేగదా కొనిపెట్టింది?

ప్ర · చెల్లాయి తొక్కేసిందమ్మా

రా . రోజుకొక బండా! చేసేది కాపురంకాదూ?

వెం : సరే నువ్వుపోయి తొందరగారావాలి. బండిలాక్కొంటూ అక్కడే ఆడుకునేవు .(ప్రసాద్ వెళ్ళుతుంటాడు) వచ్చే బస్సులూ పోయే బస్సులూ, జాగ్రత్తనాన్నా! (ప్రసాదు గొంతు దూరాన్నుంచి వినిపిస్తుంది ) నేను పసిపిల్లవాణ్ణికాదులే

వెం · ఏమిటి అంటున్నావు?

రా : ఏమీ బాగుండలేదు

వెం : ఏది బాగుండలేదు.



రా : మన వ్యవహారమే.

వెం · అంతేగదా? ఇంకా ఏం మునిగిందో అనుకుంటున్నా

రా : మీకు అలాగే ఉంటుంది.

వెం : నిండా మునిగిం తరువాత చలేమిటి?

రా : అదికాదండీ, మనకు రోజులు ఏమాత్రం బాగున్నట్లు కనిపించడంలేదు మీ ఉద్యోగమా ఊడి పోయింది. పైగా యీ పార్టీలనీ పాడనీ నెత్తిన వేసుకుంటున్నారు మనకూ అందరిలాగా వుంటే ఎన్ని వేషాలైనా వెయ్యవచ్చు

వెం . కడుపునిండిన వాళ్ళకు పార్టీలుదేనికీ?

రా ఉబుసు పోవడానికి

వెం అలాగా?

రా · అది కాదండి ఈ మధ్యనేగదా ప్రజారక్షణ శాసనం చేసింది కొంపతీసి పార్టీలవాళ్ళకి ఆశ్రయం యిచ్చారని అరెస్టుచేస్తారేమోనని భయంగా ఉంది అసలే రోజులు బాగుండలేదు

వెం అరెస్టుచేస్తారా?

రా చేస్తే ఏమిచేస్తాయి?

---

జి వి కృష్ణారావు

వెం : నా యింట్లో నా ఆప్తులకు, నా మిత్రులకూ ఆతిధ్యం ఇయ్యటం తప్పా? నేను దాయటం లేదు మిత్రమాత్రులుగా సత్కరిస్తున్నాను నా యింట్లో నా ఖర్చుతో అలాంటి ఆతిధ్య మిచ్చుకోవడానికీ కూడా అధికారం లేదా?

రా : లేదు దేశద్రోహులకు ఆశ్రయం ఇచ్చేవాళ్ళు దేశద్రోహులే.

వెం : దేశద్రోహులని నిర్ణయించేదెవరు?

రా : నేను. కాదంటారా?

వెం : నిన్ను నన్ను మించిన ప్రామాణ్యంలేకపోతే, బయట వుండేకన్నా జైలులో ఉండడం మేలుకాదా?

రా : (నిట్టూరుస్తూ) అంతేనా?

వెం : అంతకాక మరేముంది?

రా · అయితే ఈ రెక్కలురాని పిల్లలూ?

వెం : ఆ సంగతి ఇదివరకు ఆలోచించలేదు. ఇప్పుడు ఆలోచించనూ లేను.

రా అంతేనా?

ప్ర (వగర్చుకుంటూవచ్చి) నాన్నగారు, నాన్నగారు! 99

వెం ఏమిటినాన్నా? అలా రొప్పుతున్నావేం?

ప్ర : బస్సులన్నీ బందునాన్నగారు. ఇవాళ స్ట్రైకట.

వెం · ఎందుకో?

ప్ర · వాళ్ల నాయకుల్ని అరెస్టు చేశారట.

వెం అలాగా!

ప్ర ఒకటి తిరుగుతుంటే, సమ్మెచేసినవాళ్ళు రాళ్ళుగిరాటు పెట్టి వాటిని బద్దలు చేస్తున్నారు పోలీసువాళ్ళు చూస్తునే ఊరుకుంటున్నారు.

వెం · నిజమే!

ప్ర · నిజమే నాన్నగారూ, నేను కళ్ళారా చూశాను. ఎవడో కండక్టరట ఇంతలావు రాయి పుచ్చుకుని ఫెడేలున బస్సు కిటికీ అద్దానికేసి కొట్టి పారిపోయాడు లోనకూర్చున్న అయిదేళ్ళ అమ్మాయిముఖం బద్దలయింది హాస్పిటల్‌కి కూడ తీసికెళ్ళారు.

రా అయ్యో! పాపం వాళ్ళకు ఏం పోయేరోగమొచ్చింది సమ్మెచేసేవాళ్ళు మెదల కుండా చేసుకోరాదా?

ప్ర : నిజమేనమ్మా ఆబస్సు ఎందుకూ పనికిరాకుండాపోయింది అలా పాడుచేస్తే వాళ్ళు కేమివస్తుందో!

వెం : నాన్నా, జయ ఎక్కడుందిరా?

ప్ర : నేను వెళ్ళేటప్పుడు ఇంట్లో ఉందిగా. జయా. జయా. నిన్నేనే జయా ఈ కంఠశోషదేనికీ నాగస్వరం పడితేచాలు పుట్టలోపాము బయటికి వచ్చి ఆడుతుంది (డమడమాల బండి యీడుస్తువుంటాడు )

జ : (లోపలనుంచి) అన్నాయ్, అన్నాయ్!

ప్ర : ఎక్కడికో పోయిందంటిరేనాన్నగారు తూతూ మంత్రం తుమ్మాకు మంత్రం ఫో – ఫో – (బండి కనబడకుండా బల్లక్రిందికి తోస్తాడు )

జ : అన్నాయ్, అన్నాయ్! డమడమాల బండేదీ?

ప్ర : డమడమాలబండా? ఎక్కడ, ఏది? పిచ్చిపిల్ల కలగంటూ వుంది

జ : అవున్మదొంగా! ఇంతకువుందేగా ఈడుస్తున్నది! ఇందాకటి బండి బాగుచేశావా?

ప్ర : నువ్వు ఇరగదొక్కిపోతే మరేమిచెయ్యను? ఎముకలిరిగిపోయేటట్లు ఇంతసేపు కూర్చుని బాగుచేశాను

రా : మళ్ళా మెదలు పెట్టారూ గోల?

( ఆడగొంతు బజారులో నుంచి). వెంకన్న బాబుగారూ వెంకన్న బాబుగారూ

రా : (ప్రసాదు డమడమాలబండి ఈడుస్తూ ఉంటాడు ) అబ్బబ్బ ఏమిరొద? తల బ్రద్దలై పోతూ వుంది కాసేపు ఆగండర్రా ఎవరో పిలుస్తున్నట్లున్నారు. (ఇద్దరూ కుక్కిన పేలై ఊరుకుంటారు) ఎవరదీ?

ఆ.గొం: వెంకన్న బాబుగారిల్లిదేనా?

రా : ఆఁ

ఆ గొం: బాబుగారున్నారా? (లోపలికి వస్తున్నగొంతు)

రా : ఉన్నారు లోపలికి రండి.

వెం : ఎవరది?

ఆ.గొం: నన్ను సుబ్బమ్మ అంటారు ఫ్యాక్టరీలో పని చేస్తుంటాను

వెం : ఏం పనిమీద వచ్చారు.

సు . మీరు కామేశ్వరరావు గారిని ఎరుగుదురా?

వెం · కాస్త పరిచయం ఉన్నది దేనికి?

సు · మీరు కాస్త వారితో చెబితే నాకు ప్రాణభిక్ష పెట్టిన వాళ్ళవుతారు. బ్రతికి ఉన్నన్నాళ్ళు చెప్పుకుంటాను

వెం : ఆయన చాలామంచివాడే! కార్మికుల కోసమని కంకణం గట్టుకొని పని చేస్తున్నాడు. ఆయనకు కార్మికులవిషయంలో ఒకరు చెప్పనవసరం లేదు. ఒకసారి ఆయనను చూడండి.

సు : చూచాను. ఏం ప్రయోజనం?

వెం : విచిత్రంగా వుందే!

సు : నాబ్రతుకే విచిత్రం!

వెం : వీలు లేదన్నాడా? అంటే మాత్రం నావల్లకూడా ప్రయోజనం లేదు

సు : నాకథవింటే మీవంటి వాళ్ల అలా అనరు.

రా : ఏమి జరిగింది?

సు : ఏమిచెప్పను? చెప్పుకుంటే మానంపోయే చెప్పుకోకపోతే ప్రాణం పోయే (మెల్లగా ఏడుస్తుంది). 101

వెం : ఏడవకమ్మా ఏడవకు, ఏమిజరిగిందేమిటి?

రా : చెప్పమ్మా చెప్పు.

సు : (గద్గదకంఠంతో) లక్ష్మీమిల్లులో పనిచేస్తూవుంటాను ఆ మిల్లు మేనేజరు వట్టి పాపిష్టి. ఆ పాపిష్టికళ్ళు నామీద పడ్డాయి. ఒకటి రెండుసార్లు గట్టిగా చివాట్లు వేశాను. నేను మిల్లులో ఆనాడు కటింగ్ మిషన్ వద్ద పనిచేస్తున్నాను. ఎడం ప్రక్కగావచ్చి మెడమీద ముద్దుపెట్టుకున్నాడు. ఆకోపంలోనూ తత్తరలోనూ కుడిచేయిని మిషనులో ఉంచి వూనికచేసుకొని ఎడమచేతితో ఒక్కచెంప పెట్టుపెట్టాను. ఇంతలోనే మిషను కత్తివచ్చి మోచేతివరకు తెగనరికింది. తరువాత నన్ను హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు.

వెం, రా . ఎంతపని జరిగింది! ఎంతపని జరిగింది! దుర్మార్గుడు నిలువునా చీల్చినా పాపంలేదు

సు · తరువాత మాఅన్న లక్ష్మయ్య యీ సంగతంతా కామేశ్వరరావు గారికిచెప్పాడు

వెం : చెబితే ఆయనేం చేశాడు?

రా : అధికారంలో వున్న వాళ్ళని ఏం చేస్తారు? ఏం చేయగలరు?

సు : వారు అదంతా పత్రికకువ్రాసి పంపించారు అదంతా అచ్చయింది

వెం,రా : మంచిపనిచేశాడు.

సు : మీరు అట్లాగే అంటున్నారా? అయ్యో భగవంతుడా! మీ లాంటి ధర్మప్రభువుల నోటినుంచికూడా ఆ వాక్కే రావాలా?

వెం : అలా అంటావేమమ్మా?

సు : (ముక్కు చీదుకుంటూ) ఇంకా ఏమిచెప్పను? ఎవరితో మొత్తుకోను? మొత్తుకున్నా ప్రయోజనం ఏముంటుంది?

రా : ఇంకా ఏమన్నా జరిగిందా ఏమిటి? చెప్పకపోతే యెలా తెలుస్తుంది?

సు . ఇంకా ఏమిజరగాలమ్మా నా బ్రతుక్కి ఇదిచాలదూ? చాకిరిచేసుకుని బ్రతకడానికికూడ గతిలేని అవిటిదాన్ని అయితిని ఇంత రభస అయింతరువాత యెవరు పెళ్ళి చేసుకుంటారు? అందులో చెయ్యిలేనిదాన్ని?

102 రా : నిజమే పాపం. ఇంత జరిగినాక యీావిడ బ్రతుకెలా తెల్లారాలి?

సు : ఆ మారాజులు కాస్త సహాయము చేస్తామంటున్నారు.

వెం : యే మహారాజులు? (ప్రసాద్ డమడమాల బండి యీాడుస్తాడు) అబ్బబ్బ చెప్పేది వినిపించుకోనీ రేమిరా? పొండి, బయటికి పొండి. వాకిట్లోకిపోయి ఆడుకోండి. యెవరన్నావు?

సు : మిల్లు ఆసాములు.

వెం : సహాయము చేస్తామన్నారా?

సు : అవును ఆ నిండు జీతంతోనే మరొకపని ఇస్తామన్నారు మిల్లు ఫోర్మెన్ కూడా అవిటిదాన్ని నన్ను చేసుకోడానికి వప్పుకున్నాడు నా చెయ్యి పోకముందే మేము పెండ్లి చేసుకుందామనుకున్నాము.

రా : ఇంకా ఏం. బాగావుంది అంతకన్నా ఎవరయినా ఎం చేస్తారు?

వెం . అలాంటప్పుడు నీ అభ్యంతరం ఏమిటి?

సు . అభ్యంతరం వుంటే నేను మీ దగ్గరకు వచ్చేదాన్ని కాదు గదా?

వెం ఇంకా చిక్కేమిటి?

సు : పత్రికలు ఇంతకుముందు ప్రకటించినకథ అబద్దం. అనుకోకుండా చెయ్యి తెగిందని ప్రకటించాలని కోరుతున్నారు.

రా : అలా ప్రకటించడానికి అభ్యంతరం ఏమిటి?

వెం : మీరు కామేశ్వరరావుగారితో చెప్పలేదా?

సు : చెప్పాను.

వెం : ఏమన్నారు?

సు : వీల్లేదన్నారు. మీరయినా చెప్పి వినిపిస్తారన్న ఆశతో వచ్చాను.

వెం : యెందుకు వీల్లేదట?

సు : అంతపనిచేసి అదంతా అబద్ధమనండి అంటే యెలా వీలవుతుంది? అలాచేయట మంటే దోపిడీదార్లతో రాజీపడటం. ఆవరించుకొని వస్తున్న పవిత్ర విప్లవజ్యోతికే మహాద్రోహం – అనీ ఇంకా ఏమేమో అన్నారు.

వెం : (గంభీరంగా) అలాగా!

సు : (ఆందోళనగా) బాబూగారూ! మీరుకూడా అలాగే అనుకుంటున్నారా? ఈ దిక్కులేని ఆడది పండ పంచ లేక మింగ మెతుకులేక అలమటించాలిసిందేనా బాబుగారూ? నేనేం తప్పుచేశాను బాబుగారూ? నేనేం తప్పుచేశాను? 103

జ : నాన్నగారు, నాన్నగారూ! యెవరో ఇంతలావుమనిషి (బుగ్గలుబ్బించి రెండు చేతులతో లావును సూచిస్తూన్నది) వచ్చాడు. కామేశ్వరరావుగారు, కామేశ్వర రావుగారు అని పిలుస్తున్నాడు. నేను లేరని చెప్పాను. అన్నాయి మీకోసంనన్ను పంపించి ఏదో మాట్లాడుతూ ఉన్నాడు.

వెం : వారిని ఉండమని చెప్పు. పో, తొందరగా పో జయా. నేను వస్తున్నా.

సు : బాబుగారూ నాసంగతి ఏం చేస్తున్నారు?

వెం : ఇంకా కాసేపటికి నలుగురూ ఇక్కడికే వస్తారు అప్పుడు మాట్లాడుదాములే!

(తలుపు తెరచుకొని ఇద్దరూ వెళ్లుతున్న చప్పుడు)

జయగొంతు కొంచెం దూరంగా వినిపిస్తుంది అన్నాయ్! వారిని ఉండమను. నాన్నగారు వస్తున్నారు.

వెం : రాధా, రాధా!

రా : (తలుపు తెరచుకునివచ్చి) పిలిచారా?

వెం : కామ్రేడ్ వచ్చాడు ఇప్పుడు టిఫిన్ వంపించలేవుగా?

రా : ఒక పావుగంటన్నా వ్యవధి లేకపోతే యేమిచెయ్యను?

వెం : సరే కాఫీ చాలులే పంపించు

ప్రవర్ధన్: కామేశ్వరరావుగారు ఉన్నారా?

వెం : ప్రవర్ధన్‌గారా! నమస్కారం, దయచెయ్యండి, దయచేయండి. ఆ కుర్చీలో కూర్చోండి.

ప్రవ : మీరు నన్నెలా యెరుగుదురు?

వెం : మీవంటి ప్రఖ్యాతనాయకుల్ని యెరక్కపోవడమేమిటి?

ప్రవ : నేను వస్తున్నాని మీకెలా తెలుసు?

వెం : కామేశ్వరరావుగారు చెప్పారు. ఇంకా కామ్రేడ్నును తీసుకువస్తారట. మిమ్మల్ని యిక్కడే ఉండవలసిందని చెప్పిపోయారు

ప్రవ : అబ్బబ్బ అనుకున్నపని అనుకున్నట్టు జరగదుగదా!

వెం · వారు యిప్పుడే వస్తారు. కాస్త విశ్రాంతి తీసుకోండి. యెంతో దూరంనుంచి నిద్రాహారాలు లేకుండా వచ్చి ఉండాలి.



ప్రవ : స్థితిగతులు మనకోసం కనిపెట్టుకు కూర్చోవు ఈ కామ్రేడ్ యెప్పుడూ యింతే. యిలాంటి వాళ్లు పార్టీలో ఉండబట్టే యిలా గొంతు మీదికివచ్చి కూర్చుంటున్నయ్. ఆ కామ్రేడ్ వచ్చిందాకా చేతులు ముడుచుకు కూర్చోవా లన్నమాట అంత చేతకాని వాళ్లు రంగంలోనికి దిగటం దేనికి? పనిచేసే వాళ్ళకు కూడా అడ్డం రావటందేనికి?

వెం : జయా, జయా! కాఫీ పట్టుకురామ్మా.

జ : యిదిగో తెచ్చాను నాన్నగారూ!

ప్రవ : క్షమించాలి వస్తూవస్తూ ఇంతకుముందే కడుపునిండా టిఫిన్, కాఫీ తీసుకు వచ్చాను.

వెం : వట్టి కాఫీయేకదా?

ప్రవ : యేమీ అనుకోకండి. ఇక తీసుకునే ఓపికకూడాలేదు

వెం : వొరే ప్రసాద్, ప్రసాద్! సిగరెట్టు పెట్టెయేది?

ప్ర . (ప్రవేశించి) ఇదుగోనాన్నగారు ఇందాక ఇద్దామని మరచిజేబులో వేసుకొని వెళ్ళాను

వెం : ఆ పెట్టెలు వారిముందు టేబిల్‌మీదపెట్టి పోయి, నీవు చెల్లాయి తలవాకిట్లో ఆడుకొండి. బయటికి పోయేరు!

ప్ర : (వెళ్ళిపోతూ) పోములే నాన్నగారూ.

వెం : కామేశ్వరరావుగారు కనిపిస్తే వెంటనేరమ్మనిచెప్పు ఆటల్లోపడి మరచిపోతావా?

ప్ర : (దూరంనుంచి) అలాగే

వెం : కాఫీ త్రాగకపోయారు, సిగరెట్టయినా తీసుకోండి.

ప్రవ : క్షమించాలి. అలాంటి ఖరీదయిన సిగరెట్లు నేను తాగను. నాబ్రాండ్ వేరు. మారిస్తే దగ్గువస్తుంది మరేమి అనుకోకండి (అటూఇటూ చీకాకుతో పచారు చేస్తూ గడియారం తీసిచూసి) అప్పుడే 5–45 అయింది. ఇంకా యెప్పటికి వచ్చేది? యెన్నితడవలు చెప్పినా ప్రయోజనం లేకపోతున్నది. ఇంతకన్న మరినాకు పనిలేదు కామాలు!

(ప్రసాద్ డమడమాలబండి ఈడ్చుకొంటూ ప్రవేశించి) నాన్నగారు, నాన్నగారు! కామేశ్వరరావుగారు వస్తున్నారు. ప్రక్కన యెవరో మనిషికూడా ఉన్నారు.



వెం : (నిట్టూర్చి) వస్తున్నారుగదా. బ్రతికాము. నువ్వుపోయి తొందరగా రమ్మని చెప్పు.

ప్ర : ఎవరో మనిషి మనింటి ముందుగా రెండుమూడు సార్లు తిరిగి పోయాడండి. మీతో ఏమన్నా పనుండి వచ్చాడేమో నని పేరడిగాను. చెప్పకుండా వెళ్ళిపోయాడు.

వెం : ఏం పనుండి ఎవరు తిరుగుతున్నారోలే. నువ్వుపోయి కామేశ్వరావుగారిని త్వరగా రమ్మను.

ప్ర : (వెళ్ళిపోతూ అంటాడు గొంతు దూరాన్నుంచి) ఇదిగో! వస్తున్నారు నాన్నగారూ!!

కా : కామ్రేడ్! యెంత సేపయింది వచ్చి?

ప్రవ : మంచిపనిచేశావు. ఏమిచెయ్యమని నన్నిక్కడ కూర్చోబెట్టావు?

కా : కొన్ని అనివార్య కారణాలవలన ఈ కామ్రేడ్‌కోసం పోవలసి వచ్చింది

ప్రవ : ఏమిజరిగిందేమిటి? ఆ కామ్రేడ్ ఎవరు?

కా : మనవాడే కామ్రేడ్ లక్ష్మయ్య ట్రాన్స్‌పోర్టు యూనియన్ కార్యదర్శి అనుకున్న దానికంటే ముందే ప్రారంభమయింది

ప్రవ . ఏమి జరిగిందేమిటి?

కా : వెంకన్నగారూ! బోయ్ ఉన్నాడా?

వెం : యేమికావాలి?

కా : నాలుగు కప్పులకాఫీ , రెండు సిగరెట్ పెట్టెలు తెచ్చిపెడతాడేమోనని

(వెంకన్న ఒకసారి కామ్రేడ్ ప్రవర్ధన్ ముఖములోకి సునిశతంగా చూస్తూవుంటాడు. కుతూహలంతో కామేశ్వరరావు లక్ష్మయ్య వంక చూస్తాడు )

వెం : ఇప్పుడే ప్రసాద్‌ను పంపి తెప్పిస్తాను. ప్రసాద్, ప్రసాద్!

కా : ఇదిగో డబ్బులు తీసుకెళ్ళండి.

వెం : ఉంచండి అఖ్ఖర్లేదు ప్రసాద్, ప్రసాద్. (వొక్కొక్కకేక అతడు వెళ్ళినట్లు సూచిస్తుంది.)

106 కా : (చిన్న గొంతుతో) నిన్న పార్టీ ఆఫీసు ప్రధానులైన కామ్రేడ్ల ఇళ్ళు పోలీసులు ఆకస్మికంగా వచ్చిపడి సోదా చేశారు.

ప్రవ : అలాగా!

కా : ట్రాన్సుపోర్టు యూనియన్ అధ్యక్షుణ్ని ప్రధాన కార్యదర్శిని యివాళ మధ్యాహ్నమే అరెస్టుచేశారు. అందువల్ల డ్రైవర్లు, కండక్టర్లు అనుకోకుండా చెప్పకుండా సిటీఅంతా వొక్కసారిగా సమ్మె చేశారు. ఇలాంటి పరిస్థితులలో సమావేశం బాహాటంగాగాని, రహస్యంగా పార్టీ ఆఫీసులో కాని జరపటం శ్రేయస్కరం కాదని తోచింది అలాచేస్తే మనకు మనంగా ప్రభుత్వానికి దొరికిపోవడమే అవుతుంది అందువల్ల ఈ వెంకన్నగారి అడ్రసు యిచ్చాను

ప్రవ : అలాగా! సరేగాని కామ్రేడ్ లక్ష్మయ్యా, మీ యూనియన్ వర్కర్లంతా గట్టిగా నిలబడతారా?

లక్ష్మ : మనం ఎంతచెబితే అంతే తొమ్మిదిగంటలపనీ, ఈ జీతాలు చూచింతరువాత ప్రతి ఒక్కడికీ విసుగెత్తి పోయింది. అమీ తుమీ ఈదెబ్బతో తేలి పోవాలంటున్నారు

ప్రవ : నిజమే!

లక్ష్మ నిజమేనని మెల్లగా అంటారేమిటి? మన సమ్మెదార్లు స్ట్రయిక్‌లో పాల్గొనక నడుస్తున్న నాలుగు బస్సుల్నీ నుగ్గునుగ్గు చేశారు నడిపిన డ్రైవర్లనూ, కండక్టర్లను గూడా ఈ పోలీసులు రాకపోతే చంపేసి ఉండేవాళ్ళు. అందులో గాయాలు తగలనివాడు వొకడుకూడాలేడు

కా : ఇక జరగవలసిన పని?

వెం (వొకటి రెండుసార్లు తాను వచ్చినట్లు చూచిస్తూ దగ్గి) కామేశ్వరరావు గారు!

కా కాఫీ వచ్చిందా?

వెం ఆ ప్రవర్దన్ గారికి, లక్ష్మయ్యగారికి యివ్వండి. ఇవిగో సిగరెట్లు.

ప్రవ . మీ ప్రాంతాలలో మంచికాఫీ దొరుకుతుంది (అగ్గిపుల్లగీసి సిగరెట్టు ముట్టిస్తాడు) సరే నాకు బండి టైమవుతున్నది (లోపలనుంచి సుబ్బమ్మ) బాబుగారు, బాబుగారు!

వెం సుబ్బమ్మగారూ రండి జంకుతారు దేనికి? రండి. ముఖ్యులంతా ఉన్నారు రండి.

ప్రవ యెవరదీ? 107

కా (ఆశ్చర్యంగా) సుబ్బమ్మ!

ప్రవ అంటే !

కా · లక్ష్మీ మిల్లులో ఈమధ్య ఒక సంఘటన జరిగింది.

ప్రవ . అవును. మన పేపర్లోగూడ వేశారు.

కా . ఆ కథానాయిక ఈ కామ్రేడే

ప్రవ : (అత్యంత ఉత్సాహంతో) గ్లాడ్ టుమీట్‌యు.

సు · మీ అందరికీ దణ్ణాలు మీరంతా చదువుకున్నవాళ్ళు. నేనేమీ తెలియని దాన్ని. నన్నెలాగైనా ఒడ్డున పడవేయండి బాబుగారు. బ్రతికి నన్నాళ్ళూ మీపేరు చెప్పుకుంటాను.

ప్రవ . ఏమిటి అలామాట్లాడుతున్నది?

కా : ఏమీ లేదు. ఇదుగో సుబ్బమ్మా! ఆ పత్రికలో వేసిన కథ అబద్ధమంటావా?

సు లేదు, బాబుగారూ, లేదు.

కా అయితే ఈ గొడవంతా ఏమిటి?

సు : బాబుగారూ, బాబుగారూ! మీ కాళ్ల పట్టుకుంటాను దిక్కులేని ఆడదాన్ని, కనికరించండి బాబూ. బాబుగారు, కాస్తగట్టునవెయ్యండి మీపున్నెం ఊరుకనేపోదు

ప్రవ : (విసుగుతో) అబ్బబ్బ! కామ్రేడ్, ఏమిటీ గొడవ?

కా : ఏమీలేదు. కాసేపు ఆగండి. అయితే సుబ్బమ్మా! పత్రికలో ఇంతకు ముందు ప్రకటించిందంతా అబద్ధమని వ్రాయమంటావా? పైగా అబద్ధాలు ఆడించి బయటపడదలుచుకుంటే నీవు మిల్లుయజమానులకు తోడ్పడుతావా? వాళ్లకు బుద్ధి చెప్పడానికి బదులు నీ కార్మిక వర్గాన్ని నరకంలో వేగించటానికి పూనుకుంటావా? ఏదో కాస్త మేలు చేస్తామని అన్నారనే అనుకో చూస్తూ చూస్తూ నీ స్వార్థం కోసం నీ కార్మిక సోదరులను నట్టేట ముంచుతావా? ఆలోచించుకో. రోజు గడిచింది లెక్కగాదు తరం గడవాలి.

ప్రవ : ఆ కుక్కలు డబ్బిచ్చి ఈమెను తిరగతీస్తున్నారా ఏమిటి?

సు : (డగ్గుత్తికతో) బాబుగారూ, బాబుగారూ! ఈ దిక్కుమాలిన దానికి కాస్త ఆదరువు దొరికనీండి.

108 కా : సుబ్బమ్మ! నీకు మతికూడా పోతున్నది. కాస్త ప్రశాంతంగా ఆలోచించుకో. కార్మికలోకం అంతా నేడు నిన్ను యెంతో సానుభూతితో చూస్తున్నది. పువ్వులలో పెట్టి పూజించుకోవాలనుకుంటూ వుంది. నీవు తమకు మార్గం చూపించి నాయకత్వం వహించి నడుపుతావని ఆశిస్తూవుంది. అలాంటి గౌరవం దక్కించుకోవా? నాలుగు రాళ్ళకోసము కార్మికులకు ద్రోహంచేస్తావా? (కఠినంగా) మళ్ళీ ఒకసారి ఆలోచించుకో. కార్మికలోకం యధాశక్తి నీకు సాయపడుతుంది. కాదంటావా నీదారి నీదే. వాళ్ళ దారి వాళ్ళదే. అది అంతా అబద్ధమని మళ్ళీ ఆ పత్రిక ప్రకటించదు. అది ముమ్మాటికీ అసంభవం. కార్మిక సంఘం ఇవ్వదలచుకున్న కాస్త సహాయం నిరాకరించదలచుకున్నావా? నిరాకరించు అప్పుడు అటు యజమానులకూ, ఇటు కార్మికులకూ కాకుండా పోతావు మళ్ళీ సావకాశంగా ఆలోచించుకో. ఊరక ఎందుకు చెడిపోతావు?

ప్రవ : (గొంతు సవరించుకుంటూ) సరే కామ్రేడ్స్. ఇకచాలు నా బండికి టైమవుతూ వుంది. ఈ రెండు ముక్కలు జాగ్రత్తగావిని ఆ విధంగా నడుచుకోండి. కమ్యూనిజమంటే భూలోకస్వర్గమని చెప్పనవసరం లేదు నేడు ప్రపంచమంతా ఆ విప్లవానికి అనుకూలంగా ఉంది యూరప్‌లో ఇవ్వాళో రేపో యుద్ధం తప్పదు. అందులో విప్లవబలాలు నెగ్గకుండా ఆటంబాంబు కాదుగదా,

బ్రహ్మ రుద్రాదులైనా ఆపలేరు ఇవ్వాళ మనదేశంలో కూడా విప్లవానికెంతో అనుకూలంగా ఉంది పన్నుల భారమంతా ప్రజలమీద పడ్డది ఆ భారం వహించలేక ఆబాలగోపాలం హాహాకారం చేస్తూ ఉంది యెక్కడ చూచినా ఆర్డినెన్సులే! ఏమూల చూచినా, దుష్టశాసనాలే ప్రజానీకం కారాలు మిరియాలు నూరుతూ ఉంది ఈ సమయంలో మీలో పిరికితనం లేకపోతే, ప్రజాభ్యుదయమే మీ లక్ష్యమయితే, ముందుకు రండి. విప్లవం తెండి రాజీలకూ లాలూచీలకూ ఏమాత్రం అవకాశంలేదు యేమాత్రం వెనుకంజ వేసినా నరకం తప్పదు సుస్థిరకీర్తి, మహత్తర అభ్యుదయం కావాలంటే కార్య రంగంలోకి దుముకండి. కాదంటారా ఘోరాంధకార కూపంలో పడతారు

కామే, లక్ష్మ : కామ్రేడ్ ప్రవర్ధన్‌కి జై

వెం : ప్రవర్ధన్‌గారు, ఒక్కముక్క.

ప్రవ : యు పెటీ బూర్జువా స్కౌండ్రల్ షటప్!

కా : ఇది పార్టీసమావేశం. సభ్యత్వం లేనివారు మాట్లాడుతారు దేనికి?

వెం : (బిగ్గరగా) పార్టీ సమావేశమా?

రా : (లోపలినుంచి ఆతురతతో పరుగెత్తుకువస్తుంది.) యేమిటండీ, యేమిటండీ, ఈ గలభా అంతా యేమిటి? 

వెం : (తమాయించుకుని ప్రశాంతంగా) ఏమీలేదు. కార్మికురాలై దెబ్బతిన్న ఈ సుబ్బమ్మగారు తన కష్టసుఖాలు చెప్పుకోటానికి వీలులేదు నా యింట్లో నా కాఫీ తాగి నా సిగరెట్లు ఊదుతున్న వీరి ముందు మాట్లాడడానికి నాకు వీలు లేదు! అదంతా పార్టీ ఆలోచిస్తుంది! రాధా నువ్వు ఇప్పుడు మాట్లాడడంతప్పు.

రా : పార్టీయా! యేం పార్టీ? ఇది పార్టీ ఆఫీసుకాదే! మనిల్లు

వెం : నువ్వు పొరబడుతున్నావ్ రాధా. కాదు యిది పార్టీ ఆఫీసు. మనం ఈ పార్టీ నాయకుల సేవకులం అందువల్లనే నువ్వు కాఫీ కాచి యిచ్చావు నేను సిగరెట్టు పెట్టెలు తెచ్చియిచ్చాను. నేను హోస్టెస్‌ను అనుకుంటున్నావేమో. పొరబాటు. వర్కి సేవకులం ఇక్కడ మాట్లాడుకునే మాటలు కూడ వినటానికి అధికారం లేదు. పైగా ద్రోహులం. నమ్మరానివాళ్ళం కాఫీలో సిగరెట్టులో విషం పెడతాం వారి రహస్యాలను ప్రభుత్వానికి చెప్పే నీచులం. వారు మాత్రం ప్రజాసేవకులు, ప్రజోద్ధారకులు, పవిత్రజీవనులు వాళ్ళను మనంనమ్మాలి కిమ్మనకుండా అనుసరించాలి. అప్పుడే మోక్షం వస్తుంది (తలవాకిట్లో నాలుగైదు ఈలలు వినిపిస్తాయి.)

ప్రవ : యుస్కౌండ్రల్ (కుర్చీయెత్తి వెంకన్న నెత్తిమీద వేస్తాడు )

రా · (కెవ్వున అరచి పడిపోతుంది )

సు : అయ్యో, అయ్యో! తలబ్రద్దలై నెత్తురు కారుతోంది వెంకన్న బాబుగారు! వెంకన్నబాబుగారు!

కా : ద్రోహికి కావలిసిందే ఆ శిక్ష చూస్తావేం లక్ష్మయ్యా మన నాయకుణ్ణి నమ్మకంగా రానిచ్చి పట్టిస్తున్నాడు. చంపు, చంపు! (దభీ దభీ లక్ష్మయ్య వెంకన్నను గుద్దుతాడు).

వెం . నేను పోలీసులను పిలిపించానా? అవును నేనే పిలిపించి ఉండాలి లేకపోతే వీళ్లెలా వస్తారు? ఆమాత్రం తెలివి తేటలు, నీతి ఉంటే ఇంక బాగుండేది

(గ్రుద్దులు పడుతూనే ఉంటాయి).

సు అన్నయ్యా - అన్నయ్యా?

లక్ష్మ నోరుముయ్.

( ఇంతలో పిస్టల్ మోత, కిటికిలోంచి పారిపోవాలని ప్రవర్ధన్ ప్రయత్నిస్తుండగా తలుపు తెరచుకొని లోడ్‌చేసిన పిస్టల్‌తో పోలీస్ ఇన్‌స్పెక్టరు ప్రవేశం )



పోలీ ఇ హాండ్సప్! కదిలావా చంపివేస్తాను. కిటికీలోంచి దిగిరా (పైకి ఒకషాట్ వదులుతాడు వెటకారంగా.) మా బాబుగా దిగిరా ప్రవర్ధన్‌నువ్వేగా నీకోసమే వెదుకుతున్నాము. ఏయ్ పోలీసులు! వీళ్ళందరికీ సంకెళ్ళు వెయ్యండి

వెం · వీలులేదు. నాయింట్లో వీళ్ళందర్నీ అరెస్టు చేయడానికి వీలులేదు

ఇన్ : వీళ్ళు ద్రోహులు. పట్టుకోమని ప్రభుత్వ ఉత్తరువు.

వెం : అయితే నా యింట్లోకిరావడానికి నీకు అధికారం? వారంటు ఉందా?

ఇన్ : అవసరం లేదు. వీళ్ళకి ఆశ్రయం ఇచ్చావు. కాబట్టి నిన్నుకూడా అరెస్టుచేశాము పోలీసులూ! వీళ్ళందర్నీ తీసుకుపదండి.

పో : స్పృహతప్పినట్టుంది. ఈమెకుకూడా బేడీలు వెయ్యనా?

ఇన్ : త్వరగా ఆ అయిదుగుర్నీ తీసుకురండి.

(అంతా వెళ్తున్నట్లు బూట్లచప్పుడు దూరంలోనుంచి డమడమాలబండి సవ్వడి)

జ . అన్నాయ్, అన్నాయ్! కాస్త బండి ఆపవూ

ప్ర . (గంభీరంగా) ఆగదు ఆగదు.

---

పాత్రలు :

శ్రీనాథుడు

పెదకోమటి వేమభూపాలుడు

రాచవేమన

సింగన మంత్రి

కంచుకి

గాయకులు

చెన్నమరాజు

జి.వి. కృష్ణరావు

(కొండవీడు రాజసౌధం. రక్షక భటుల పహరాధ్వనులు, కోటలోని ఘంటారావాలు, దూరాన్నుంచి సన్నగా వినిపించే కోడికూత, వేకువజామును సూచిస్తూ వుంటాయి పెదకోమటి వేమారెడ్డి మంచంలో ఒకటి రెండుసార్లు అటూ ఇటూ ఆవలిస్తూ దొర్లుతాడు)

వేమ : పూర్వజన్మంలో పుణ్యం చేసుకొన్నవాళ్ళే రాజులై పుడతారనడం అబద్ధం-

చెన్న : కాదు సత్యం

వేమ : అబద్ధం.

చెన్న : కాదు సత్యం – ముమ్మాటికీ సత్యం!

వేమ : (ఆశ్చర్యంతో నిదురమత్తు తొలగిపోయి) ఎవరది? పలకరేం? కలగంటున్నానా? లేదే! కళ్ళు తెరుచుకునే వున్నాయి రెప్పలుకూడా ఆడుతున్నాయి. ఇంతకు ముందే కదా అబద్ధమన్నది. మేలుకొనివుంటే – ఈ రెండోకంఠం? ఎవ్వరు కనబడరేం? కాదు స్పష్టంగా కంఠస్వరం వింటే! అయినా చూస్తాను (గట్టిగా అంటాడు) పుణ్యం చేసుకున్న వాళ్లు రాజులై పుడతారనటం అబద్ధం–



చెన్న . కాదు, సత్యం! ముమ్మాటికీ సత్యం! ముమ్మాటికీ సత్యం! ఈసారి అబద్ధ మంటే వేమారెడ్డి ప్రభువులతో చెప్పి దండిస్తాను

వేమ : కలగాదు; అడుగో బ్రహ్మచారి!

చెన్న : (కోపంతో) పుణ్యం చేసుకున్నవాళ్ళు రాజులై పుడతారనడం అబద్ధమన్నది మీరేనా?

వేమ : (నవ్వుతూ) అవును నాయనా!

చెన్న : (కఠినంగా) ప్రభువులెక్కడ?

వేమ . దేనికి?

చెన్న : (అలక్ష్యంగా) వారెక్కడున్నారు?

వేమ : ఈ వేకువజామున ఆయన దేనికి?

చెన్న : (కోపంగా) ఇంత మర్యాద తెలియనివాళ్ళుకూడా వున్నారా?

వేమ : మర్యాద తెలియదా?

చెన్న : తెలిసినవారు ప్రభువులను ఏకవచనంతో చెప్పరు!

వేమ : అలాగా—అతడు నేనే అయితే?

చెన్న : ద్రోహం. రాజద్రోహం (పెద్దగా కేకవేస్తూ) వేమ ప్రభూ, వేమప్రభూ!

కంచుకి : (గొంతు దూరంనుంచి వినిపిస్తుంది) ఎవరిది? పొండి పొండి ప్రభువుల శయనాగారం వద్ద యిప్పుడేమిపని? పొండి (ముందుకు వస్తూ ఉంటాడు.)

చెన్న : కంచుకీ కంచుకీ!

కంచుకి : జయము, జయము, మహా.....

వేమ : ఇస్ – కంచుకీ నీవు పోవచ్చును.

కంచు : ఈ బ్రాహ్మణ వటువు....

వేమ : మేమే పిలిపించాము. నీవు పోవచ్చును.

కంచు : చిత్తం. (వెళ్ళిపోతుంటాడు)

చెన్న : వెళ్ళకు కంచుకీ వెళ్ళకు! అయ్యో కంచుకి కూడా వెళ్ళిపోయాడే! ఏమి చేయటం? ప్రభువులను చూడకుండా ఎలాపోయేది? (పెద్దగా) మహాప్రభూ, మహాప్రభూ!

114 వేమ : ఏమి కావాలి నాయనా?

చెన్న : మీతో మాట్లాడకూడదు. అయినా గతిలేక అడుగుతున్నాను. పెదకోమటీ వేమ ప్రభువులు ఎక్కడ వుంటారు?

వేమ : (నవ్వుతూ) ఇక్కడే!

చెన్న : మీరా! వేమ ప్రభువులా!!

వేమ : కాగూడదా?

చెన్న : అసంభవం?

వేమ : ఎందుకని?

చెన్న : కరకులుగాని మేరువులు – ఉరుమని నీలిమేఘాలు, హోరని ఎన్నడూ ఘోష పెట్టని సాగరాలు, పట్టి చూచినా కాలని చల్లని చెంద్రనిప్పులు, చేవలు దేరిన ధర్మ వృక్షాలు ఎరుగుదురా?

వేమ : లేదు.

చెన్న : అవే కరిగి వేమప్రభువులయ్యారు.

వేమ : అలాగా?

చెన్న   అవును, మరేమనుకొన్నారు? వారి ముఖంలో చిరునవ్వులు చిందులు త్రొక్కు తాయిగాని విషాదమేఘాలు ఆవరించివుండవు

వేమ : (విషాదంగా) ని-జ-మే

చెన్న   నిజమేనని మెల్లగా అంటారేమిటి? గంట బజాయించి చెప్పక.

వేమ : ఎవరు. అక్కడ?

(ప్రభాత భేరీధ్వనులు వినిపిస్తుంటవి)

కంచు · చిత్తం ప్రభూ!

వేమ   (కఠినంగా) ఈ దేశానికి ప్రభువులున్నారా?

కంచు . (భయంతో) క్షమించాలి. ప్రభువులయాజ్ఞ వాద్యగాండ్రకు తెలియజేశాను కాని అలవాటు చొప్పున....

వేమ : ఈతూరి మ్రోగాయో...

కంచు : చిత్తం ప్రభూ! (వెళ్ళిపోతాడు)

చెన్న : (ఆశ్చర్యంగా) వేమ భూపాలురు తమరేనా? (భయంతో) ఎంత అవజ్ఞ జరిగింది! ఎంత అవజ్ఞ జరిగింది!!

వేమ : నేనా? వేమభూపాలుడనా? కాదు నాయనా, కాదు. వేమభూపాలుడే ఉంటే ఇలాజరగదు. ఎన్నటికీ జరగదు. మాదయ లింగమ నేడు, దేవరకొండపిల్లి, కొండవీటి సింగాలను ఓడించటమా! రాజవంశ పరంపరాగతమైన సందికంత పోతురాజా ఖడ్గము అపహరించటమా! అసంభవం! ఇతడు వేమభూపాలుడు కాదు. నాయనా నీవన్నది నిజం. నేను వేమ భూపాలుడనుకాదు. బ్రహ్మచారి వాక్కు బ్రహ్మవాక్కు-వేమభూపాలుడు వీరసింహం! అతని రణభేరికల్పాంత దుర్దాంత కాలభైరవభేరీ మహోన్నాదాన్ని అణచివేస్తుంది తప్పకుండా అణచి వేస్తుంది మీ గురువులు సకలవిద్యా సనాథులు. శ్రీనాథులు అబద్ధం చెబుతారా?



చెన్న . లేదు, కాని-

వేమ . వేమ భూపాలుడు దర్శనార్థం వచ్చిన బ్రాహ్మచారులను రిక్తహస్తాలతో పంపించి వేస్తాడా?

చెన్న : తమ ఆజ్ఞ శిరసావహిస్తున్నాను. కాని ప్రభువులు విచారంలో ఉండి మరచిపోయి నట్లుంది.

వేమ · ఏమది?

చెన్న : మా గురువులను ఒకసారి వచ్చిపోవలసినదని కబురుపంపించారు నన్ను చెన్న మరాజంటారు

వేమ : అవును. శ్రీనాథులెక్కడ?

చెన్న : వారు పట్టణంలో లేరు ప్రయాణమై వెళ్ళారు

వేమ : ఏక్కడికో–

చెన్న : తెలియదు, వెళ్ళుతూ, కోటలోనుంచి పిలుపువస్తే నేను స్వయంగా వెళ్ళి యీ సంగతి చెప్పాలనీ, త్వరలోనే తాము తిరిగివస్తామని మనవి చేయవలసిందనీ ఆజ్ఞాపించారు

వేమ : అలాగా!

చెన్న : ప్రభువులు సెలవిప్పించాలి

వేమ : మంచిది (చెన్నమరాజు పోతాడు వేమభూపాలుడు గట్టిగా నిట్టూర్చి) దుర్భరం మహాకవీ! నీవుకూడా మాకీర్తి ప్రతాపాలతో పాటు వెడలిపోయావా? అవును. ఈ నిర్వీర్యమైన ఆస్థానం నీకు తగదు. అయినా అసలు నీవు ఇక్కడ నిలువవలసిన అవసరం ఏముంది? అలావుండాలని ఆజ్ఞాపించటానికి అధికారం ఎవరు ఇచ్చారు? కొండవీడు నీకు అగ్రహారాలిచ్చి ఆదరించిందా? కనకాభిషేకం చేసి గౌరవించిందా? ఎవరికైనా అగ్రహారాలు, అందోళికలు ఇచ్చానే కాని నీకుమాత్రం ఇవ్వలేదుకదా? అలాంటప్పుడు ఇలాంటి సంస్థానం అంటి పెట్టుకొని దీనితోపాటు నామరూపాలు లేకుండా అణగారిపోవలసిన ప్రారబ్ధమేమి వచ్చింది? కాదు, కాదు, శ్రీనాథమహాకవి అలాంటివాడు కాదు వలుకెంతో హృదయమంత! ఇలాంటి క్లిష్టస్థితిలో అతడు కొండవీడు వదలి పోతాడంటే నమ్మకంలేదు అణుమాత్రం నమ్మకం లేదు. అతనికి కొండ వీడంటే ఎంతో మమకారం మాత్రమేకాదు, కొండవీడు అతనికి పంచ ప్రాణాలు. అంతటి కొండవీటిని శ్రీనాథునివంటి ఆత్మాభిమాని, ఇలాంటి క్లిష్టస్థితిలో వదలి పోతాడా? ఏమో నమ్మలేను. ఏదో పరమార్థం వుంటుంది

(వెలుపలినుంచి గొంతులు కలిపి ఈ క్రింది పద్యం చదువుతుంటారు.)

తన కృపాణము సముద్ధత వైరిశుద్ధాంత
తాటంకములకెగ్గు దలచుచరయ-
తన బాహుపీఠంబు ధరణి భృత్క మరాహి
సామంజంబులకు విశ్రాంతి యొసగ

తనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
భవన భూముల గొండ్లి బరిఢవిల్ల
తన దానమహిమ సంతాన చింతారత్నా
జీమూతసురభుల సిగ్గుపరుప
వరగు శ్రీవేమ మండలేశ్వరుని మంత్రి
అహిత దుర్మంత్రి వదన ముద్రావతార
శాసనుడు రాయవేశ్యాభుజంగ బిరుద
మంత్రి పెద్దయ సింగనామాత్య వరుడు.

వేమ  ఎవరాధూర్తులు? కంచుకీ, కంచుకీ! ఎంత హద్దుపద్దుమీరిపోయింది రాజ్యం (గట్టిగా) కంచుకీ!

కంచు  పిలిచారా ప్రభూ!

వేమ . ఎవరాధూర్తులు? రాజద్రోహులు?

కంచు . రాజద్రోహులా? ఎక్కడప్రభూ??



వేమ  ఎవరా పాడేదీ? జీవితంపై విరక్తికలిగిందా ఏమిటి?

కంచు  అదేమి ప్రభూ! అదేమి ప్రభూ! వారేమి తప్పుచేశారు? మంత్రిసత్తములను కీర్తిస్తున్నారు. అందులో సంస్థాన విద్యాధికారులు చెప్పిన పద్యమే! అందులో దోషమేమిటి ప్రభూ!

వేమ : ఆ ద్రోహులను పట్టి తెమ్మని ఆజ్ఞ. పోయి రాజభటులను పంపించు

కంచు : చిత్తం (వెళ్ళిపోతూ) పదిరోజులనుండి లేని ద్రోహం నేడెక్కడనుంచి వచ్చిందో – పెద్దవారిహృదయాలు తెలియటం కష్టం.

వేమ · కంచుకీ!

కంచు  ఏమి ప్రభూ!

వేమ  నమ్మినమంత్రికే ఎసరుపెట్టారు. వర్ధిష్ణువుకే ఈ దుర్బుద్ధి పుట్టలేదుకదా?

సింగన  (దూరంనుంచి) ఎవరది – కంచుకీ! ప్రభువులెక్కడ? మేలుకొనివున్నారా?

కంచు  ప్రభువులు పండుకొంటేగదా మేలుకొనటానికి? అసలు ఈ రాత్రి కునికి నట్లేలేదు – లోనికి దయచేయండి.

వేమ  ఎవరు? సింగనమంత్రులా దయచేయండి! ఆ పీఠం అలంకరించండి

సింగ : ప్రభువులు అసలు ఈరాత్రే నిద్రపోలేదా?

వేమ : పోకేమి? హాయిగా నిద్రపోయాను ఇంతకుముందే ఎవరో బ్రహ్మచారివస్తే లేచాను. విశేషాలేమీ లేవుకదా?

సింగన : ఏమున్నవి ప్రభూ!

వేమ : మంత్రులసంగతి కొత్తదికాదుగదా? ఊరకనే ఈ వేళ వస్తారూ? చెప్పండి. సందేహించకండి. మొన్నటి పరాభవంకన్న దుర్వార్త ఏముంటుంది?

సింగ : ఏలినవారికి చెప్పదగ్గ వార్తలులేవు.

వేమ : మరి

సింగ : (విచారంగా) ఏలినవారనుగ్రహిస్తే....

వేమ : (చీకాకుతో) చల్లకువచ్చి ముంత దాయటం దేనికి?

సింగ : ప్రభువులకు చీకాకు కలిగిస్తుందని తెలుసు! రాజభక్తికి కురాఘాతమని తెలుసు. హృదయంకూడా ఒప్పుకోవటం లేదు ఇరువది సంవత్సరాల పాటుగా కలసి మెలసి ఉన్న యీ జీవికలను బలవంతాన పట్టి పెకలించి వేరుచేయటం సుతరాం ఇష్టంలేదు. కాని ఏమిచేయను?



వేమ : ఏమి చేస్తానంటారు?

సింగ : కోపమా? అవును. ఎవరికి కోపంరాదు? వివిధాగ్రహారాలు ఛత్ర చామర కల్యాణ కలాచి కాది బహుసన్మానాలు పొంది, ఇరువది సంవత్సరాలపాటు ఇంద్రభోగాలు అనుభవించి, యీ కష్టస్థితిలో పోతానంటే ఏ ప్రభువు ఊరు కుంటాడు? ఇది రాజద్రోహం. నేనే అయితే తల కొట్టించి కోట కొమ్ముకు కట్టిస్తాను. ప్రభూ! తెలుసు. ఇవన్నీ తెలుసు, మరేమి చేయను?

వేమ : ఇంతకూ ఏమి చేస్తానంటారు?

సింగన : ఒకసారి ఆనంద కాననం చూడాలని మనస్సు ఆరాటపడుతున్నది.

వేమ : ప్రయాణానికి ఇకముందు మంచిరోజులు లేవుకాబోలు సరే! అంతా బయలు దేరండి. ఇలాంటి శుభసమయం మళ్ళాదొరకదు.

సింగ : ప్రభూ!

వేమ . ఇంకా ఏమి కావాలి? అనుజ్ఞ ఇచ్చాముకదా? ఇంకా మా వల్ల కావలసిన దేమున్నది?

సింగ . ప్రభువులు సావకాశంగా, సానుభూతితో ఆలోచించాలని కోరుతున్నాను

వయసా తప్పింది నిర్వహించవలసినదా గురుతర రాజ్యతంత్రం! ఈతని వల్ల ఏమవుతుంది? మొన్నటి లింగమనేనితో యుద్ధమే తీసుకోండి ఈ పరాజయానికి కారణం ఎవరు? మంత్రి సింగనకాదా? అతనుకాక మరియొక యువ నీతిచతురుడుంటే అలాజరుగుతుందా? ఎన్నటికీ జరుగదు. ప్రభూ! ఎన్నటికీ జరిగి యుండేదికాదు.

వేమ : వేమభూపాలుడు అట్లాభావించటం లేదు

సింగన : ఈ ముదివగ్గుమీద ప్రభువులకు అంత అనుగ్రహం ఉన్నదని తెలుసు.

వేమ అయినప్పుడు?

సింగన : నా స్థితి కొంచెం ఆలోచించండి కొండవీటి రాజ్యం శత్రువులబారినుంచి రక్షించ వలసిన బాధ్యత మంత్రిది. అతడు చేతగానివాడయ్యాడు. రాజ్యాన్ని శత్రు దండయాత్రకు అగ్గం చేశాడు. అప్పటికైనా పగతురను పారద్రోల గలిగాడా? లేదు సైన్యాలను బలిపెట్టాడు దానితోనైనా విజయం పొందాడా? లేదు, దురంత దుర్భర పరాభవం పొందాడు. అంతటితో ఆగలేదు. కొండవీటి రాజకుమారులకు ఉత్తేజకమైన సందికంత పోతురాజా ఖడ్గం సమర్పించు కొన్నాడు అలాంటివాడు మంత్రి లోకంలో, రాజలోకంలో ఎలా తలెత్తుకొని తిరుగుతాడు? నిజప్రభువుల ముఖారవింద ప్రతిబింబం లింగమనేడు తమ్మపడిగలో తాపి ఊస్తూ ఉంటే కాంద్రింతలు వింటున్నాడు! సింగన – ఈ సింగన! ఇంతకన్నా నీచాతి నీచుడు మరొకడుంటాడా? లేదు ప్రభూ ఈ సింగనకు మంత్రిత్వ యోగ్యత ఏమాత్రం లేదు. ఇతని ప్రయాణానికి అనుమతి ఇవ్వండి (రానురాను కంఠంలో గాద్గద్యం ఏర్పడుతుంది.) 119

వేమ : (వేమన చప్రున కత్తిదూస్తాడు.)

సింగ : అదేమి ప్రభూ! అదేమిప్రభూ!!

వేమ : పెదకోమటి వేమారెడ్డికికూడా చీమూ నెత్తురున్నది.

సింగ : ఆత్మ హత్యా! కార్యశూరులకు అతిహేయం!

వేమ . మంత్రులు స్వవచన వ్యాఘాతం చేసుకుంటున్నారు!

సింగ : ప్రభూ, ప్రభూ! ఆత్మహత్య శ్రేయస్కరమని బోధించానా?

వేమ : తమ, యేలిక పరాజయం మంత్రులకు దుస్సహమై, తమ ప్రభువుల ఘోర పరాభవం తలగొట్టినట్లయి, పదవీత్యాగం చేస్తూవుంటే – ఆ దుర్భర

పరాజయం, ఆ దుస్సహ పరాభవం పొందిన రాజేమి చెయ్యాలి! లింగమనేనిచే నిరంతరం కాంక్షించి, ఉమియించుకుంటూ తిరగాలా? అంతకన్నా ఆత్మహత్య శ్రేయస్కరం కాదా?

సింగ : త్వరపడకండి ప్రభూ! సర్వస్వతంత్రులైన మీకు, రాజాధీన తంత్రుడనైన నాకు తేడావున్నది త్వరపడకండి – దీనికంటే శత్రువుతో హోరాహోరీగా పోరాడి విజయం పొందడం మేలు. వీర మరణం పొందినా మేలే! మీకు అలాంటి అవకాశం ఉన్నది చెడగొట్టకండి. ఇక నామాట అంటారా? అలాంటి అవకాశం లేదు –

వేమ : మీ ఉద్యమానికి అడ్డుతలపెట్టగల అల్పాయుష్కుడెవ్వడు?

సింగ : అలా అనకండి!

కంచు : జయము జయము మహారాజా!

వేమ : ఎక్కడ ఆ ద్రోహులు!

కంచు : వీరిద్దరూ పాడుతూవుంటే రక్షక భటులు చుట్టుముట్టారు. అంతలో వీళ్ళు పారిపోవటానికి ప్రయత్నించారట! సందులుదూరి గొందులుదూరి పట్టు

కొనేటప్పటికి మన రక్షక భటులకు తలప్రాణం తోకొచ్చిందట!

వేమ : మంత్రులే విచారిస్తారు – కంచుకీ నీవు పోవచ్చును.

కంచు : చిత్తం! –

1గాయ : పాటలు పాడి పొట్టలు పోసుకుండేవాళ్ళం బాబయ్యా! రచ్చించాల! యీ నేరం తెల్దు బాబయ్యా!

సింగ : నేరం చెయ్యని వాళ్ళు పారిపోవడం దేనికి?

2గాయ : బంట్లు పట్టుకోటానికొత్తుంటే తత్తర పుట్టింది బాబయ్యా ఆతత్తరమ్మీన తెలియక పారిపొయ్యాం!

వేమ : ఎన్నిరోజాలనుంచి పాడుతున్నారు?

2గాయ మా తప్పేముంది బాబయ్యా, మంతిరిమీనపాడితే

1గాయ సంతోసిచ్చి నాలుగుడబ్బులిత్తారని పాడాంబాబయ్యా

వేమ ఎన్నిరోజాలనుంచి పాడుతున్నారు?

2గాయ · పద్దినాల్నుంచి. అన్నెం పున్నెం తెలీనోళ్ళం తప్పు కాయాల పెబువులు

వేమ అంతకుముందు ఎందుకు పాడలేదు?

1గాయ. అంతకుముందు నేర్చుకోలా బాబయ్యా! నోటికొత్తే గందా చదివేచె

వేమ : ఆ పద్యం మరొకసారి చదవండి

1గాయ. ఇదివరకే తప్పుచేశాంగందా, మల్లా ఎట్టా చదవేట్టు బాబయ్యా?

సింగ : ప్రభువులు ఆజ్ఞాపిస్తున్నారు

గాయకులు (జంకుతూ)

తన కృపాణము సముద్ధత వైరిశుద్ధాంత
తాటంకములకెగ్గు దలచుచుండ
తన బాహుపీఠంబు ధరణి భృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసగ
తనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
భవన భూములగొండ్లి బరిఢవిల్ల
తన దానమహిమను సంతాన చింతారత్న
జీమూత సురభుల సిగ్గు పఱుప
పరుగు శ్రీవేమ మండలేశ్వరుని మంత్రి
అహిత దుర్మంత్రి వదనముద్రావతార
శాననుడు రాజవేశ్యాభుజంగ బిరుద
మంత్రి పెద్దయ సింగనామాత్యవరుడు.

వేమ : ఇంకా ఆలోచిస్తున్నారు దేనికి? కంచుకీ!

సింగ : ఇప్పుడైనా నిజం చెప్పండి. బిచ్చగాండ్లుకాదని మీ ఉచ్చారణే చెబుతున్నది. ఉన్నది ఉన్నట్లు చెబితే ఉరిశిక్ష తప్పుతుంది. ఆలోచించుకోండి. మీకా ఈ అసత్యంవల్ల వచ్చేది ఏమీలేదు. పైగా తలలు ఊడతాయి అనవసరంగా ఈ వయస్సులో చచ్చిపోవటం దేనికి? ఇందులో పురుషార్థమేదన్నా ఉంటే ఇలాంటిచావు ఉత్తమమే! మీకు ఈ పాటవల్ల వచ్చి వళ్లోపడేదేముంది? ఎవరో నాలుగు డబ్బులు ఇచ్చి పంపితే ఈపనికి దిగారు. ఆ పద్యంలో కూడా వైపరీత్యం కనిపించలేదు అందుకని చదివారు రక్షక భటులు మీవెంట పడటం, పట్టుకోవటం, రాజుగారిదగ్గరకు తీసుకురావడం తత్తరపుట్టించింది ప్రాణాల కోసం ఈ బొంకులన్నీ చెప్పారు అంతేనా?

గాయ : చిత్తం!

వేమ : మిమ్మల్ని చదవమన్నది ఎవరు?

గాయ : మరి – ప్రభువులు – క్షమించాలి.

వేమ . (గట్టిగా) ఎవరు చదవమన్నది?

సింగ : సందేహించకండి, మీప్రాణాలకు నాదీ పూచీ.

గాయ : యువరాజులుంగారు.

వేమ : సరే మీరు పొండి.

సింగ : ఈ విచారణసంగతీ – యువరాజులపేరు మరెక్కడైనా తడివేరుసుమా! ఇకపొండి.

వేమ : కంచుకీ! కంచుకీ!

కంచు : పిలిచారా ప్రభూ!

వేమ : యువరాజును ఒకసారి పిలుచుకొని రావాలి. త్వరగాపో. ఇక్కడు న్నట్టురావాలి.



కంచు : చిత్తం.

వేమ : వినాశకాలే విపరీతబుద్ధిః అని పెద్దలు ఊరకనే అనలేదు.

సింగ : అలాఅనకండి. యువరాజులుంగారి హృదయం గంభీరం!

వేమ : రాజుల అభ్యుదయంకోరే మంత్రులు ఇలా చెప్పరు.

సింగ : రాచవేముల హృదయమేమో?

వేమ : వాడు రాచవేమనకాదు–రాచవుండు కాకపోతే వాడిలా పిరికిపందయై తన దోషాన్ని మంత్రులపై రుద్దటానికి ప్రయత్నించడు. ఇలా అనుభవశాలియైన మంత్రిమనస్సు నొప్పించి రాజ్యంలోనుంచి పంపివేయడానికిపూనుకోడు

సింగన : నా మనస్సు వారు నొప్పించిన దేమున్నది?

వేమ : దాయకండి! ఆరునెలలక్రితం కాశీయాత్రకు రమ్మనికోరితే రాని వారికి నేడిలా కొత్తగా కాశీదర్శనాభిలాష ఎందుకు కలిగింది? లేదు నిజంగా వాడి దుష్ప్రవర్తనమే ఇంతవరకు తెచ్చింది (పెద్దగా) నిజంగా నాకడుపు చెడబుట్టాడు

కంచు : యువరాజా రాచమేమనగారు వచ్చారు.

యువ : తండ్రిగారికి నమస్కారం!

వేమ : నా కుమారుడా! పదిరోజులక్రితమే యుద్ధంలో చనిపోయాడు లేదు. నిజంగా చనిపోయాడు మంత్రీ నవ్వులు కాదు. సింగంకడుపున మేకపిల్ల పుడుతుందా? నా కుమారుడే అయితే దేవర కొండపల్లికి జడిసిపోయి, వంశపారంపరాగత ఖడ్గం లింగమనేనికి అప్పగించివస్తాడా! తండ్రి ముఖరూపం త్రష్మప్రడిగపై తాపించి శత్రువుచే ఉమియిస్తాడా? అంతతో తృప్తిపడక ప్రాణాలకు ప్రాణమైన విద్యాధికారులను, మంత్రులను అవమానించి పంపివేయజూస్తాడా? శత్రువులపై సాగించవలసిన కుతంత్రాలు ఆప్తులమీదనా?

యువ : స్తోత్రపాఠాలు చెప్పే భట్రాజులు; ఇచ్చకాలుచెప్పే మునిముచ్చులు ఆప్తులా?

వేమ : ఏమని ప్రలాపిస్తున్నావ్! విద్యాసనాధుడైన శ్రీనాధభట్టు, మంత్రి కులావతం సులైన సింగనగారు ద్రోహులా! కంచుకీ, కంచుకీ!

సింగ : ప్రభువులు త్వరపడరాదు – యువరాజాలుంగారు తమ అభియోగాన్ని రుజావు చేసుకోవలసివుంది.

యువ : ఇంకా రుజావు చేసుకోవాలి!

కంచు : పిలిచారా ప్రభూ!

వేమ : అవును – దండనాథులను రమ్మంటున్నానని చెప్పు!

సింగ : త్వరపడకండి – ఏ పుట్టలో ఏమున్నదో ఎలా తెలుస్తుంది?

వేమ : నీవు త్వరగాపోయి వారిని పిల్చుకొనిరా!

కంచు : చిత్తం–

సింగ : యువరాజాలుంగారు ఏమంటారు?

యువ : విద్యాధికారి శ్రీనాధుడు పట్టణంలోనే ఉన్నారా?

వేమ : లేరు. అయితే –

సింగ : లేరా ప్రభూ –

వేమ : లేరు–

యువ : ఎక్కడకువెళ్ళారో తెలుసా?

సింగ : ఎక్కడికి వెళ్ళారు?

యువ : (సగర్వంగా) దేవరకొండకు.

సింగ . (ఆశ్చర్యంతో) దేవరకొండకా? మన ఆగర్భశత్రువైన మాదయ లింగమనేని దగ్గరకా?

యువ : అవును.

వేమ : నీ తల నూరువ్రక్కలుచేసినా పాపం తీరదు! (కత్తి దూస్తాడు)

సింగ : ఆగండి. ఆగండి – యువరాజులుంగారు చెబుతున్నది నిజమేనేమో! ఆ ఖడ్గం ఆవల ఉంచండి. రాచవేములహృదయం పూర్తిగా విప్పిచెప్పాలి!

యువ : విప్పి చెప్పవలసిన పనేమున్నది? కొండవీటిరాజ్యం శ్రీనాధుల దృష్టిలో కూలి పోయింది. అందువల్ల విజేత అయిన లింగమనేనిని ఆశ్రయించటానికి వెళ్ళాడు ఆ తుచ్ఛుని మెప్పుకోసం కొండవీటి గుట్టు మట్లన్నీ చెబుతాడు ఇలాంటి ఉద్దేశం లేకపోతే దేవరకొండ రాచసీమ నాశ్రయించవలసిన పనేముంది?

వేమ : ఛీ! దుర్మార్గుడా నీ ముఖం చూస్తేనే పాపం చుట్టుకొంటుంది. (దండ నాధుడు ప్రవేశిస్తూ) జయము జయము మహాప్రభూ!

వేమ : ఎవరది? వీణ్ణి కొనిపోయి కారాగారంలో వేయండి. ఆలస్యం దేనికి? తీసుకొని పొండి.

సింగ : ప్రభువులు తొందర పడకూడదు.



వేమ : ఇది వేమభూపాలుని ఆజ్ఞ!

దండ : చిత్తం. యువరాజులుంగారు బయలుదేరాలి

యువ : నా మాటలు నేడు కర్ణ కఠోరమైనా, రేపు ఆ శ్రీనాధునితో కలిసి లింగమనేడు దండెత్తి వచ్చిననాడైనా యధార్థమని తోచక మానవు. ఇప్పుడు తొందరపాటు దేనికి? సెలవు.

(దండనాధుడు, రాచవేమన వెళ్ళిపోతారు)

సింగ : యువరాజులుంగారి హృదయం అర్థంకావటంలేదు

వేమ : అర్థం కావటానికి కేమున్నది? దుష్టునికి లోకమంతా తన లాగే కనిపిస్తుంది

చెన్న : (రొప్పుతూవచ్చి) జయము, జయము, మహారాజా!

వేమ : ఎవరది చెన్నమరాజా?

చెన్న · అవును ప్రభూ!

వేమ · ఏమి విశేషాలు?

చెన్న : (ఆయాసంగా) కవిరాజులు వస్తూ ఉన్నారు

సింగ (ఆదుర్దా లేనట్టుగా) ఎక్కడనుంచి?

చెన్న దేవరకొండనుంచి

సింగ · దేవరకొండనుంచా?

చెన్న : అవును పరివారంతో వస్తున్నారు.

సింగ : పరివారంతో నేనా?

వేమ : సమాచార మేమిటినాయనా?

చెన్న : మా గురువులు మాదయ లింగమనేని దర్శనార్థం వెళ్లారట

సింగ : (వెటకరాంగా) దర్శనం లభించిందా?

చెన్న : మొదటి రెండు మూడురోజులు నానావస్థలు పడ్డారట ఆస్థానకవులు పండితులు పెట్టరాని చిక్కులు పెట్టారట. ఎలాగైతేనేం చివరికి రాజదర్శనం లభించిందట.

వేమ : తరువాత?

చెన్న : తరువాత ఆస్థానపండితులకు మా గురువుగారికి ఉద్ధృత వివాదం జరిగింది

సింగ · (కుతూహలంతో) అందులో గెలిచారు సరే ...

చెన్న · లింగమనేడు ఉబ్బిపోయి ఏమికావాలో కోరుకో మన్నారట!

సింగ అగ్రహారాలు కోరుకున్నారుకాబోలు!

చెన్న · లేదు, ఏదో కోరారట దానికి లింగమనేడు అదిగాక మరేదికోరుకున్నా యిస్తామన్నారట – రత్నాలిస్తామన్నారట – అగ్రహారాలిస్తామన్నారట! ఆందోళికా ఛత్ర చామరాలిస్తామన్నారట – ఇక చివరికి అర్థరాజ్యమైనా ఇస్తామన్నారట.

సింగ : తర్వాత ఏమిజరిగినది?

చెన్న . ఇస్తే నేనుకోరిన అర్థం యివ్వండి. లేకపోతే అసలు యివ్వవలసిన పనేలేదని బయలుదేరారట – చివరికి లింగమనేడు తప్పుకోలేక అపకీర్తిపాలుకాలేక అడిగింది ఇచ్చారట. అదిపుచ్చుకొని యిక్కడికే వస్తున్నారు

వేమ ఇక్కడికే వస్తున్నారా? ఎప్పుడు? ఎవరుచెప్పారు?

చెన్న మా సహాధ్యాయి దుగ్గన – అతడు గురువులవెంట వెళ్ళాడు వారు పంపితే – ముందు వగర్చుకొంటూ వచ్చాడు

సింగ మీ గురువులు ఏమికోరి తెస్తున్నారో తెలుసా?

చెన్న : లేదు. తొందరలో ఆసంగతి అడగటమే మరచిపోయాను

కంచు : జయము, జయము మహారాజా –

వేమ : ఏమది కంచుకీ–

కంచు : శ్రీనాథ కవిరాజులు ఏలినవారి దర్శనార్థం వచ్చారు–

సింగ : శ్రీనాథ కవిరాజులెవరు?

వేమ : మంత్రులకింకా కినుకపోలేదు – విద్యాసనాథులైన మన శ్రీనాథులే – త్వరగా ప్రవేశపెట్టు –

చెన్న : గురువులు వచ్చారా!

శ్రీనాథ: (ప్రవేశిస్తూ) ఆంధ్రక్షమా మండలాఖండలా! పెదకోమటి వేమభూపాలా! జయము – జయము–

వేమ : జయమా – నిన్నగాక మొన్న పరాభూతుడైన వేమనకు జయమా!

శ్రీనాథ. అవును –

వేమ -: ఆ పీఠం మీద ఆసీనులుకండి!

126 శ్రీనాథ: ఓహో – సింగనమంత్రులుకూడా ఇక్కడే ఉన్నారే – నమస్కారం!

సింగ : సుఖీభవ!

చెన్న : గురువులకు నమస్కారం.

శ్రీనాథ: నాయనా చిరంజీవివికమ్ము ప్రభువులనుండి ఇంత వరకు పుచ్చుకొనటమేకాని ఇచ్చినదిలేదు. అనుగ్రహించి ఏలినవారిది స్వీకరించాలి. (కట్టువస్త్రాలతో కప్పబడిన పాత్ర అందిస్తాడు.)

సింగ : ఏమది?

శ్రీనాథ: ప్రభువులే స్వీకరించి చెప్పాలి

సింగ : ఏమది? ఏమది?

(వేమభూపాలుడు పాత్ర నందుకొని ఆచ్ఛాదనం తొలగిస్తాడు)

చెన్న · సందికంత పోతరాజా – సందికంత పోతరాజా ..

సింగ : తమ్మపడిగ కూడా వుంది

శ్రీనాథ: (నవ్వుతూ) మహాప్రభూ! విజయం ఎవరిది?

వేమ (ముసి ముసి నవ్వుతో) కొండవీటిదే!

---

జి వి కృష్ణరావు

చెన్న (పాటగా) ''విజయం మనదేలే. కొండవీడు మనదేలే'' (గంతులు వేస్తాడు)

వేమ · శ్రీనాథులు నిజంగా కవిరాజులు మీ ఋణం ఈ కొండవీటి రాజ్యమెలా తీర్చుకోగలదో తెలియటం లేదు.

శ్రీనాథు ఋణం కాదు అది నా విద్యుక్తధర్మం.

వేమ మీ సౌజన్యం అలా అనిపిస్తుంది అంతకన్నా మరేమీ లేదు.

శ్రీనాథు. అయితే ఋణమే నంటారా?

వేమ అవును.

శ్రీనాథు. అయితే తీరుస్తారా?

వేమ : తప్పకుండా.

శ్రీనాథు: యువరాజులుంగారిని విడుదలచేయించండి.

వేమ : ఆ ద్రోహ బుద్ధినా?

శ్రీనాథు వారి ద్రోహం వారికే ఉంటుంది నాయం దనుగ్రహం ఉంటే వారిని విడుదల చేయించండి అంతా వినే ప్రభువుల్ని అర్థిస్తున్నా.

వేమ : కవిరాజుల వాక్కునకు ఎదురేముంది? అలాగే.

*(1952)*

## పాత్రలు :

| | |
|---|---|
| బలిచక్రవర్తి | తార్క్ష్యుడు |
| భార్గవుడు | కంచుకి |
| విప్రచిత్తి | బ్రాహ్మణులు |
| వామనుడు | వింధ్యావళి |

(వెన్నెల దూరాన నదీప్రవాహ ధ్వని వాయువు అనుకూలంగా వున్నప్పుడు వినిపిస్తుంది అనుకూలంగా లేనప్పుడు వినిపించదు ఇలకోళ్ళ చప్పుళ్ళు అప్పుడప్పుడు గూళ్ళల్లో మేలు కొన్న పక్షుల అరుపులు. నిశాసమయప్రశాంతతను చాటుతుంటై

రాజసౌధం, యామాలు తెలుపుతూ రెండుసార్లు గంట మ్రోగుతుంది. దూరంలో గస్తీవాళ్ళ హెచ్చరికలు వినిపిస్తుంటాయి బలి ఒకశయ్యపై నిద్రపట్టక పొర్లుతూ, మెల్లగా ఆవలిస్తుంటాడు రెండో మంచంపై వింధ్యావళి గాఢనిద్రలో వుండి పలవరిస్తూ భయ కంపిత అవుతుంది.

కేకలు, నవ్వులు, చప్పట్లు నారాయణస్తవాలు విపరీతంగా వినిపిస్తుంటాయి తండోపతండాలుగా జనం నడుస్తున్న చప్పుడు. వామనుడు ఒకచేత గొడుగు, మరొకచేత కమండలువు, ఆ చంకనే భిక్షాప్రాత తగిలించుకొని, కాళ్ళకు తొడిగిన పావుకోళ్ళు, పై చెప్పుళ్ళను మించి టకటక మంటూ వుండగా నడుస్తూ వుంటాడు )

విప్రచిత్తి : భార్గవ గురుదేవులకు నమస్కారం

భార్గవ : (ఉలిక్కిపడి అటుచూడకుండానే) ఎవరది;

విప్ర : నేను 131

భార్గ . (నిర్వేదంగా) నేను. ఈ ప్రపంచమంతా నేను. నేను లేకపోతే ఈ ప్రపంచమేలేదు.

విప్ర : (జంకుతూ జంకుతూ) నేను గురూ. ప్రియశిష్యుణ్ని.

భార్గ : ప్రపంచమంతా నా శిష్యులే! అంతా ప్రియశిష్యులే

విప్ర · విప్రచిత్తిని గురూ!

భార్గ : మతిపోయిన యీ ముసలితో ఎవరికీ పనిలేదు, ఐనా యీ అనామకుడు ఈ అర్ధరాత్రాన ఇక్కడ ఉంటాడని తెలుసు కోవలసిన అవసరం ఎవరికి కలిగినదబ్బా!

విప్ర . (భయపడుతూ) తమకోసం నగరమంతా గాలించాను ఎక్కడా కనిపించ లేదు దీర్ఘాలోచనలో ఉన్నప్పుడు తమరీ నదీప్రాంతానికి వస్తారని జ్ఞప్తికి వచ్చింది వెంటనే ఇటు బయల్దేరాను సరిగా అనుకొన్నట్టు ఇక్కడే వున్నారు.

భార్గ · ఎవరిదీ, పురాతన స్మృతి పరంపర కదలిస్తున్నారు. ఆఁ విప్రచిత్తి, విప్రచిత్తి, విప్రచిత్తి!!

విప్ర . అవునుగురూ!

భార్గ : (అప్యాయనంగా) విప్రచిత్తివికదూ! రా నాయనా దగ్గరకు రా ఎన్నేళ్ళయిన దోయీ చూచి! ఏదీ ఇటుచూడు, ఎంత మారిపోయావు? ధరుర్వహనంతో రణక్రీడతో కాయలుకాచిన నీమూపు నీ చేతలు ఇంతగా మారిపోయాయే?

విప్ర : ఎంతకాలమైనది యుద్ధం చేసి? అసలు యుద్ధావశ్యకత లేనప్పుడు శరీరంతో పాటు మనస్సుకూడా మారిపోయింది. మీకు తెలియంది ఏముంది?

భార్గ : ఇంతకాలం కనిపించలేదేమి? ఎక్కడున్నావు? నిన్ను పంపిన సంగతి ఏం చేశావు? సమ్రాట్టు మరొకపనికి నియోగించాడా?

విప్ర : లేదుగురూ! మీ ఆజ్ఞ శిరసా వహించే అన్వేషణకు వెళ్ళాను. ఆ వెళ్ళటం వెళ్ళటం ఇప్పుడే తిరిగివస్తున్నాను.

భార్గ : (ఆశ్చర్యంగా) ఇప్పుడేనా రావటం?

విప్ర : అవును. మీ అనుజ్ఞవడసి నాడుబలిచక్రవర్తి అమరావతి ముట్టడించాడు పిరికి పందయైన ఇంద్రుడు ఎదుర్కొనలేక పారిపోయాడు అతనిజాడ తెలుసుకోవలసిందని పంపించారు. ఇంతకాలం అతనికోసం వెదుకుతూనే వచ్చాను – కాని



భార్గ . కనిపించలేదు–అంతేగా? ఆ మాట చెప్పటానికే ఇంతలెక్క వచ్చావన్నమాట?

విప్ర : (వణకుతూ) క్షమించాలి. ఇన్నేండ్లనుంచీ ఎండనకా వాననకా ఆలనకా బిడ్డనకా మూడులోకాలు తిరుగుతూనే వున్నాను వెళ్ళినచోట నిలువలేదు, నిలిచిన చోట కుడువలేదు, కుడిచిన చోట పండలేదు. కాళ్ళు బలపాలు కట్టేట్టు తిరిగాను. స్వర్గధామం తిరగేశాను. బ్రాహ్మణవాటికలు పరిశోధించాను అరణ్యాలంతా ఆరాతీశాను. ఆశ్రమవాటికలు అన్వేషించాను. పూవు పూవు రేకు రేకు అణువు అణవువు గాలించాను కాని–,

భార్గ : నీ కళ్ళల్లో ఇంద్రుడు చక్కగా దుమ్ముకొట్టాడు –అనుకొంటూనే వున్నాను అనుకున్నంతా జరగబోతున్నది.

విప్ర : ఏమి జరగబోతున్నదంటారు?

భార్గ : త్వరలోనే చూస్తావుగా, నానోటిమీదుగా చెప్పటం దేనికి?

విప్ర : గురువుల శుభదృష్టి మాపై ప్రసరిస్తున్నంత వరకూ రక్షోలోకానికి వచ్చిన భయమేమీలేదు.

భార్గ : శుభదృష్టి ప్రసరిస్తున్నంతకాలం ప్రమాదం లేదు!

విప్ర జౌను – ముమ్మాటికి ప్రమాదం లేదు ఏమిటి ఆలోచిస్తున్నట్టున్నారు?

భార్గ ఏమీ లేదు – సరేకాని – లోకాలెలా ఉన్నవి?

విప్ర ప్రశాంతంగా ఉన్నాయి అంతా త్రిభువనాధీశ్వరులైన బలిని ప్రశంసించేవారే!

భార్గ అవి విమతులవర్ణనం–

విప్ర : లోకాలన్నీ అట్లే ఘోషిస్తున్నవి

భార్గ : లోకాలసంగతి అలావుంచు – నీకెలా ఉన్నాయి?

విప్ర . ఇంక ఎలా ఉన్నాయంటారు?

భార్గ : సందేహించకు. ఎలా కనిపిస్తున్నదో చెప్పు.

విప్ర : మరొకవిధంగా కనిపిచటం లేదే!

భార్గ : విప్రచిత్తీ, ఇటుచూడు. బలి అభ్యుదయం నీ అభ్యుదయమేనా?

విప్ర : అవును గురూ!

భార్గ : అయితే ఇచ్చకాలమాటలు అలావుంచి, నిజం చెప్పు!

విప్ర : లోకాలన్నీ అచ్చగా. ...



భార్గ : ఎలావున్నాయి? సందేహించకు.

విప్ర : దేవేంద్రుడు ఏలుతున్నట్లుగా ఉన్నాయి!

భార్గ : అంతేగాని తేడా లేదంటావు

విప్ర : నిజం చెప్పాలంటే అంతే.

భార్గ : అయితే మనం నానావస్థలువడివిశ్వజిద్యాగం చేయించటం, అమరావతిపై బడటం, లక్షలాదిగా దితిసంతానం బలిపెట్టి రక్తవాహినులు ప్రవహింపజేసి విజయం సంపాదించటం, తిరిగి ఇంద్రత్వం నెలకొల్పటానికేనా? ఈ వ్యయప్రయాస దేనికి? ఈ భీభత్సం ఈ అల్లకల్లోలం ఎందుకు జరగాలి?

విప్ర బలి ఇంద్రునివంటి స్వార్థపరుడు కాడు అతనిహృదయం కాకలకు కరగని బంగారం!

భార్గ . ఎవరు కాదన్నారు? అతని గుణాలు నాకు తెలియనివా?

విప్ర గురువుల హృదయం అర్థం కావటంలేదు

భార్గ (కోపం) కేవలం అధికారంకోసం బలి కూర్చోలేదు కీర్తికండూతి కూడా అతనికిలేదు అందువల్లనే కుడి భుజాలై మీవంటి వాళ్ళు పనిచేయటం, నా

వంటివాడు చేతనైనసహాయం చేయటం జరుగుతున్నది అసలు ఇంద్రుః పదవీచ్యుతుని చేసి మనం స్వర్గం ఎందుకు ఆక్రమించవలసి వచ్చింది? బ తనకు కావాలని కోరాడా? కోరినంత మాత్రాన సహాయంచేసి ఉండేవాళ్లమా

విప్ర నిజమే!

భార్గ : (విసుగుదలతో) ఏమి నిజం?

విప్ర : ఇంద్రత్వం కావాలని బలిసమ్రాట్టు కోరలేదు.

భార్గ : అయితే అధికారం అపేక్షించి సూర్యచంద్రాదులు నా చుట్టూ తిరగడంకోసం, నా శిష్యుడైన బలిని ఇంద్రపదవి కెత్తించానా?

విప్ర : మిమ్మల్ని ఎరగనివాడు చూడనివాడు అలా అనుకోవాలి

భార్గ : అయితే మీ అధికారాన్ని పెంపొందించుకోటానికి మీరంతా బలిచేత ఈనాటక మాడించారన్నమాట!

విప్ర : నాటకమాడించామా మీ కోసం? నిజమేనా గురూ?

భార్గ : మరి యీ జరిగిన మారణహోమం దేనికి?

134 విప్ర : ఏమో నా హృదయం హృదయంగా లేదు ఈ భూమ్యాకాశాలు తిరిగి పోతు న్నట్టున్నాయి. ఈ చంద్రుడు నిప్పులు కురుస్తున్నట్లున్నది ఈ ఝిల్లికలు ప్రళయహుంకారాలు చేస్తున్నట్లున్నాయి

భార్గ : (కఠినంగా) నీ కవిత్వం కట్టిపెట్టు. కర్తవ్యమేమిటో చూడు!

విప్ర : నిజంగా నాకు మతిపోయినట్లుంది.

భార్గ : హృదంతరాంతరాలలో దాగి ఉన్న వాసనలు అభివ్యక్తమైనప్పుడు అలాగే ఉంటుంది. ఇంతకూ స్వర్గమూ త్రిలోకాలు జయించవలసిన అవసరం ఏమి వచ్చింది? అసలు ఎలా స్వాధీనమయ్యాయి?

విప్ర : ఈ మూఢుని మనస్సు అంత మహోన్నత శిఖరం అధిరోహించలేదు గురుదేవులు చెబితే అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తాను.

భార్గ : ఉన్నస్థితిలో ప్రాణికోటి ఎన్నడూ సంతృప్తి పడదు సంతృప్తిపడిందో అది ప్రాణికాదు. ఎప్పటికప్పుడు నిత్య నూతనత్వం అభ్యుదయం పొందాలని కాంక్షిస్తుంది. కాంక్షించటమే కాదు, ప్రాణాలర్పించి అయినా ఆలక్ష్యం చేరు కోటానికి ప్రయత్నిస్తుంది ఇలాంటి స్వభావంకలిగిన ప్రాణికోటి మహా ప్రవాహంలో మనం అగ్ర తరంగాలం వెనకటి తరంగాలు మనకు వెన్నుదన్ని

నిల్చాయి మనం ముల్లోకాలు ముంచేశాము. అంతే! కేవలం నీశక్తికాదు, నాశక్తికాదు బలిప్రభావం అంతకన్నకాదు. కాకపోతే ఈస్వభావాన్ని గుర్తించి వినియోగించుకొన్నాము. అందువల్ల అధికారంలోకి వచ్చాము. తద్వారా జీవకోటి తుష్టిపొందింది. అయితే అంత మాత్రంతోనే ఆగదు. అవిచ్ఛిన్న పరిణామం దానికి కావాలి. అది హ్రాసమైనా, వికాసమైనా దానికి లెక్కలేదు. ఎప్పుడూ పరిణామం అని ఉద్ఘోషిస్తూ ఉంటుంది.

విప్ర : పరిణామం లేకపోతే పారిపోయిన ఇంద్రుని తెచ్చి సింహాసనాసీనుని చేస్తుందంటారా?

భార్గ : నిస్సందేహంగా.

విప్ర : గురువులు క్షమించాలి.

భార్గ : ఏమది?

విప్ర : లోకాలన్నీ దేవేంద్రుడు ఏలుతున్నట్లున్నాయికదా?

భార్గ : అవును.

విప్ర : దేవేంద్రుడే స్వయంగా పదవిలో కూర్చోవలసినఅవసరం? 135

భార్గ : (నవ్వు) అదా నీ సందేహం దితి పుత్రులంతా ఇంత అమాయికులు కాబట్టే స్థితిగతులు యిలా వున్నాయి.

విప్ర : నోటిలో వెయిబడితే కరవనన్నా నాకు చేతకాదంటారు

భార్గ : నొచ్చుకోకు మనం స్వర్గం జయించామంటే అందులోని అంతరార్థం గ్రహించ లేదన్న మాట ఇంద్రునిఢీకొట్టామంటే దేవతాకోటపై దండెత్తాము ప్రళయ రుద్రునిఫాలనేత్రంపై గ్రుద్దాము చతుర్ముఖుని వదన చతుష్టయంపై దుమ్ము చల్లాము క్షీరసాగర వీచికాడోలికలోనూగు కేశవుని శిరస్సు దట్టించితన్నాము. కాకపోతే త్రిమూర్తి నియతుడైన ఇంద్రుని పదవి హరించటంలో అర్థమేమిటి? ఈ యీ మన్వంతరంలో వీడు వీడు ఇంద్రుడని వ్యవస్థ నెలకొల్పితే కాదని దాన్ని మనం మార్చివేశాము. అలాంటి వ్యక్తులను చూస్తూ, చూస్తూ ఎవడు సహిస్తాడు? సహించినా ఎవడధికారం గుంజాకోలేక ఉపేక్షిస్తాడు? అది అలా ఉంచు ఇంత విప్లవం తెచ్చిపెట్టిన బలి ఏరోజానకు ఏంచేస్తాడో ఎవరికితెలుసు?

విప్ర · అలాగా?

భార్గ : మరేమనుకున్నావు?

విప్ర : ఆఁ ఇప్పుడు అర్ధమవుతున్నది

భార్గ . ఏమది?

విప్ర · ఏమీ లేదు గురూ, మీకడ సెలవుతీసుకొని వెళ్ళినతరువాత ఎందుకైనా మంచిదని, ఇంద్రునితల్లి అయిన అదితి గృహం ఒక కంట కనిపెడుతూ ఉండండని చారులను నియోగించాను

భార్గ : ఇంద్రునిజాడ లేమైనా పొడగట్టాయా?

విప్ర · లేదు అప్పుడప్పుడు కశ్యపబ్రహ్మ వస్తూ పోతూవుండేవాడట బహుశః ఏవో గుసగుసలు జరిగి ఉండవచ్చును.

భార్గ : వివరాలేమీ తెలియలేదా?

విప్ర : లేదు కాని అదితికి మళ్ళీ సంతానమట!

భార్గ : సంతానమా? నిజంగానే-

విప్ర : అవును. పేరు వామనుడట రూపం పేరుకుతగినట్టుగానే ఉంటుందట ఇటీవలనే వడుగుకూడా అయిందట.

136 భార్గ : (ఆదుర్దాగా) పొట్టివాడా – వడుగైనదా?

విప్ర : అవును–అలా ఉద్విగ్నులవుతున్నారు దేనికి?

భార్గ : ఆఁ తేలింది మంచి ఎత్తే ఎత్తారు ఇదుగో విప్రచిత్తి! రేపే తేలిపోతున్నది.

విప్ర : ఏమిటి గురూ!

భార్గ : విజయం!

విప్ర : అది ఇదివరకే లభించిందికదా!

భార్గ : కాదు రేపటితో తేలుతుంది.

విప్ర : విచిత్రంగా వుంది.

భార్గ : ఖచ్చితంగా రేపటితో తేలుతుంది మనదో దేవతలదో జయం తేలిపోతుంది త్వరపడాలి, త్వరపడాలి, విప్రచిత్తీ!

విప్ర · అంత ఆందోళన దేనికి?

భార్గ : కాదు. మించిపోయిన తరువాత అనుకొంటే ప్రయోజనం లేదు. ముందు నీవొక పనిచేయాలి రక్షోలోకం భవిష్యత్తు త్రిభువన అభ్యుదయం, బలిసమ్రాట్టు భద్రం, నీమీద ఆధారపడి ఉన్నాయి

విప్ర : నామీదనా? ఆశ్చర్యంగా ఉంది!

భార్గ . నవ్వుతాలు కాదు విప్రచిత్తీ! నిజంగా నీమీద ఆధారపడిఉంది నీవు చేయవలసిన పని నిర్విఘ్నంగా నెరవేరిస్తే ముల్లోకాలు కృతజ్ఞులు.

విప్ర : ఏమని సెలవు?

భార్గ : ఈ రాత్రే నీవు సర్వసైన్యంతో పోవాలి.

విప్ర . ఎక్కడికి గురూ?

భార్గ : యజ్ఞవాటికకు నాలుగుమైళ్ళు దూరంగా చుట్టూకావలా కాయాలి. కొత్త పురుగుని ఒక్కదానిని కూడా యజ్ఞశాలలోనికి రానీయరాదు. రానిస్తే సర్వం ధ్వంసమే!

విప్ర : రేపే యజ్ఞసమాప్తికదా! పాపం దక్షిణలకోసం లక్షలాది ప్రజలు వస్తారు కాబోలునే! చూస్తూ చూస్తూ వీళ్ళందరినీ హతాశులను జేసి ఎలా పంపించి వేయటం?

భార్గ · హతాశులను చేయటం దేనికి? ఎవరేమి కోరుకున్నా ప్రభుత్వం పేర ఇచ్చి పంపించేసెయ్యి అంతేకాని కొత్త వారిని ఒక్కరిని కూడా రానీయవద్దు-

విప్ర : అలాగే కాని గురూ! ఒక మనవి. 137

భార్గ : ఏమది?

విప్ర : స్థితిగతులు ఇంత విషమంగా ఉన్నాయని బలిసార్వభౌమునికి తెలుసా?

భార్గ : తెలియకపోతే ఎంత బాగుండేది? నీకు నాకు ఇంతశ్రమ ఉండేదేకాదుగదా?

విప్ర : తెలిసి ఉండే ఉపేక్షిస్తున్నారంటారా?

భార్గ : అవును. అది ఎలాఉన్నా సర్వసైన్యంతో సిద్ధంగాఉండడం అవసరం. అందువల్ల మనం అనుకున్నవేవీ చెప్పకుండా ఎలాగైనా నీప్రవర్తన కనుకూలంగా సార్వభౌముని అనుజ్ఞపొంది పోవాలి. లేకపోతే శాసనోల్లంఘనం అతడు ఏమాత్రం సహించడు తెలుసా?

విప్ర : అలాగే-

భార్గ . సరే నువ్వు పద - నేను ఇటువెళతాను.

( ఇద్దరు చెరొక దారిన పోతారు )

అంతఃపురంలో - అర్ధరాత్రి - బలిచక్రవర్తి - రాణి వింధ్యావళి - రెండుసార్లు గంటమోగుతుంది బహుపరాక్! బహుపరాక్! బలి. ( అవులించి, చిటికెలు వేస్తాడు.)

(వింధ్యావళి భయంతో కలవరిస్తుంది)

విం ప్రభూ! ప్రభూ! పతిభిక్ష -

బలి వింధ్యా! వింధ్యా! ఏమిటిది? ఎన్నడూ లేనిది కలవరింత లేమిటి వింధ్యా!

(ఉలిక్కిపడి ఒక్కసారిగా మంచంక్రిందకి దుముకుతుంది నూపుర కంకణాలు ఘల్లుమంటాయి నాలుగుదిక్కులూ పరికించి వణుకుతూ చేయిపట్టుకొని కుదుపుతాడు. కంకణాలు మరొకసారి ఘల్లుమంటాయి )

విం : ఏడీ? ఆ విచిత్ర పురుషుడేడీ?

బలి : వింధ్యా! ఏమిటిది – అలా కంపించిపోతున్నావు? ఇటు చూడు – ఇదుగో నావంకచూడు. నేను, బలిని ఇంక భయందేనికి?

విం : (నిట్టూర్పు విడుస్తూ) మీరా – భద్రముకదా?

బలి : నేనే. ఈ చెమట లిలా దిగజారిపోతున్నాయేమిటి?

విం : ఏమీలేదు. మీరు సుఖంగా ఉన్నారుకదా?

బలి : పిచ్చిభ్రాంతి కాని – బలి కెగ్గుతలపెట్టి బ్రతకగలవాడెవ్వడు? ఇంకా నీకు మెలకువ రాలేదు.

138 విం : మెలకువ వచ్చింది. కాని హృదయం అల్లడ తల్లడమౌతున్నది.

బలి : లేదు. నీకు మెలకువరాలేదు ఇంకా స్వప్నలోకంలోనే ఉన్నావు కాకపోతే యీ భయం ఉండదు

విం : (విషాదంగా నవ్వుతూ) నిద్రపోతున్నవాళ్లు మేలుకొన్న వాళ్ళల్లే మాట్లాడుతారు కాబోలు నాకు తెలియదు లెండి!

బలి : నిజంగా మేలుకొనివుంటే త్రిభువనాధీశ్వరుని పత్ని భయపడుతూందా? అసంభవం?

విం : ఏమో నా హృదయం అశుభం శంకిస్తూవుంది ఎవరో మహాపురుషుడు మీ దగ్గరకువచ్చాడట – సరిగ్గా నువ్వు గింజఅంత ఉన్నాడు.

బలి · ఉంటే!

విం : చూస్తూ చూస్తూ ఉండగానే ఇంతై, అంతై–

బలి : అల్లంతయ్యాడు (వింధ్యావళి వీపుచప్పున మ్రోగుతుంది).

విం : మీకన్నీ నవ్వులే – తరవాత వినండి!

బలి . నేను వినను.

విం  అయితే చెవులు గట్టిగా మూసుకోండి మీకు నామాట ఇప్పుడు వినపడటం లేదు. కదూ? ఆ విచిత్రపురుషుడు బ్రహ్మాండమంతా నిండిపోయాడు చంద్రతారకలు అతని నూపురమణులు సూర్యమండలం అతని మొలఘంటిక. వేదములు అతని ఊర్పులు. సత్యలోకం అతని శీర్షం.

బలి  కవిత్వం మంచి పాకాన పడ్డది. ఆస్థానకవి ఒకడైనా యీ మాత్రం చెప్పిన పాపాన పోలేదు.

విం  విదూషకత్వం ఒకటే తక్కువ ఒక అడుగుతో భూమి, మరొక అడుగుతో స్వర్గం ఆక్రమించాడు. అంతటితో ఆ విచిత్రవ్యక్తి సంతుష్టి పొందలేదు మళ్ళీ చరణ మెత్తాడు. లోకాలు ఆక్రోశించాయి భార్గవులకు ఒక కంట నెత్తురు వేరొక కంట నీరు కారుతున్నది. త్రిభువనాధీశులమోము వాలిపోలేదు. వాడిపోనూలేదు. ఆమహాచరణం, ఆ కఠోర చరణం త్రిభువనాధీశుల (ఏడ్పు)

బలి  : వింధ్యా, వింద్యా, అది నిజంకాదు, నిజంకాదు కల వట్టికల. ఇటుచూడు. ఇదుగో నేను బాగానే ఉన్నాను. నువ్వూబాగానే ఉన్నావు.

విం  · (మళ్ళీ ఏడ్పు)

బలి  . మహారాణులు ఏడుస్తారా? ఛి ఛీ ఊరుకో వట్టి బేలవు. నానాటికి పసిపిల్లవై పోతున్నావు. లేనిపోనివి శంకించుకొని అడలిపోతున్నావు. నిర్నిమిత్తంగా ఆనందమయమైన జీవితాన్ని పాడు చేసుకుంటున్నావు.



విప్ర  : భిక్షాందేహి, భిక్షాందేహి.

విం  : ఎవరిది?

బలి  : ఎవరో ఆర్తుడు.

విం  : నాకేదో భయంగా ఉంది

బలి  : నీకు అన్నీ అనుమానాలే!

విం  · కలలోకూడా ఇలాగే జరిగింది అంతా నిజమౌతుంది కాబోలు.

బలి  · ఎందుకంత ఆందోళన?

విం  · కేవలం అతడు యాచకుడే అయితే యీ అర్ధరాత్రిన రావలసిన పనేముంది

బలి  · రక్షకభటులు అతని దైన్యస్థితిచూచి లోనికిపోనిచ్చి ఉంటారు.

విం  అంత దీనస్థితిలో ఉంటే వాళ్ళే ఏదోసహాయం చేసి పంపించి ఉండేవాళ్ళు కాదు, అతడు వాళ్ళకన్నుమలపి వచ్చి ఉంటాడు నాకు భయంగా ఉంది.

కం : (దూరంగా) భిక్షాం దేహి!

బలి : ఎవరిది?

కం : భిక్షార్థిని.

బలి : దుర్గమమైన యీ కోటలోనికి ఎలావచ్చావు?

కం : దుర్గమమా? త్రిభువనాధీశ్వరుల సౌధం అర్థులకు దుర్గమమా (నవ్వు) దుర్గమం శత్రువులకు.

విం : నిశాసమయాన అర్థించవలసిన అవసరమంత ఏమివచ్చినది?

బలి : ఎంత అవసరమో రాకపోతే ఈవేళ – కానివేళ ఎందుకు వస్తాడు?

కం : అవును అనవసరంగా ఎవరైనా నిద్రాభంగం కలిగిస్తారా?

బలి : ఏమికావాలి?

కం : నాకోరిక చెల్లిస్తారా!

బలి : బలిని కోరి ఇంతవరకు విఫలుడైనవాడు లేడు.

విం : ఎవరది? తమ్ముడు విప్రచిత్తా?



విప్ర : అవును నేనేనమ్మా

బలి : (ఆశ్చర్యంగా) విప్రచిత్తి! ఎక్కడనుంచి ఊడిపడ్డావు? క్షేమమేకద? ఇంత కాలంనుంచి ఎక్కడున్నావు? నీవు విప్రచిత్తివికావు. కఠిన చిత్తుడవు.

విప్ర : ఇంతకూ నాకు భిక్ష అనుగ్రహించారా?

విం : తమ్ముడూ ఇవాళ వింతగా మాట్లాడుతున్నావేమిటి?

విప్ర : వింత ఏముంది? ఒకానొక అర్థం త్రిభువనాధీశులవల్ల పొందాలని అడిగాను

బలి : అడగరాదా?

విం : అంత ఉద్వేగంతో మాట్లాడుతున్నావేమిటి? ఏమన్నా ప్రమాదం వచ్చిందా?

విప్ర : (తమాయించుకొని) ప్రమాదమా? అసంభవం!

బలి : వచ్చినవాడవు అలాగే నిల్చున్నావేం కూర్చో.

విప్ర : రేపొకరోజు సర్వసైన్యం నాఆధీనంలో ఉంటుంది. రేపట్నో ఉత్తరువులకు భంగం కలుగరాదు ఇదే నాకు కావలసిన భిక్ష – త్రిలోకవల్లభులు అనుగ్రహించారు కాదూ?

బలి : బలి ఒకటి, ప్రతిజ్ఞ మరొకటి కాదు.

విప్ర ధన్యుణ్ణి, సెలవు తీసుకుంటాను

విం ఇప్పుడేకదా వచ్చినది అప్పుడే వెళ్ళివస్తానంటేవేమిటి? అందులో ఈనడిరేయి

బలి రేపు యజ్ఞసమాప్తి అయినపిమ్మట నేనుగూడా వస్తాను కదా?

విప్ర ప్రభువులు క్షమించాలి నేను వెంటనే పోవలసి ఉంది!

విం నీమాటలు నీప్రవర్తన చూడగా నా హృదయందోళన ఎక్కువవుతుంది ఉన్నదేదో చెప్పగూడదా? ఆమాత్రం చిత్తశాంతికి గూడా నోచుకోలేదా తమ్ముడూ?

విప్ర అంతగా కాళ్ళు త్రొక్కుకోవలసిన పనిలేదమ్మా మళ్ళీ త్వరలోనే వచ్చి అంతా మనవిచేస్తాగదా! ప్రభువులు అనుజ్ఞ ఇవ్వాలి

బలి మంచిది (విప్రచిత్తు వెళ్ళిపోతాడు) అంతా బాగానే ఉంది గూడు పూర్తి అవుతూ వుందన్నమాట.

విం : ఏమిటాగూడు?

బలి . సాలిగూడు

విం : ఎవరా సాలీడు? 

బలి · అదే నేనూ ఆలోచిస్తున్నది

విం : భార్గవాచార్యులు ఇటీవల కనిపించటం లేదు వారికి ఏమైనా కోపం వచ్చిందా?

బలి · దేనికి?

విం ఇదివరకువలె తరచు రావటంలేదు.

బలి · యజ్ఞం సాగుతున్నదికదా? అందులో నిమగ్నులై ఉన్నారు. అందువల్ల రావటానికి వీలుచిక్కటంలేదు కాబోలు!

విం అది సాకుమాత్రమే. కారణమేదో ఉంటుంది

బలి ఏమది?

విం ఏమో నాకెలా తెలుస్తుందీ?

బలి వింధ్యా! నేడెందుకో అపోహలు పోతున్నావు ఎందుకో నీమనస్సు ప్రతీది శంకిస్తూవుంది. బహుశః నిద్రపట్టక పోవటమే కారణమైవుంటుంది అదమరచి సుఖంగా నిద్రపోయి లేస్తే లోకాలన్నీ హాయిగా కన్పిస్తాయి

విం నాకు నిద్రరావటము లేదు.

బలి · చక్కగా వస్తుంది ఇలా పడుకో

కం · (దూరంలో) అమ్మా – వింధ్యా, వింధ్యా, నిద్రపోతున్నావా తల్లీ!

బలి : ఎవరది?

విం : ఆచార్యులు భార్గవుల కంఠస్వరం వలె ఉంది

బలి : ఆచార్యులెప్పుడూ నన్ను పిలుస్తూండేవారే!

విం : నేను చెప్పలేదా? మీమీద వారికెందుకో కోపం వచ్చింది.

కం · అమ్మా – వింధ్యా!

విం : ఇటు, ఇటు, దయచేయండి.

బలి : ఆచార్యులకు నమస్కారం. ఆపీఠం అలంకరించండి.

విం · గురుపాదులకు నమస్కారం అక్కడ ఆసీనులుకండి!

భార్గ : దానికేమిగాని వింధ్యా నువ్వు ఏడ్వగలవా?

విం . అదేమి గురూ! అదేమి గురూ!



భార్గ : పెద్దపెట్టున ఏడవాలి నీ అశ్రు ధారా ప్రవాహం త్రైలోక్య సామ్రాజ్యం కరిగించి అంతర్లీనం చేసికొని ప్రవహించే నీ మగని దానధారావాహినిని అరికట్టాలి చేయగలవా వింధ్యా?

విం : అదేమి గురూ?

భార్గ : నేను చెప్పటందేనికి? నీ మగనినే అడుగు

బలి : అది గురువచనం భాష్యం చెప్పగల తాహతు, యోగ్యత నాకు లేవు.

విం : ఏదో విపత్తు అలముకొని వొస్తున్నది కాబోలు అనుకొంటూనే ఉన్నాను. అలాగే జరగబోతున్నది కాబోలు గురూ, గురూ, గడచే మార్గం లేదా? అప్రతిమానప్రజ్ఞా ధురంధరులైన మీకు అతీతమా? పలకరేంగురూ?

భార్గ : ఏమి కావాలి?

విం : గడిచేమార్గం.

భార్గ : లేకేమి? ఉన్నది. ఉండబట్టే యీ అర్ధరాత్రాన ఈ ముదుసలి పడుతూ పడుతూవచ్చాడు.

విం . అయితే చెప్పరూ, ఆ మార్గమేదో చెప్పరూ?

భార్గ · ఎప్పుడో చెప్పాను

విం . ఏమని?

భార్గ : నీ మగనిని అడుగు

విం . మీకు గురుదేవులు చెప్పారా?

బలి :

విం : ఏమ్మని?

బలి : ధారాస్రవంతి అరికట్టవలెనని. మాటలకూ చేతలకూ సంబంధం ఉండ కూడదని. దయాదాక్షిణ్యాలు పనికిరావని. పురుషుడూ క్రియా వేరని, గమ్యం గమకమూ వేరని, నీతి నియమాలు అవసరం లేదని, అధికార సముపార్జ సంరక్షణలే ఏకైక లక్ష్యమని.

విం : అసంభవం. గురుదేవులలా ఎన్నడూ చెప్పరు.

బలి : ఎదురుగా ఉన్నారుగా వారినే అడుగు-

భార్గ : (కోపం దిగజారిపోయింది వాదించటానికి చేతగాక మారాముచేసే పసి వాడిలా) నేనలా ఎన్నడూ చెప్పలేదు బలీ, బలీ, నా హితోపదేశానికి అదేనా భాష్యం? అదేనా కూలంకషవ్యాఖ్య? కాదు, కాదు. 

బలి : మరేమని?

భార్గ : రేపాకరోజు వాగ్దానంచేసినాకూడ, నీ దానం మానివేయమంటున్నాను. త్రిభు వనాలుతిరిగి అధఃపతనం పొందకుండా కాపాడుమంటున్నాను. అభ్యుద యానికి, ఆత్మసిద్ధికీ సోపానం ఏర్పరచమంటున్నాను చేజిక్కిన అధికారాన్ని వ్యర్థం చేయవద్దు అంటున్నాను దేవతాకోటి చేస్తున్న కుతంత్రాన్ని విచ్ఛిన్నం చేయమంటున్నాను. ఇదంతా నా కోసం కాదు నీ దారాపుత్రాదుల కోసం కాదు బలి స్వార్థంకోసంకాదు – శైశవడోలికాలోలులైన నేటి పాపలకోసం – మూడులోకాల చేతనాచేతన కోటికోసం ఇది నేరమా వింధ్యా! నీవేచెప్పు. పగవాళ్ళు మూగి అన్యాయంగా ఏకాకినిచేసి కంఠంనులిమి వేయబోతూంటే, ఒక్క అనృతంతో తప్పించుకోడం, అధర్మకార్య నాయకులైన వారిని అంత మొందించటం, తిరిగి ధర్మం సుప్రతిష్ఠితం చేయడం కర్తవ్యం కాదా? వింధ్యా నీవేచెప్పు – చెప్పలేవా వింధ్యా?

బలి . సరే వింధ్యా! ఈ ఒక్కమాటకూడా విను నీబిడ్డ ఆకలి గొంటాడు. అమ్మా అన్నమంటాడు ఆ దీనవదనం నీ కన్నులముందు గోచరిస్తుంది నీహృదయం

గిజగిజలాడిపోతుంది వెంటనే 'అలాగే నాయనా' అంటావు వాడు సాధార ణంగా క్రూరుడుకాడు కాని ఒకవేళ అవుతాడే అనుకో – నీ సర్వస్వం తినివేయటానికి ఉపక్రమిస్తాడు – అప్పుడు తినటానికి వీలులేదంటావా? అసలు నీకు తిండి పెడతాననలేదంటావా? అనృతం ఆడుతావా! ఇలాంటి అనృతంతోనే నీ పిల్లలను పెంచుతావా? అయితే నీ మాతృత్వం దేనికి? నీలో మాతృత్వం చంపుకొని ఉంటావా? ఆ పవిత్ర మాతృత్వం లేని జీవచ్ఛవ కంటే గండశిల మేలుకాదా? అదలా ఉంచు నీ అధికార రక్షణకోసం, నీ ప్రాభవరక్షణకోసం, అనృతమాడుతావనుకో – నీ తల్లితండ్రులూ నీలాగే ప్రవర్తించారనుకో – నీవు ఉండే దానివా? నీ పిల్లలు నీలాగ ప్రవర్తిస్తారనుకో నీ జీవితం ఏమవుతుంది? ఇలాగే అయితే లోకాలన్నీ ఏమవుతాయి? బూడిద బుంగ లవుతాయి. ముందు వెనుకలు చూచుకొని చెప్పు – జీవితంలో దయా దాక్షిణ్యాలు, నీతి నియమాలు ఋతశౌచాలు వాక్క్రియలు అవసరంలేదా?

భార్గ : (మండిపడుతూ) ఈ త్రిభువనాధిపత్యం ఉందే – ఈ నీచాతినీచమైన త్రిభు వనాధిపత్యం, మీ వంటి లోకోత్తర పురుషులకుంటే తగదు ముమ్మాటికి తగదు

144 విం · (విషాదంగా) గురుదేవులు శపిస్తున్నారు

బలి · కాదు – భవిష్యత్తు పలుకుతున్నది

భార్గ (శాంతంగా) అమ్మా, వింధ్యా! వస్తాను – వత్సా! బలీ గుర్తుంచుకో – వస్తాను. (వెళ్ళిపోతాడు)

(కోటలోనుంచే గంటలు మ్రోగుతుంటాయి)

చందాతపంబులు సాంద్రక్షపాతమ
స్పృహయుద్ధ్వాలై పరిశ్రాంతిఁబొందె
అతిదరిద్రాణ దేహద్యుతి ప్రాణమై
ప్రాలేయ కిరణబింబంబువ్రాలె
అపస్వరంబులై ఆకాశవీధిని
కోటిభాస్కర కరాంకురము లెగసె
అమహతీతర దీప్తి నంతంతచుక్కలు
సంఖ్యావిధేయ శేషంబులయ్యె
కుముద కేదారముననుండి క్రొత్తవిరియు

కలమషండమ్మునకు వేడ్కగొల్పవచ్చు
కొదమ తుమ్మెద కడరెక్క నుసుమపెట్టి
అభిరవంబైన ప్రథమ సంధ్యాగమంబు

బలి : అదిగో కోటలో నుంచి ప్రభాత ఘంటికలు వైతాళిక గీతులు వినిపిస్తున్నాయి త్వరగా ప్రయత్నపడాలి–

(బలి కాలిసవ్వడి, వింధ్యావళి పాదనూపురధ్వని నిష్క్రమణను సూచిస్తాయి)

వామ : తార్క్ష్యాదులారా త్వరగా నడవండి. జాగుచేయకండి. విప్రచిత్తిని తప్పించుకొనేటప్పటికి యీ వేళ అయింది. వేళ అతిక్రమించకముందే, తిరిగి విప్రచిత్తి ఎదుర్కొనకముందే దానధార స్వీకరించాలి. భార్గవుడడ్డుపడక ముందే పొందాలి – లేకపోతే పడినశ్రమంతా వ్యర్థం – దుస్సహతేజుడైన యీ బలిని అణచి వేయలేము – జటలు వల్లిస్తూ మెల్లగానడవండి – ఇది వామనుని అనుశాసనం –

తార్క్ష్య : అతడు దాన మివ్వడమో?

వామ : అసంభవం. అగ్ని దహించడా? సూర్యుడు ప్రకాశించడా?



తా : అతడు ఇచ్చినా మనం స్వాధీ నపరుచుకోవాలికదా– విప్రచిత్తి భార్గవాదులు తిరగబడితే మనమేమవుతాము–

వామ : బలి ఉండగా ప్రమాదం లేదు. అతడు తన ప్రతిజ్ఞకు దాసుడు–రక్షోలోకం కూడా ప్రతిజ్ఞాబద్ధం. అతడు కాదంటే ఊరుకుంటుంది. కాదని ఒకరిద్దరు తిరగబడినా ఇబ్బంది లేదు. త్వరగా నడవండి (చక చకా నడుస్తుంటారు)

ఇతడే దానవ చక్రవర్తి సురలోకేంద్రాగ్ని దిక్పాలకా
కృతి గర్వాప నయప్రవర్తిగత లోభస్ఫూర్తి నానాముఖా
వ్రత దాన ప్రవణానువర్తి సుమనో రామామనోభేదనో
ద్ధత చంద్రా తపకీర్తి సత్య కరుణాధర్మండు సన్మానమున్.

తా : ఎవరు ఆమహా తేజస్వి?

వామ : ఎవరా?

తా : బలిచక్రవర్తి

వామ : ఔను!

(దూరంనుంచి)

బలి : వింధ్యా అటు చూడు – ఆ వచ్చే బ్రహ్మణ సందోహం ముందరి వటువు - అసలే యింతటిమూర్తి దీనికి ఒక గొడుగు – కమండలువు – భిక్షపాత్ర - పాదుకులు –

విం · చంకలో గొడుగుకూడా ఉంది – పాపం ఎంత దూరం నుంచి వస్తున్నాడో – మీరు నిజంగా నిర్దయులు కాకపోతే ఆ వటువును ఇక్కడి దాకా రప్పించరు

బలి : ఎన్నాళ్ళకి అతడు ఇక్కడికి చేరుకుంటాడు – ఇలాంటి వారిని కాదనగలవా వింధ్యా?

విం . (విచారం) చూడగా చూడగా స్వప్నంలోని విచిత్ర వ్యక్తిలాగా కనిపిస్తున్నాడు ఇతనికే కాబోలు ఆచార్యులు దానమీయవద్దన్నది

వామ : స్వస్తిశ్రీ బలిసామ్రాట్టుకు....

బలి : దయచేయండి. ఆ పీఠంపై కూర్చోండి. పేరు?

వామ : వామనుడంటారు.

బలి : ఆగమనానికి ఫలం?

 వామ : చెప్పమంటారా? త్రిపదా ఫలం మీవల్ల పొందగోరి వచ్చాను.

బలి : (నవ్వి) ఏమది?

వామ : మూడడుగుల భూమి.

బలి : మూడడుగులంటే మూడడుగులా? భ్రాంతి పడ్డారేమో ఆలోచించుకోండి.

వామ : (నవ్వి) త్రిభువనాధీశ్వరా! ఆలోచించుకున్నాను. ఆ మూడడుగులు కాదన కిస్తేచాలు. అదేనాకు బ్రహ్మానందం. అనుగ్రహించి ఆ మూడడుగులు దానధార దత్తం చేయండి చాలు

బలి · వింధ్యా!

విం . ఇదిగో హేమకలశం ఇప్పుడే తెస్తున్నాను.

భార్గ (దూరాన్నుంచి త్వరత్వరగా నడిచివస్తూ) వత్సాబలీ ఆగు, ఆగు, ఓయీ మాయావటూ, ఆగు, ఆగు

వామ . పుణ్యస్వరూపు డెవరిది?

భార్గ అవును. పాదుగు కోసుకొని పాలుత్రాగేవాళ్ళం కామిత మిచ్చే కల్పవృక్షం దగ్ధం చేసేవాళ్ళం, మే మెలాపుణ్యస్వరూపులమౌతాం? ఒకటి ఆలోచించుకో

ఈ దానధారతో త్రిలోకరాజ్యలక్ష్మిని త్యజించ బోతున్నావు త్రిభువనాశా జ్యోతిని ఆర్పివేయబోతున్నావు ఆలోచించుకో

బలి . గురుదేవా ఆలోచించాను.

వామ ఆలస్యం దేనికి?

విం . ఇదిగో జలం!

బలి . పట్టండి – సూర్యచంద్రాదుల సాక్షిగా మూడడుగల భూమిని దానం చేస్తున్నాను

విం : అదేమి, అదేమి, విచిత్రంగా ఉంది కలశం నుంచి దానధార పడటం లేదు.

వామ : కలవళపడకండి. దుష్టగ్రహం అడ్డుపడివుంటుంది. ఈ కుశాగ్రంతో చక్కబడుతుంది.

విం : అయ్యో! అయ్యో ఆచార్యుల కన్ను నెత్తురోడుతున్నది.

వామ : దానధార నిరోధనకు తగిన ప్రతిఫలం కుశాగ్ర మనుగ్రహించింది. సరే – దానం గ్రహిస్తున్నాను. (పెద్దధ్వని)

తార్క్ష్య : విచిత్రం – విచిత్రం. 147

అహో, అహో, భూమిఅంతా ఒక్కఅడుగైంది. స్వర్గమంతా మరో అడుగైనది ఏదీ మూడో అడుగునకు చోటు!

వామ : మూడో అడుగెక్కడ? అలా చూస్తావేం?

విం : ఘోరం, ఘోరం, ఆడితప్పని దాక్షిణ్యమూర్తిని అన్యాయం చేయటం ఘోరం!

(కొంచెం దూరంలో పరుగిడివస్తున్న గుర్రాల గిట్టల చప్పుడు. హేషలు, ఘీంకారాలు, వీరుల సింహ నినాదాలు వినిపిస్తాయి.)

విప్ర . అమ్మా భయపడకు, భయపడకు. విప్రచిత్తమేనిలో ప్రాణాలున్నంతవరకు ఈ గారడిలు, పన్నాగాలు సాగవు ఇక్కడున్న పగతురనందర్నీ బంధించండి! హేతువు హేతులారా! కాలభైరవా! విజృంభించండి. కొట్టండి. నరకండి – పగవులుగు నొక్కదానిని కూడా పోనీకండి.

(ఘాతప్రఘాతాలు, సింహనాదాలు, ఆర్తనాదాలు, కేరింతలు పెడబొబ్బలు వినిపిస్తాయి )

బలి వత్సా విప్రచిత్తి! వత్సా విప్రచిత్తి!

విప్ర : వస్తున్నా ప్రభూ, వస్తున్నా!

బలి : ఏమిటి ఈ సంరంభం నాయనా!

విప్ర : కుతంత్రాలు రేపిన విషజ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయి – స్వాశ్రితాన్ని నాశనం చేస్తున్నాయి అంతే!

బలి . వారికి మూడడుగులు దానమిచ్చాను ఇంకొక్కడుగు బాకీపడింది

విప్ర : నాకు వాగ్దానమిచ్చారు ఈరోజున నా ఉత్తరువులకు తిరుగు ఉండరాదని – ఇవ్వలేదా? ఇవ్వలేదా?

బలి : ఎవరు కాదన్నారు?

విప్ర : అందువల్ల మీరు జోక్యం కల్పించుకోగూడదు

బలి : మా విప్రచిత్తి జ్ఞానవంతుడు – భీరువుకాడు

విప్ర : నేను పిరికిపందనా?

బలి : నిజంగా వీరుడవా? అయితే యీ జంకుదేనికి? ప్రతిజ్ఞా నిర్వహణం చేయలేక ఇలా కంపించిపోయి ఇలా నీచంగా పోరాడుతావా? భూమినంతా అనాధకోటి రక్తప్లావితం చేస్తావా? మాటలకు చేతలకు దుస్తరాంతరం కల్పిస్తావా? దయా దాక్షిణ్యాలు, దానధర్మాలు, తుచ్ఛాతి తుచ్ఛములైన సంకుచిత స్వార్థాలకోసం బలియిస్తావా?



విప్ర : వీరు చేస్తున్న దేమిటి? ఇంత నీచంగా దొంగదారిగా వచ్చి ఉత్తమోత్తమ ప్రకృతి అని అయినా చూడకుండా త్రిలోకాలకు ఆరాధ్య చరిత్ర అని అయినా గణించకుండా ప్రవర్తించలేదా?

బలి : అయితే నీవుమాత్రం తక్కువ చేస్తున్నదేమిటి?

విప్ర : కుతంత్రాన్ని ఎదుర్కొంటున్నాను

బలి : కుతంత్రంతో – అంతేగా – నాయనా ఎన్నడైనా చెడు మార్గాలు గమ్యాన్ని చేరవేస్తాయా? విషవృక్షం అమృత ఫలమిస్తుందా? లేదు ఈ పోరాటంవల్ల ప్రయోజనం లేదు నామాట విను – విశ్వాభ్యుదయాంకురానికి ఈ దానధారతో దోహదమిస్తున్నాము. నేడు వీచే ఈ వడగాలికి యీ మొక్క వాడిపోవచ్చును. అంతమాత్రంచేత నీవంటి సత్సంకల్పులు దోహదం మానరు ముష్టివిత్తులో నుంచి ముష్టివిత్తే మొలుస్తుంది. నామాట విను.

విప్ర : ఈనాడు నిజంగా మీరు త్రిభువనాధీశ్వరులయారు

# విధి నిర్ణయం!

## పాత్రలు :

| | | వయస్సు |
|---|---|---|
| నాగేశ్వరరావు | | 40 |
| జానకి | (భార్య) | 35 |
| చంద్రం | (పెద్దకొడుకు) | 12 |
| రాజ్యం | (కూతురు) | 10 |
| భరతుడు | (చిన్నకొడుకు) | 06 |
| రామారావు | (స్నేహితుడు) | 44 |
| డాక్టరు | | 50 |

రంగం : డాబా                    సమయం   మునిమాపు

(చెళ్ళుమని వీపున ఒకటి చరచిన చప్పుడు పెద్దపెట్టున మూగఏడుపు వినిపిస్తుంది )

రాజ్యం : ఏం, చేతులంత తీటగా ఉన్నయ్యా? నోరువాయిలేనివాణ్ణి చేసి అలాబాదావు? ఊరుకో నాన్నా ఊరుకో ఆనిక్క నాన్నగారితో చెప్పి....

చంద్ర : ఒకమ్మాయి వీపుమీద దెబ్బల కేడుస్తున్నది!

రాజ్యం . నాన్నగారినిరానీ ఎవరి వీపు దెబ్బలకేడుస్తుందో తేలుతుందిగా. ఎందుకంత తొందర? చెబుతాగా!

చంద్ర ఏమని?

రాజ్యం : నాన్న, నాన్న అన్నాయే, నిన్నరాత్రే ..

చంద్ర : (వెక్కిరిస్తూ) నిన్నరాత్రే. .

రాజ్యం : చదువు, సంధ్య మానేసి రెండో ఆట సినిమాకు వెళ్ళాడని చెప్పకపోతే నాపేరు రాజ్యంకాదు.

చంద్ర . చెబుతావా! (ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తుంటాడు.)

రాజ్యం · (గొంతు పెద్దదిచేసి) నాన్నా, నాన్న! (చంద్రంతో) చూస్తావెందుకూ, రా, కొట్టూ! 151

చంద్ర ఓసి నీ గొంతుకొయ్యా! ఇల్లెగిరిపోతుందే! (లోపలి నుంచి మూలుగు వినిపిస్తుంది) అదిగో అమ్మకూడా మూలుగుతున్నది!

రాజ్యం ; అమ్మ మేలుకుంటుందనుకొంటే ఇంతగోల చేస్తావా? వాణ్ని ఇలా చెండుకు తింటావా?

చంద్ర · (మెల్లగా) అబ్బా చండీ! కాస్త ఊరుకోవే పుణ్యముంటుంది!

రాజ్యం : (గొంతు మరింత పెద్దదిచేస్తూ) ఈ టక్కుటమారీలు ఎవరికి తెలియదంటా! నాన్నగారినిరానీ!

జానకి : (లోపలినుంచి) ఇస్ అబ్బ!

చంద్ర : (మెల్లగా) అబ్బా నీకేనే చెప్పేది!

రాజ్యం : (గొంతు కాస్త తగ్గించి) అయితే తమ్ముడి జోలికీ నాజోలికీ రాకుండా ఉంటావా?

చంద్ర : రాను,

(బయటనుంచి నాగేశ్వరరావు కేకవేస్తాడు)

నా · అరేచంద్రం!

చంద్ర . వస్తున్నా నాన్నగారు! ఓసే రాజ్యం, నాన్నగారితో చెబుతావా?

రాజ్యం · ఎందుకు చెప్పను?

చంద్ర · మీ ఇద్దరి జోలికి రానంటినిగా?

రాజ్యం : నమ్మకం ఏమిటి?

చంద్ర : రానంటే రాను

రాజ్యం : అయితే చెంపలు వేసుకో

చంద్ర · నన్నొడిపిస్తే నీకేమొస్తుందే?

రాజ్యం . అదంతా నీకుదేనికి? ముందు వేసుకొంటావా లేదా . అలాకాదు ఆ దేవుడిపటం వేపు తిరిగి నేనెప్పుడూ చిన్న వాళ్ళిద్దరి జోలికి పోనంటే పోనని మూడుసార్లు చెళ్లున చెంపలు వేసుకోవాలి ఆఁ . ఒకటీ రెండూ (చెంపలు వేసుకొన్నచప్పుడు )

నాగేశ్వర .(లోపలికివస్తూ) అరే చంద్రం!



రాజ్యం అటుమళ్ళుకు కానీ.

చంద్ర (మెల్లగా) నాన్నగారు వస్తున్నారే!

రాజ్యం ఏం ఫరవాలేదు కానీ, లేకపోతే నాన్నగారితో చెప్పానే.

చంద్ర : రాజ్యంకాదురా బాబూ రాకాసి!

రాజ్యం . అయితే చెబుతా!

చంద్ర : చెప్పకే తల్లీ చెప్పకు ఇదిగో వేసుకొంటున్నాగా?

(చెళ్లుమని చెంపలు వేసుకుంటాడు. ఇంతలో నాగేశ్వరరావు లోపలికివస్తాడు చంద్రం చెంపలువేసుకోవటం కనిపిస్తుంది )

నా : ఏమిటిరా అది? (చంద్రం గిరుక్కున తండ్రివైపు మళ్లుతాడు ) ఎందుకు ఏడుస్తావు?

రాజ్యం ఏమీలేదు నాన్నగారు! జబ్బు నయంచేసి మా అమ్మను మా కీమని దేవుణ్ణి అడుగుతున్నాము నాన్నా! అంతే కాదురా అన్నాయ్!

చంద్ర (తెప్పరిల్లుకొని) అంతే నాన్నగారు! ఇప్పటికే మంచమెక్కి 25 రోజులైందా? అమ్మ జబ్బు తొందరగా నయంకావాలని మొక్కుకొంటున్నాము

రాజ్యం నాన్నగారూ!

నా ఏమిటమ్మా?

రాజ్యం దేవుడికి జాలిలేదా?

నా : ఎందుకుండదూ?

రాజ్యం . అయితే అమ్మను ఇన్నాళ్ళు జబ్బుతో బాధపెట్టటం దేనికి?

నా : దేవుడు అలాచేస్తాడా?

రాజ్యం : అయితే మరెవ్వరు?. . చెప్పమేమినాన్నా?

నా : ఏమిచెప్పను? చెప్పినా నీకు తెలియదమ్మా, (మూగ నవ్వు వినిపిస్తుంది) అడుగో వస్తున్నాడు. ఏమిటి వాడి చేతిలో ఉంది?

చంద్ర : ఉత్తరంనాన్న, పోస్టుమన్ పడేసిపోతే లంకించుకొన్నాడు. ఎంతబతిమాలినా ఇవ్వలేదు. ఎలా చించాడో చూడు దొర!

నా · రా నాన్నా, రా! కొట్టాడా అన్నాయి నిన్ను!

చంద్ర : కొట్టలేదునాన్నా, ఇంకా చెల్లాయిని అడుగు

నా · వాడిజోలికిపోకండి! రా నాన్నా రా!

భర : ఊఁ, ఊఁ, ఊఁ!



నా : చూడరా చిట్టితండ్రి ఉత్తరం ఇచ్చాడురా! వాడికున్న జ్ఞానం మీకుందిరా? ఏదీ? చూడనీనాన్నా......

రాజ్యం : ఏమిటినాన్నగారు చెయ్యి అలా వణికిపోతున్నదే?

నా : ఏమిలేదమ్మా! ఒరేచంద్రం!! ఒకసారి రామారావుగారిని నేనురమ్మంటున్నానని పిల్చుకురా. పో. ఇక్కడున్నట్టుగా రావాలి.

చంద్ర : ఓ ..... కూ గుప్‌గుప్‌గుప్ (వెళ్ళిపోతాడు)

రాజ్యం : అబ్బబ్బ! ఎప్పుడూ అంతే నాన్నగారూ.

నా : అన్నాయికాదూ అలా అనొచ్చా?

రాజ్యం . ఏళ్లు పైనబడ్డాయన్నమాటేగాని..... రవ్వంత జ్ఞానముంటేనా? అమ్మకు అంత బరువుగావుంటే వాడలా చేస్తాడా మరి?

నా : అలా అనరాదమ్మా! లోకం అన్నతరువాత అనేక తరహాలుంటాయి వాటితో సర్దుకుపోవాలి

రాజ్యం సరేకాని ఆ ఉత్తరంలో ఏముంది నాన్నగారు?

నా · ఏమున్నది, ఏమీలేదే!

రాజ్యం . అమ్మదొంగా, దాస్తున్నారు!

నా . దాయటానికేముంది?

రాజ్యం . ఎందుకలా ఉన్నారు నాన్నగారూ?

నా : (నవ్వుతూ) మీ మామయ్య ఉత్తరంలో కధవ్రాస్తే ఆలోచిస్తున్నా

రాజ్యం : నిజంగానే?

నా : అబద్ధమేముంది? ఇదిగో.

రాజ్యం : వట్టిదే. నవ్వుతున్నారు.

నా : వట్టిదే అయినప్పుడు నేను చదవటందేనికి?

రాజ్యం : అయితే చదవండి!

నా : అనగా అనగా ఓ రాజా.

రాజ్యం : ఆరాజా వేటకు వెళ్ళాడు తరువాత?

: దప్పిక అయింది.



రాజ్యం : రాజాకు దప్పిక అయిందా?

నా . రాజాఅయితే మాత్రం దప్పిక కాకపోతుందా?

రాజ్యం : అయింది. అయితే?

నా : నీళ్ళకోసం అడవిఅంతా వెదికాడు ఎక్కడా గుక్కెడు నీళ్లు కనిపించలా. చివరికి ఒక ముని ఆశ్రమం కనిపించింది.

రాజ్యం : ఆ ముని మంచినీళ్ల ఇచ్చాడా?

నా : లేదు. తపస్సులో ఉన్నాడు రాజా ఎంతో దీనంగా ప్రార్థించాడు అతడు పలకలా. రాజాకు చివరకు కోపం వచ్చి దగ్గర్లో చచ్చిపడి ఉన్న పాము కనిపిస్తే దాన్ని ముని మెళ్ళో వేసి రాజ్యానికి వెళ్లాడు.

రాజ్యం : తరువాత ఏమయింది?

నా · మునికొడుకువచ్చి తండ్రిమెడలో పామునుచూచి మండిపడ్డాడు పామును మెళ్ళోవేసిన దుర్మార్గుడు వారంరోజులలో పాముకాటుచే మరణించుగాక అని శపించాడు.

రాజ్యం అయ్యోపాపం! ఆరాజా ఏమిచేశాడు?

నా    రాజుకు ఈ వార్త చేరింది చేరగానే మంత్రులతో ఆలోచించాడు వారు సముద్ర మధ్యంలో ఒంటిస్తంభం మేడకట్టించి రాజును అందులో ఉంచారు

రాజ్యం : తరువాత ఏమైనదట?

నా . ఆమేడను మాంత్రికులు భటులు కాపలా కాస్తూ వచ్చారు.

రాజ్యం : అయితే-పాము వచ్చిందా?

నా : లేదు బ్రాహ్మణుడొకడు వచ్చాడు.

రాజ్యం · వచ్చి?

నా : ఆశీర్వదించి రాజుకు పండు ఇచ్చాడు. ఆ పండులోనుంచి బుస్సున పాములేచి రాజును కాటందుకొన్నది.

రాజ్యం - అయ్యో పాపం!

రామా : అమ్మా రాజ్యం, మీనాన్నగారున్నారా?

రాజ్యం : ఓయ్ వస్తున్నా! రామారావుగారు వచ్చారు నాన్నగారూ.

నా : లోపలికి రమ్మను, నువ్వూ అన్నాయి పోయి డాక్టరుగారిని పిల్చుకొస్తారా!

రాజ్యం : (పోతూ) ఓ. మిమ్మల్ని రమ్మంటున్నారు.

గుర్రాల దౌడులూ గుగ్గిళ్ళ కేను

మాయన్న దూకుళ్లు మామంచి కేను!

రామా : (లోపలికివస్తూ) ఏమిటి అలా ఉన్నావు?

నా : ఏమీలేదు నిలుచున్నావేం? కూర్చో

రామా : నువ్వు నిల్చోమన్నా నిల్చోనుగాని మా చెల్లెలికి ఎలా ఉంది?

నా : అలాగే ఉంది పొద్దున డాక్టరు ఇంకేమీ పరవాలేదన్నాడు.

రామా . అమ్మయ్యా, బ్రతికాను!

నా : సరేగాని మానవుడు స్వతంత్రుడా, అస్వతంత్రుడా?

రామా · అంటే?

నా : మానవుని జీవితానికి మానవుడేనా కర్త? లేక మరొకడు ఉన్నాడంటారా?

రామా · ఇప్పుడు ఆ సంగతి దేనికి?

నా . ఊరకనే. తెలుసుకోవాలని ఉంది

రామా : మానవుడు స్వతంత్రుడైతే బాగుంటుందా? అస్వతంత్రుడైతే బాగుంటుందా?

నా : నా యిష్టా యిష్టాలతో పనేమిటి? సత్యం కావాలిగాని.

రామా : కొందరు పూర్తిగా అస్వతంత్రుడంటారు మరికొందరు స్వతంత్రుడంటారు. మరికొందరు పాపపుణ్య కర్మలలో మాత్రం స్వాతంత్ర్యం ఉన్నదంటారు.

నా : ఇంతకూ ఆచార్య రామారావు ఏమంటాడు?

రామా : (నవ్వుతూ) యావన్మాత్రంజ్ఞానం, తావన్మాత్రం స్వతంత్రతా అంటాడు. ఆ సంగతి అలా ఉంచు. ఇంతకూ నీ బాధ ఏమిటీ?

నా : నాకు బాధ ఏముంది? హాయిగా తిని తిరుగుతున్నాను. కాకపోతే మావాళ్ళకు కాస్త సుస్తీగా ఉంది డాక్టరు కూడా ఆమెకు పరవాలేదని చెప్పనే చెప్పాడు.

రామా : ఇంతకూ మనస్సులో ఎలాంటి ఆందోళన లేదంటావు? అయితే ఇందాక రాజ్యానికి చెబుతున్నదేమిటి?

నా : కథ.



రామా : అవును పరీక్షిత్తుమరణం. అవునా? పోతే నన్ను అడిగిన దేమిటి? మానవుడు స్వతంత్రుడా అస్వతంత్రుడా- అనేకదా? ఈ రెంటికీ సంబంధం లేదా?

నా : కొత్త సంగతే వింటున్నాను!

రామా : ఇదిగో ఇటుచూడు. దిగులుతో ఎందుకు అంత అవస్థ పడతావు? నేను అంత నమ్మరానివాణ్నా?

నా : ఆ సంగతి నీ అంతరాత్మకు తెలీదా?

రామా : తెలియకేం, తెలుసు. అందుకేగదా అడుగుతున్నది. నామాటవిను. గుండెల పొత్తిళ్ళలో దాచి దాచి దిగులు పెంచుకుంటే ప్రయోజనం లేదు.

రాజ్యం : (ప్రవేశించి) నాన్నగారు, నాన్నగారు డాక్టరుగారు వస్తామన్నారు.

నా : సరేకాని సూర్యాస్తమయం బాగుంటుందా తల్లీ?

రాజ్యం : ఓ, పడమర ఎర్రని సిల్కు ఓణీ అరగట్టినట్లుగా ఉంటుంది

చంద్ర : ఇంటికి తిరిగివచ్చే పశువులు, దేవాలయంముందు చెడుగుడులాడే పిల్లలు – బలేబాగుంటుంది నాన్నగారు.

నా : అయితే మన డాబామీదకెక్కి చూస్తూ ఉండండి. పొద్దు గర్భంలో పడగానే చెబుతారుకాదూ.

రాజ్యం ఓ, రారా అన్నాయి ఎంతెంతదూరం! ఊఁ అనూ, ఎంతెంతదూరం?

చంద్ర కోసెడు కోసెడు దూరం!

రామా ఏమిటి ఈ స్వయంపాకం!

భర (ఏడుస్తూ) ఊఁ ఊఁ ఊఁ . అ ... మ్మ .. అ ..మ్మ.

నా నాన్నగా ఏడవకు నా చిట్టితండ్రిగా ఏడవకు అమ్మ దగ్గరకు పోదామా.. . అలాగే ఏడవకు మరి. వీణ్ణిచూస్తే కడుపు తరుక్కుపోతుంది రామం రేపటి నుంచి వీడిగతి ఏమికాను? పెద్దవాళ్ళిద్దరివిషయంలో నాకు ఎలాంటి దిగులూ లేదు కాళ్లూ చేతులున్నై, నోరు ఉన్నది. కాస్తో కూస్తో తెలివితేటలు ఉన్నాయి. ఎలాగో ఓలాగు బతుకుతారు ఇంతకూ ఈ అవిటివాడి సంగతే, తలచు కొన్నప్పుడల్లా గుండె చెరువౌతుంది వీడిని దైవం ఇంత అన్యాయం ఎందుకు చేయాలి రామం? వాడుచేసిన పాపమేమిటి? చెయ్యి సరిగా ఆడదే, నోరు మాటరాదే? వాడు ఎవడికి ఏవిధంగా అపకారం చేశాడు? భగవంతుని లీల అందామా? ఘోరం. ఇదే అతని ఆటఅయితే అతని హృదయం వజ్రకవాటం కావాలి. లేక నా పాపానికి ప్రాయశ్చిత్తంమంటే వట్టి బుద్ధిహీనుడుకావాలి. నన్ను శిక్షించటానికి ఇంతకన్నా మార్గంలేదా రామం?



రామా : నాగూ, నాగూ!

నా : ఆఁ!

రామా . నాచేతిలోది ఏమిటి?

నా . పుస్తకం.

రామా : అది?

నా : కుర్చీ ఇంకా అడుగూ చెబుతాను. పైనున్నది ఆకాశం, కిందనున్నది భూమి. అది ఉత్తరం, ఇది దక్షిణం. మాట్లాడుతున్నది నేను వింటున్నది నీవు. ఇంకా ఏమికావాలి?

రామా · అదే తెలియటం లేదు తెలిస్తే నిన్ను వేధించడం దేనికి?

నా : ఇంకా నన్ను వేధించటమా? అసాధ్యం!

రామా · అవును నిజమే. జరగవలసిందంతా జరిగింది

నా అంటే!

రామా అవును నిజమే జరగవలసిందంతా జరిగింది

నా	అంటే?

రామా . గాజాపాత్రలో పోయవలసిన విషం బంగారుపాత్రలో పోశాడు

రాజ్యం : (గబగబా పరిగెత్తుకొనివస్తూ) నాన్నగారూ, నాన్నగారూ! ప్రొద్దే మరే ప్రొద్దే మరే ..

(జానకి లోపలినుంచి కెవ్వున కేకపెడుతుంది ''చెల్లాయ్ చెల్లాయ్!'' అంటూ రోగి గదిలోకి పరుగెడతాడు రాజ్యం కూడా వెంటపరుగెత్తినట్లు గజ్జెలధ్వని సూచిస్తుంది నాగేశ్వరరావు కుర్చీలో కూలబడతాడు లోపలినుంచి గొంతులు వినిపిస్తాయి )

రా	చెల్లాయ్, చెల్లాయ్! ఎలా ఉందమ్మా ఒంట్లో?

జానకి	(నీరసకంఠంతో) ఎవరది?.....

రామా	నేనేనమ్మా, రామారావును.... లేవకమ్మా లేవకు.

జా	అబ్బాయీ? ఎప్పుడొచ్చావు?

రామా	ఇంతకుముందేనమ్మా. ఒంట్లో బాగుండలేదా ఏమిటి?

జా	జ్వరమేమోతగ్గింది తమ్ముడూ. కాకపోతే కాస్తనీరసంగా ఉంది వారెక్కడ?



రామా	హాల్లో ఉన్నారు. సరేకాని కేకపెట్టావు దేనికి?

జా	. ఇప్పుడే కాస్త కునుకుపట్టి పీడకల వచ్చింది అందులో అరిచానుకామాలు పాడుదాన్ని

రామా : అమ్మా రాజ్యం, మీ అమ్మకు మంచినీళ్లు కావాలేమో కాసినివ్వు.

(డాబాపైనుంచి చంద్ర కేకవేస్తాడు )

చంద్ర : రాజ్యం, రాజ్యం!

రాజ్యం : ఓయ్ వస్తున్నా, వస్తున్నా!

(రాజ్యం బయటికి పరెగెత్తుకొని పోతుంది )

రామా : ఈ యింట్లో ఎవరికి జబ్బో ఏమిజబ్బో అర్థంకాకుండా పోతున్నది

జా	: అదేమిటి తమ్ముడూ? మీ బావగారికి ఒంట్లో బాగాలేదా?

రామా : బాగానే ఉంది. కాని మరి....

జా	· ఏమిటి నీ సందేహం?

రామా : ఏమీలేదు. మళ్ళీ ఇప్పుడే డాక్టరురాగానే వస్తాను. (ముందు హాలులోకి వస్తాడు ) నాగూ. నాగూ!

నా	ఆఁ! మీ చెల్లెలికి ఎలా ఉంది?

రామా · బాగానే ఉంది జ్వరం లేదు. ముఖం ఎంతో తేటగా ఉంది.

నా : అలాగా!

రామా : సరేకాని నాగూ ఏమిటి ఈ గొడవ?

నా : గొడవ్వా-గిడవా ఏమిలేదు. కాని ఒకటి చెప్పు

నా : ఈ భర్తృతుడి నోరుకాని కాలుకాని రాదుకదా?

రామా : ఇవాళ కొత్తగా వచ్చిన సమస్య కాదుగదా?

నా : అవును నిజమే! ఇదివరకే డాక్టర్లుచెప్పారు ఇవాళ కొత్తగా వచ్చింది ఏమీలేదు. సరేకాని వీడి ముందుగతి ఏమికాను?

రామా : మీరిద్దరూ బ్రతికి ఉండగా వాడికి జరగని దేముంది?

నా : మా ఘటాలుమాత్రం నిత్యమా? ఎవరు ముందో ఎవరు వెనకో ఎవరు చూచారు?

రామా : నిజమేకాని ఒకటి అడుగుతాను చెప్పు ప్రపంచంలో అన్నివిధాలా అవిటివాళ్ళు ఇద్దరూ ముగ్గురా?

నా : లక్షలాదిగానే ఉండవచ్చును.



రామా : వాళ్ళగతి ఏమవుతున్నది?

నా : భగవంతుని కృప ఇంతేకాబోలు! అన్నట్లు జ్ఞాపకం వచ్చింది. మా పాలవాడికి పది రూపాయలివ్వాలి.

రామా : ఇప్పుడు ఆగొడవదేనికి?

నా : ఆఁ ఏమీలేదు. ఇందాకవచ్చి అఘోరించాడు. ఇద్దామంటే దగ్గిర చిల్లరలేక పోయింది.

రామా : మా ఇంటి పక్కనే ఉంటున్నాడుగా. నేనింటికి పోయి తరువాత పంపిస్తానులే. అసలు సంగతి దాటవేస్తున్నావు. ఈ గొడవంతా ఏమిటి?

నా (విషాదంగా నవ్వుతూ) ఇవ్వాళ నీకేదో మతిపోయినట్లుంది రామం.

రామా : నిజంగా నాకు మతిపోయింది!

నా · లేకపోతే యీహడావుడి అంతా ఏమటి?

రామా నాగూ! ఇటుచూడు నిన్ను చూచి ఏడవాలో నవ్వాలో అర్థం కావటంలేదు

నా . నాకుమాత్రం నువ్వు నవ్వటమే మేలనిపిస్తుంది.

రామా · నేడు నువ్వు మహాకాకోలం మింగి మాట్లాడుతున్నావు నాగూ! అది కడుపులో

ఉండటం ఏమాత్రం మంచిది కాదు ఎంత తొందరగా వెళ్ళ గక్కితే అంత మంచిది. నా స్నేహమే కావాలనుకొంటే, అసలు భూమిమీద బత్తెపుగింజలు అట్టిపెట్టుకోదలచుకొంటే వెంటనే కక్కివెయ్యి అది నీకు ఇమడదు, ముమ్మాటికీ ఇమడదు

నా : రామం, ఇటుచూడు ఈచేతిలోది ఏమిటి? . ఆ కనిపించే దేమిటి?. (రామారావు మాట్లాడడు నాగేశ్వరరావు జాలిగా నవ్వుతూ) అంత కోపమైతే నేనే చెబుతాలే! ఇది పుస్తకం అది కుర్చీ పైనున్నది ఆకాశం కిందనున్నది భూమి అవునా?

రామా : నాగూ, నాగూ నీకు పూర్తిగా మతిపోతున్నది నీకు పోవటమే కాదు ఎదుటి వాళ్ళకు కూడా మతిపోయేటట్లు చేస్తున్నావు

నా : నిజమే రామం!

రామా : ఏమిటి నిజం?

నా : అవును ఏమిటి నిజం? ప్రపంచానికి తెలుసా?

రామా : వట్టిది వట్టిది అదంతా వట్టిది నాగూ.

160 నా : నిజమే. అంతా వట్టిది, అంతామిథ్య

రామా : (ఆవేగంతో) ఎవరో నీకు తలకెక్కించారు ఎవరికో ప్రాణగండమున్నదనీ చెప్పారు. బహుశః జానకే మరణిస్తుందని చెప్పి ఉండవచ్చు దుర్మార్గులు అన్నట్టుగానే ఆమెకు జబ్బుచేసింది నీవు ఆ జోస్యం నమ్ముతున్నావు నాగూ ముమ్మాటికీ నమ్ముతున్నావునాగూ! అదంతా వట్టిది వచ్చి అబద్ధం నామాట విను. అదంతా వట్టి అబద్ధం. భవిష్యత్తులో ఏమిజరుగుతుందో, మానవుడి ఆత్మశక్తి ఎంత ఉందో, అతడు ఎంత స్వతంత్రుడో, ఎంత కల్పనా శక్తి ఉందో ఎవడూ చెప్పలేదునాగూ ఎవడు గిరిగీయలేడు నాగూ, నామాటనమ్ము. అదే నిజమైతే, భవిష్యమే చదవగలిగితే యీ సృష్టిఅంతా వ్యర్థం, ఈ చరిత్ర అంతా వ్యర్థం నాగూ. ఈ ప్రజాస్వామ్యం, ఈనాటి స్వాతంత్ర్యం ఈ పురుష ప్రయత్నం ఈ అర్థాలు అన్నీ నిరర్థకం నాగూ. ఈ జగద్వ్యవహారామంతా అర్థం లేని నాటకంకావాలి. ఈజీవకోటి అంతా కేవలం వినోద సాలభంజికా కోటి కావాలి నాగూ. జీవితంలో సుఖం, సంతోషం, ఆనంద్ధర్మలేక దుర్భరమై పోవాలినాగూ. ప్రతి మానవుడు ప్రతి జంతువు, ప్రతి క్రిమి కీటకం, ప్రతి అంకురం మరణాన్నే ఆశించాలినాగూ జీవింపనొల్లనిజీవి, బ్రతుకు చేదైన ప్రాణి ఉన్నదా నాగూ. లేదు, లేదు-ముమ్మాటికీ లేదు

నాగు : అయితే ఈ ఉత్తరం?

రామా  ఏముంది! అందులో ఏదీ ఏదీ ( ఆదరాబదరా కాగితాలు తిప్పుతున్న చప్పుడు వినిపిస్తుంది )

నాగు  ఆ జోస్యమే తప్పనుకొందాము, తల్లీ కూతుళ్ళు ఒకేసారి మరణిస్తారన్నాడు దానికి నిదర్శనంగా తల్లి మరణించింది కూతురు మంచంలో ఉంది. ఇదంతా వట్టిదే

రామా : వట్టిది, వట్టిది ముమ్మాటికీ వట్టిది! నామాటవిను. చదువుకొన్న వాడివి కాస్త ఆలోచించు చల్లగాలి వచ్చినంతమాత్రాన వర్షంకురవాలని లేదు అగ్ని ఉన్నంత మాత్రాన పొగ బయలుదేరనవసరం లేదు. గర్జించే మేఘాలు కూడా చిందించకుండా విచ్ఛిన్నమవ్వటం కద్దు

చంద్ర  (వగర్చుకొంటూ వచ్చి) నాన్నగారు, నాన్నగారు! పొద్దుగుంకింది ఇప్పుడే కుంకింది.

నా · ఆఁ, ఆఁ!

చంద్రం · పొద్దు గర్భంలో పడ్డది నాన్నగారు!

నా · చంద్రుడు కూడా కనిపిస్తున్నాడా, నాలుగు బారల్లో చుక్కకూడా కనిపిస్తున్నదా?



చంద్రం  అటుకేసి చూడలేదు నాన్నగారు ఇప్పుడే చూచివచ్చి చెబుతా ( గబగబా మళ్ళీ డాబామీదికి పరుగెత్తుకు పోతాడు. పైనుంచి రాజ్యం కేకపెడుతుంది )

రా : డాక్టరుగారు, డాక్టరుగారు.

నా : కనిపిస్తున్నాడా, కనిపిస్తున్నాడా నాన్నా

(కారువస్తున్న చప్పుడు)

రామా : భగవాన్, భగవాన్.

చంద్రం . (వగర్చుకొంటూ) నాన్నగారూ నాన్నగారూ. చంద్రుడి ప్రక్కనే చుక్కకూడా ఉంది. ( లోపలినుంచి జానికి కెవ్వున కేక పెడుతుంది ఇంతలో ఇంటిముందు కారు ఆగినచప్పుడు వినిపిస్తుంది. పిల్లలూరామారావు డాక్టరు కోసం కేకవేస్తారు.)

రాజ్యం .
చంద్రం } డాక్టరుగారు, డాక్టరుగారు డాక్టర్‌సాబ్, డాక్టర్‌సాబ్.
రామా

డాక్టరు : (బూట్ల టకటకలతో ప్రవేశిస్తూ) ఏమిటి, ఏమిటి? రోగికి విషమించటానికి వీలులేదే! ఏమిజరిగిందేమిటి?

రామా : ఇప్పుడే ఎందుకో కెవ్వున కేకవేసింది 15 నిమిషాల క్రితం బాగానే ఉంది పలకరించివచ్చాము కూడా లోపల ఒకసారి చూచివద్దాము పదండి

(అందరూ లోపలికి పోతున్న చప్పుడు. ముందుగా రాజ్యం బావురున ఏడుస్తుంది. అది చూచి చంద్రం ఏడుపు మొదలెడతాడు )

డాక్టరు : ఏడవకండర్రా ఏడవకండి మీ అమ్మకు ఏమీ పరవాలేదు నేనున్నాగా.

రామా : ఛా తప్పు. మీఅమ్మ బాగానే ఉంది. ఎందుకు ఏడుస్తారు? మీ ఏడుపు వింటే గుండె ఆగిపోతుంది.

రామా : ఊరుకోండి. అమ్మాయి రాజ్యం నీకే చెప్పేది ఓరే చంద్రం ఊరుకో.

డా : రోగి బాగానే ఉందే.

రామా : జాగ్రత్తగా చూడండి!

డా : చూచేకదా చెబుతున్నది మీకుకూడా అనుమానమేనా రామారావుగారూ. లంకణాలుచేసిన ప్రాణమా కాస్త స్పృహతప్పి ఉంది అంతే

162 రామా : ప్రమాదమేమీ లేదుకదా?

డా : నా మాట నమ్మకం లేదా?

రామా : (హాల్లోకి వెళ్లుతూ) నాగూ, నాగూ చెల్లాయికీ ఏం ప్రమాదం లేదు బాగానే ఉంది. ఇందాకటినుంచి ఏదో అంటూాందిలే. గండం గడించింది. నేను చెబితే చెవికెక్కింది. పొద్దు గర్భంలోపడ్డది తూర్పున చంద్రుడుదయించాడు. చంద్రుడికి బారెడుదూరంలో చుక్క కనిపించింది చుక్కకన్న చక్కగానే ఉంది మా చెల్లాయి. (గట్టిగా నవ్వుతాడు) తెలిసిందా. ఇప్పటికైనా నామాట నమ్మతావా? ఎంతగొడవచేశావోయి నాగూ, నాగూ మాట్లాడవేం? సిగ్గా? కాదు అభిమానంకామాలు. (ఒక్కక్షణం నిశ్శబ్దం) డాక్టర్‌సాబ్, డాక్టర్‌సాబ్!

డా : (లోపలినుంచి) వస్తున్నా, వస్తున్నా!

రామా : మీరు అక్కడే ఉండండి నేను అక్కడికి వస్తున్నాను.

డా : (ఆతురతతో) ఏమిటది, ఏమిటది!

రామా : ఏమీలేదు మీ ఛాపర్‌ను తీసుకొచ్చారుకదా

డా : ఆఁ, దేనికి?

ఏమీలేదు. ఈరోగిని పిల్లల్ని మీ హాస్పిటల్‌కి పంపించండి

డా రోగికి ఏమీ ప్రమాదం లేదండీ నేను చెబుతున్నా మీకు నమ్మకం లేదా?

రామా అదికాదు. నామాట వినండి వీళ్ళను ఇక్కడనుంచి పంపించివేయాలి. ఇక్కడుంటే సరిగా మందూమాకులు అందవు పైగా రోగికి పిల్లలను చూడకుండా స్వస్థత చేకూరదు అరే చంద్రం, అమ్మాయి రాజ్యం త్వరగా పోయి కారులో కూర్చోండి. ఊc.

రాజ్యం } మా హోన్న ఏడీ!
చంద్రం }

రామా : వస్తున్నాడమ్మా!

రాజ్యం } అయితే వచ్చింతరువాతనే అంతాకలసి పోదాము.
చంద్రం }

రామా : కాదు మీనాన్నకు కాస్త ఆలస్యం అవుతుంది ఇదిగో మీవెంట భరతుణ్ణికూడా తీసుకుపోమ్మన్నాడు.

రాజ్యం : రారా భరతుడు. అన్నాయి నువ్వూ నేనూ బుర్ బుర్ ఎక్కిపోదాం.

భర : ఊc, ఊcన్‌న్‌.

చంద్రం. నాన్నకూడా వస్తాడురా (కారుధ్వని అనుకరిస్తూ చంద్రం రాజ్యాన్ని భరతుణ్ని తీసుకొని వెళ్ళిపోతాడు.) 163

డా : ఏమిటిదంతా రామారావుగారు?

రామా : ఏమున్నది, జీవితం, త్వరగారండి.

డా : (హడావుడిగా నడుస్తున్న బూట్ల చప్పుడు) ఎక్కడికి?

రామా : నాగు దగ్గరికి. ఇంతకూ జానకికి వెంటనే స్పృహరాదుకదా?

డా : లేదు. ఇంకా కొంతసేపు పడుతుంది అదేమిటి, అదేమిటి?

రామా : త్వరగాచూచండి త్వరగా చూడండి! (డాక్టరు ప్రక్కన ఉన్న కుర్చీలో కూలబడతాడు) మీరు కూడా మాలాగా చేస్తే ఎలా? ఏదైనా ఇంజక్షన్ ఇవ్వండి. మీ మేలు ఎన్నడూ మరచిపోను డాక్టర్‌సాబ్, డాక్టర్‌సాబ్!

డా : ప్చ్. లాభంలేదు.

రామా : లాభం లేదా?

డా · హార్ట్ ఫెయిల్యూర్

రామా . (కుర్చీలో [illegible]) [illegible] జరిగింది!

## పాత్రలు :

| | |
|---|---|
| రాజా | నర్తకుడు |
| కృత్తివాసులు | గంగాధరం |
| శివభట్టు | యోగి |
| బాలసరస్వతి | కంచుకి |

(తలుపు గట్టిగా తట్టిన చప్పుడు)

బాలసరస్వతి : ఏమండోయ్ మిమ్మల్నే (మళ్ళీచప్పుడు) అబ్బా పలకరేమండీ? తలుపు కొట్టలేక చెయ్యి, పిలువలేక గొంతూ పోతున్నాయి. (మళ్ళీచప్పుడు) మిమ్మల్నే పిలిచేది!

నత్కీరుడు : ఎవ్వరది?

బా.స : నేను.

న : నేనంటే?

బా స : నేనే, తలుపుతియ్యండి.

న : ఈ నేనుకు అర్థం?

బా.స : సంసారసుఖదుఃఖాలకు ఆశ్రయం. ఇకనైనా తియ్యండి.

న : ఈ నేనుకు ఏమికావాలి?

బా.స : వైవిధ్యమంతా ఇప్పుడు నత్కీరసక్యంకావాలి. అబ్బబ్బ ఏమిటి, మకురుతనం? ఇప్పుడైనా తలుపుతీస్తారా లేదా?



న : తియ్యకపోతే?

బా.స : రాజహంస విచారమున్నదన్న సంగతిమాత్రం మరచిపోకండి.

న : అలాగా! (గభాలున తలుపుతీసిన చప్పుడు)

బా.స : అదేమిటి అలాగున్నారేం? ఇంతసేపు పరిహాసమాడుతున్నారను కొంటున్నాను. కాని, ఇలా ఉన్నారనుకోలేదు.

న : ఎలా ఉన్నాను?

బా.స : చీకాకుగా.

న : చీకాకుగానా, ఎందుకు? బాలసరస్వతీ ప్రణయం, రాజానుగ్రహం వెగటయ్యా?

బా స : మీరెంతదాచినా ఎర్రబారిన మీకన్నులు, ముఖం, చెబుతూనే ఉన్నాయి.

న : ఏమని?

బా స : ఆ సంగతి తెలిస్తే అడగటం దేనికి? ప్రమాదమేమీ రాలేదుకద?

న : లేదు వాళ్లువచ్చారా?

బా.స : ఎవరు, పిల్లలా! అన్నట్లు ఇంకా రానేరాలేదు ఎండ మాడిపోతున్నది. పూజా పుష్పాలకు గంపెడు చీకటి నెత్తినవేసుకొని వెళ్ళారు పాపం ఏమయ్యారో?

వ : పూలకోసం పంపేచావా?

బా.స : ఆఁ. ఈ వారం రోజాలనుంచి వాళ్ళే తెస్తున్నారు.

వ : దాసీ లేమయ్యారు?

బా.స : వాళ్ళకు పూలే కనిపించడం లేదు. ఈశ్వరపూజకు పూలు లేకపోతే ఎలా? అందుకని యీ యేడురోజాలనుంచి గంగాధర కృత్తి వాసులను పంపిస్తున్నా.

వ : ఆ సంగతి మాటమాత్రమైనా నాతో చెప్పలేదేం?

బా.స : ఎందుకు అంత ఆందోళన పడుతున్నారు?

వ : అయితే నువ్వీ లోకంలో లేవన్నమాట.

బా.స : ఏమి జరుగుతున్నదేమిటి?

వ : త్వరగా ఉత్తరీయమందుకో.

బా.స : ఎక్కడికి?



వ : ముందు ఉత్తరీయమందుకోమంటే!

బా.స : అవ్యక్త స్థితిలో ఉంచి ఎందుకు బాధిస్తారు? ఏవి జరిగిందేమిటి?

వ : (తలుపు గుభాలున మూసుకొనేటట్లు ఒక్కతన్ను తంతూ) ఉత్తరీయమందుకోమని నీకే చెప్పేది.

బా.స : (గద్గద కంఠంతో) అలాగే (నూపురారావం లోపలికి వెళుతున్నట్లు సూచిస్తుంది. అంతలో ఘంటారావం వినిపిస్తుంది)

వ : ఘంటారావం కూడా వినుపిస్తున్నది. అమ్మీ. అమ్మీ!

బా.స : ఓయ్ వచ్చా, వచ్చా, తెస్తున్నా.

వ : (కొంచెం బిగ్గరగా) ఉత్తరీయం అక్కరలా శాలువ, ఆ దుశ్శాలువ.

బా.స : (నూపురధ్వని రాకనుసూచిస్తుంది-) ఇదిగో ఉత్తరీయం.

వ : (సవిచారంగా) అక్కరలేదు. ఆ చేతిలోని శాలువ ఇలాతే

బా.స : (గొంతులో గాద్గద్యం) నేనేంచేశాను?

వ . నేనే తప్పుచేశాను (జాలిగా) ఎందుకు కంటతడిపెడతావు? ఎత్తి పొడుపు కాదు. నిజంగా తప్పు నాదే. ఏదీ ముఖం ఇటుతిప్పు

బా స : అయ్యయ్యో శాలువ

న ఫరవాలేదు

బా.స కాటుక అంటింది అది వేసుకొని ఆస్థానానికి ఎలా వెళ్ళుతారు?

న : పోయినా ఒకటే, పోకపోయినా ఒకటే.

బా.స : అదేమిటి అలా అంటారు? ఇవాళ లేచినపొద్దు మంచిది కాదట్టున్నది. అన్నీ వైపరీత్యాలే

న : (జాలిగా) వట్టి పిచ్చిపిల్లలాగ ఉన్నావు. వైపరీత్యాలేమిటి?

బా స : స్థితప్రజ్ఞులు సంక్షోభించటం (లోపలనుంచి దుర్బలస్వరంతో) అమ్మా, అమ్మా.

న : అమ్మయ్య!

బా.స : ఏమిటి విచిత్రంగా మాట్లాడుతున్నారు? (మళ్ళీ లోపలనుంచి) అమ్మా, అమ్మా.

న : (తొందరిస్తూ) వాళ్ళ సంగతిఏమిటో చూసి తీసుకురా. (బాలసరస్వతి బయటికి వెళ్ళుతున్నట్లు నూపుర ధ్వనితలుపు తెరచినట్లు గడియచప్పుడు సూచిస్తాయి )



బా.స మీకోసం గురువులు ఒకటికి పదిసార్లు అడుగుతున్నారు. బయలుదేరాలని ఉత్తరీయంకూడా తెప్పించారు అలా దిగాలు పడిచూస్తారెందుకు? పూలు లేకపోతే పోయాయి వదండి లోపలికి. అబ్బబ్బ గడపరాళ్ళు మాడి పోతున్నాయి నేనునిల్చోలేనురా. అలా బొమ్మల్లాగా నిలబడ్డారేమిటిరా? గంగా నువ్వుపద ముందు (నతీక్కరుడు లోపలనుండి) ఒరే గంగాధరం, కృత్తివాసులు (ఆరుపాదాల సవ్వడి నూపురధ్వని వినిపిస్తుంది).

న : వాళ్ళ నేమన్నా అన్నావేమిటి?

బా.స : మీకు తెలియదుగామాలు, కొట్టి కొరతను వేశా!

న : మరెందుకు వాళ్ళముఖాలు అలా వెలవెల పోతున్నాయి?

బా.స : పాఠాలు రాలేదని దండించిన సంగతి నాకేమి తెలుసు?

న : నేను దండిస్తానా? గట్టిగా కూడా ఎప్పుడూ మాట్లాడనే. ఏమిరా గంగాధరం నీనోటిమీదుగా చెబితేగాని మీ అమ్మకు నమ్మకం లేదు.

బా.స : ఏమిరా కృత్తివాసులు – నిన్నేగదరా చెప్పింది. మా గురువుగారు నోరువిప్పితే పండితులూ, కవులూ గజగజ లాడతారని. ఎంతటి దురుసునోరో కాకపోతే

వాళ్ళకు అంతభయం దేనికి? మాట్లాడవేం? మీ గురువుగారితో ఏకమౌతున్నావా ఏమిటి?

కృ : నిజమే.

బా.స . అలా చెప్పు.

వ · అంత తొందరపడితే ఎలా? కాస్తగుర్రాన్ని కట్టెయ్. (అప్యాయంగా) ఏమిటిరా నిజం?

కృ : ఇద్దరు చెప్పింది నిజం.

వ · సరిపోయిందా?

బా.స : అమ్మో దొంగలు. గురుశిష్యులేకమై నన్ను వెర్రిదాన్ని చేస్తున్నారా?

వ · అరే గంగా! మీరిద్దరు ఎక్కడెక్కడ తిరిగి వచ్చారురా?

గం : పట్టణమంతా.

కృ . దొడ్లు దోవలు, తోటలు, తోపులు, మళ్ళు మాన్యాలు ఒకటేమిటి – ఈ వారంరోజులనుంచి పట్టణంలోను, పరిసరాలలోను చూడని చోటంటూలేదు.



వ : నీకేమీ కనిపించిందిరా గంగా?

గం . గురువుల అభిప్రాయం ఏమిటో అర్థం కావటం లేదు

వ : ఏమీలేదు. సరిగా నీ కంటబడ్డవి మాత్రం చెప్పు.

గం : డొక్కలంటుకుపోయిన మేక ఒకటి ఎండు తాటాకు నములుతూ ఉంది.

వ : ఇంకా.

గం : ఒకచోట పెద్ద పెద్ద చెట్లు నిలువునా మాడి ఉన్నాయి. మరీ విచిత్రం ఒకటి కనిపించింది.

బా.స : ఏమిటది?

గం : ఎక్కడా కాకిమాత్రం కనిపించలా పశువుల కళేబరాలు కుప్పలు తెప్పలుగా పడివున్నాయి. మాంసాలుకుళ్ళి గబ్బుకొడుతున్నాయే గాని వాటికోసం వచ్చి వాలినవి లేవు. నీలాటి రేవులోమాత్రం పందులు పొర్లాడుతున్నాయి.

బా.స . శివశివా.

వ కృతివాసులూ, నువ్వేమిచూశావురా?

కృ . పట్టణం వెలువల నెర్రులువిచ్చిన సజ్జమళ్ళు, పైరుచేలు, కనిపించాయి

అంతేకాదు, మళ్ళదొరవుల్లో ఏతాము కుండలు కూరుకొనిపోయి ఉన్నాయి ఇక పట్టణంలో ఎక్కడచూచినా రక్కెసపొదలకూ, జిల్లేళ్ళకూ కొదవలేదు. అయితే రక్కెసపొదలలో పండిన గుబ్బలంటూ లేదు ఈతచెట్లు, తాడిచెట్లు ఒక్కటికూడా బ్రతికిలేదు అన్నీ పడగొట్టి ఉన్నాయి వాటితో ఎన్ని చావిళ్ళయినా వేసుకోవచ్చు. కాని, ఒక్క చెట్టయినా కొట్టినవాళ్ళ పట్టుకుపోలేదు. పోతే పట్టణంలో కలకలలాడుతున్న పూరిండ్లు కాని, మిద్దెలుకాని, పెంకుటిళ్ళు కానీ, కనిపించలా. అసలు చాలాయిళ్ళు పాడయి ఉన్నాయి. అటు మీనాక్షి దేవాలయంలోకూడా అర్చకులుతప్ప మరొక పురుగు గూడా కనిపించలా.

న : సరే పోయి స్నానాలు చెయ్యండి. పొద్దుకూడా నెత్తిమీదికి వచ్చె. (గంగాధర, కృత్తివాసులు వెళ్ళిపోతారు.)

న : అలానుంచున్నావేం? పోయి వాళ్ళకు అన్నపానాలేవో చూడు.

బా.స · అయితే ఇది ఎన్నాళ్ళనుంచి?

న · నాలుగు నెల్లనుంచి.

బా.స మీరైనా ఒకసారి కాకపోతే ఒకసారైనా నాతో ఎందుకనలేదు? అని ఉంటే వాళ్ళను పూలకోసం పంపించేదాన్నికాను. 171

న : అనటానికి వీలులేదు.

బా.స : ఎందుకని?

న . కవిసమయం కాబట్టి.

బా.స . అంటే?

న : తాంబూలచర్వణం చేసిన దంతాలు ఎలా ఉంటాయి?

బా.స : ఎర్రగా

న : కవి నాయికా నాయకుల దంతాలకు వర్ణించేటప్పుడు ఎర్రగా ఉంటాయని చెప్పవచ్చునా?

బా.స : ఇదికూడా అంతేనా?

న : ఆహా! అది మామూలు కవి సమయం. ఇది ఆస్థానకవి సమయం. అంతే! ఇక మరేలాంటి తేడా లేదు.

బా.స : దుర్భరం. మీలాంటి వారు ఆస్థానంలో ఉన్నప్పుడుకూడా క్షామ పీడితులకు సహాయం జరగకపోగా ఆ వార్తనే కప్పిపెట్టటం ఘోరాతి ఘోరం.

న : అలా ఉంటే కొంతనయమే!

బా.స : అంతకంటే దారుణం జరగుతున్నదా ఏమిటి?

న : ఇలాటి మహారిష్ట సమయంలో నివారణ మార్గాలు చర్చించటానికిబదులు నృత్య వినోదాలు, శాస్త్రచర్చలు, కవితాగోష్ఠి, కవిసమ్మానాలు, జరుగుతున్నాయి. అది అలా ఉండగా శంఖపీఠంపై కూర్చున్న నేరానికి ఇతరుల కవిత్వాలలో దోషాలు చూపించి మహాపాపం కట్టుకోవలసి వస్తున్నది.

బా.స : దోషాలు చూపించాలన్నది కూడా ఆస్థాన కవిసమయమా?

న : కాదు. అది శాస్త్రం చేస్తున్న అనుశాసనం.

బా : అయితే ఇక్కడదేనికి?

న : కొలువు మానుకోవటం, అందులో యీ పరిస్థితులలో మానుకోవటం అంత తేలిక కాదు.

బా : మరి కర్తవ్యం?

న : అదే ఆలోచిస్తున్నది.

172 గంగ : (తలుపు తెరుచుకొని) గురువుగారికోసం కంచుకి వచ్చాడు. మీతో ఏమో చెప్పాలట. సావట్లో ఉంచి వచ్చాను

న . సరే అతన్ని ఇక్కడికి రమ్మను. అమ్మీ వెళ్ళు నీవు వాళ్ళకు భోజనం వడ్డించు. (నూపుర ధ్వనితో బాలసర్వతి పోతుంది.) ఆమె వెనుక గంగాధరుడు వెళ్ళిపోతాడు.

గం : కంచుకీ! గురువుగారు రమ్మంటున్నారు.

కం : జయము జయము మహాకవులకు.

న : విశేషాలేమీ లేవుకదా?

, కం · ఏలినవారు తమరి నొకసారి కొలువుకూటానికి వచ్చి పొమ్మంటున్నారు ఎవరో కవి రాజసందర్శనార్థం వచ్చినట్లున్నది.

న · కొలువుకూటానికి తతిమ్మా ఆస్థాన కవులు రాలేదా?

కం : వచ్చారు అయినా తమర్ని పిలుచుకురమ్మనారు

న : ఏదో విశేషం ఉండి ఉంటుంది. లేకపోతే ప్రభువులు ప్రత్యేకంగా కబురు పంపించవలసిన పనిలేదు.

కం	ఏమో మరి

న	ఆ వచ్చిన కవిని నీవు స్వయంగా చూచావా?

కం	ఆఁ అచ్చుగా నడిచే అస్థిపంజరమే. ఇన్నేళ్ళనుంచి ఆస్థానానికి వచ్చిపోయే కవులను చూస్తున్నానుగా. కానీ ఆయనలో నాకు ఎక్కడా కవిత్వం చెప్పేశక్తి ఉన్నట్లు కనిపించలా.

న	. కవి అవునో కాదో ముఖాన వ్రాసి ఉంటుందా?

కం	· మీరు ఎన్నన్నా చెప్పండి. కవుల మాటతీరు, వైఖరీ అవన్నీ వేరు. అదిఅలా ఉంచి ఈ నూతన కవి వెంట ఎవరో యోగికూడా వచ్చినట్లుంది.

న	: యోగులకు ఆస్థానాలతో పని ఏమిటబ్బా!

కం	అదే విచిత్రం. బహుశః ఏలినవారు అందుకు తమరిని రమ్మన్నారేమో?

న	: సరే నువ్వు పద. ఇప్పుడే బయలుదేరుతున్నా (కంచుకి వెళ్ళిపోతాడు) ఏం చేస్తున్నా, విన్నే.

బా.స	. (నూపుర ధ్వనితో వస్తూ) పిలిచారా?

న	: ఆఁ, వాళ్ళకు భోజనాలైనయా?



బా స	. ఆహా. ఇక్కడికే వస్తున్నారు. అయితే కంచుకి పనిమీద వచ్చినట్లుందే!

న	· రాజుగారు రమ్మని కబురు పంపించారు. నేను ఆస్థానానికి వెళ్ళివస్తా పిల్లలు మిడిమేలం ఎండలోబడి తిరిగితిరిగి వచ్చారు పాపం వాళ్ళను కాసేపు విశ్ర మించమను. కొలువుకు బయలుదేరుతారేమో నేను తిరిగి వచ్చినదాకా ఎక్కడికీ కదలవద్దన్నాని చెప్పు.

గం,కృ . (తలుపు తెరుచుకొని వచ్చి) గురువులు నేడు మా కోరిక చెల్లించాలి.

న	: ఏమిటది?

గం	· ఇవాళకూడా మమ్మల్ని ఆస్థానానికి రానివ్వాలి.

న	ఇవ్వాళ ఒక్కరోజు గోష్ఠికి రాకపోతే ఏమిపోయింది?

కృ	ఇంతవరకూ గడచిన రోజులన్నీ ఒక ఎత్తూ, ఇవాళ ఒక ఎత్తు

న	: మీ ముఖం! కాసేపు పండుకోండి

గం	· క్షమించాలి. ఇవాళ బ్రహ్మాండమైన వాదం జరుగుతుందట

న	. ఎవరితో?

గం : కంచుకి ఇందాక చెప్పాడు అనుగ్రహించాలి

వ : మీకు ఓపిక వుంటే కాదనటం దేనికి? పదండి

గం, కృ : అమ్మా ఇప్పుడే వస్తాను (పరుగెత్తారు).

వ · మళ్ళీ బాల్యదశ ప్రాప్తిస్తేనా?

బా.ప నాకు ఒక కోరిక ఉంది. చెల్లించరూ?

వ : ఏమటది?

బా.ప : చెల్లిస్తామంటే.

వ : శక్యమైతే తప్పకుండా చెల్లిస్తా. ఏమిటది?

బా.ప : ఏమిలేదు, ఎలాగైనా మీరు ఈ గౌరవంనుంచి వెంటనే విముక్తులు కావాలి.

వ : విముక్తికేం? విముక్తి వెంటనే లభించబోతున్నది కానిభద్రంగా బయటపడటం జరుగుతుందా లేదా అన్నదొక్కటే సంశయం

బా : ఎలా బయటపడతారు?

174 వ : పిల్లలు చెప్పనే చెప్పారుకదా. ఇవాళ గట్టివాదమే జరుగుతుంది గెలిస్తే తీర్థ యాత్ర చేస్తానని చెప్పి రాజువద్ద సెలవు తీసుకోవచ్చు ఓడితే సెలవు తీసుకోవలసిన ప్రయాస ఉండనే ఉండదు. వేళ అతిక్రమించేటట్లుంది. తలుపు వేసుకో. నేను వెళ్ళుతున్నా. (నత్కీరుని పాదుకల సవ్వడి క్రమంగా సన్నగిల్లుతుంది. నూపురధ్వని క్రమంగా ఉచ్చస్థాయికివస్తుంది ఆ స్థాయికిరాగానే గడియవేసిన చప్పుడు వినిపిస్తుంది తరువాత నూపురధ్వని క్రమంగా సన్నగిల్లుతుంది.)

## రెండు

(రాజస్థాన ఘంటారావం అంతదూరం నుంచీ కాకుండా అంత దగ్గరనుంచీ కాకుండా వినిపిస్తూ ఉంటుంది. యోగి, శివభట్టు నడుస్తూ ఉంటారు. యోగి పాదాలనున్న పాముకోళ్ళ రాజపథంలో పరచి ఉన్న శిలాఫలకాలమీద టక్కుటక్కున మోగుతుంటాయి )

శివ యోగిసిద్ధుల వాక్కులకు తిరుగులేదు. కాని....

యో ఇంకా సందేహపిశాచం పీడిస్తున్నట్లున్నదే ఇంతకూ మాలో శివభట్టుకు నమ్మకం లేదన్నమాట

శివ · శివశివా ఎంతమాటన్నారు

యో కాకపోతే ఈ గుంజాటనం దేనికి?

శివ : మీవంటి వారి ఆశ్రయం ఉండగా గుంజాటనమేముంది? ఎటుతిరిగీ కాటకం నా పుత్రికను నాకు కాకుండా చేసింది. అర్ధాంగిని దిగమ్రింగినది. ఇక వాళ్ళు నాకు ఈ జన్మలో లభించరు. నా సంగతి అంటారా? బ్రతికినంత కాలం ఇంకా బ్రతకబోవటం లేదు అలాటప్పుడు పెద్దలకింత శ్రమ కల్పించటం దేనికి?

యో : (కరినంగా) అర్థమైంది. మాలో అంతవిశ్వాసం లేనప్పుడు ఇందాకా తీసుకొని రావటం దేనికి? దర్శనార్థం వస్తున్నామని రాజుకు కబురుపంపించి ఇప్పుడు పారిపోవటం దేనికి? ఆస్థానంలో నవ్వులుపాలు కావడందేనికి?

శివ : పెద్దలుకోపిస్తే నాబోటి అల్పులకు దారిలేదు. క్షమించాలి అపనమ్మకం మీపైన కాదు నాపైనే. కేవలం అజ్ఞానిని. కవిత్వమంటే నల్లగా ఉంటుందో తెల్లగా ఉంటుందో తెలియదే. అలాంటప్పుడు మీ పద్యం పట్టుకొని వెళ్ళి నాదేనని ఎల్లా చదివేది? చదువులూ .. అర్థమో మరొకటో మరొకటో అడిగితే ఈ నిరక్షరకుక్షి ఏంకావాలి? అందులో నత్కీరుడంటే సామాన్యుడుకాడు. కొమ్ములు తిరిగిన పండితులుకూడా గడగడలాడిపోతారు. అలా అవమానం పొందటంకంటే....



యో : మళ్ళీ మొదటకొచ్చావన్నమాట. ఇంకేమీ, మామాటలన్నీ గాలిపోయాయి? (పాముకోళ్ళచప్పుడు చటుక్కున ఆగుతుంది.) వ్యర్థప్రయాస మాకింకా దేనికి?

కం : శివభట్టుగారెవరు?

యో : ఎవరది?

కం : నేను కంచుకిని. ఎవరో శివభట్టుగారట. వారిని ఏలినవారు పిలుచుకొని రమ్మంటున్నారు.

శివ : నేనే.

కం : దయచేయండి. అనుగ్రహముంటే యోగులుకూడా దయచేయవచ్చును.

యోగి : పద., వస్తున్నాము

కం : ఇటు ఇటు. ఈ ఆసనాలు అలంకరించండి

కృత్తి  అరే గంగా అటుచూడరా ఆ కొత్తకవి ఎలా ఉన్నాడో శల్యావశిష్టమైఉన్న ఆ కవికీ, పీనవక్షుడైన ఆ యోగికీ జతకుదిరినందుకు చెప్పుకోవాలి

గం  . అక్కడేముందిరా ఇటుచూడు ఎప్పుడూ చిరునవ్వులొలకబోసే గురువుగారి ముఖం ఇప్పుడు గంభీరముద్రతో వింతగా ఉంది.

కృ  : ఏదో వైపరీత్యం జరిగేటట్లేవుంది

గం  : ఇస్. ఆగరా! కవి ఏదో చెప్పబోతున్నాడు.

శి  : వరపాండ్య ప్రభుశేఖరా పరిమళింపజేయుగాత న్నిరం
తర మిందిందిర నీలమై సహజగంధంబైన వీరద్విష
ద్ధరణీనాయక సింధు రేంద్రగమనా ధమ్మిల్ల బంధంబు రా
జ్యరమాగాఢ కుచోపగూఢ నిబిడంబౌనీదు శుద్ధాంతమున్

న  ఏదీ మా యేలిన వారికిచ్చిన ఆశీస్సు. మరొకసారి?

కృ  : నవకవికొంప నిలువునా కూలిందిరా గంగా.

గం  : లేకపోతే గురువులు మరొకసారి చదవమనరు



కృ  : ఆ కవివంక చూడు. ఆవజీవాలు క్రుంగిపోయాయి

న  : ఇప్పుడు తాము చెప్పిన పద్యం మరొకసారి సెలవివ్వాలి

శివ  : (జంకుతూ, జంకుతూ)
వరపాండ్య ప్రభుశేఖరా పరిమళింప జేయుగాత
న్నిరంతర మిందిందిర నీలమై సహజగంధంబైన వీరద్విష
ద్ధరణీనాయక సింధు రేంద్రగమనా ధమ్మిల్ల బంధంబు రా
జ్యరమాగాఢ కుచోపగూఢ నిబిడంబౌ నీదు శుద్ధాంతమున్.

న  : ఏమన్నారు? ధరణీనాయక సింధు రేంద్రగమనా ధమ్మిల్ల బంధమ్ము సహజ గంధమనేకదా?

! శివ  · (గాద్గద్యంతో) అవును.

కృ  అరేగంగా అటుచూడరా పద్యదోషానికేమిలే! అది తేలేపోయింది ఆ యోగి నాలుక కొరుకుక్కుంటున్నాడురా.

గం  : పద్యం అతనిదేమో?

న  : ధమ్మిల్ల బంధం సహజగంధమనటానికి ఉపపత్తి? కవి సమయసిద్ధమా? లేక ప్రత్యక్షసిద్ధమా?

---

శివ · ప్రభువులు, సభాసదులు క్షమించాలి ఆ కవిసమయాలేమిటో, ప్రత్యక్ష సిద్ధ మంటే ఏమిటో నాకు తెలియదు

యోగి : ఆగు ఆగు, నత్క్కీరాదురహంకారం కాస్త కట్టిపెట్టు నీకే కొమ్ములు మొలవ లేదు. ప్రపంచంలో నీ తలదన్నే కవులెందరో ఉన్నారు

న : అయ్యా తమపేరు? వాదం వారితో ఇంకా జరుగుతూనే ఉన్నది. వారు చెప్పదలచుకున్నది ఇంకా పూర్తికాలేదు.

యో : అతని పక్షాన వాదించటానికి సిద్ధంగా ఉన్నాము.

న : సభ్యాధ్యక్షులైన ప్రభువుల నిర్ణయం ఎలాగైతే అలాగే

రాజ : శివభట్టు చెప్పదలచుకొన్నది పూర్తికాలేదు. అది పూర్తి అయినపిమ్మట తన పక్షాన యోగులు వాదించటానికి సమ్మతిస్తే యోగులప్పుడు వాదించవచ్చు ఇది సభాధర్మం శివభట్టూ మీరేమి చెప్పుతారు?

శివ : (గాద్గద్యంతో) ఇంకా ఏమున్నదిప్రభూ? వట్టి నిరక్షరకుక్షిని. జీవనానికి గడవక ఈ యోగులను ఆశ్రయించాను. వారే ఈ పద్యంవ్రాసి ఇచ్చారు. పద్యం సభలో చదివి సత్కారం పొందుదామన్న దురాశతో ఈనేరం చేశాను. ఇది క్షమించరాని మహాపరాధం తరువాత ప్రభువుల చిత్తం.



రాజా : ఇక యోగులు మాట్లాడవచ్చును.

యో : ప్రతిపక్షవాదమే మని?

న : కేశాలకు సంస్కారంవల్ల తప్ప సహజంగా గంధం ఉండదు. ఉంటుందని విన్నదీకాదు కన్నదీకాదు. ఉంటుందంటే ప్రమాణం కావాలి.

యో : పార్వతీ ధమ్మిల్లబంధం సహజగంధం.

న : అది మనకు ప్రత్యక్షానుభవమే కావచ్చును. కాని, తమ వంటి పెద్దలు ఉద్రిక్తులు కాకూడదు. ఇది శాస్త్రచర్చకాని దూషణ సమయంకాదు. దోషానికి అంతకన్నా సమయంకాదు. అనవసరంగా ఇప్పుడు వాదదోషానికి కూడా పాల్పడుతున్నారు.

యో . వాదదోషమా?

న : అవును. ఇప్పటి వివాదాంశం మానవ ప్రకృతికాని, దైవ ప్రకృతికాదు మానవ లోకంలో కేశాలు సహజగంధాలు అవునా కాదా అన్నదే ముఖ్యం కైలాసంలో పార్వతీ కేశాలు ఎలా ఉన్నవో ముఖ్యం కాదు

యో . (పండ్లుకొరుకుతూ) అలాగా?

కృ : అదేమిటి! అదేమిటి!! యోగినొసలు కన్ను కనుపిస్తున్నదేమిటి?

గం ఏదో అనర్థకం ఉంది!

న . (కఠోరంగా) తలమట్టూ కళ్ళు మొలిచినా తప్పుతప్పే. మీ పద్యం ఒప్పుకాదు. ఇది సిద్ధాంతం. మహారాజా వాదం ముగిసింది తమకు వేడుకైతే ఇక ఇంద్ర జాలంచూడవచ్చును. అందులో వీరిది అందెవేసిన చేయి.

యో . ఓరీ కవితా దురహంకార దుర్విదగ్ధుడా! పరమేశ్వర వాక్యంకూడా నీకుదుష్టమై పోయిందా? ''నికృష్ట కుష్ఠ రోగివై ప్రజాపరిత్యక్తుడవై నూరేండ్ల బ్రదుకు.''

రా : ఎంత దురహంకారం!

గం, కృ : ఎంత దౌర్జన్యం!

శివ : అన్యాయం.

బా.స : (పరుగెత్తుకొనివస్తున్న పాదనూపురధ్వని) యోగీశ్వరా!

కంచు : ఏడీ యోగి? ఎక్కడా కనుపించడేం? ఈ ద్వారాన పోనేలేదు. నేనిక్కడే నిలుచున్నానే!

178 న : పిచ్చివాడా. అతడెవరుకున్నావు? కాలకంఠుడు.

శివ . కాలకంఠుడా! శివుడా!! నేను నమ్మను శివుడే అయితే ఇంత అన్యాయానికి ఒడిగట్టుతాడా?

న : అన్యాయమేముంది? దుష్టునికి తగ్గశిక్ష విధించాడు.

బా.స : ఎవరు? మీరాదుష్టులు. దుర్భరక్షామానికిలోబడి లక్షలాది ప్రజలు మలమల మాడి చస్తూఉంటే చూస్తూ ఊరుకొన్న ఈరాజు దుష్టుడు. క్షామవార్త పొక్కనీని ఈ రాజనామకుడు దుష్టుడు. క్షుధార్తులకోసం అనుక్షణం లోలోన మ్రగ్గిపోతూ వచ్చిన మీరు, శాస్త్రార్థం కోసం మేరువులాగా నిలబడ్డ మీరు దుష్టులా?

న : అమ్మ, అమ్మ – ఏమంటున్నావో తెలుసా?

బా.స : తెలియకేమి. తెలుసు. సత్యం చెబుతున్నాను.

న : కాదు రాజద్రోహం.

రా : ఆ తల్లిమాటలు ముమ్మాటికీ నిజం మహాదుష్టుడను ఘోరపాపిని నేనే. మీకు వాటిల్లిన దుర్భరశాపానికి మూలకారణం నేనే! నన్ను క్షమిస్తేగాని వదలను.

---
జి.వి. కృష్ణరావు

న : ఛీ ఛీ లెండి. ప్రభువులు నాలాంటి వాడి పాదాలమీద పడటమా?

రా : క్షమిస్తేగాని లేవను.

న : క్షమించటానికి నేనెవడను లెండి. మిమ్ము ఒకటి కోరదలచుకున్నాను

రా : మహాప్రసాదం. ఏమిటది?

న : దేశంలో ప్రళయ తాండవం చేస్తూన్న క్షామాన్ని నివారించే మార్గం వెంటనే చూడాలి.

రా : ఇంకా ప్రాలుమాలటమా?

న : వత్సా, కృతివాసులు, నాయనా గంగాధరా....

గం, కృ : ఓయ్ వస్తున్నామండి.

న : రావటం కాదర్రా ప్రధానం. ఈసారి కొత్తగురువుగారి వద్ద చేరి చక్కగా చదువుకోండి. ఏమంటారు? పల్కరేమిరా?

గం : మరొక గురువులను ఆశ్రయించటమా?

కృ · అది యీ జన్మలో జరగదు.

న : అయితే నేటి సభావిశేషం మీకర్థం కాలేదన్నమాట. 

న · అర్థంకాకపోవటానికేమున్నది? వాదించలేక దురభిమానియైన కాల కంరుడు శపించాడు.

న : అయితే కుష్ఠురోగి ఎలా ఉంటాడో తెలియదన్నమాట. సరిగ్గా చెబుతాను వినండి. దేహం చీము రక్తమోడుస్తూ పురుగులుపడి లుకలుక లాడుతుం టుంది. జుమ్మున ఎప్పుడూ ఈగలు ముసురుతుంటాయి. రోగికి బాధతో అమితంగా చిర్రాకు. పైగా ఆ చాయలకన్నా ఎవరూ వెళ్లరు. అలాంటి స్థితిలో రోగిష్టి ఏమి చెబుతాడు? ఏమి చదువుకొంటారు?

కృ, గం . ఏమన్నా చెప్పండి. మీ దగ్గరే ఉంటాము.

న : ఇక నేను కాదనేదేముంది పదండి. అమ్మీ!

బా.స : వస్తున్నా.

న . కాలాడటం లేదు. ఈ శాలువతీసుకో. పాండ్యరాజా వస్తాను – (నూపుర ధ్వని, ముగ్గురి పాదాల సవ్వడి క్రమంగా దూరమౌతుంటుంది )

రా : మంచిది... రాజ్యంలోని అసలైన జ్యోతిర్లింగం పోతున్నది.

## పాత్రలు :

విశ్వంతరుడు		జయదేవుడు

మైత్రీబలుడు		హేమచంద్రుడు

సుధన్వుడు

రంగం : కౌశాంబిలో నూతన బౌద్ధవిహారం.

కాలం : జడివట్టి బౌద్ధనీతి వర్థిస్తున్న రోజులు.

(ప్రభాతరేఖలు ప్రసరిస్తున్నవి. పక్షుల కలకలరవాలు బయలుదేరుతున్నవి. పరిసరాలనుంచి, ''బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి,'' అన్న వాక్యాలు వినిపిస్తున్నవి.

పర్ణకుటీరంలో జయదేవుడు పచారుచేస్తున్నాడు అతని పాముకోళ్ళధ్వని ప్రశాంతతను ప్రస్ఫుటంచేస్తున్నది.

జయదేవుడు వృద్ధు. ఆజానుబాహువు. వయోభారంతో నడుము కొంచెం వంగివుంది. బ్రహ్మవర్చసమొలుకుతున్న ముఖం. నీడలీనుతున్న తల. కనుబొమలు లేవు. క్రిందనుంచి పైకి ఒకటే కాషాయవస్త్రం. చేతులు వెనకకట్టుకొనివున్నాడు )

జయదేవుడు : వత్సా, విశ్వంతరా! (జవాబురాదు) విశ్వంతరా! .... ముసలితనం చాల విచిత్రమైనదిసుమా!..... నాయనా విశ్వంతరా!

(మైత్రీబలుడు ప్రవేశిస్తాడు. వయస్సు నలభై సంవత్సరాలు. నున్నగా గొరిగిన తల. కాషాయవస్త్రం, కాళ్ళకు పాముకోళ్ళు)

మైత్రీ : గురుదేవులకు నమస్కారం.

జయ : ఎవరది? (అప్పటికింకా మైత్రీబలుడు సరిగా కనిపించడు.)

మైత్రీ : నేను గురూ, మైత్రిని.

జయ : విశ్వంతరుడు ఎక్కడ?

మైత్రీ : తెల్లవారి లేచినతరువాత ఇంతవరకూ కనిపించనేలేదు.

జయ : కనిపించనేలేదా?

మైత్రీ : లేదు గురూ.

జయ : రాత్రి కనిపించాడా?

మైత్రీ : కనిపించకేం, పొద్దుపోయేదాకా శాస్త్రార్థాలు వినిపిస్తూ వుంటే ప్రపంచం మరచి అలాగే వింటూ కూర్చున్నాను. యామికుడు రెండు కొట్టాడు. ఎంత బ్రతిమాలినా వినక నన్ను మందలించి పండుకొమ్మని చెప్పి విశ్వంతరుడు తన కుటీరానికి వెళ్ళిపోయాడు. ఈ ప్రొద్దున మాత్రం అతడు కనిపించలేదు.

జయ : అలాగా! ఎక్కడికి వెళ్ళాడు? విచిత్రంగావుంది చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళడే!

మైత్రీ : విచిత్రంగానే వున్నది. గురుపాదాభివందనం చేయనిదే బయటికి కదిలేవాడు కాదు.

జయ : నాయనా, మైత్రీబలా!

మైత్రీ · ఏమిగురూ!

జయ : సరే! నీవు విహార ప్రవేశోత్సవ సన్నాహాలు చూడు విశ్వంతరుడు రాగానే చెప్పు.

మైత్రీ : మహాప్రసాదం ... కాని ...

జయ : ఏమిటి నీ సందేహం?

మైత్రీ : (గద్గదకంఠంతో) గురువులు క్షమించాలి.

జయ : జయదేవుని వద్ద సంశయమందేనికి? చెప్పునాయనా చెప్పు!

మైత్రీ : నాలో చోరత్వం అంతరించి మైత్రీబలత్వం ఎప్పటికి పాదుకుంటుంది గురూ?

జయ : (నవ్వి మెల్లగా మైత్రీబలుని బుజం తడుతూ) అదా నీబాధ. నాకున్నవి రెండే కళ్ళు ఒకటి విశ్వంతరుడు. రెండు మైత్రీబలుడు

మైత్రీ : గురువుల అనుగ్రహం యేనాడో సిద్ధించింది. కాని....

జయ మనస్సు విప్పిచెప్పటం లేదనేకదా నీ బాధ. బుద్ధదేవుని శరణుకోరే వారికి దాపరిక మేముంటుంది? కాని నీవూ విశ్వంతరుడూ ఈ కొత్త విహారం చూశారా?



మైత్రీ : చూచాము గురూ!

జయ : ఎలావున్నది?

మైత్రీ : ప్రత్యేకంగా అడగటందేనికి? జయదేవ శిక్షితుడైన విశ్వంతరుని వాస్తురచనకు అన్యథాత్వ మెక్కడిది? గురూ, గురూ! ఛీని సింహళ జాల్యాదిదేశాలలో విశ్వంతరుడు యెన్ని విహారాలు నిర్మించలేదు? కాని వాటిలో ఒకటి కూడా ఈ విహారంవలె లేదు. లోకోత్తరమైన శిల్పం బుద్ధదేవుని దివ్యకలలన్నీ కన్నులకు కడుతున్నట్లున్నవి. విశ్వంతరునిలో ఇంత మహత్తరశక్తి వున్నదనుకోలేదు. అతడు నిర్మించినవే కదా ఇతర విహారాలు వాటికి ఈ జీవంరాలేదేమీ గురూ? చూడగా చూడగా ఇచటి నైసర్గిక స్థితిగతులను పూర్ణంగా ఆకళించుకొని ఈవిహారంనిర్మించి నట్లున్నది విశ్వంతరుడు ఈదేశం యెప్పుడు వచ్చాడు? ఎప్పుడు చూచాడు?

జయ : అలాగా!

మైత్రీ : అంత మనోజ్ఞంగావుంది. కాని ..

జయ . ఇవాళ నీకు అన్నీ సందేహాలే.

మైత్రీ : లేదు గురూ.

జయ . ఏదీ ఇటుచూడు ఇకకానీ.

మైత్రీ : ఏమీలేదు గురూ!

జయ : నాయనా, నీవు మైత్రీబలుడవు. ఆ సంగతి నాకు తెలుసు.

మైత్రీ : ఈనూతన విహారం...

జయ : (ఆందోళనతో) ఈనూతన విహారం?

మైత్రీ : ఏదో బలి కోరుతున్నట్లున్నది.

జయ : బుద్ధం శరణం గచ్ఛామి. బుద్ధం శరణం గచ్ఛామి. బుద్ధం శరణం గచ్ఛామి.

మైత్రీ : (గద్గదకంఠంతో) క్షమించండి. తెలియక అన్నాను.

జయ : (అటూ ఇటూ పచారుచేస్తూ) విహార నిర్మాణసంకల్పం బయలుదేరినప్పటి నుంచీ అన్నీ దుర్నిమిత్తాలే... అన్నీ దుర్నిమిత్తాలే.

మైత్రీ : దుర్నిమిత్తాలా?

జయ : అవును. ఈ వార్ధక్యంలో ధర్మపారంగతులైన ఇద్దరు మేటిశిష్యులుండగా ఎందుకు బయలుదేరవలసి వచ్చింది? చైనాలో విహారాలు నెలకొల్పటానికి పంపిందప్పుడు, సింహళంలో ధర్మసూక్ష్మ విచారణకు పంపినప్పుడు. జావాలి ద్వీపంలో బౌద్ధప్రచారానికి పంపినప్పుడూ బయలుదేరని యీ ముదుసలి ఇవాళ ఎందుకు బయలు దేరవలసి వచ్చినది? 185

మైత్రీ : (జంకుతూ) నావల్ల నేమైనా తప్పుజరిగిందా గురూ?

జయ : లేదు.

మైత్రీ : విశ్వంతరుని వల్ల నేమైనా....

జయ : లేదు.

మైత్రీ : గురుదేవులహృదయం అర్థం కావటంలేదు.

జయ : హేమచంద్రుని విజ్ఞాపనపై విశ్వంతరుడు ఏమన్నాడో జ్ఞాపకమున్నదా?

మైత్రీ : లేకేమి? హేమచంద్రుడు సుధన్వునిపంపి ఈ విహార నిర్మాణం కోరాడు. విశ్వంతరుడు మొదట్లో అంగీకరించలేదు.

జయ : విశ్వంతరునుకి బౌద్ధధర్మవ్యాప్తి ఇష్టంలేదు అంతేనా?

మైత్రీ : అదే నిజమైతే జయదేవులకు కరుణ, చంద్రునికి వెన్నెల సహజం కాకపోవాలి.

జయ . విశ్వంతరుడు మరి మొదట్లో ఎందుకు ఒప్పుకోలేదు?

మైత్రీ . అతని హృదయానికి ఏమి తోచిందో?

జయ · ఈ నూతన విహారం చూచినప్పుడు నీకు కలిగిన శంక లాంటిదే ఒకటి కలిగి ఉండాలి అది అలావుంచు విహార నిర్మాణానికి అంతగా ప్రాధేయపడి, అంత ధనం వెచ్చించిన హేమచంద్రుడు ఇంతవరకు కనిపించనే లేదు జరపవలసిన సత్కారాలు జరిపాడనుకో. కాని అతడు నిన్న సాయంకాలంకాని, ఇవాళకాని ఇంతవరకు కనిపించలేదు బౌద్ధ ధర్మదీక్షితుడు ఇలా చేస్తాడంటావా?

మైత్రీ : నిజమేగురూ. చూచినకొలది అనుమానాలే ఎక్కువౌతున్నవి.

జయ : ఇంతకూ అపశకునాలు రెండేకాదంటావు?

మైత్రీ : అవును గురూ. ఈ దేశంలో ధర్మశాలలు కనిపించలేదు. అన్నిమైళ్ళు ప్రయాణం చేసివచ్చామా మార్గంలో మంచినీళ్ళ బావిఅయినా కనిపించిందా? లేదు దేశంలో డబ్బువుంది, మేడలున్నాయి, కాని ధర్మమనేది ఎక్కడా కనిపించ లేదు. ఇలాంటి మరుభూమిలో విహారం ఉండి ప్రయోజనకారి అవుతుందా? బహుశ ఇదంతా తెలిసే విశ్వంతరుడు మొదట్లో విహారనిర్మాణానికి అంగీక

186 రించలేదేమో ననిపిస్తున్నది

జయ : అదే కారణమైతే నాదగ్గర దాయవలసిన అవసరమేమి వచ్చింది?

మైత్రీ : అదే అర్థంకావటంలేదు.

జయ : ఇంతకూ విశ్వంతరుడు ఎక్కడకు వెళ్ళినట్లు? వెళ్ళినా ఇంతవరకూ రాక ఏమిచేస్తున్నట్లు?

మైత్రీ : ఎందుకు అంత కలవరపడతారు? ఈపాటికి తిరిగి వస్తుండాలి?

జయ . ప్చ్ ప్చ్. ఏమీ బాగుండలేదు. వెంటనే వెళ్ళిపోవటం ఉత్తమంగా కనిపిస్తున్నది

మైత్రీ : (ఆశ్చర్యంతో) వెళ్ళిపోవటమా?

జయ : అవును. ఊషరక్షేత్రంలో విత్తనంచల్లి ఎంతకాలం ఎదురుచూచినా ఏమిలాభం?

మైత్రీ : తాము సంకల్పించాలేకాని ఊషరక్షేత్రాలైనా తృటిలో కేదారఖండాలుకావా?

జయ : నీ గురుభక్తి అలా అనిపిస్తున్నదికాని కారణ కార్యసూత్రాన్ని ఎవడూ విచ్ఛిన్నం చేయలేడు.

మైత్రీ : అయితే బౌద్ధం అపహాస్యంపాలు కావలసిందేనా? ఆర్తులు అనాధులు కట్టు కొంటున్న ఆశాసౌధాలు భగ్నం కావాలసిందేనా?

జయ : బుద్ధదేవుని ఇచ్చి. నీవుపోయి విశ్వంతరుని పిలుచుకొని రావాలి. అతనిమీదనే కర్తవ్యం ఆధారపడి ఉంది.

మైత్రీ : చిత్తం. కాని.....

జయ : ఇవాళ-లేచింది మొదలు నీకు అన్నీ సందేహాలే. ఏమిటది?

మైత్రీ : పాదుకార్చనం భిక్షువులకు విహితమా?

జయ : (కోపంతో) ఏమన్నావ్?

మైత్రీ : (అర్థోక్తిగా) పాదుకార్చనం.....

జయ : మైత్రీబలా! ఇటుచూడు! నువ్వు జయదేవునివద్ద దీక్ష పుచ్చుకున్నవాడవేనా?

మైత్రీ : క్షమించండి. తెలియక నోరుజారి ఏదోఅన్నాను. వెళ్ళి ఇప్పుడే విశ్వంతరుణ్ణి పిల్చుకువస్తాను. (పోబోతుంటాడు.)

జయ : ఏయ్ మైత్రీ, ఆగు! బౌద్ధభిక్షువులు సత్యవ్రతులు. నువ్వు బౌద్ధభిక్షువునని ఇప్పటికీ నా నమ్మకం. పాదుకార్చనం చేస్తున్నది ఎవరు?

మైత్రీ - : గురూ, గురూ....

జయ : సత్యం, అహింస, దయ, త్యాగం లేక బౌద్ధం లేదు నాయనా!

మైత్రీ : విశ్వంతరుని సంచిలో పాదుకలు కనిపించాయి. అతనివో మరొకనివో మాత్రం తెలియదు అతడు అర్చిస్తూ ఉండగా ఈ కన్నులు చూడలేదు. కాని అర్చనా చిహ్నాలు మాత్రం పాదుకలమీద కనిపించాయి.

జయ : మైత్రీబలా, ఒక్కగ్రుడ్డు గ్రుడ్డివుంటే ఈ ముసలి ప్రాణాలు చిటికెలో పోయి వుండేవికదా. లేదు, ఈ ముసలివాడిమీద జాలిలేదు.

మైత్రీ : నా తప్పు క్షమించండి.

జయ : నీవల్లనా తప్పు? లేదు. నిజంగా నేను భ్రష్టుణ్ని. ఇంకా ఇంతవరకు లోకం అర్థంకాలేదు. మైత్రీ, మైత్రీ, నువ్వు ఎరుగవు అప్పటికి విశ్వంతరుడికి పదీ పన్నెండేళ్ళు నిండవు. రేగినజుట్టు, శల్యావశిష్టమైన శరీరం, పీకుకొనిపోయిన కన్నులు, ఆ కన్నుల్లో ప్రబలమైన విద్యాతృష్ణ. ఆ రూపం చూడగానే సహించ లేకపోయాను. దగ్గరకుతీసి నాకు తెలిసిన నాలుగుముక్కలూ చెప్పాను. ఎంత శ్రమకోర్చాడు! ఎంతోదీక్షతో చదివాడు. నాజన్మం, నావిద్య చరితార్థమైన దనుకొన్నాను. అలాంటి విశ్వంతరుడు వివిధ దేశాలలో విహారాలు నెలకొల్పి బౌద్ధధర్మం శాఖోపశాఖలుగా విస్తరిల్లటానికి అచంచలదీక్షతో కృషి చేస్తున్న

విశ్వంతరుడు- ధర్మేతరుడై గురువంచకుడై ఇలా చాటుమాటున పాదుకార్చన చేస్తున్నాడంటే ఏమనాలి? నాది కేవలం నిరర్థకజన్మం. నా గురుకులవాసక్లేశ మంతా వ్యర్థం. మైత్రీ వస్తా. (గబాగబా వెళ్ళిపోతుంటాడు)

మైత్రీ : గురుదేవా గురుదేవా! మీరు పెద్దలు. జరగవలసిందా విహార ప్రవేశమహోత్సవం. విశ్వంతరుడూ నేనూ మీ ఆజ్ఞాబద్ధులం. మాకే శిక్ష అయినా విధించవండి కాని మీరిలా పోతే బౌద్ధప్రతిష్ఠకే భంగం కలుగుతుంది. (దారికి అడ్డంగా నిలబడతాడు.)

జయ . దారివిడువు. నీకే చెబుతన్నది. (పావుకోళ్ల చప్పుడు వినిపిస్తుంది. చేతిసైగతో ప్రక్కవాటుగా నిలబడమని మైత్రీబలునికి సూచిస్తాడు. అతడు దారివదలి గురువుల ప్రక్కన నిలబడతాడు. జయదేవుడు వస్తున్న వ్యక్తిని ఉద్దేశించి) ఎవరది?

(విశ్వంతరుడు ప్రవేశిస్తాడు. పాతికేండ్లు నిండీనిండని వయస్సు, బంగారు చువ్వలాంటి శరీరం, చిరునవ్వు లొలుకుతున్న ముఖం. భిక్షుయోగ్యమైన వేషం)

188 విశ్వం : గురువులకు నమస్కారం.

జయ : ఎవరది? ఇదివరకు చెవులుమాత్రమే సరిగా వినిపించేవి కాదు. ఇప్పుడు కళ్ళు కూడా కనిపించటంలేదు.

విశ్వ : (భయపడుతూ) నేనే .... విశ్వంతరుణ్ని.

జయ : విశ్వంతరులా? ఎవరోయి ఈ విశ్వంతరులు? ముసలితనం. బొత్తుగా మతి కూడాపోయింది. నువ్వన్నా కాస్తజ్ఞాపకం చేయలేవా మైత్రీబలా?

విశ్వ : నావల్ల దోషముంటే క్షమించండి. (పాదాలమీద పడతాడు.)

జయ : నిగ్రహానుగ్రహ సమర్థులు ముసలివాడి కాళ్ళమీద పడటమా? లెండి.

విశ్వ : క్షమిస్తేగాని లేవను.

జయ : క్షమించవలసినది పాదుకలుకాని నేనుకాదు.

విశ్వ : (మెల్లగాలేచి) పాదుకలా?.... పాదుకలా? ఆఁ.... అవును. ఇంతవరకూ మీకుచెప్పలేదు. మహాపరాధం జరిగింది. దిక్కుమొక్కులేని ఒక అనాధ బాలుణ్ని చేరదీసి ఇంత వాణ్ని చేశారు. ఈ నిర్భాగ్యుడు ఆమాత్రం విశ్వాసం చూపించలేకపోయాడు. ఇంతకన్నా మహాపరాధమేమున్నది? దీనికోసం

సంవత్సరాలనుండి హృదయం యెర్రగా కాల్చిన ఇనపశలాకతో వాతలు పెట్టినట్లు బాధపడుతూనేవుంది. ఎప్పుడు సమయం వస్తుందా, ఎప్పుడు గురువులకు వివరిస్తానా అని తహతహపడుతూనే వున్నాను. కాని ఇనాళ్ళవరకు అలాంటి అవకాశం రాలేదు నేటికి అది లభించబోతున్నది. ఈ కొండదిగడి యలూ ఆగితేఅంతా మీకేఅర్థమౌతుంది. అప్పుడే శిక్షయినావిధించవచ్చును.

మైత్రీ : గురుదేవా! ఈ ఒక్కమనవి మన్నించండి!

జయ : అధికారభ్రష్టుడైన వృద్ధునికి అంతకన్నా మార్గమేమున్నది?

విశ్వ : బుద్ధభగవాన్! ఇంకా నేను బ్రతికి యెందుకు?

(కుటీరం వెలుపలనుంచి ''ఒఓంబీబీ, ఒఓంబీబీ, ఒఓంబీబీ,'' అంటూ బోయీల మోతలు వినిపిస్తవి)

జయ : ఎవరీ నరవాహనుడు?

మైత్రీ : బౌద్ధుడుమాత్రం కాదు.

గొంతు : (వెలుపలినుంచి) విశ్వంతరులు ఉన్నారా?

మైత్రీ : ఆఁ, లోపలికిరండి.

(సుధన్వుడు, హేమచంద్రుడు ప్రవేశిస్తారు. సుధన్వునికి నలభై సంవత్సరాలుంటాయి ఇనుపదుక్కలాంటి శరీరం, నల్లని మీసాలు, కరకుచూపులు, హేమచంద్రునికి యాభై సంవత్సరాలుదాకా వుంటాయి. దొందుఒళ్ళు. అంతచిన్నదీ, పెద్దదీ కాని బొజ్జ, తెల్లనిమీసాలు, సొగసైన వేషం.)



సుధ :
హేమ : } నమస్కారం

విశ్వ : అటు కూర్చోండి.

సుధ : వీరే హేమచంద్రులు నన్ను సుధన్వుడంటారు.

హేమ : వీరు నా ఆప్తమిత్రులు (జయదేవునిచూచి) మీరేనా విశ్వంతరులు?

జయ కాదునాయనా, కులపతి విశ్వంతరుడు అతడు. విహార ప్రవేశ మహోత్సవం జరిపేది అతడే.

హేమ (ఆశ్చర్యంగా) వీరేనా విశ్వంతరులు?

జయ : అవును అతనితో మాట్లాడుతారేమో, నాయనా, మైత్రీబలా! భిక్షువుల సదుపాయాలు విచారించవద్దా. (జయదేవుడు, మైత్రీబలుడు వాకిలివైపు వెళ్ళుతుంటారు )

విశ్వ : గురుదేవా, మైత్రీబలా, కొంచెం ఆగండి నాయనా, హేమచంద్రా! బౌద్ధ భిక్షువులకు రహస్యాలు లేవు మీరు చెప్పవలసినదేమైనా వుంటే నిరభ్యంతరంగా చెప్పవచ్చును (జయదేవుడు, మైత్రీబలుడు యధాస్థానాలు అలంకరిస్తారు)

హేమ . నిన్న మీకు స్వయంగా సుస్వాగతమిచ్చే మహాభాగ్యానికి నోచుకోలేక పోయాను క్షమించండి

సుద : పనిమీద గ్రామాంతరం వెళ్ళవలసివచ్చింది మీరు వచ్చేలోగా తిరిగి రావచ్చునని వెళ్ళాము. పనిపూర్తిచేసుకొని వస్తూవుంటే దారిలో ఏరు వెల్లి పొడిచింది దానితో నిన్న రాత్రి అంతా అక్కడే గడపవలసి వచ్చింది.

విశ్వ : దైవికంగా వచ్చినవాటికి మరొకరుమాత్రం చేయగలిగిన దేమున్నది? అదిసరే మరి....

హేమ : (ఆతురతతో) ఏమిసెలవు?

విశ్వ : ఏమీలేదు. ఈ విహార నిర్వహణం మీకు త్రికరణశుద్ధిగా ఇష్టమేకదా?

హేమ : అందుకు ఈ పంచభూతాలే సాక్షి. ఈ బౌద్ధభిక్షువులే సాక్షి

విశ్వ : నాయనా, హేమచంద్రా! వేరే సాక్ష్యాలతో పనిలేదు. నీ అంతరాత్మ విషయమే ఇప్పుడు కావలసింది.



హేమ : (నత్తులుకొడుతూ) నా. .. నా అంతరాత్మ సంగతా? (అంతలోనే నవ్వుతూ) అంతరాత్మ ఒప్పుకోనినాడు హేమ చంద్రుడు విహారానికి ఇన్ని కోట్ల నిష్కాలు వెచ్చిస్తాడా?

విశ్వ : సరే. ఇప్పుడు ఆగాధ దేనికిగాని, మరి .

హేమ : (చేతలుకట్టుకొని క్రిందికి చూస్తూవుంటాడు )

సుధ : ఏమిసెలవు?

విశ్వ : నేను చెబుతున్నది హేమచంద్రునికిగాని నీకుకాదు. నాయనా, హేమచంద్రా! నీ చిత్తశుద్ధివల్ల భిక్షువులకు ఏమాత్రం అనుమానం లేదు నీపట్లనేకాదు యావన్మానవ జాతిలోను మాకు విశ్వాసం వుంది భౌద్ధ ధర్మం మనుషులకే కాని మ్రాకులకు కాదుగదా!

హేమ : విశ్వంతరులు ఆజ్ఞ ఏమని?

విశ్వ : ఆజ్ఞ కాదు. అభ్యర్థన. నీవు బౌద్ధధర్మ దీక్ష స్వీకరించాలి తరువాతనే విహార ప్రవేశ మహోత్సవం

సుధ : దీక్షాస్వీకరానికి, ప్రవేశమహోత్సవానికి అవినాభావ సంబంధమా?

విశ్వ : అవును. సందేహముంటే మా గురువులు జయదేవులనే అడుగవచ్చును

సుధ . (జయదేవునితో) అంతేనా?

జయ : అంతే.

సుధ : విహార నిర్మాణానికి అంగీకరించిననాడే ఈ సంగతియెందుకు చెప్పలేదు?

మైత్రీ : భిక్షువులకు రెండు నాలుకలు. పొట్టలుకూడా పెద్దవి.

సుధ : నేను ఆ మాట అనలేదు!

హేమ : సుధన్వా, ఆగు. బౌద్ధమతేతరుడు విహారప్రతిష్ఠాపనకు పూనుకొంటారని ఎవరనుకొంటారు? ఇందులో ఎవరి పొరపాటు ఏమీలేదు.

విశ్వ : మరి?

హేమ : సంసారకూపంలో కూలినవారికి బౌద్ధధర్మం కంటె శరణ్యమేమున్నది? మొదటి నుంచీ ధర్మదీక్ష తీసుకొందామని తహతహ లాడుతూనే వున్నాను కాని విహారనిర్మాణ ప్రారంభంతో బౌద్ధశిల్పుల పరిచయభాగ్యం లభించింది వారి దీక్ష ధర్మనిష్ఠ చూచినతరువాత కంపించిపోతున్నాను.

మైత్రీ : కంపించిపోతున్నారా? 191

హేమ : అవును. నాసంగతీ అంతగా తెలియదు కాబట్టి ఆశ్చర్యంగానే వుండవచ్చును. కాని నాలాంటి అలసుడు, చపలుడు దుర్బలుడు, ప్రపంచంలో మరొకడు పుట్టడు. అంతదాక దేనికి? ఇవాళ మిమ్ము కాలినడకనువచ్చి సందర్శించాలని సంకల్పం. కాని పల్లకివచ్చి గుమ్మంలో నిల్చింది. వద్దనుకొంటూనే వున్నాను కాని కాళ్ళు నన్ను పల్లకీలోకి చేరవేశాయి. ఇలాంటివానికి దీక్షయిస్తే భిక్షు లోకానికే కళంకంకాదా?

విశ్వ : నాయనా, హేమచంద్రా! దీనికైతేమాత్రం నీవు సంకోచించవలసిన పనిలేదు. అసలు ధర్మసూత్రాలు ఎందుకు వెలసినవనుకొంటున్నావు? మనలాంటి కృపణులకోసమే. అంతేకదా గురుదేవా?

జయ : అవును. ప్రపంచంలో సాధారణంగా ప్రతివాడు దుర్బలుడే. జీవి ఎంత దుర్బల మైనా జీవయాత్ర మానుకొంటున్నదా? యధాశక్తిని సాగిస్తూనే వుంది ధర్మ విషయంలో మానవుడు కూడా అంతే

సుధ : ఇంతకూ ధర్మదీక్ష తీసుకొనక వీలులేదంటారు!

విశ్వ : అవును. నాయనా హేమచంద్రా! దీక్షాస్వీకారం – విహారప్రవేశ మహోత్సవం

నీకు సమ్మతమైతే సాయింకాలం దుందుభులు వ్రేయించు కాదనుకొంటావా మానుకో. తీరికగానే ఆలోచించి నీవు ఎలాచేసినా మాకు సంతోషమే సరేనా?

హేమ : ధన్యుణ్ని సంఘం శరణంగచ్ఛామి (నమస్కరిస్తాడు)

సుధ : భిక్షువులకు నమస్కారం.

విశ్వ :
జయ : } (ఆశీర్వదిస్తూ) శుభంభూయాత్!
మైత్రీ :

(సుధన్వ హేమచంద్రులు వెళ్ళిపోతారు. వెలుపలనుంచి బోయీల ''ఒ. ఓం'' బీబీ ధ్వనులు)

మైత్రీ : ఇక జరగవలసినవని?

విశ్వ : ఏమున్నదీ? ప్రవేశమహోత్సవానికి ఆయత్తం కావటమే.

జయ : విశ్వంతరా!

విశ్వ : ఏమి గురూ?

 జయ : కార్యక్రమమంతా నిర్విఘ్నంగా జరిగిపోయిందనే నా విశ్వాసం?

మైత్రీ : విఘ్నాలు తప్పవంటారా?

విశ్వ : ఎన్ని విఘ్నాలు వచ్చినా విహారప్రవేశమహోత్సవం జరగకతప్పదు. ఇంతమేర వచ్చిన తరువాత హేమచంద్రుడు వెనుకంజ వేస్తాడని అనుకోను.

జయ : సరే, మీరిద్దరూపోయి భిక్షువుల సదుపాయాలు చూడండి. ఏమాత్రమైనా ఏమరిల్లేరు! ఎందుకైనా మంచిది, ప్రవేశ మహోత్సవానికి ఆయత్తమై ఉండండి.

మైత్రీ : } అలాగే (జయదేవునికి నమస్కరించి నిష్క్రమిస్తారు.)
విశ్వ :

## రెండు

(విహారం మిద్దెమీద విల్లమ్ములు తాల్చిచేతులు వెనుక కట్టుకుని సుధన్వుడు ఆందోళనతో అటూయిటూ పచారుచేస్తున్నాడు; ఇంతలోనే పావుకోళ్ళ చప్పుడు వినిపించింది. తెల్చికోలు నవ్వుతో వస్తున్నవ్యక్తి ఎవరో చూడకుండానే ఆహ్వానిస్తాడు )

సుధ : దయచేయండి, దయచేయండి! పెద్దలకు శ్రమ కలిగిస్తున్నందుకుక్షంతవ్యుణ్ణి.

జయ : (ప్రవేశించి ఒక్కక్షణంలో నఖశిఖపర్యంతం సుధన్వుణ్ని చూచి) ఆర్తులకు తోడ్పడటంకన్నా భిక్షువులకు పరమధర్మ మేమున్నది!

సుధ : ఆర్తుడనా! (నవ్వుతో) జయదేవులు చమత్కార ప్రియులు

జయ : కాదు, సత్యప్రియులము.

సుధ : ఇంతకూ ఆర్తుడనంటారు?

జయ : నిస్సందేహంగా. లేకపోతే బౌద్ధవిహారంలో ఈ వేషానికి అవసరమేమివచ్చింది?

సుధ : నన్ను సుధన్వుడంటారని ఇదివరకే మనవిచేశాను.

జయ : జ్ఞాపకం లేకపోలేదు. కాని హేమచంద్రుడు ఎక్కడ?

సుధ : పెద్దలు క్షమించాలి మీకోసం కబురుపంపించింది నేనే. హేమచంద్రుడుకాదు.

జయ : విచిత్రంగా వుందే! నాయనా సుధన్వా! భిక్షువుల తత్త్వం నీకింకా అర్థం కానట్లున్నది. ఏ జీవి సహాయంకోరినా భౌద్ధ భిక్షువు శక్తివంచనలేక తోడ్పడుతాడు అంతేకాని ధనానికి కాని, పదవికి కాని అతడు దోసిలి ఒగ్గడు. పశు బలానికి అంతకన్నా లొంగడు.

సుధ : పొరపాటేజరిగింది. ఇప్పుడైనా మించిపోయినదేమున్నది? మీరు చెప్పినట్లు నేను ఆర్తుణ్ని. ఆర్తునికి తోడ్పడటం భిక్షుకధర్మంకదా! 193

జయ : ఇంతకూ మేము చేయగలిగిన సాయం?

సుధ : హేమచంద్రుడు బౌద్ధమతస్వీకారానికి యోగ్యుడుకాదు. అందువల్ల అతనెక దీక్ష ఇవ్వవద్దని మనవి. ఇంతకన్నా మిమ్ము ఏమీ కోరటం లేదు.

జయ : నాయనా! ఛండాలుడు మొదలుకొని బ్రాహ్మణునిదాకా అంతా యోగ్యులేనని బుద్ధభగవానుని ఉపదేశం. ఇకదీక్షా ప్రదానమంటావా, హేమచంద్రునికి ఇష్టం లేనిదే ఏవరూ అతనికి దీక్ష ఇవ్వరు. ఇది ముమ్మాటికీ నిజం. ఇక నీవు నిశ్చింతగా ఉండవచ్చును.

సుధ : క్షమించండి. నా హృదయాన్ని సరిగా చెప్పలేకపోయానేమో. హేమచంద్రునికి మిత్రుణ్ని కాబట్టి, బౌద్ధధర్మ వ్యాప్తి ఇష్టం కాబట్టి చెబుతున్నాను. హేమ చంద్రుడు ఈ విహార నిర్మాణానికి యెందుకు పూనుకొన్నాడో తెలుసా?

జయ : బౌద్ధధర్మం అతనికి నచ్చింది.

సుధ : (నవ్వుతూ) భిక్షువులకంటే పసిపిల్లలే నయంసుమా!

జయ అంటే?

సుధ . ఏమున్నది? నల్లనివన్నీ నీళ్ళూ తెల్లనివన్నీ పాలూ అనుకొంటారు భిక్షువులు

జయ . (కరినంగా) సుధన్వా హేమచంద్రుడు నీకు మిత్రుడు

సుధ · అటు హేమచంద్రునికీ, ఇటు బౌద్ధభిక్షువులకూ ఆప్తుడను కాబట్టే చెబుతున్నాను.

జయ : ఏమని?

సుధ : నామాట సావకాశంగా ఆలకించండి. ఆ తరువాత మీ యిష్టం హేమచంద్రుని సంపద పూర్వులిచ్చిపోయింది కాదు. నిరుపేదకుటుంబంలో పుట్టి ఈనాటికి కుబేరుడయ్యాడు. ఎలా అయ్యాడు?

జయ : కష్టించి సంపాదించాడు.

సుధ : కాదు. అక్రమమార్గాలు త్రొక్కి వర్తకం ద్వారా సంపాదించాడు. ఇంత సంపాదించినా అతనికి సంతృప్తిలేదు. ఆ సంగతి మీకు ఎలా తెలుస్తుంది? అంత రంగికుణ్ని కాబట్టి నాకు తెలుసు.

జయ - : ఇంతకూ నువ్వుచెప్పేది ఏమిటి?

194 సుధ : ఏమీలేదు. ఈ విహారనిర్మాణంతో బౌద్ధుల ప్రాపకం సంపాదించి చైనా సింహళం మొదలైన దేశాలతో వర్తకం సాగించాలని చూస్తున్నాడు. అంతేగానీ నిహికజీవితం మీద విరక్తిలేదు, భౌద్ధధర్మంలో అనురక్తిలేదు

జయ : (ఆలోచిస్తూ) అలాగా?

సుధ : మరేమనుకున్నారు? అలాంటివానికి దీక్షయిస్తే బౌద్ధులకు కళంకం మాత్రమే కాదు, భిక్షుక వ్యవస్థఅంతా తారుమారు అవుతుంది. మీలాంటి పవిత్ర మూర్తులు ఇలాంటిదానిని సహిస్తారని నేను కలలోకూడా అనుకోలేదు.

జయ : నాయనా నీ బౌద్ధధర్మాభిమానం భిక్షువులు మరచిపోరు వెళ్ళి వాస్తము (వెళ్ళి పోతూ వుంటాడు)

సుధ : సమాధానం చెప్పకుండానే వెళ్ళుతున్నారా?

జయ : (ఆగి) నన్నేమి చెప్పమంటావు నాయనా? ఇష్టమై దీక్షపుచ్చుకొనేది హేమ చంద్రుడు. ఇచ్చేది విశ్వంతరుడు. మధ్య ఈ జయదేవుడు ఎవరు?

సుధ : ఈ దీక్ష హేమచంద్రునికి ఇష్టంలేదు

(విహారంలో దుందుభులు మ్రోగుతుంటాయి సుధన్వుడు తెల్లబోతాడు జయదేవుడు అతనివాలకం చూచీచూడనట్లు ఊరకుంటాడు )

సుధ : జయదేవా! జయదేవా!

జయ ఏమి నాయనా?

సుధ : ఈ దీక్షాప్రదానం జరగటానికి వీలులేదు

జయ : అయితే మమ్మేమి చేయమంటావు?

సుధ : దీక్షాప్రదానం మానిపించాలి.

జయ : దీక్ష ఎవరిస్తున్నారో తెలుసా? విశ్వంతరులు.

సుధ : మీ శిష్యుడేకదా!

జయ : అది మూడేళ్ళనాటి మాట.

సుధ : నేడుకాదా?

జయ · కాదు. అతడు కులపతి. అతని ఆజ్ఞ భిక్షుకలోకం శిరసావహించాలి.

సుధ : ఇదుగో, ఇటుచూడండి. ఎందుకు బూకరిస్తారు? సుధన్వుడు అచ్చికాలు, బుచ్చికాలు నమ్మడు. అందులో ఈ విల్లుందే ఈ విల్లు (ధనుష్టంకారం చేస్తాడు) బొత్తుగా నమ్మదు. దీనికి లక్ష్యదృష్టేతప్ప చెవులు లేవు.



జయ : (పెద్దగా నవ్వుతూ) ఇంతవరకూ సుధన్వుడు కార్యసాధకుడనుకొన్నాను.

సుధ · (గద్దిస్తూ) చాలు. ఆ విషపు నవ్వు ఆపండి!

జయ : సరేకాని, జయదేవుని వయస్సెంత నాయనా?

సుధ : అదంతా నిర్ణయించవలసినది విశ్వంతరుడు కాని సుధన్వుడు కాడు. ఎవడురా అక్కడ? జయదేవులు తమ ఆయుః ప్రమాణం అడిగిరమ్మన్నారని విశ్వంతరులను ఏకాంతంగా అడిగిరా. పో. ఇక్కడున్నట్లు రావాలి.

జయ : (నవ్వుతూ) త్వరగా పంపునాయనా. శుభస్య శీఘ్రమన్నారు గదా పెద్దలు.

సుధ : భైరవా ఆగు! (జయదేవునితో) విశ్వంతరులు రారా?

జయ : మమ్ము అడగటం దేనికి! భైరవుణ్ణి త్వరగాపంపు. తరువాత అనుకొని ప్రయోజనం లేదు.

సుధ · విచిత్రంగావుంది. ప్రాణాలుపోతుంటే గురువులకు గ్రుక్కెడు నీళ్ళు పోయని శిష్యుడుకూడా ఒక శిష్యుడేనా?

జయ : విశ్వంతరుని సంగతి నీవంటివారికి అర్థంకాదు.

సుధ అర్థమౌతుందో లేదో ఇప్పుడే తేలుస్తాను. భైరవా! భైరావా!

(మంగళతూర్యధ్వనులు వినిపిస్తుంటాయి సుధన్వుడు తెల్ల బోతాడు, జయదేవుడు మందహాసం చేస్తాడు )

సుధ : భైరావా, ఇక నీతో పనిలేదు. పోవచ్చు

జయ : (గంభీరంగా) దీక్షాప్రదానం అయిపోయినట్లున్నది!

సుధ : జయదేవా, ఎత్తిపొడుపులుమాను ఇల్లు అలికినంత మాత్రాన పండుగకాదు.

జయ : నాయనా కోపందేనికి? ముసలితనంలో మతితప్పి ఏదో అని వుంటాను. క్షమించు, హేమచంద్రుడు మనసార దీక్ష అర్థించాడు, సుప్రసన్నుడై విశ్వంతరుడు ఇచ్చాడు. విహార ప్రవేశ మహోత్సవంకూడా పూర్తి అయినట్లున్నది.

సుధ . ప్రవేశ మహోత్సవం కూడా ముగిసిందా?

జయ : అదిగో!

(విహారంలోపలనుంచి 'బుద్ధభగవానునికిజై. విశ్వంతరులకు జై. బౌద్ధధర్మాలకుజై' అన్న నినాదాలు వినిపిస్తూ వుంటాయి)

196 జయ : నాయనా సుధన్వా! ఇంకా కోపతాపాలు అనవసరం గతించిన దేదో గతించింది. హేమచంద్రుడు భిక్షువుఅయ్యాడు పైగా బౌద్ధులు దయార్ద్ర హృదయులు. చేతనైనంతసాయం యెప్పుడడిగినా చేస్తారు. ఇక మేము పోయి రావచ్చునా?

సుధ : కదలటానికి వీలులేదు.

జయ : ఇంకా కావలసినదేమున్నది?

సుధ : ప్రతిక్రియ.

జయ : ప్రతిక్రియా?

సుధ : మీ విశ్వంతరుడు చేసినదంతా గాలికిపోయింది!

జయ : (ఆశ్చర్యంతో) విశ్వంతరుడు అపకారంచేశాడా?

సుధ : అబ్బే, ఏమీ యెరుగడు.

జయ : విచిత్రంగా వుంది!

సుధ : పల్లకీ బోయీలవంటి పరిచారులు, ఆయుధోపజీవులైన నాలాంటివాళ్లు జీవన వృత్తులు కోలుపోయి అలో లక్షణా అని యేడుస్తూవుంటే బౌద్ధభిక్షువులకు విచిత్రంగానే వుంటుంది.

జయ . నాయనా, సుధన్వా! బౌద్ధవిహారాలు అహోరాత్రాలు అందరికీ తెరిచే ఉంటవి.

సుధ (వికటంగా) మీ భూతదయకు జోహారు

జయ : ఇక నేను మాట్లాడి ప్రయోజనం?

సుధ : నిజమే, ఏమాత్రం ప్రయోజనం లేదు.

జయ : నాయనా, ఈ జయదేవుడెన్నడూ ఒరులను యాచించి యెరుగడు. ఇవాళ నోరు తెరచి నిన్నడుగుతున్నాడు

సుధ . తనకు చేతనైన సాయం సుధన్వుడు తప్పకుండా చేస్తాడు.

జయ : అయితే జయదేవుడు సుధన్వునికి చేయగల సాయమేమున్నది?

సుధ : ఏమీలేదు

జయ : మరి ఈ చర్యకు అర్థం?

సుధ . అదే మీ బౌద్ధులకు తెలియదు.

జయ : అంటే?

సుధ . ఏమీలేదు ఈ ప్రపంచంలో నాలాంటివాళ్ళు పుడుతూ ఉంటారు. ఎందుకు పుడుతుంటారో మీ బుద్ధునికి తెలియదు. దానికేమిలే. మీ విశ్వంతరులు ఏదో మాటాడుతున్నారు జాగ్రత్తగా వినండి. నోరుమాత్రం కదిపారో–అన్నీ తెలిసిన మీకు నావంటివాడు చెప్పవలసిన పనిలేదుగా.



(విశ్వంతరుడు, మైత్రీబలుడు, హేమచంద్రుడు, భిక్షువులు, ప్రజలు ప్రవేశిస్తారు. విశ్వంతరుని బుజాన పళ్లెరంలో పాదుకలుంటాయి. హేమచంద్రుడు ముండితమస్తకంతో కాషాయ వస్త్రం కట్టుకొని ఉంటాడు. సుధన్వ జయదేవులకు విశ్వంతరాదులు కనిపిస్తారుకాని, విశ్వంతరాదులకు సుధన్వ జయదేవులు కనిపించరు. భిక్షువులు, ప్రజలు ''బుద్ధభగవానునికి జై, విశ్వంతరులకు జై, బౌద్ధధర్మానికీ జై'' అంటూ జయ జయ ధ్వానాలు చేస్తారు.)

విశ్వ : మైత్రీబలా, గురువులెక్కడ?

మైత్రీ : వారికోసమే ఇందాకటినుండి వెదుకుతున్నా. ఇంతవరకూ ఎక్కడా కనిపించ లేదు

విశ్వ : భిక్షువులలో ఉన్నారేమో?

మైత్రీ : అక్కడా చూచాను

విశ్వ : ఎక్కడకు వెళ్ళారబ్బా! ఇలాంటి శుభసమయంలో ఎక్కడికీ వెళ్ళరే!

హేమ : ఎక్కడకు వెళ్లుతారు? ఈ జనంలోనో, విహార పరిసరాలలోనో ఉంటారు

విశ్వ : మైత్రీబలా! గురువులెక్కడఉన్నారో చూచివస్తావా? మనస్సు ఎందుకో ఆరాటపడుతున్నది.

మైత్రీ : పనులన్నీ నిర్విఘ్నంగా ముగిసినవికదా?

విశ్వ : హేమచంద్ర గురువుల అనుగ్రహంవల్ల అన్నీ ఇంతవరకూ సక్రమంగానే నెరవేరాయి.

హేమ : ఏమన్నారు? పెద్దలు పరిహాసమాడుతున్నట్లున్నది.

విశ్వ :- గురువులతో పరిహాసమా?

హేమ : (జంకుతూ) అయితే, పెద్దలను ఒకటి అడగవచ్చునా?

విశ్వ : సంకోచందేనికి? శిష్యులను యథేచ్ఛగా ఆజ్ఞాపించవచ్చును

హేమ : (గొంతుసవరించుకొంటూ) మీరు భిక్షువుల కులపతులు. ఈ పాదుకలు ఎందుకు మోస్తున్నారో అర్థంకావటం లేదు ఇందులో ఏదో పరమ రహస్యం ఉండిఉంటుంది. కాకపోతే మీలాంటివారు పాదుకార్చనం చేస్తారా?



మైత్రీ : ఇదే గురుదేవులుకూడా అడిగారు. కులపతులు ఇప్పుడైనా వివరించాలని ప్రార్థన.

విశ్వ : గురువులు జయదేవులుంటే ఎంతబాగుండేది?

హేమ : వారి సమక్షంలోతప్పు చెప్పటానికి వీలులేదా? అయితే పోనీండి.

విశ్వ : ఇదివరకేచెప్పాను. శిష్యులను యథేచ్ఛగా శాసించవచ్చును.

మైత్రీ : హేమచంద్రులు ఏమంటారు? ఆలోచించి చెబుతారా?

హేమ : ఆలోచించవలసినదేమున్నది? కులపతులు మనలను తప్పకుండా అనుగ్రహిస్తారు.

విశ్వ : దయచేయండి. పీఠం అలంకరించండి. ఏదీ పాదం (పీఠంమీద కూర్చున్న హేమచంద్రుని పాదాలవద్ద పళ్ళెరంతో కూర్చుంటాడు పాదుకలను పళ్ళెరం నుంచి తీసి కప్పుకొన్న కాషాయవస్త్రంతో తుడిచి హేమచంద్రుని కాలికి తొడగబోతాడు.)

హేమ : అదేమి గురూ! నేను మహాపాపిని మీరు పవిత్రులు. కులపతులు (విశ్వం

తరుడు వినిపించుకోకుండానే పాదుక అతని కాలికి తొడుగుతాడు) బుద్ధభగవాన్, బుద్ధభగవాన్

విశ్వ : పూజ్యులు విచారించవలసిన పనిలేదు (రెండవ పాదానికి కూడా పాదుక తొడ్డుగుతాడు. హేమచంద్రుని కన్నుల వెంట జలజల అశ్రువులు రాలుతాయి. అంతా ఆశ్చర్యచకితులై చూస్తూ ఉంటారు )

మైత్రీ : అంతా విచిత్రం! అంతా అయోమయం!

విశ్వ : హేమచంద్రులు ఇంకా పాదుకావృత్తాంతం వినగోరుతున్నారా?

హేమ : (కన్నీరు తుడుచుకొంటూ డగ్గుత్తికతో) నాయనా విశ్వంతరా! నీమేలు జన్మ జన్మాలకు మరచిపోలేను. (అమాంతం విశ్వంతరుని కౌగిలించుకొంటూ) బుద్ధదేవా, నీదయామృతం మధురమేకాదు, అపారం. నీ ధర్మతత్వం నేటికి అర్థమయింది. నా జన్మ తరించింది. ఈ పాదుకా చరిత్ర అపూర్వం. విశ్వం తరుల అనుగ్రహంవల్ల అది హృదయవీధిలో దేదీప్యంగా ప్రకాశిస్తూ ఉంది.

మైత్రీ : నాయనా విశ్వంతరా, మేమంతా మూఢులం హేమచంద్రులకు చూపిన అను గ్రహంలో కొంతైనా మాకు ప్రసాదించకూడదా?

విశ్వ · (ఏదో మాట్లాడబోతాడు.)



హేమ : నాయనా, విశ్వంతరా! ఆగు. పాదుకాచరిత్ర వినిపించే భాగ్యం నాకే అనుగ్రహించు. ఇంతకన్నా మరేమీకోరను. ఈ ఒక్క కోర్కె చెల్లించాలి

విశ్వ · అంతగా అడుగుతున్నప్పుడు ఎలాకాదనగలను? సరే మీరు చెప్పండి. ఈలోగా, గురువులెక్కడున్నారో చూసివస్తాను.

హేమ : వీల్లేదు. ఈ కాసేపు మీరు ఇక్కడే ఉండాలి. ఈ పీఠం అలంకరించండి. (బలవంతాన తీసుకువెళ్ళి విశ్వంతరుణ్ని పీఠంమీద కూర్చోబెడతాడు ) నాయనలారా వినండి –

కౌశాంబిలో రాహులుడు అనే బాలుడు ఉండేవాడు. అతడు నిరుపేద. దీనికితోడు తల్లిదండ్రులుకూడా చిన్న తనంలోనే కర్వై పోయారు. పొట్టకోసం అతడు కోటీశ్వరుని వద్ద సేవకావృత్తికి కుదిరాడు తొమ్మిదీ పదిఏళ్ళు నిండీ నిండని వయస్సు కాలకర్కోటకుని వద్ద సేవకావృత్తి. ఇక చెప్పవలిసిన దేమున్నది?

ఒకరోజున కోటీశ్వరుడు నూతన పాదుకలు తెమ్మని రాహులుణ్ణి పంపించాడు జోరునవర్షం కురుస్తూవుంది ఆ వర్షంలోనే అతడు వెళ్ళి పాదక

లేమో తీసుకొన్నాడు కాని తడవకుండా తెచ్చి వాటిని యజమాని పాదాలకు తొడగాలి. గడగడలాడుతూ వాటిని చంకలో పెట్టుకొని తన చినుగుబొంత కప్పాడు. కాని భయంతో చెమటలు పోశాయి వాటితో పాదుకలమీద మరకలువడ్డాయి. మరకలువడ్డ పాదుకలనుచూచి కోటీశ్వరుడు మండి వడ్డాడు. ఆ దుర్మార్గుడు ఆ చెప్పులతోనే పెఢీపెఢీ కొట్టాడు. పసికూన రాహులుడు స్మృతితప్పి పడ్డాడు

అతడు తెప్పరిల్లి చూచుకునేసరికి శరీరం కోటవెలువల పడివుంది. ప్రక్కనే చెప్పులున్నాయి. ఆ చెప్పులు పట్టుకొని రాహులుడు బయలుదేరాడు. ఆ కోటీశ్వరుణ్ణి ఏంచేస్తే పావం తీరుతుంది? ఆ చెప్పుతోనే అతన్ని కొట్టి తీరాలి. ఇదే రాహులుని భావం అయితే ఆ కోట ఒక పెనుగొండ. తాను నిర్భాగ్యుడు. ద్వారపాలకులు కాల కింకరులు. రాహులునికి ఏమీ పాలు పోలేదు. ఆలోచించాడు. చివరికి ఒక ఉపాయం తోచింది

అతడు భిక్షువువద్ద శిష్యుడుగాచేరి ప్రతిక్రియాసాధనకై అష్టకష్టాల కోర్చి విద్యాభ్యాసం సాగిస్తూ వచ్చాడు గురువుల వల్ల లభించిన విద్యా సంస్కార బలంతో అతని మనస్సు మారింది. కోటీశ్వరుడు నాడు తన్ను అలా దండించ కుండా ఉంటే తనకు విద్యాగంధం లభించేదా? ధర్మదీక్ష ప్రాప్తించేదా? లేదు, లేదు. ఆ కోటీశ్వరుడే తనకు గురువు. రాహులుడు పాదుకలను గురు భావంతో పూజిస్తూ వచ్చాడు. ఆ కోటీశ్వరుని ఎలాగైనా సంసారకూపంలో నుంచి ఉద్ధరించాలనుకొంటూ వచ్చాడు. అది ఈనాటికి సిద్ధించింది



మైత్రీ : అంటే?

హేమ : ఆ రాహులుడే ఈ విశ్వంతరులు. ఆ ధనమదాంధుడే ఈ హేమచంద్రుడు. ఇంకా చెప్పవలసినదేమున్నది?

జయ : (మిద్దెపైనుంచి పెద్దగా) ధన్యోస్మి ధన్యోస్మి. ( ఉత్సాహంతో సుధన్వుని కట్టడి మరచి విశ్వంతరునివైపు పరుగెత్తుకొని వస్తూ) నాయనా విశ్వంతరా! నాయనా విశ్వంతరా! (సుధన్వుడు కొరకొర జయదేవునివంక ఒకసారిచూచి, విల్లెక్కుపెట్టి ఆ కర్ణాంతంలాగి బాణం వదలుతాడు. రివ్వుమంటూ వచ్చి అది విశ్వంతరుని హృదయంలో నాటుతుంది. అతడు పీఠంమీదనుంచి పడిపోతాడు.)

విశ్వ : బుద్ధభగవాన్. బుద్ధభగవాన్!

---

జి.వి. కృష్ణరావు

(ప్రజలలో కలకలం ''పట్టుకోండి, చంపండి, వెదకండి, పోనీకండి, నరకండి'' అని కేకలు పరుగులు )

మైత్రీ : భగవాన్, భగవాన్!

హేమ : మొదటినుంచీ అనుమానిస్తూనేఉన్నాను. కాని ఇంత జరుగుతుందను కోలేదు మహాపాపి సుధన్వుడింత దారుణానికి ఒడి కడతాడనుకోలేదు పట్టుకోండి. సుధన్వుణ్ణి పట్టుకోండి! నాయనలారా పట్టుకోండి చూస్తారెందుకు (పరుగెత్తుకొనిపోతాడు )

జయ : (విశ్వంతరునివద్దకు వస్తూ) దుర్మార్గుడు. సుధన్వుడే ఈపని చేశాడు. ఇంత వరకూ నన్ను నిర్బంధంలో ఉంచింది అతడే. ఇలాచేస్తాడని కలలో కూడా అనుమానించలేకపోయాను. భిక్షువులారా, అతన్ని ప్రాణాలతో పట్టుకోండి (విశ్వంతరుని తల ఒళ్ళోకితీసుకుని) నాయనా, విశ్వంతరా! నీశీలాన్ని, ధర్మ దీక్షను శంకించి పాపంకట్టుకొన్నాను. క్షమించవూ. మొదటినుంచీ అనుమా నిస్తూనే ఉన్నావు మైత్రీబలుడూ అనుమానిస్తూనే వున్నాడు. యీ విహారం బలికోరుతున్నదన్నాడు మూఢుడనై నేనే అర్థం చేసుకోలేక పోయాను. నువ్విలా బలి అవుతావనుకోలేదు. ఇంకాబ్రతికి నేను చూడవలసినదేమున్నది నాయనా? 

విశ్వ : (మెల్లగా) అలా అనకండి. ధర్మవిశారదులైన మీరే అలాఅంటే ఈభిక్షువులకు దారి?

హేమ : (రోజుతూవచ్చి) పాపి సుధన్వుడు పారిపోతూవుంటే భిక్షువులు పట్టు కొన్నారు. (పెడరెక్కలు విరిచికట్టి సుధన్వుని భిక్షువులుఈడ్చుకొనివస్తారు.)

విశ్వ : నాయనా, సుధన్వా (సుధన్వుడు మాట్లాడడు) గురుదేవా! సుధన్వునికింకా తనుచేసినపని అర్థంకాలేదు పాపం!

సుధ : ఎరిగి ఎరిగి చేసినదానికి పశ్చాత్తాపం అనవసరం.

మైత్రీ : (పెడముఖంపెట్టి) విశ్వంతరుడు నిజంగా అపకారమే చేశాడు.

హేమ : ఆ దుర్మార్గుని ప్రస్తావనమే భౌద్ధులకు అనుచితం. రాజభటులకు అప్పగిస్తే కర్తవ్యం తీరిపోతుంది.

విశ్వ : ఇస్ అబ్బా – గురుదేవా

జయ : ఏమి నాయనా?

విశ్వ : మీరు అప్పగించిన కులపతిత్వం తిరిగి మీకే ఇస్తున్నందుకు క్షమించండి ఇంకా రెండే మిగిలిఉన్నాయి

జయ : ఏమిటవి?

విశ్వ : ఈ సుధన్వులు ఎలాఉద్భవిస్తున్నారో ఆలోచించాలి

(సుధన్వుడు ఉలిక్కిపడి చూస్తాడు.)

జయ : అది నా సాధ్యమా నాయనా? అయినా శక్తివంచన మాత్రం ఉండదు.

విశ్వ : పోతే మరోజన్మలోకూడా మీ శిష్యత్వం లభించేటట్లు ఆశీర్వదించండి!

జయ : (చెక్కిళ్ళపై నీళ్ళుజారుతాయి. మాట్లాడలేక ఆశీఃపూర్వకంగా చేయి యెత్తుతాడు. ఆచేయివంక చూస్తూ విశ్వంతరుడు ప్రాణాలు విడుస్తాడు.)

మైత్రి }
హేమ } : బుద్ధం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి.

భిక్షు }
ప్రజలు } : (అదే అందుకొని అంటారు)

పాత్రలు :

వెంకటేశ్వరన్

మధుకుమార్

రాఘవరావు

(గ్రాండ్ హోటల్లో మూడో అంతస్తు గది ఒక ప్రక్కన స్ప్రింగ్ మంచమూ, దానిమీద మెత్తనిపరుపూ, మీద మల్లెపూవులాగా వున్న దుప్పటీ ఉన్నాయి. ఇంకో ప్రక్కన టేబుల్, కుర్చీ ఉన్నాయి టేబుల్ మీద హోటలు వాళ్ళమర్చిన చక్కటి అద్దం, ఫోను, ఒక ఆల్బం తప్ప మరేవీ లేవు ఇంకో ప్రక్క సోఫా, చుట్టి వేసిన హోల్డాలు, వెళ్ళి పోటానికి సిద్ధంగావున్న సూట్‌కేసూ వున్నాయి. సోఫావెనక స్నానాలగది తలుపువుంది

వెంకయ్య – ఇప్పుడు వెంకటేశ్వరన్ అయ్యాడు – కుర్చీలో కూర్చొని తాను తియ్యబోతున్న 'శైలబాల' అనే చిత్రంలో నటించటానికి దరఖాస్తులు పెట్టుకున్న అభ్యర్థుల ఫొటోల ఆల్బం తిరగవేస్తున్నాడు. మొన్నటిదాక పత్రికల్లో ఏకాంకికలు, కథలూ వ్రాస్తూ వుండేవాడు. కొత్తగా సినిమా కంపెనీ ఒకటి బయలుదేరి, వెంకయ్య వ్రాసిన శైలబాల తియ్యమని, అతన్నే డైరెక్టర్ని చేసింది.

సినిమారంగంలో మొదటినుంచీ నటిస్తున్నవా రెవ్వరూ నచ్చలేదు కొత్తవాళ్లనుంచి మంచి సమర్థుల్ని తీసుకోవాలని అభిలాష. ముఖ్యంగా ప్రధానభూమిక నిర్వహించగల చాకచక్యమున్నవాడు కనుపించలేదు. ఆల్బం పేజీలు తిప్పుతూ అభ్యర్థుల భంగిమలుచూచి నవ్వుతూవుంటాడు )

వెంటేశ్వ. వహ్వా! ఏం పోజులు, ఏం పోజులు! ఈ అతిరథులూ, మహారథులూ సినిమాల వాళ్ళ మీద విరుచుకపడకపోతే సైన్యంలో చేరగూడదూ? ఆ మిడగుడ్లు, ఆ రొమ్ము విరుపులా చూసి జర్మనులు రారెత్తి పారిపోతారుగా! యూరప్‌లో మళ్ళీ, ప్రజాస్వామ్యం తలెత్తుతుంది. కాదు – కాంగ్రెస్ వద్దంటున్నది, సోషలిస్టులు వ్యతిరేకప్రచారం చేస్తుంటే, ఎలా సైన్యంలో చేరుతారు? ఇక చౌకగా పడివుంది సినిమారంగం! హుఁ 205

(టేబిల్‌మీద ఫోను మోగుతుంది. వెంకటేశ్వరన్ అందుకొని)

హల్లో ... ఎవరది.... పత్రికా విలేఖరివా?..... ఆఁకాదు..... నాకు తీరిక లేదు. స్టూడియోకి వెళ్లుతున్నా..... ఆఁ. .. ఏమిటి?..... విలేఖరివా? .. .. కమిన్ ప్లీజ్.

(వెంకటేశ్వరన్‌లేచి, కుర్చీతిప్పుకొని, వాకిలివంక చూస్తూవుంటాడు

ఐదు నిమిషాలు గడిచింతరువాత గదితలుపు మెల్లగా తెరుచుకుంటుంది బిళ్ళగోచీ, నేల జీరుకాడే కుచ్చిళ్లూ, బెంగాలీలాల్చీతో సహా మధుకుమార్ ప్రత్యక్షమౌతాడు.)

మధు · క్షమించండి!

వెం . (అనుమానంగా పత్రికా విలేఖరివా?

మ : కాదు....కాని-

వెం : ఇప్పుడు మీతో మాట్లాడజాలనందుకు క్షమించాలి

మ : రెండే ముక్కలు మాట్లాడుదామని వచ్చాను

వెం : అర్జంటుగా గదిఖాళీచెయ్యాలి . ఇంకా బోలెడుపనుంది... క్షణంతీరికలేదు

మ : రెండే మాటలు..... నేను

వెం : ప్రయోజనం లేదు ... మరెప్పుడన్నా

మ : (తలుపు ఓరగిలివేస్తాడు. వెంకటేశ్వరన్ అనుమానంగా చూస్తాడు.) తీరిక లేకపోయినా తప్పేదికాదు.... నేను-

వెం : ఏమిటి ఈ దౌర్జన్యం?

మ : ఏమన్నా అనండి, (తలుపుగడి మెల్లగావేస్తాడు వెంకటేశ్వరన్ కొంత గాభరా పడతాడు.) వినకతప్పదు. మానాన్న పెద్ద స్థితిమంతుడు.

వెం : (చిరాకుగా) ఈ సొంత గోడంతా నా కెందుకయ్యా?

మ : (లక్ష్యపెట్టకుండానే) నేనుకథకుణ్ణి, నాటికలు వ్రాస్తాను, పైగాకమ్యూనిస్టుని

వెం : (భయంతో) ఆ!

మ : కమ్యూనిస్టు రాక్షసుడు కాడులెండి; వాడూ మానవుడే. అందువల్ల మానాన్న ఇంట్లోనుంచి వెళ్ళగొట్టాడు

వెం : నేను వెళ్ళాలి. చెప్పి ఫలం లేదు.

మ : నాకు మరో జీవనాధారం లేదు. నాకథల్తోను, నాటికల్తోను జీవించాలని వ్రాసినవన్నీ పత్రికలవాళ్ళకు పంపించాను. నా ప్రతిభ వారికి అర్థంకాలేదు నా వందరచనల్లో ఏదో పనికిరానిదాన్ని ఏరి ప్రకటించారు. అయినా, ఎర్రని ఏగానీ అన్నా నాకు చూపించలా. కవి ఎలా బ్రతకాలి?

వెం : (ఎలాగా తప్పించుకోవడమని ఆలోచిస్తున్నవాడు చప్పున పర్సుతీసి, ఐదు రూపాలనోటు ఇవ్వబోతాడు).

మ : (కోపంగా) తోటికవిని గౌరవించేది ఇలాగేనన్నమాట! నేను అడుక్కునే వాణ్ణనుకున్నారా? కవులే యిలా ప్రవర్తిస్తే, పామరలోకం అనాదరభావం చూపించిందంటే విపరీత మేముంది? కవికీ, కళాపిపాసువుకీ ఈ లోకంలో స్థానంలేదు వీళ్ళెందుకు జన్మిస్తారు? భూభారం కోసం కామాలు! (నిట్టూర్పు విడుస్తాడు )

వెం : (నొచ్చుకొని) మీరిలాభావిస్తారనుకోలేదు I am sorry to offend you.

మ : (లాల్చీ జేబులోంచి పిస్తలు తీస్తాడు. ప్రాణాలెక్కడ ఎగిరిపోతాయోనని వెంకటేశ్వరన్ ఆపాదమస్తకం వణకిపోతాడు.) ఎందుకలా వణికిపోతారు? భయపడకండి. మిమ్మల్ని చంపి సాధించేదేముంది? ఇదిగో, యీ పిస్తలు చూచారూ, ఎంత అందంగావుందో! ఒకేసారి ఐదుగుళ్ళు పడతాయి. డబ్బున్న రోజుల్లో 500 పోసి కొన్నా. (వెంకటేశ్వరన్ ముఖంలోకి చూస్తాడు.) ఈ మీటనొక్కితే క్రిందివాడి చెవినిబడకుండా పంచప్రాణాలు అలా లేచి పోతాయి ఈపిస్టల్ చాల మంచిది లెండి. మోస్ట్ అప్‌టుడేట్. (తన కణతకు గురిచేసి పెట్టుకుంటాడు వెంకటేశ్వరన్ ఒళ్ళంతా చెమటముద్ద అవుతుంది. కళవళపడతాడు. ఏమీతోచదు. వెర్రిచూపులు చూస్తాడు.)

వెం : అంతపనికి పూనుకోవద్దు. వద్దు, వద్దు, నామాటవినండి!

మ : ఇంకా యెందుకు ఈ ప్రపంచంలో బ్రతకటం? మీలాంటి వారికి గుదిబండగా ఎందుకు బ్రతకాలి? ఒక్కసారి ఈ మీట నొక్కితే సరిపోతుంది.

వెం : (భయంతో కుర్చీలోనుంచి లేవకుండానే) ఈ అఘాయిత్యానికి పూను కోకండి. బ్రతికి ఏదన్నా సాధించవచ్చునుగాని, చచ్చి ఏంచేస్తారు? లోకం ఇలాగే ఉంటుంది ఇకముందు కూడా మీవంటి కవులు ఆత్మహత్య చేసికోవలసిందే. 207

మ : (అలక్ష్యపు నవ్వుతో) బ్రతికితే ఈ లోకం మరీ భయంకరంగా కనిపిస్తుంది. దివారాత్రాలులేని మహానరక కూపంలాగా వుంటుంది.... గత్యంతరం లేదు. (వెంకటేశ్వరన్ ముఖంలోకి చూస్తాడు.)

వెం : మీమాట మీదే కాని....

మ : లేదులెండి. అన్నంలేక, పేరులేక మలమల మాడిచావటం కన్న యిదేమేలు.

వెం : ఎట్లా! ఆత్మహత్యకంటే మరో మహాపాతకం లేదు.

మ : అలాకాదు. ఈపిస్టల్‌తో కాల్చుకుని చస్తాననుకోండి.... మిరొక చక్కని నాటికను రాయవచ్చును. మంచి చిత్రాన్ని తియ్యొచ్చు! ప్రజల హృదయం కరగిపోతుంది నా విషాధగాధ లోకానికి విశదమౌతుంది, నా జీవితచరిత్ర కోసం లోకం తహ తహ పడుతుంది. పత్రికా కార్యాలయాల్లో మూలబడి మూలుగుతున్న రచనలు మళ్ళీ సూర్యరశ్మిని చూస్తాయి. నాపేరు, మీపేరు సాహిత్య చరిత్రలో సువర్ణాక్షరాలతో ఎక్కుతాయి – ఇక గత్యంతరంలేదు.

(మీట నొక్కబోతాడు వెంకటేశ్వరన్ గభాలున లేచి మధుకుమారు చేయి పట్టుకుంటాడు. అతని కాళ్ళు వణకుతూనే వుంటాయి )

వెం : ఆగండి, ఆగండి

మ : ఆగటం లేదు, గీగటం లేదు.

వెం : నేను చెప్పేది విన్నతరువాత... పిస్టల్ 500 ఇచ్చి నేను కొంటాను నేను భిక్షం వేస్తున్నట్లు కాదుగా? మీపిస్టల్ మీరమ్ముకోవచ్చును. ఇందులో తప్పేముంది? హృదయం నొచ్చుకోవలసినదికూడా ఉండదు.

మ : మీరుకొంటే యేమైనట్లు?

వెం : ఏమీలేదు, 500తో ఎటులేదన్నా పదినెల్లు గడుస్తాయి ఈలోగా స్థితిగతులు చక్కబడవచ్చును. మీ రచనల్లోని రసాన్ని లోకం ఆస్వాదించవచ్చును

మ . లోకం నా రచనల్ని ఆనందించినంతమాత్రాన్నే డబ్బిస్తుందా? ప్రయోజనం లేదు. వట్టి అడియాస. ఈ ఊహా సౌధంలో నా హృదయాన్ని నిలిపి తల క్రిందులు చెయ్యకండి

వెం : నాలాగానే మీరు సినిమా డైరెక్టర్లు కావచ్చును. లేక మీ తండ్రిగారే మీకు ఆస్తీపాస్తీ అప్పగించవచ్చును. నామాట వినండి!



మ : ఇవన్నీ కేవలం మధురస్వప్నాలు

వెం : ఆశలు కోసి వేసుకొని ఎలా బ్రతకటం?

మ : అసలు ఎందుకు బ్రతకటం?

వెం : పుట్టేటప్పుడే యీ తెలివి తేటలుంటే?

మ : నా పుట్టుక నాచేతిలో వుందా?

వెం : నీ పుట్టుక నీచేతిలో లేనప్పుడు, నీచావును నీచేతిలోకి లాక్కొనే అధికారం మాత్రం ఉంది కామాలు! పిచ్చిపోకలు పోక నామాట వినండి. ఈ 500 తీసు కోండి. (పర్సులోనుంచి ఐదునోట్లుతీసి మధుకుమార్ చేతిలో పెడతాడు అతడు సందేహిస్తాడు.) సందేహం దేనికి?

మ : ఏమో, నాకిష్టం లేదు మంచిరోజులు ముందున్నాయని మోహపెడుతున్నారు

వెం : ఎల్లకాలం రాత్రే ఉంటుందా? ఈపది నెల్లూ గడవనీండి. అంతగా దారీతెన్నూ కనిపించకపోతే, ఇప్పటిదారి అప్పటి కుండనే వుంటుందిగా.

మ మీకిచ్చివేసిన పిస్టలు నాకు అప్పుడెలా వస్తుంది? ఏమో, ఇదంతా వట్టిభ్రమ లేనిపోని ఆశల్ని రెక్కొలుపుతున్నారు

వెం · మిమ్మల్ని మోసగిస్తే నాకు ఒరిగేదేముంది! ఇలాంటి ఇబ్బందులు అందరికీ వస్తూనే వుంటాయి కష్టాలు రాగానే ఇంతటి పనికి పూనుకోగూడదు ఇది కష్టాలనుంచి గట్టెక్కటం కాదు. కష్టాలకు నీచంగా లొంగిపోవటమౌతుంది నామాట వినండి.

మ : (నిట్టూర్పు విడుస్తూ) మీలాంటివారు చెప్పటం, నాలాంటివాడు కాదనటం బాగుండదు. కాని . .

వెం : కానీ లేదు, అర్ధణా లేదు. మీపిస్టలివ్వండి (మధుకుమార్ చేతిలోని పిస్టల్ తీసికొంటాడు.)

మ : సరే, మీరెక్కడికో పోవాలని త్వరపడుతున్నారు. ఇంత సేపు ఆపినందుకు క్షమించండి. ఇక సెలవు తీసుకుంటాను.

వెం : మంచిది

(గడియతీసి, తలుపు తెరచుకొని మధుకుమార్ నమస్కారంచేసి వెళ్ళిపోతాడు వెంకటేశ్వరన్ తలమీది కొండను దించినట్లె నిట్టూర్పు విడుస్తాడు. తుడుచుకొంటున్నా చెమట ఆగటం లేదు. క్షుభితవాలకం ఇంకా చక్కబడలేదు మూడునాలుగు సెకండ్లు గడుస్తాయి.



ఇంతలో నిండుసూట్‌తో రాఘవరావు సూట్‌కేసు పట్టుకొని గదిలోకి చరచరా వస్తాడు తలవని తలంపుగా వెంకటేశ్వరన్‌ను - చూచి ఆశ్చర్యపోతాడు.)

రాఘ : నువ్వా! ఈ గదిలో వుంటున్నావా? ప్రొప్రైటరు నీ గది నాకెలా ఇచ్చాడు?

వెం : నేను ఖాళీ చేస్తానని చెప్పాను, అందువల్ల నీకిచ్చి వుంటాడు.

రా : (సూట్‌కేసు ఒక ప్రక్కనపెట్టి) బాత్‌రూమ్ ఎక్కడ! ఏమటి అలా వున్నావు?

వెం : చాలావుందిలే భాగవతం. కాస్తతో తప్పిపోయింది ఆత్మహత్య

రా : (అతురతతో) నువ్వేనా? ఆ బూర్జువారోగం నీక్కూడా అంటుకుందా?

వెం : నేనా? ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి? సుఖంగా బ్రతకలేకనా?

రా : అమెరికాలో అందుకనే ఆత్మహత్య చేసుకొంటారు. ఇంతకూ సంగతేమిటి?

వెం : ఎవడోవచ్చి, నాగదిలో చచ్చిపోతానన్నాడు. వాడిదగ్గర పిస్టల్‌కొని ప్రాణాలతో పంపించేటప్పటికి తలప్రాణం తోకకొచ్చింది

రా : (ఆశ్చర్యపడుతూ) వాడా, ఆపిస్టల్ ఏజంటు ... నీకూ్కడా ఒకటి అంట గట్టాడూ?

వెం : ఏమిటీ, ఏమిటీ! వాడు ఏజంటా? పిస్టల్ ఏజంటు? దొంగ వెధవ, నాకూ టోపీ వేశాడన్నమాట? ఇలాంటి వెధవల్ని ప్రభుత్వం పూరక చూస్తూ ఉందన్న మాట. వాడి తాడు తెంచక ఊరుకుంటానా? కాస్తా కూస్తా కాదు, ఐదు వందలు.... (ఫోను తియ్యబోతాడు.)

రా : ఇప్పుడేం చేదామని?

వెం : పోలిసులకి ఫోనుచేసి, పట్టించి, మోసం చేశాడని కేసుపెడతాను.

రా : ఇష్టపూర్వకంగా నువ్వేడబ్బిచ్చి పిస్టల్ తీసుకొన్నావు. వాడు కొనమనికూడా నిన్నడగలేదు. కేసుపెట్టి ప్రయోజనంలేదు.

వెం : ఇలాంటి నేరాలు జరగవలసినవేనన్నమాట! వీణ్ణి ఏం చేస్తే పావం తీరుతుంది?

(ఫోను మోగుతుంది)

రా : వాడేనట్లుంది.

210 వెం : మళ్ళీ ఇక్కడికెందుకొస్తాడు?

రా : ఈ గది ఇప్పుడు నాకింద వుందిగా. నీవు ఇంకా ఇక్కడే వున్నావని వాడికెలా తెలుసు?

వెం : వాణ్ణే పట్టుకుతీరాలి.

రా : ఆగు. (ఇంకా మోగుతున్న ఫోను తీసుకొని మాట్లాడవద్దని) హాల్లో.. ఎవరది (వెంకటేశ్వరన్) వాడే, నేను చెప్పలా? (ఫోన్లో) ఆఁ, రావచ్చును (ఫోను స్టాండులో పెట్టి) వస్తున్నాడు. నీవు ఇక్కడ వుండకూడదు. త్వరగా పోవాలి. వస్తూ ఉంటాడు.

వెం : ఎక్కడ దాక్కోమంటావు? మంచంకింద దూరమంటావా? ఎంతగతి పట్టింది! (దూరబోతాడు.)

రా . (గబగబా తలుపు గడియవేసి వచ్చి) ఇది కన్యాశుల్కం కాదు బాత్‌రూం లోకి వెళ్ళు. (వెళ్లుతూ ఉంటాడు పిస్టల్ బల్లమీద వుంటుంది రాఘవరావు చూస్తాడు.) ఏడిసినట్టే వుంది. దీన్ని కూడా తీసికెళ్లు.

వెం · పెట్టే, హోల్డాలు గుర్తువట్టడూ?

రా : అదిగో వస్తున్నట్లుంది కాలిచప్పుడు వినపడ్తూవుంది నీవు త్వరగాపో. నేను చూస్తానులే

(వెంకటేశ్వరన్ పిస్టలుతో స్నానాలగదిలోకి వెళ్ళి, తలుపుమూస్తాడు రాఘవరావు ముక్కుతూ అంతపెట్టీ, హోల్డాలు మంచంకిందికి కనబడ కుండానెట్టి, కోటువిడచి మంచంమీదికి విసిరేస్తాడు. త్వరగాపోయి గడియ తీసి తలుపు తెరవకుండా వచ్చి సోఫాలో కూర్చొని వెంటతెచ్చుకున్న పత్రిక చూస్తూ ఉన్నట్లు నటిస్తాడు. ఇంతలో గదితలుపు తట్టిన చప్పుడౌతుంది.)

రా : కమిన్

మ : (తలుపు తెరచుకొని వస్తాడు.) తమతో ఐదు నిమిషాలు మాట్లాడుదామని వచ్చాను.

రా . ఐదు కాకపోతే పదినిమిషాలు మాట్లాడండి.

మ · నేను ఉన్నకుటుంబంలో పుట్టాను. కథలు, నాటికలు వ్రాశాను కమ్యూనిస్టుని, అందువల్ల మా నాన్న యింట్లోనుంచి వెళ్ళగొట్టాడు

రా : అంతమాత్రాన్నే వెళ్లగొట్టడం దేనికి?

211

మ . ఆయన వార్కమిటీ ప్రెసిడెంటు. నేను వ్యతిరేకప్రచారం చేసేవాణ్ణి. అందువల్ల తన కొంప మునిగి పోతుందని వెళ్ళగొట్టాడు.

రా వెళ్ళగొడితే?..... ఇప్పుడా సంగతంతా నాకెందుకు?

మ : వినండి. నాకు మొదటినుంచీ కథలూ, నాటికలూ వ్రాసే అలవాటు. నా రచల్ని పత్రికలు కాని, లోకం కాని ఆదరించలేదు.

రా · నిజమే. నీ కథలంటేనేకాదు, సాహిత్యమంటేనే లోకంలో ఆదరణ లేకుండా పోయింది.

మ : నా కథను ప్రకటించినవాడైనా దమ్మిడీ యివ్వడు. జీవితం దుర్భరమై పోయింది.

రా : నాకు కూడా ఇలాంటి అనుభవమే. నేనూ ఇరవై నవలలు వ్రాశాను. ఒక దానికి కాకపోతే ఒకదానికైనా దమ్మిడీ రాలేదు నా సొమ్మంతా అచ్చువాళ్ళ ఎదాన పోశాను.

మ : (ఆశ్చర్యపడి తలుపు గడియ వేసివచ్చి, జేబులోనుంచి పిస్టల్ తీస్తాడు రాఘవ రావు వణకుతున్నట్లు నటిస్తూ)

రా : అదెందుకు?

మ : భయపడకండి, మిమ్మల్ని కాల్చబోవటం లేదు ఇలాంటి దుర్భరజీవితంకంటే మరణం మేలు. కాల్చుకుని చచ్చిపోతాను.

రా : బలే ఊహ! ఇలాంటి దరిద్రలోకంలో ఉండి ప్రయోజనం లేదు మన కెందుకులే అని మనవంటివాళ్లు ఊరుకోబట్టే ఇలా జరుగుతూవుంది ప్రతిభావంతు లంతా మలమల మాడి చస్తున్నారు. అలా తిండి లేక మాడి చావటం కంటె ఇట్లా చావటమే మంచిది లేకపోతే, లోకానికి గుణపారం చెప్పలేము. ఎంతమంచి ఊహ తట్టింది మీకు!

(మధుకుమార్ దిగ్భ్రమ చెందుతాడు. తెల్లబోయి, కొంత తెప్పరిల్లు తాడు. నోటివెంట మాటరాదు.)

రా : ఎందు కాలస్యం?

మ : కాని

రా : నిజమే, ఇలాంటిచోట చచ్చి ఎవడి గొంతుకో ఉరితేవటం కంటె, చాటుగా చస్తే బాగానే వుంటుంది. అయినా మించిపోయింది లేదు. ఈ కాగితం మీద ఆత్మహత్య చేసికొంటున్నానని రాసి, కాల్చుకోండి ఎంతసేపో పట్టదు ఇట్లా నీచత్వంపాలు కావడంకంటె మీ ఉపాయమే బాగుంది ఇంకా సందేహం దేనికి?

మ : దీంట్లో గుళ్లు లేవు.

(స్నానాలగది తలుపు తెరచుకొని వెంకటేశ్వరన్ గబగబా వస్తాడు.)

వెం : అయితే నా పిస్టల్లో గుళ్లున్నాయి. ఒకటి తప్పినా, ఇంకా నాలుగుంటాయి. పక్కవాడికూ్కడా వినిపించదు. ఏం అలా చూస్తావు?

(మధుకుమార్ తెల్లబోయి చేతులు నలుపుకుంటూవుంటాడు)

రా : ఎట్లాగైతేనేం నేటికి దొరికిపోయావు. ఏమిటి నీకథ.

వెం : ఈ మోసమంతాయేమిటి?

(కన్నంలో తేలుకుట్టిన దొంగలాగా మధుకుమార్ మాట్లాడడు. అతని చూపులు క్రిందికి ప్రసరిస్తుంటాయి. కాలిబొటనవ్రేలు నేలను గీరుతూ ఉంటుంది రాఘవరావు వేంకటేశ్వర్లను ఒకళ్ళనొకళ్ళని చూచుకొంటారు నాల్గైదు సెంకడ్లు గడుస్తాయి. మధుకుమార్ స్థితి రాఘవరావులో జాలిని రేకెత్తిస్తుంది ఈ దుస్సహ ప్రశాంతాన్ని భగ్నంచేస్తూ.)

రా : (వెంకటేశ్వరన్‌తో) నీ శైలబాలలో నాయకపాత్ర వేయటానికి ఒకడు కావాలంటివికదూ?

మ : (సంతోషంతో వెంకటేశ్వరన్‌వైపు తిరిగి) అట్లైతే నన్ను బుక్‌చేసికోండి ఈ వెధవవృత్తివదిలేసి, హాయిగా బ్రతుకుతాను. దయవుంచండి

వెం : నువ్వు పనికివస్తావని ఎట్లాచెప్పేది? కెమేరాకు పనికివచ్చేదీ లేనిదీ చూడవద్దా?

రా : (నవ్వుతూ) మోసగించాడని కంటుగా ఉన్నట్లుంది.

వెం : నాకెందుకు కంటు?

రా : అయితే యితన్ని బుక్‌చెయ్యి.

వెం : బాగా నటించగలడో లేదో?

రా : నీవంటివాణ్ణి నాటకమాడి నమ్మించి 500 పుచ్చుకోవడం కంటె ఎలాంటి నేర్పుకావాలి?

మ : (వెంకటేశ్వరన్‌తో) అనుగ్రహించి ఒకనటకుణ్ణి పోషించండి

వెం : సరే.

213

*1941, మార్చి*

**పాత్రలు :**

వర్మ

వేదాద్రి

(యుద్ధరంగం. శవాలు కుప్పతిప్పలుగా పడివుంటాయి వర్మ సైనికులతో కలిసి ఉన్నంతకాలం తీవ్రంగా పోరాడాడు వారు పారిపోవటమో, చనిపోవటమో జరిగేటప్పటికి అతడొక్కడే మిగిలాడు మళ్ళీ వాస్తవిక జగత్తు ఒకసారి అతనికి గోచరించింది ఎక్కడలేని భయం కలిగింది మెల్లగా శవాలు పోగుచేసి వాటిని మీద వేసుకొని పండుకున్నాడు. ఆ భయోద్వేగంవల్ల కొంత స్పృహతప్పి పడివుంటాడు అతడెంతసేపు అలావున్నాడో తెలియదు పూర్తిగా స్పృహ వచ్చేటప్పటికి అమిత దాహం కలుగుతుంది.

ఇంకా దూరాన్నుంచి ఫిరంగులమోత వినిపిస్తూనే వుంటుంది చెదురాటుగా తుపాకీ గుండ్లు దూసుకొని వస్తూనే వుంటాయి )

వర్మ : దాహం, దాహం!

అవ్యక్తస్వరం : అదిగో నెత్తురు మడుగు, దప్పిక తీర్చుకో

వర్మ : (మెల్లగా) చచ్చానురా! మనుష్యుడైతే మానవరక్తాన్ని తాగమంటాడా? ఏదో పెనుభూతం!

అవ్య : దాహమన్న వాడివి మెదలకుండా వూరుకున్నావేం?

వర్మ (మెల్లగా) ఇది నామీదనే వున్నట్లుంది. ఈ గడియతోనే నూరేళ్లు నిండాయి! ఈ నెపంతోనన్నా దాన్ని కొంత దూరం సాగనంపితే, అవతల ఎటుపోయి ఎటువస్తుందో. (పెద్దగా మూలుగుతూ) బాబూ, లేవలేకుండా ఉన్నా. కాస్త నీ దోసిటితో–

అవ్య : (మెల్లగా) ఇదేదో దయ్యంలాగా వుంది. లేకపోతే రక్తం తాగుతానంటుందా? అయితే పూజ్యులు దయ్యాలు లేవన్నారే! అయినా కాస్త టొలాయిస్తే. (పెద్దగా) దేవతలు రక్తం ముట్టుకోరు.

వర్మ : అయితే నీవు అమరుడవా?

అవ్య : ఆఁ

వర్మ : ఇంకేం! ఇది స్వర్గము.

అవ్య : ఊఁ.

వర్మ : అయితే ఇంత చీకటి బుయ్యారంగా ఉందేమిటి?

అవ్య : రాత్రి

వర్మ : అలాగా! ఈ ధ్వని ఏమిటి? (తలకొంచెం పైకి ఎత్తుతాడు. తుపాకి గుండు బుస్సున తలపాగాలో గుండా దూసుకుపోతుంది. అంతలోనే తల వంచుకుంటాడు.)

అవ్వ . అబ్బే యేమీలేదు మన్మధుడు పుష్పబాణాలు సంధిస్తూ వున్నాడు అవే రివ్వురివ్వున గాలిలో దూసుకుపోతున్నాయి

వర్మ మన్మధబాణాలు ఇంత రణగుణ ధ్వనిచేస్తాయా?

అవ్వ : గుండెల్నే చీల్చివేస్తాయి అలాంటప్పుడు యీ ఘోష బయలుదేరక ఏమవుతుంది?

వర్మ : మరి టపటపా పడుతున్నా యేమిటి?

అవ్వ : యుద్ధరంగాన్నుంచి ఎకాయెకిని వస్తున్న వీరులమీద అప్సరసలు పుష్పవర్షం కురిపిస్తున్నారు.

వర్మ : అలాగా! అయితే యీ లోకంలో ఆడవాళ్లు అద్దూపద్దు లేకుండా కంటికి కనిపించిన ప్రతివాడితో యిలా సరసాలాడుతారన్నమాట!

అవ్వ : ఏమిటీ! నీవీ స్వర్గలోకం వాడివి కాదట్లుందే?

వర్మ : మాది భూలోకం లెండి.

అవ్వ : అలా చెప్పుమరి!

218 వర్మ : సరే కాని బాబూ! ఇది స్వర్గలోకమేనా?

అవ్వ : ఆహా.

వర్మ : అయితే ఈ లోకంలో ఆకలి దప్పులుండవంటారే?

అవ్వ : ఉండవు.

వర్మ : నాకు నాలుక పీక్కుపోతూవుందే?

అవ్వ . అయితే నీకు భూలోకంలో నివాపాంజలి ఇచ్చివుండరు.

వర్మ : ఇవ్వకపోవటమేమిటి? అసంభవం తప్పకుండా ఇచ్చివుంటారు. మాది కర్మభూమి.

అవ్వ : కర్మభూమి అయితే కావచ్చును. కాని నీకు మాత్రం నివాపాంజలి యిచ్చి వుండరు.

వర్మ : మా రాజవంశ మున్నంతకాలం అలా జరగటానికి వీలులేదు. ఆ వంశం పేరు చెబితే చాలు; గడ్డి పరకసహితం నిలబడిమాట్లాడుతుంది ధర్మంనాలుగు కాళ్ళానడుస్తుంది.

అవ్వ అది పశువన్న సంగతి తెలియదులే. కాని నీవు భూలోకాన్ని వదలి వచ్చావని ఎవరికి తెలుసు?

వర్మ · వచ్చేటప్పుడు మా చిరంజీవితో మరీ మరీ చెప్పివచ్చాను. నేను బ్రతికివున్నా, లేకపోయినా నివాపాంజలి విడవమన్నాను అలాంటి మంచివాడు మరొక డుండడు

అవ్వ : అతనికేమి ప్రమాదం సంభవించిందో! లేకుంటే నీకీ అగచాట్లు ఎందు కొస్తాయి?

వర్మ : మా ముసల్దయినా వూరుకుంటుందా? దానికి నేనంటే ఎంతో ప్రాణం. నాకిలాంటి దుర్గతి వస్తుందని తెలిసికూడా ఎలా వూరుకొంటుంది?

అవ్వ : ఆమె కెలావుందో?

వర్మ : (ఆలోచిస్తూ) నిజమే. ఇంటెలపాదీ ప్రమాదమే భగవంతుడా. ఎంత కర్మ పట్టిందిరా! అరాజకం పెరిగిపోతున్న యీ రోజులలో ఏ నిమిషంలో ఏమి జరిగినా ఆశ్చర్యపడనక్కర లేదు. అయినా రాజుగారు ఉన్నారు. యుద్ధరంగంలో చనిపోయిన సైనికులకు నివాపాంజలి ఇస్తూవుంటానికి ప్రత్యేకంగా బ్రాహ్మల్ని నియమించారు. అవి అయినా చేరి వుండాలిసిందే!.. ఇక్కడ అధికారు లేమన్నా....

అవ్వ : ఏమిటీ, లంచాలు పుచ్చుకొంటారనా?

వర్మ · ఎందుకు కోపం బాబు! అలవాటయిన ప్రాణాలుకాదు?

అవ్వ (నవ్వుతూ) నివాపాంజలిఅంటే అంతతేలిక అనుకున్నావా? మంత్రపూతం సరిగ్గా నిర్దిష్టవ్యక్తికే చేరుతుంది. మళ్లీ ఇంకెవ్వడన్నా అపహరించడానికి ప్రయత్నించాడా గొంతు పట్టుకొంటుంది.

వర్మ . అయితే ఎందుకురాలేదంటా?

అవ్వ . అసలు నీవు చచ్చిపోయావని బ్రాహ్మణుల కెలా తెలుస్తుంది?

వర్మ : ప్రతిరోజు యుద్ధంలో చనిపోయిన సైనికులను లెక్కకట్టించి వారిపేర్లు, కులగోత్రాలు త్రవ్వించి ఆ మీదట నివాపాంజలి ఇవ్వటానికి రాజుగారు కట్టడి చేశారు.

అవ్వ : రోజురోజు అసంఖ్యాకంగా సైనికులు చచ్చిపోతున్నారు. ఈ సంఖ్య అంతా బట్టబయలైతే ప్రజల్లో ఆందోళన బయలుదేరదూ? అందువల్ల అందరికీ నివాపాంజలి ఇచ్చి ఉండరు.

వర్మ : ఇంతకూ దప్పికతో ఇలా అల్లాడిపోవలసిందేనన్నమాట. అబ్బబ్బ! ఇది స్వర్గంకాదు నరకంలాగా ఉంది... బాబూ బాబూ! పుణ్యముంటుంది. ఇన్నినీళ్లు గొంతులోపోద్దూ.

అవ్వ : స్వర్గంలో ఉన్నవాడికి ఇంకా పుణ్యమెందుకు? ఈ రంభా మేనకాదుల్ని వదలిపెట్టి ఏ పాడులోకానికో పోవాలి నీకు నీళ్లు పొయ్యనూ పొయ్యను, ఆ పాడులోకానికి నేను పోనూ పోను.

వర్మ : ఛీ ఛీ! ఏమిలోకం! చస్తేనన్నా బాగుంటుంది

అవ్వ : అయితే చావరాదు? ఎవరడ్డవడ్డారు?

వర్మ : ఇంతకూ ఇది అమరలోకం కాదన్నమాట!

అవ్వ : (మాట్లాడదు )

వర్మ : ఇంతకూ ఇది అమరలోకం కాదన్నమాట!

అవ్వ : (మాట్లాడదు )

వర్మ : ఏం పలకవేం! ఇది స్వర్గంకాదు ఇంతసేవు ఈ ముసలి వాడితో వరిహాసాలాడు తున్నావా? నీ తలకాయ నరికివేస్తా

అవ్వ : అంత మగసిరివుంటే యీ శవాల్లో ఎందుకు దాక్కుంటావులే?

వర్మ : నాకా భయం? మా సేనావతన్నా ఆ మాట అనలేదు. పైగా ఎన్ని బంగారు వతకాల్ని బహుమతిగా సంపాదించానో తెలుసా?

220

అవ్వ : ఏదీ, ఒక్కటికూడా కనిపించదే?

వర్మ : (మెల్లగా) ఓరి వెధవా, నన్ను ఒక కంట కనిపెడుతూనే వున్నావన్నమాట! (పెద్దగా) వాటిని ఇంటిదగ్గర దాచివచ్చాను. మీలాంటి పిరికివాళ్ళు యుద్ధంలో ఎదురౌతారని నాకేం తెలుసు?

అవ్వ : ఇంకేం! ధైర్యాన్నికూడ ఇంటిదగ్గర భార్యకు కావలా పెట్టి వచ్చివుంటావు.

వర్మ . కళ్ళు తెరవని వసికుంకలకుకూడ పెద్దవాళ్ళుంటే ఎంత తేలిక, ఎంతతేలిక! నేనే పిరికివాణ్ణయితే అన్ని బంగారు వతకాలు ఎందుకిస్తారు?

అవ్వ : పారిపోయినందుకు.

వర్మ · పారిపోయిన సైనికుడికి బహుమతా? ఎవరన్నావింటే నవ్విపోతారు.

అవ్వ : నీవు మాంధాత కాలంలో ఉన్నట్లుంది . ఇప్పటి యుద్ధతంత్రాల సంగతి తెలియదుకామాలు సైన్యం ఎంత తొందరగా, ఎంత నష్టం లేకుండా పారి పోగలిగితే అంతలాభం వెంటబడి తరుముకొనివచ్చే శత్రువు అంతతొందరగా అలసిపోతాడు. ఆ హడావుడిలో వరికరాల్ని వదలిపెట్టి వట్టిచేతుల్తో వుంటాడు

వర్మ : అదంతా నాకు తెలీదు. నాకు మాత్రం నా ధైర్యసాహసాలకు మెచ్చుకొని బంగారు వతకాలిచ్చారు

---

జి.వి కృష్ణరావు

అవ్వ  నీకే ధైర్యముంటే యీ నరకయాతన ఎందుకనుభవిస్తావు? ఈ మురిగి పోతున్న శవాలమధ్య, రోజులపర్యంతం ఈ దుర్గంధంలోఅన్నానికీ, నీళ్ళ కూరోసి ఇలా పడివుంటావా? నేరుగా వెళ్ళి ఎదురు రొమ్మొడ్డి జయాన్నో, మృత్యువునో చూరగొంటావు

వర్మ  : (విషాదంగా) నిజమే నాయనా! ఇంకా యీ ముసలివాడు యీలోకంలో అనుభవించవలసింది ఏముంది? కాని..... కుంకుమరేఖ మాసిపోతే మా ముసలిదాని ముఖం ఎంత చిన్నబోతుందనుకున్నావు? నా కళ్ళు గిర్రున తిరిగి ఊడిపడవు?

అవ్వ  : (గట్టిగా నవ్వుతూ) చచ్చిపోయినవాళ్ల బ్రతికివాళ్ళను ఎప్పుడూ చూస్తూనే ఉంటారు కామాలు!

వర్మ  : అదికాదు. పొరబడుతున్నావు చావంటే నేను గజగజ వణికిపోయేవాణ్ణి కాదు. కాని . . అది పసిది నాలుగేళ్ళ పాటు ఆ లేతముఖం కుంకుమరేఖతో కళకళ లాడుతూ వుంటే ఎంత బాగుంటుందనుకున్నావు! నువ్వు చూచి ఉంటే ఇలాంటిమాట అనవు.

అవ్వ  : తాటిచెట్టులాంటి కొడుకున్నాడని ఇంతకు ముందేగా చెప్పింది.

221

వర్మ  : ఎప్పుడు?

అవ్వ  : యుద్ధానికి వచ్చేముందు అన్ని అప్పగింతలుపెట్టి వచ్చానన్నావుకాదూ?

వర్మ  : కాదని ఎవరన్నారు?

అవ్వ  : నీ కొడుకు చిన్నవాడయితే అన్నీ వైనవైనాలుగా ఆఖరికి నివాపాంజలితో సహా మరచిపోవద్దని ఎలా హెచ్చరించావు?

వర్మ  : అవును, మా అబ్బాయి మాకు చిన్నవాడు కాక పెద్దవాడవుతాడా?

అవ్వ  : ఆ అబ్బాయి తల్లి చిన్నదా, పెద్దదా?

వర్మ  : చిన్నదే, నిజంగా పసిపాప. రెండో సంబంధం. అచ్చుటా ముచ్చుటా ఏమీ ఎరగదు. కళ్ళన్ని నామీదనే పెట్టుకున్నది.

అవ్వ  : రెండో పెళ్ళి చేసుకొన్నవాడివి మూడో దాన్ని కట్టుకోటానికి ఏమాత్రం సంకోచ పడనక్కరలేదు ఈ పుణ్యక్షేత్రమైన యుద్ధంలో చచ్చిపోతే రంభా మేనకాదులు నేనంటే నేను, నాకుకావాలంటే నాకుకావాలి, అని వచ్చిందాలతో వచ్చి పైన బడతారు

వర్మ  : అదే చిక్కు అందరి అప్సరసలతో నేనెలా వేగేది? పడుచువాణ్ణన్నా అయితే ఎలాగుండేదో?

అవ్వ : ఆ భయమేమీ అక్కరలేదు నీ కిష్టమైన దాంతోనే కాపరం చెయ్యొచ్చు ఎవ్వరూ కాదనరు.

వర్మ : మా ముసలిదాని సంగతో మరి?

అవ్వ : అంటే మీ మొదటిభార్య సంగతేనా?

వర్మ : అబ్బబ్బా! ఏం పిదపకాలం .. మా పసిదానిసంగతి.

అవ్వ : నీకు ఒకకూతురుకూడా ఉందా?

వర్మ : కాదురా బాబు! మా యింటావిడ.

అవ్వ : అలా చెప్పరాదు? ఇలా యేడ్పించకపోతే? ఆవిడకేం మహాలక్ష్మిలాగ బంగారు పతకాలు అమ్ముకొని సలక్షణంగా కాలం గడుపుతుంది.

వర్మ : బంగారు పతకాలా? ఎవరిచ్చారు.

అవ్వ : యింతకుముందేగా నీవు చెప్పింది. యుద్ధాల్లో ఎన్నో బంగారు పతకాలు సంపాయించానని.

వర్మ : లేదు. నేనెలా చెప్పి ఉంటాను? యుద్ధరంగాల్లో బంగారు పతకాలుపుట్టు కొస్తాయా ఏమిటి? అయినా మా ముసలి దాని సంగతి నీకు తెలీదు ఎప్పుడన్నా కాస్త ఆలస్యంగా ఇంటికి వెళ్ళితే ఎంత గొడవచేస్తుందనుకున్నావు? నన్ను చూడనిదే ఒక్క నిమిషం వుండలేదు పైగా నేను రంభదగ్గరున్న సంగతి తెలిస్తేనా? అయ్యో చచ్చాను! దాని ప్రసన్న వీక్షణం ఎంత సమ్మోహనంగా ఉంటుందో దాని కోపం అంత భయంకరంగా ఉంటుంది అలాంటి దాన్ని నేనెలా విడిచిపెట్టి వెళ్లేది? ఇరుగుపొరుగు వారంతా అదంటే ప్రాణాలు విడుస్తారు. వాళ్ళనడిగితే అది ఎంత మంచిదో తెలుస్తుంది.

అవ్వ . ఆమె కలవాటైనవాళ్ళకు కాక పరాయివాళ్ళ కామె మంచి తన మెలా తెలుస్తుందిలే.

వర్మ : ఇప్పుడు కూసిన కూత మళ్ళీ కుయ్యి?

అవ్వ : (నవ్వును ఆపుకొని) ఎందుకు అంత కోపం? నేనేమన్నాను? ఆమె మంచి తనానికి అలవాటుపడ్డ వాళ్ళకు ఆమెమంచితనం తెలుస్తుందన్నాను. ఇందులో తప్పేమిటి?

వర్మ : అబ్బా! దాహం దాహం!

అవ్వ నే నిందాకే దారి చూపించాను.

వర్మ . చావమంటావు అంతేగా!

అవ్య · ఇలా బాధపడేకంటె హాయిగా కాలుమీద కాలువేసుకొని, ఆ రంభ అలా ఆకుమడుపులు అందిస్తూవుంటే, ఆ సన్నని పొడుగాటి వేలిని అలా లీలగా కొరికితే, మొగం చిట్లించుకొని ప్రయత్నం మీద కోపం తెచ్చుకొని ఆవిడ ఒక్క క్రమ్మనిచూపు అలా పారవేస్తే ఎంత బాగుంటుంది?

వర్మ : నిజమ్మే, కాని... ..

అవ్య : ఏడ్చినట్లే ఉంది, ఆ రంభాకేళిలో ఆనందంలేదని ఎవ్వడంటాడు? కొమ్ములు తిరిగిన వేదాంతులుకూడ విషయికానందాన్ని ఒప్పుకున్నారు.

వర్మ : నేను కాదనటంలేదే! కాని నా పెద్ద భార్య సంగతే ఆలోచిస్తూవున్నా.

అవ్య : ఆవిడకు అక్కడేం పని? అక్కడి కెందుకు వస్తుంది?

వర్మ : స్వర్గలోకంలో కాక అది ఎక్కడ వుంటుందంటా? నరకానికి పోతుం దంటావా? ఎప్పటికిపోదు. మహాపతివ్రత. కాదన్నవాళ్ళ నోట్లో పురుగులు పడతాయి పైగా చచ్చిపోయిం తరువాత సువర్ణ దానం, గోదానం, భూదానం ఒక్కటేమిటి అన్నిదానాలు చేశాను అలాంటప్పుడు అది నరకానికి ఎలా పోతుంది? తప్పకుండా స్వర్గానికి చేరి ఉంటుంది.

అవ్య : చేరితే నీకేం? 

వర్మ : మహాబాగా చెబుతున్నావు. అమాంతం మీదపడి గొంతు నులిమేస్తుంది. ఇంకొక పెళ్ళి చేసుకుందికాక ఇక్కడకూడ నా ముందు నా కళ్ళయెదుట ఇలా ఊరేగుతావా అంటుంది.

అవ్య : మహాపతివ్రత అని ఇంతకుముందేగా చెప్పింది?

వర్మ : కాదని ఏ దరిద్రుడంటాడు?

అవ్య : ఆవిడ చనిపోయి నాలుగయిదు సంవత్సరాలయిందికాదు?

వర్మ : అవును.

అవ్య : ఇన్ని సంవత్సరాలనుంచీ ఆవిడ స్వర్గంలో ఏమిచేస్తూ వుంటుంది? హా ప్రియా! ఓహో ప్రియా! ఎప్పుడు వస్తావు? నువ్వెప్పుడు చస్తావు? అని ఎదురు చూస్తూ వుంటుందా? అంటే నువ్వెప్పుడు చస్తావు? అని కనిపెట్టుకొని కూర్చుంటుందా?

వర్మ : నోరుముయ్యి పతివ్రత భర్తచావుకోసం కనిపెట్టుకు కూర్చుంటుందా? అలాంటిదైతే, అది పతివ్రతాకాదు, స్వర్గంలోనూ ఉండదు. ఏ నరకజ్వాల ల్లోనో మ్రగ్గిపోతూ వుంటుంది.

అవ్వ : ఇంతకూ నీభార్య పతివ్రతేగా, అందువల్ల ఆవిడ స్వర్గ లోకంలోనే ఉండి ఉండాలి

వర్మ : తప్పకుండా అంతే.

అవ్వ : అయితే నీకోసం ఎదురుచూస్తూ వుండదు అంతేనా, ఇందులో సందేహ ముందా? పైగా స్వర్గంలో వార్ధకం, వావి–వరుసలు ఉండవని చెప్పనే చెప్పారు ఉంటే రంభా మొదలైనవారు ఎవడు యుద్ధంలో చస్తాడా, యెవడు యజ్ఞం చేసి వస్తాడా అని యెదురు తెన్నులు చూస్తూ ఉండరు కాబట్టి..... మీ

వర్మ : శచీదేవికూడా అలాంటిదేనా?

అవ్వ : ఆవిడ దేవేంద్రుని భార్య

వర్మ : మరి అది నా పెళ్ళాంగా?

అవ్వ : నీవు దేవేంద్రునిలాంటి అధికారివి కావుగా?

వర్మ . టట్, ఇదంతా అబద్ధం. ఇష్టం వచ్చినట్లు కల్పించి వ్రాశారు. ఇలా చెడబరకే టప్పుడు వాళ్ళ భార్యలు జ్ఞాపకంరాలేదు జ్ఞాపకం వచ్చి ఉంటే ఇలా అంక ఖండాలం వ్రాసివుండరు



అవ్వ . ఇంతకూ అంతా అబద్ధమే నంటావు.

వర్మ · ఆహా! అందువల్ల యుద్ధభూమిలో చచ్చినా ఒకటే; రేపు తీరిగ్గా ఇంటిదగ్గర చచ్చినా ఒకటే

అవ్వ : ఎప్పుడు చచ్చినా ఒకటే అయినప్పుడు ఇప్పుడే ఎందుకు చావగూడదు? ఈ బాధ తప్పుతుంది.

వర్మ : ఏదో శనిగ్రహం పట్టుకుందిరా బాబు నీవు మానవుడి మాదిరిగా లేవు. నా చావును కనిపెట్టుకు కూర్చున్నావేమంట! నేను చచ్చిపోతే నీకేమి వస్తుంది? నేను భాగ్యవంతుణ్ణికాదు. నీవు నా జ్ఞాతివీకావు ఒకవేళ దగ్గర జ్ఞాతివైనా, నా అప్పులు, నా కుటుంబ భారాన్ని పంచుకోవలసిందే తప్ప నీకు ఒరిగేది ఏమీలేదు.

అవ్వ · శత్రువు చచ్చిపోవటం ఇష్టంకాదా?

వర్మ (ఉలిక్కిపడి) నాకు జ్ఞాపకం వున్నంతవరకు నీకుగాని, మీ వాళ్ళకుగాని అపకారం చెయ్యలేదు ఇంతవరకూ కూడా మనం ఒకరి ముఖం ఒకరు చూచుకోలేదే! అలాంటప్పుడు నామీద నీకుగాని, నీమీద నాకుగాని కోపం ఉంటానికి ఎలా వీలుపడుతుంది?

అవ్వ   నిజమే, కాని మా మీదికి ఎందుకు కత్తి దూశావు? ఎవరిమీద పగతీర్చు కోటానికి వచ్చావు? స్వర్గం అలంకరిస్తానంటావా? అది లేదని నీవే చెప్పుకున్నావు

వర్మ   . నిజమే. (నిట్టూర్చి) పొట్ట ... ఈ పాపిష్టిపొట్ట నన్నేమి చెయ్యమంటావు?

అవ్వ   · అయితే నీ రాజుతో కలిసి ఎవరిపైకి కత్తి దూశావో తెలుసా?

వర్మ   : అబ్బబ్బా! ఏమిటి ఈ ధ్వని?

అవ్వ   : రివ్వుమనేవి గాలిలోదూసుకుపోతున్న తుపాకి గుండ్లు. ఆహారం కోసం వచ్చి గుండ్ల దెబ్బలు తిని నక్కలు అర్చి చస్తున్నాయి. మాంసం కోసం రాబందులు ఆకాశంలో చక్రాలు కొడుతున్నాయి అదను దొరికినప్పుడల్లా మాంసఖండా లను తన్నుకు వెళ్లుతూ తుపాకీ గుండ్లకు బెదరివాటిని జారవిడుస్తున్నాయి.

వర్మ   : ఇక దిక్కేముంది? బ్రతికి బయటపడటం కల్ల.

అవ్వ   : మరేమనుకున్నా?

వర్మ   : ఈ పక్షులకు, ఈ జంతుజాలానికి ప్రాణభయం లేదంటావా?

అవ్వ   : లేకేమి?

వర్మ   : ఉంటే యీ ప్రమాదకరమైన స్థలానికి ఎందుకు వచ్చాయి?



అవ్వ   . నువ్వెందుకు సైన్యంలో చేరా? ఈ ప్రజ యెందుకు యుద్ధానికి దిగింది?

వర్మ   : నేనేదో దౌర్భాగ్యుణ్ణి. ఆ పక్షులకేం? ఆ నక్కలకేం? ఏ గ్రామాల్లోనో, ఏ అరణ్యాల్లోనో పొట్టపోసుకోవచ్చును గదా?

అవ్వ   . గ్రామాల్లో ఏముంది? పైరా, పంటా? అంతా క్షామం. ప్రజలే తుంగగడ్డలు, రక్కెస గుబ్బలు, ఈతగుంజా, పక్షులు – ఒక టేమిటి? తిన గూడనివాటికి గూడా ఎగబడ్డారు. అలాంటప్పుడు ఇతర ప్రాణులసంగతి చెప్పాలా?

వర్మ   . ఆకలిబాధవల్లనే యీ తిరుగుబాటు వచ్చిందన్నమాట.

అవ్వ   . లేకపోతే వీరస్వర్గాన్ని చూరగొందామని చేస్తున్నారంటావా? ఒక్కడైతే ఏ అధికార పిపాసతోనో యుద్ధానికి దిగవచ్చును కాని ప్రజలంతా ఇలా తెగబడి యుద్ధానికి దిగుతారంటావా? దిగినా ఇంత తెంపరితనముతో పోరాడుతా రంటావా?

వర్మ   : ఎంత దారుణం! ఎంత దారుణం!

అవ్వ   : రేపు నీ గతి యింతకన్న భిన్నంగా ఉంటుందన్న నమ్మకముందా? యుద్ధానం తరంకూడా నిన్నిలాగే మేపుతా రనుకుంటావా?

వర్మ : అంతే!

అవ్వ : అంతగాక మరేమనుకున్నా? స్వర్గం, నరకం, కర్మం, సనాతనధర్మం అనే పేరుతో కాస్తోకూస్తో నోటికందించి మీ వంటి వాళ్ళనంతా ఇలా యుద్ధానికి తోలుతున్నారు అన్నెమూ పున్నెమూ ఎరుగని మిమ్మల్ని మృగాలవలె ఇలా వేటాడుతున్నారు

వర్మ : మా కడుపుల్ని మేమే చించుకుంటున్నామన్నమాట.

అవ్వ : అంతేకాదు, ఏ కొలదిమందికో భోగాలు సాగవనీ నిత్య నైవేద్యాలు చెల్లవనీ నీబిడ్డల్ని, నీ బంధువుల్నీ, నీ ప్రాణాలను చేతులార బలిస్తున్నావు ఎప్పుడన్నా ఆలోచించుకున్నా? నీ మీద, నీ కుటుంబంమీద ఈ ప్రజలకేమి కోపం? నీవు వారికి చేసిన అపకారమేముంది?

వర్మ : నిజమే. ఇంతవరకు ఈ యుద్ధరంగంలో నాకు శత్రువు ఎదురుపడలేదు. ఈ ప్రజలు నాకెలాంటి అపకారంచెయ్యలేదు రాజా చంపమన్నాడు కాబట్టి నేను చంపాలా? అతిఘోరం అందులో నా మాదిరిగానే వారుకూడా తిండికి వాచి మలమల మాడిపోతూ వుండాలి లేకపోతే ఇంతగా ప్రాణాలకు తెగించరు. ఈ సంగతి నాకెన్నడూ పాలుపోలేదు. మరెవ్వరూ చెప్పలేదు ఏదో దూకమంటే దూకటం, నరకమంటే నరకటం తప్ప మరి ఎన్నడూ ఆలోచించలేదు



అవ్వ : అయితే నీవు ఆలోచించుకోలేని యంత్రానివా? ఇంత మందిని నిర్దాక్షిణ్యంగ చంపితే నీకు వచ్చి వళ్లో పడే దేముంది? లేని స్వర్గం తప్ప.

వర్మ : ఆలోచించుకోటానికి నా కెందుకధికారం లేదు? కేవలం ఎవరికోసమో తోడిమానవుణ్ణి ఎందుకు చంపాలి? ఇప్పుడీ ప్రజలు అనుభవిస్తున్న కరవు నా కొడుకుకు రాదని ఎలా నమ్మటం? ఏ దేవుడడ్డుపడతాడు? బాబూ! చాల పొరబడ్డాను, క్షమించు.

అవ్వ : పాపం నీకుమాత్రం నిజం ఎలా తెలుస్తుంది? ''ధర్మం పాడైపోతూవుంది ఉద్ధరించండి. భగవంతుడు మీవెంట ఉంటాడు అంత అవసరమైతే అవతారమెత్తి పోరాడుతాడు. చచ్చారా స్వర్గం; గెల్చారా విజయం. ఇదిగో డబ్బు తీసికోండి. తరతరాలుగా మీ వంశాల్ని, మీ భూముల్ని రక్షించుకోండి పుట్టేవాడు చావటం ఖాయం. కాబట్టి తీసుకుతీసుకు చచ్చేకంటే ధర్మంకోసం, జాతికోసం, స్వాతంత్ర్యంకోసం పోరాడి మరణించటం మేలు మీరు చచ్చిం తరువాత మా పేర్లు చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాసుకొంటాము'' అని

జి.వి. కృష్ణరావు

ప్రబోధం సాగిస్తారు. దానికి అనుగుణ ప్రచారం, ఆర్థికవిధానాలు సాగుతాయి ఇలాంటి యుద్ధంకోసం పేదలు తిండీ, గుడ్డా మానెయ్యాలి ఇలాంటి జగత్తులో మెలిగే సామాన్యమానవుడేమనుకుంటాడు.

వర్మ : ఈ ఆటలు ఇకసాగవు. (లేవబోతాడు)

అవ్య : లేవకు, లేవకు! తలకాయ ఎగిరిపోతుంది అబ్బబ్బ ఏమి గుండ్లు!

వర్మ : అయితే పోరాడుకొంటూ పోదాంపద.

(అవ్యక్తస్వరం విషాదంగా నవ్వుతుంది వర్మ మెల్లగా తలతిప్పి చూస్తాడు.)

వర్మ : అయ్యో, అయ్యో! కాళ్ళుచేతులనుంచి రక్తం ఒకటే ధారగా కారుతూవుందే దెబ్బలు ఎప్పుడు తగిలాయి?

అవ్య : (మాట్లాడదు)

వర్మ : ఏమిటీ! ఇందాకటినుంచి ఇలా రక్తం పడియలుకట్టి పారుతూవుంటే మాట్లాడు తున్నావా?

అవ్య - : ఆరిపోయే దీపం గప్పుమనదూ?

వర్మ : ఛీ ! అలా అధైర్యపడకూడదు, నిన్నిక్కడినుంచి నేను మోసుకపోతాను. 

అవ్య : నా మూలాన నీ ప్రాణాలనుకూడ వదలుకోవలసివస్తుంది. పైగా దీనివల్ల ప్రయోజనంకూడా లేదు. నీవు ఎలాగైనా బయటపడి ప్రజలతో చేయికలుపు.

వర్మ : (శవాలమధ్య నుంచి బయటికి ప్రాకివచ్చి తనతోమాటాడే వ్యక్తి దురవస్థ చూచి స్తంభించిపోతాడు. ఒకటి రెండు సెకండ్లు గడచి పోతాయి.) నిన్నిలా వదలిపెట్టి నేనెలా వెళ్ళేది?

అవ్య : నా మాట విను. నాకోసం కూచోటంవల్ల ప్రయోజనం లేదు. నేను బ్రతికికూడ ఏమి ప్రయోజనం?

వర్మ : ఎందుకలా నిరుత్సాహపడతావు? కాళ్లుచేతులు పోగొట్టుకొన్న ఎందురు యోధులు బ్రతకటం లేదు? పైగా మాలాంటి వాళ్ళకు కన్నులు విప్పగలవు

అవ్య : నా సంగతి నీకు తెలీదు లోకానికి నా హృదయాన్ని ఇవ్వటంకోసం శిల్పిని, చిత్రకారుణ్ణి అయ్యాను. ఈ సేవలో ఆనందాన్ని పొందటానికి అలవాటు పడ్డాను. ఈ ఆనందాన్ని సాధించిపెట్టే చేతులు పోయాయి. లోకానికి సేవ చేస్తున్నానని సంతృప్తితో గర్వించే అవకాశాలు పోయాయి. ఇక నేను దేనికోసం ఏ ఆదర్శనిర్వహణంకోసం జీవించేది? పైగా కొన ఊపిరితో వుండి యోధుల

కాళ్లు చేతులకు అడ్డురావటం తప్ప, వారి ఉత్సాహం కొడికట్టటానికి తప్ప, మరొక ప్రయోజనం లేదు. అబ్బబ్బ ఇంత వరకూ బాధ ఎలాగో ఉంది, (వర్మ నిర్వణ్ణుడై చూస్తాడు) ఈ దీనుని తుదికోర్కె చెల్లించు. నీతళతళలాడే పిడి బాకులతో ఒకసారి యీ రొమ్ములో గుచ్చి అలా హాయిగా బయటికి లాగు

వర్మ : ధర్మంకోసం నిలబడిన యోధుణ్ని – యిలానీచంగా – నేను పిరికిపందను నిజంగా పిరికిపందను. బాబూ నావల్లకాదు

అవ్వ : ఇదిగో నా మాటవిను నేను బ్రతకటం వల్ల, ఇలా బాధపడుతూవుంటే నీకు సంతోషమా? నాకు తెలుసు నీది జాలిగుండె. దానిలో కాకోలం లేదు.

వర్మ : (కంగారుగా) లేదు, లేదు – నావల్లకాదు

అవ్వ : నారొమ్ము కత్తికి ఎదురు తిరుగుతుందనా భయం? ఏమాత్రం సంకోచించకు. నాకోసం ఎదురుచూచే గురుదేవులకు ఏకాంతంగా ఉన్నప్పుడు నా తుది నమస్కారాలు అర్పించు. తన పాత్ర నిర్వహణంలో వేదాద్రి సుఖంగా, శాశ్వతంగా, కన్నులు మూశాడని చెప్పు. తాతయ్యా! ఆలస్యం దేనికి? గురుదేవులైన యువభారతిగారు ఇక్కడి వార్తల కోసం తహతహలాడుతూ వుంటారు. నాలుగువేల రాచసిబ్బంది హతమైందని చెప్పు. నీకు కూడ దీక్ష యివ్వగలిగింది గురువులే. నాకు ఆ తాహతు లేదు ఇంకా దేనికాలస్యం? తాతయ్యా, తోటి మానవుడు ఇలా నరకయాతన అనుభవిస్తూవుంటే ఎలా సహిస్తావు? నీ ప్రేమ బంధాలు ఇంత తీవ్రంగా వుంటే నీవు ప్రజలతో కలసి ఎలా యుద్ధం చేస్తావు? నా మాటలో నీకు గురి వుంది. నన్ను బాధనుంచి విముక్తుణ్ని చెయ్యి. యువభారతి సన్నిధికి వెళ్ళు అక్కడ ఓ అల్లరిపిల్ల వుంటుంది. పొరపాటునైనా నామృతి సంగతి ఆ పిల్లకు తెలియజేసేవు సుమా! కానీ తాతయ్య, నీ శరీరం కొంత పటుత్వం తప్పవచ్చును కానీ నీ హృదయంలో నిశితత్వమూ దీక్షా వెల్లివిరుస్తున్నాయి కానీ తాతయ్యా, తాతయ్యా!...

వర్మ : (చటుక్కున మొఖం త్రిప్పికొని) యువ భారతికి జై! (పిడి బాకుతో గట్టిగా వేదాద్రి రొమ్ములో గుచ్చుతాడు) యువ భారతికి జై! (పిడి బాకు లాక్కొని ముఖం తిప్పకుండానే మెల్లగా పారాడుకొంటూ వెళ్లుతూ వుంటాడు).

*(యుగ సంధ్య నుంచి.)*

## పాత్రలు :

| | |
|---|---|
| తాతయ్య | మఖాదేవుడు |
| కేదారుడు | పరదేశి |
| రాజా | కంచుకి |
| శిల్పులు | వైతాళికులు |

# ఒకటి

(జనులు తండోపతండాలుగా వెళ్లతూవుంటారు జయ జయధ్వనులు, శివనామసంకీర్తనలు వినిపిస్తూవుంటాయి ఆ గందరగోళంలో "అయ్యో నా ఉత్తరీయం," "నా జంధ్యం", "అయ్యయ్యో నాకాలు!" "ఒరే చిట్టీ," "నా బొక్కసా!" "ఒసేవ్ ఎక్కడే!" అన్న కేకలు వినిపిస్తూవుంటాయి.

ప్రతిష్ఠ జరుగని దేవుడికి ప్రజ దణ్ణాలు పెడుతూవుంటుంది. జనానికి దూరాన గోపుర శిఖరాలుమాత్రం కనిపిస్తాయి.

ఈ ఒత్తిడికి వెలుపల ఒక వృద్ధు, అతని శిష్యుడు, మరొక పరదేశి నడుస్తూవుంటారు. శిష్యుడు, పరదేశి కొంచెం ముందువెళ్ళుతుంటారు. ఈ ముగ్గురు వ్యక్తులకూ పింజవోసికట్టిన నీరుకావి దోవతులు. పైన ఉత్తరీయాలు. శిష్యుని ఉత్తరీయం కొంగున ఏదో వేలాడుతూ వుంటుంది.

వృద్ధునికి పూర్తిగా చత్వారం చేతిలో ఒక కర్ర మాత్రం ఉంటుంది. ఈ కర్ర టకటక కొట్టుకుంటూ, వంగిన నడుంతో వృద్ధు మెల్లగా నడుస్తూవుంటాడు.)

తా : బాబా, బాబా! (చూపు ఆనక ఎడమచెయ్యి కనుబొమల కడ్డుపెట్టుకొని అటూ ఇటూ చూస్తాడు ) బాబా, బాబా! 231

కే : ఈ జనమంతా అక్కడికేనా?

పర : ఔను. ఆ దివ్యలోకానికే.

కే : ఆ సృష్టిఅంత లోకోత్తరంగా ఉందా?

పర : ఏమో చూడటానికి ఈ చర్మ చక్షువులు చాలవంటున్నారు.

తా : బాబా, బాబా!

కే : ఓయ్!

తా : పరుగెడుతున్న ఈలోకంలో ముసలివాళ్లదేనికి? భగవాన్! ఇదంతా ఆట– కళ్లూ కాళ్లూ లేనివాళ్ళతో ఆట!

కే : (తాతయ్య దగ్గరకువచ్చి చెయ్యిపట్టుకొని మారాంచేస్తూ) తాతయ్యా, తాతయ్యా! అంతకోపం దేనికి? మీలాంటి వారు ఉండబట్టే ఈలోకం పరిగెడుతూవుంది కాళ్లు విరిగితే కట్లు కట్టించుకొంటూవుంది.

తా . ఒరేయ్, ఈ మాటలు గుండెల్లోనుంచి వస్తున్నాయా?

కే : (నవ్వుతూ) అబ్బే మా తాతయ్యకు ఏమీతేలీదు సరేకాని తాతయ్యా, మా అమ్మమ్మ నడుములు రోజు కెన్నిసార్లు విరిగేవి?

తా : ఏమండోయ్, వింటున్నారుగా!

వర : ఏదో నవ్వుతూ అన్నాడులెండి తాతదగ్గర కాకపోతే మనుమడు మరెక్కడ చనువు తీసుకొంటాడు?

తా : నాయనా, ఇంకా ఎంతదూరముంది!

కే : ఆఁ, ఎంత, ఇంకా ఒక్కపరుగు.

తా : పరుగా? (నిట్టూర్చి) ఏయ్ తాతా, ఇంకొక్క పరుగు. ఏదీ కాని – ఒకటి, రెండు.

వర : నిజంగా పరుగెత్తరుగదా! దేవాలయం చూడకుండానే మధ్యలో పడిపోయేరు!

తా : నాయనా, ఈ ఘటముందే – ఈ ఘటం ఓటిదనుకుంటున్నారేమో, కాదు.

కే : (నవ్వుతూ) ఓటిదయితే ఈ వయసులో, ఈజనసమ్మర్దంలో ఇంతదూరం వస్తుందా?

232 తా : నిజమేరా? బాబా! చూడు నువ్వెం తెత్తున్నా? రెండంగుళాల ఆరు వీసాలు, అంతేనా?

వర : (నవ్వుతూ), అదేమిటి, అలా అంటారు? చత్వారమా, చమత్కారమా?

తా : వాడంతకన్నా ఎత్తు ఉన్నాడంటారా? కొలవండి.

కే : తాతయ్య, నిజమే, నీకు నేను రెండు అంగుళాల ఆరు వీసాలే. అబద్ధం కాదు

తా : చూపులేనివాడు ఇక ఇక్కడికి దేనికి వస్తాడు? ఏమి ఆనందిస్తాడు?

కే : ఆయన మాటలు నమ్మకండి. అసలు సంగతి మీకు తెలీదు ఈ శిల్పసంపద చూడాలని ఆయన ఆరాటం.

తా : నాయనా, చూస్తున్నావుగా? కళ్ళులేనివాడు శిల్పకళను ఆనందిస్తాడా? ఇది ఎక్కడన్నావుందా?

వర : (కేదారుడితో) వారు చెప్పేది అబద్ధమంటారా? ఈ వయసు మళ్ళిన కాలంలో ఇంతదూరం వారు వస్తారా?

తా : అదీ, నూరేండ్ల బ్రతుకు నాయనా!

కే : (నవ్వుతూ) నిజంచెప్పు తాతయ్యా! నువ్వు బయలుదేరదీశావా? నేను

బయలుదేరదీశానా? మనమిద్దరం అబద్ధమాడితే, మా అమ్మ అబద్ధం చెబుతుందీ?

తా : కన్న కడుపు ఏమీ చెబుతుందిరా?

కే · మీ అమ్మాయి అబద్ధం చెబుతుందా?

తా అవును, నిజమే. నేనే నిన్ను వెంటబెట్టుకొని వచ్చాను. సరేనా?

కే : నీతో వాదించి ఎవరు నెగ్గగలరు?

తా : నీవు నెగ్గుతున్నావు

కే : కేవలం మనమడిమీది ప్రేమ. నిజానికి వస్తే నీతో పోటీ చెయ్యగలనా?

తా : (మనవణ్ణి దగ్గరకు తీసుకొని తల నిమురుతూ) బాబా, మేమిద్దరం నీ మీద ప్రాణాలుపెట్టుకొని బ్రతుకుతున్నాము. బ్రతకమంటావా, లేదంటావా?

కే : తాతయ్యా, అలా మాట్లాడుతావేం?

తా : నాలుగు కాలాలపాటు బ్రతుకు. నీ వంశాన్ని, నీ దేశాన్ని ఉద్ధరించు.

వర : అదేమిటి, అలా సెలవిస్తారు? 233

తా : వీరశైవుడైన రాజు విగ్రహ ప్రతిష్ఠచేస్తూవున్నాడు సిద్ధహస్తుడైన శిల్పి చేయిస్తూ వున్నాడు ఇది మాత్రం మరచిపోకు. ఆ పైని నీ యిష్టం

కే : అనవసరంగా మాట్లాడనన్నాను. అమ్మకు మాటయిచ్చాను. గురుదేవునితో శపథం చేస్తూవున్నాను. నన్ను నమ్మలేవు?

తా : నమ్మటం, నమ్మకపోవటం కాదు. దీక్షితుల మనస్సు అలా అనిపిస్తుంది అన్నట్టు ఒక కథ జ్ఞాపకం వస్తున్నది.

వర . చెప్పండి వింటాము.

తా : పూర్వం ఒక శిల్పాచార్యుడు ఉండేవాడు.

కే : ఎప్పటి సంగతి?

తా : ఎప్పుడో చెప్పలేను ఈ ముసలివాడికి అంత జ్ఞాపకమా?

వర : ఒక శిల్పాచార్యుడూ - అయితే?

తా : ఆయనదగ్గర కూతురు, శిష్యుడూ శిల్పం చెప్పుకొంటూ వుండేవారు.

కే : ఆ ఆచార్యులు మీరేనట్లుందే!

తా : అంతా తెలిసింతరువాత నేను చెప్పటం దేనికి?

కే . నాకు తెలీదు తాతయ్యా చెప్పు – చెప్పవూ? మా తాతయ్య చాల మంచివాడు ఏమండోయ్, మా తాతయ్య చాల మంచివాడు నేనే బలవంతంచేసి మా తాతయ్యను ఇక్కడికి లాక్కువచ్చాను నిజం చెప్పానుగా! ఇక చెప్పు తాతయ్యా! మీరు ఊఁ కొడుతూ వుండండి

తా : ఉండరా గడుగ్గాయా! తాతకే దగ్గులు నేర్పాలంటావు

వర : మీరు చెప్పండి!

తా : సరే కూతురు, శిష్యుడూ శిల్పంలో ఆరితేరారు.

కే : వారిద్దరికీ చూపులు కలిశాయి.

తా : చూపులు కాదు – మనస్సులోయ్, మనస్సులు!

కే : ఇప్పుడు మా అమ్మమ్మ దగ్గరుంటేనా?

వర : చెప్పనీండి! తరువాత?

తా : వరుడు కట్నం కావాలన్నాడు. ఆమె హృదయాన్ని కరిగించి పోసిన అర్ధ నారీశ్వర విగ్రహాన్ని ఇమ్మన్నాడు. అది నాహృదయమే కదా అంది వధువు. దాన్ని బద్దలు చెయ్యటానికి ఇష్టముంటే పెండ్లాడుతానన్నాడు వరుడు. ఆమె త్రొక్కిసలాడుతూవుంది.



కే : చివరికి ఏమైంది?

తా : అర్ధనారీశ్వరుడు ముక్క చెక్కలయ్యాడు. వారికి పెండ్లి అయింది.

వర : ఎంతటి ప్రేమ ! ఆ త్యాగాన్ని ఎవరు చేయగలరు?

కే : లోకానికి ఒక అపూర్వ సందేశాన్ని ఇవ్వటానికి హృదయాన్ని కరిగించిపోసిన విగ్రహాన్ని ఒకరికివ్వటానికి ఏమి అధికారముంది? ఆమె మాత్రం ఎంతవరకు సక్రమంగా ప్రవర్తించింది? వారి అనురాగం ఎంతదైనా కావచ్చును. కాని, లోకాన్ని దోచుకోటానికి వారికి అధికారంలేదు. ఆమె ఇవ్వటానికీ, అతడు భగ్నం చెయ్యటానికీ అధికారమెక్కడిది?

తా : సాంతం విను.

కే : కేవలం అన్యాయం.

వర : చెప్పండి!

తా : ఆ దంపతుల ప్రణయం మొగ్గతొడిగింది ప్రసవఘడియలు సమీపించాయి శిశువు శీర్షోదయం కాగానే బయటికి నిమ్మకాయ వేయవలసిందని

మంత్రసానికి ఆజ్ఞ. ఆమె వేసింది. కాని కాయ మండిగానికి తగిలి లోపలనే పడ్డది. పరచర్యలలో మగ్నమై ఉన్న మంత్రసాని తరువాత ఎప్పుడు చూచిందో, మళ్ళీ దాన్ని బయటికి వేసింది వాకిట్లో తాటాకు గంటం పట్టుకొని కూర్చున్న శిల్పి ఒళ్ళోపడ్డది.

కే : ఇంకేం, మీనమేషాలు లెక్కపెట్టాడు!

పర : ఏమి జరిగింది?

తా : జారిణీపుత్రుడని తేలింది మనస్సు చివుక్కుమంది. శిల్పిని కాళ్లు ఎక్కడికో చేరవేశాయి.

కే : కాళ్లు చేరవేసినచోటికి శిల్పి వెళ్ళాడు. వహ్వా ఎంత బాగుంది!

పర : ఎంత పని జరిగింది!

కే : (కోపంతో) నేనంత మూర్ఖుణ్ణికాదు. ఇక నీవు నిశ్చింతగా ఉండవచ్చును.

తా : అయితే శాస్త్రాన్ని కాదంటావా?

కే : శాస్త్రం, శాస్త్రం! శాస్త్రం ఎక్కణ్ణుంచి పుట్టింది. (పరదేశితో) కాస్త తేడాతో ఈ విపరీతం జరిగింది. ఈ తేడాను గూడ గమనించలేని శాస్త్రం సమగ్ర మౌతుందీ? ఆమె ఎంత కసిడికోతలకు ఒప్పుకొని ఎంతగా ప్రేమించింది? అతగాడికి తెలుసే అనుభవించాడే, అలాంటివాడు అసమగ్రశాస్త్రానికి ప్రాధాన్యమిచ్చి ఏమిచేశాడు..... నాకు సామాజిక అనుభూతే బలీయసి. గురుదేవా, ఏమంటావు? 235

తా : ఏదో పుక్కటి పురాణం చెబుతూవుంటే అంత వుద్రేకం దేనికి బాబా!.... కాని ఇదిమాత్రం జ్ఞాపక ముంచుకో. అంతకన్నా యీ వృద్ధు....శిష్యునికి ఇక చెప్పవలసింది–

కే : అదేమితాతయ్యా... కళ్లు చెమ్మగిల్లుతున్నాయ్?

తా . బాబా, ముసలి వాణ్ణికదా... ఏదివచ్చినా అలా పట్టలేకుండా వస్తుంది. (మనుమణ్ణి దగ్గరకు లాక్కొని తల నిమురుతూ ఆకాశంలోకి చూస్తూ వుంటాడు.)

కే : కాదు, కాదు. ఏదోవుంది. మా గురుదేవుడు సామన్య మానవుడుకాదు.... తాతయ్యా, చెప్పవూ?

తా : ఇలాంటి కథను చెప్పక ఒక కొడుకును కోల్పోయాము. అది జ్ఞాపకంవచ్చి గుండె నీరయిపోతూవుంది

కే : మా అమ్మ ఎప్పుడూ చెప్పలేదే.

వర : ఇదిగో ప్రాకారగోపురం .. ఎందరు శిల్పులు ఎన్నేండ్లు తపస్సు చేశారో!

కే : తాతయ్యా, తాతయ్యా.

తా : ఏమిటి బాబా!

కే : ఇదిగో (తాతయ్యను ద్వారందగ్గరకు తీసుకువెళ్ళి ధ్యాన ముద్రలోవున్న నారదుని విగ్రహంమీద చేతిని మోపిస్తాడు. అతడు ఆపాదమస్తకం తడివి, విగ్రహముఖాన్ని మాటి మాటికి చాల నెమ్మదిగా వణుకుతూ, వణుకుతూ తడువుతూ, మనుమడి ముఖంలోకి రెండు సెకండ్లుచూచి.)

తా : బాబా, జన్మతరించింది ముకుళితనేత్రమైన యీ నారద ముఖంలో ఎంతటి దివ్యమందహాసాన్ని చిత్రించాడో చూచావా? శిల్పమంటే ఇదే శిల్పం.

వర : విచిత్రంగా వుంది స్పర్శమాత్రంతోనే ప్రతిమాసౌందర్యాన్ని అనుభవిస్తున్నారే!

తా : నాదేముంది నాయనా! ఆ శిల్పి లోకోత్తరుడు (కంఠంలో గాద్గద్యం మోగుతుంది. మనుమడితో) బాబా, నాకాళ్లు వణికిపోతున్నాయి. .. మనస్సు పరిపరివిధాల పరిగెడుతూ వుంది.



కే : ఏం తాతయ్యా?

తా : (తడబడుతూ) ఈ శిల్పం ఎప్పుడో కొంతకాలం నాచేతిలో మెలిగినట్లుగా సరిగా చెప్పలేను బాబా, ఈ ఖత్తు ఎక్కడో ఎప్పుడో ... ఈ జన్మలోనేనా? చెప్పలేనుబాబా!

కే : ఏమిటి తాతయ్యా?

తా : నా గుండె ఎందుకో కొట్టుకొంటూవుంది మనస్సు మనస్సులో లేకుండా పోతూవుంది. మనం తిరిగిపోతే?

కే : ఎందుకంత కల్లోలపడుతున్నావు తాతయ్యా!

తా : బాబా, లేదు. ఎందుకో భయం కలుగుతూవుంది మనం ఎందుకు తిరిగి పోగూడదు?

వర : ఇంతదూరం వచ్చి ఈ శిల్పాన్ని చూడకుండా తిరిగిపోతారా?

తా : (మనుమడితో) మీ అమ్మకు వాగ్దానమిచ్చాను నీ కొడుకును మళ్ళీ నీకప్పగిస్తానన్నాను.

కే · (నవ్వుతూ) అంతేగదా! మా తాతయ్యను ఎవ్వడు ఓడించగలడు? విశ్వకర్మ వచ్చినా నమస్కరించిపోవలసిందే

తా : ఆ అహంకారమే పనికిరాదంటాను బాబా! నా హృదయం ఏదో అశుభాన్ని శంకిస్తూవుంది. పవనవీచికల్లో ఏదో విపత్తు పలుకుతూవుంది.

కే : కాచివడపోసిన మీరే అలాఅంటే, ఎవరేమి చెపుతారు?

తా : తొందరపడనని వాగ్దానం చెయ్యిబాబా!

కే : ఇదివరకే చేశానుగదా...

తా : (మనుమడి శిరస్సు నిమురుతూ) మళ్ళీ.

కే : అలాగే (తాతపాదాలు స్పృశించి) తొందరపడను.

వర : ఇదంతా ఏమిటి? నేను ఏ లోకంలో ఉన్నాను?

తా : ఇక్కడ ఎవరికో, శృంగభంగం తప్పదు. బాబా! నేను రాలేను ముసలివాణ్ణి దయదలచి ఈ వార్ధక్యాన్ని జనసమ్మర్దం లేని చోటికి చేరవేయి బాబు!

కే : అదిగో, అదిగో! చంద్రశేఖరుని విగ్రహం మల్లేవుంది దాన్నే ప్రతిష్ఠించుతారు కాబోలు! చూచింతరువాత బయటికి వెళ్లుదాము (తాతయ్య చెయ్యివట్టు కొంటాడు.) 237

తా : (నిట్టూర్చి) పోవలసిందేనా?

వర : ఇంతలెక్క వడివచ్చారు కదా?

(అందరూ ముందుకు నడుస్తారు.)

వర : శిల్పి ధన్యుడు.

కే : (ఆవేగంతో) తాతయ్యా, తాతయ్య! (తాతయ్య చెయ్యి ఒక్కసారిగా కుదుపుతాడు)

తా : (ఉగ్రుడైపోయి) ఛీ, నోరుముయ్!

కే · (ధైర్యంతో) తాతయ్యా!

తా : ఇంతకు ముందేమన్నావ్? ఇందుకేనా నన్నిక్కడకు తీసుకొచ్చింది? నీ వాగ్దాన మేమైంది?

వర . ఎందుకండి అంతకోపం? ఆయన ఏమిచేశాడు?

తా : నాయనా, మావాడి సంగతి మీకు తెలీదు లోకాలన్నిటినీ తన పాదాక్రాంతం

చేసుకోవాలని వాడికోరిక సప్తగ్రహాలు ఇక వాడిచుట్టూ తిరగాలి, శిల్పుల తలలు నరికించి వాడిమెళ్లో వేసుకోవాలి!

కే (మొండికెత్తి) నా గురువులు అంత సంస్కారహీనులు కాదు

పర అంతలోనే మీరు నెయ్యిపోసిన అగ్నికుండ మౌతున్నారేమిటి?

తా నాయనా, నీవు శిల్పివి కావచ్చును అన్ని మర్మాలు తెలిసి ఉండవచ్చును అంతమాత్రానసే కన్నులు నెత్తికి రాగూడదు అందుకేనా ఈ శాస్త్రాన్నీ, కళనూ అభ్యసించింది? కాదు బాబా, కాదు లోకాన్ని ప్రబుద్ధం చెయ్యాలి తద్ద్వారా జన్మను తరింప జేసుకోవాలి

పర నేనా భాగ్యానికి నోచుకోలేదు.

కే లోకం పల్లకీ అయి నన్ను మోయాలని కోరటం లేదు

తా కాక మరేమంటావు? కీర్తికండూతికోసం ఒక శిల్పి కపాలాన్ని మెడకు కట్టు కొంటావా?

పర మీరు తెలుగు మాట్లాడుతున్నారా?

 కే నా స్వార్థం కోసం నేనేమీ చెయ్యటంలేదు, చెయ్యను కాని ..

తా అందుకే ఇక్కడకు రావద్దన్నది అందుకే యీ వయస్సున ఇంత దూరం పడివచ్చింది నీ మాత్రం ఆ లోకోత్తర శిల్పికి తెలియదంటావా?

కే కాదంటున్నానా తాతయ్యా! శాస్త్రం అపారం, నేను పారంగతుణ్ణని ఎవడు చెప్పుకొంటాడు? కాని, ఆ –

తా అదే అనవద్దంటున్నాను. ఆ అహంకారమే పనికిరాదంటున్నాను దోషమంటే ఏమిటి? నిర్దుష్టమైన వస్తువును ప్రపంచంలో చూపించు క్రిందూ మీదూ తెలియడం లేదు. ఔను, నిన్నంటే ప్రయోజనమేముందిలే! ఆ వయస్సుని అనాలి

కే తాతయ్యా, ఎందుకంత వలపక్షం ఆ విగ్రహాన్ని ఆ చేతితో తాకిచూస్తేమీకే తెలుస్తుంది

తా (క్రుంగిపోయి) బాబా, నాకు ఏమీ తెలీదు వయస్సుతో పాటు మతిగూడ మళ్ళిపోయింది. చేతులు వణికిపోతున్నాయి ఈ పాపమంతా నాకు దేనికి? నా తరమేదో వెళ్ళిపోయింది లోకం నన్ను అతిక్రమించి పోయింది ఒకప్పుడీ లోకం ప్రాధేయపడింది పాదాలు పట్టుకొన్నది ఎందుకు ఆ గొడవ ఒక

మూల కూర్చుని కృష్ణా, రామా, అనుకోవంసిన నన్ను రంగంలోకి ఎందు కీడుస్తావు? నేను ఆడాలేను, పాడాలేను. నన్ను ఇంటికి చేర్చు. తాతను మనుమడు బాగా చూచాడంటారు.

కే : తాతయ్యా, ఎందుకంత కోపం కాస్తదయవుంచి ఆ విగ్రహాన్ని చూడు.

తా · నాకేమీ తెలీదు శిల్పమంటే ఏమిటి బాబా? అజ్ఞానిని.

పర ఎవరో యిద్దరు మీవంక ఊరికే చూస్తున్నారు రాజుతో చెబుతారేమో!

కే (వినిపించుకోక) ఒకసారి చూడండి తరువాత మీరేమన్నా పడతాను.

తా : (కఠినంగా) ఇక్కడ ఒక్క క్షణం ఉండవద్దు. వెళ్లదాంపద.

కే : తాతయ్యా, లోకానికి, శిల్పానికీ అపకారం చేస్తావా?

తా · అందుకని ఒక లోకోత్తర శిల్పిప్రాణాలు తియ్యమంటావా? ఆ వుసురు నన్ను పోసుకోమంటావా? నాచేత కాదు నా వల్లకాదు కేవలం నేను శాకాహారిని- మానవుణ్ణి

కే - . నీ శిల్ప దీక్ష, శాస్త్రాభిమానం ఏమయ్యాయి తాతయ్యా! ఏ అణుమాత్రం దోషమున్నా, శాస్త్రాన్ని ఏమాత్రం ఉల్లంఘించినా సహించేవాడివి కాదే నేడెలా సహిస్తున్నావు? మేరుపర్వతంలాగా నిలిచిపోరాడవలసిన యీసమయంలో ఇలా జారిపోవటం ధర్మమా! 239

తా నీ కిదివరకే చెప్పాను. శాస్త్రాన్ని పూర్తిగా అభ్యసించిన తరువాత శిల్పి స్వతంత్రుడు. అతడేమి చేసినా సాగనుంది – ఇంతకూ నా శిష్యుణ్ణే ఇందరిలో అవమానపరచమంటావా? ఆ అవమానం నాది కాదా?

కే ( ఆశ్చర్యంతో) ఈ శిల్పి నీ శిష్యుడా!

తా నేను ఖచ్చితంగా చెప్పలేను కాని యీ హస్తాన్ని ఎక్కడో, ఏ జన్మలోనో దిద్దాను బాబా, నన్నెందుకు ఏడిపిస్తావు? ఈ వార్ధక్యంలో కూడా మన శ్శాంతికి నోచుకోలేదా? నీ తండ్రి కోసం ఈ రోజుకూ ఏడుస్తూనే వున్నాను. మరొక ఆప్తుణ్ణికూడా నా కళ్ల ఎదుట అవమానించి నన్నెందుకు ఏడిపిస్తావు?

కే నీలాంటి ధర్మజ్ఞుడే అలా అంటే ఏమి చేసేది? తాతయ్యా ఒకటి మాత్రం మరచిపోకు ఈ దేవాలయానికి కోట్ల కొలది ధనం వ్యయమౌతూవుంది.

తా అయితే?

కే ఇదంతా ప్రజలది నెత్తురోడ్చి సంపాదించినది ఒక్క చిల్లిగవ్వకూడ రాజుది

కాదు. ఇన్నికోట్లు వ్యయించిన ఫలం ప్రజలకు చెందాలి ఈ దేవాలయం వారిలో శాశ్వతంగా భక్తిబావాన్ని రేకెత్తిస్తూ వుండాలి

తా : ప్రపంచంలో అన్నీ శాశ్వతమే!

కే : నీతో నేను వాదించలేను ఏది ఎలా వున్నా కొంత కాలం ఈ దేవాలయం నిలవాలి. ప్రజల కష్టార్జితానికి ఫలముండాలి ప్రజలది పాపపు సొమ్ము కాదు గంగలో కలపాటానికి వీలులేదు

తా : బాబా, నిన్ను చూచి నవ్వనా? ఏడ్వనా? ప్రపంచంలో ఎన్ని మహత్తర కృతులు నశించాయి? ఎందుకూ కొరగాని కృతులెన్ని కేలుమోడ్పు లందు కొంటున్నాయి? గుణదోషాల దారి గుణదోషాలది. లోకం దారి లోకానిది. పెద్దవాణ్ణౌ, చిన్నవాణ్ణౌ చెబుతున్నాను. పద. బాబా, నా మాట కాస్త చెవిని బెట్టు. మళ్లీ నీ కాళ్ళకు చేతులకు అడ్డంరాను

కే : తాతయ్యా, ఈ ప్రజాద్రోహానికీ, శిల్పద్రోహానికీ ఒడిగట్టుతావా?

తా . లోకవ్యవహారం నీకు తెలీదు నిన్నకాక మొన్ననే కళ్లు విప్పావు. మాత్సర్యం ఎలా నడువుతుందో, తనకత్తికెదురు తగిలితే రాజుల చిత్తవృత్తి ఎలావుంటుందో నీకేమి తెలుసు? ఎప్పుడు చూచావు కనక? నీ మాట విని వెళ్లుదాం పద నన్ను ఏడిపించకు. మీ అమ్మ సంగతైనా ఆలోచించు.



కే : నీవంటి శిల్పకోవిదుడు, ధర్మిష్ఠి, ఇలా కావటం శోచనీయం. దేశదౌర్భాగ్యం. ఇదే నమస్కారం. నా ధర్మాన్ని పరిత్యజించలేను తాతయ్యా నన్నాశీర్వదించు.

తా : నేను ముసలివాణ్ణి – మాటలు తడబడుతున్నాయి. ఆశీర్వదించనా? విచిత్రం, ఈ మానవజీవితం విచిత్రం. ఎన్ని పోకిళ్ళుపోతుంది? కీర్తికోసం చేయరాని పనులను చేస్తుంది. ధర్మమంటుంది. అధికారకోసం రక్తాన్ని ప్రవహింప జేస్తుంది. అహింస అంటుంది ఎప్పుడూ ఈ ప్రాణి మాయావాగురలలో తప్ప బయట బ్రతుకలేదు. బాబాపో, – నీ గురుదేవుల చేతులు నరికించు! (ముఖం త్రిప్పుకొని) భగవాన్ నీ శిక్షయిదా! (వెళ్ళుతూవుంటాడు.)

వర : కళ్లుకనపడని ఆ వృద్ధులు వెళ్ళిపోతున్నారు

వైతా. కంఠం · శ్రీ మన్మహామండల రాజాధిరాజ రాజ పరమేశ్వర, విజయీభవ! అభ్యస్త సర్వదర్శన కలా ప్రాభవా, విజయీభవ!

---

జి.వి. కృష్ణరావు

కే . (పరదేశితో పెద్దగా) మాలాతయ్యను కాస్త చూస్తూ వుండండి నేను త్వరగానే వస్తాను (కంచుకి ప్రవేశిస్తాడు )

కం · మహారాజుల ఆజ్ఞ.

కే · ఏమని?

కం : తమ్ము ఆస్థానానికి తోడ్కొని రమ్మని.

కే : మేము ఆస్థానపోషితులము కాదే?

కం : పోషితులుకాదు. ఆహూయమానులు. దయచేయండి. ఇటు....

( ఇద్దరూ వెళ్ళిపోతారు)

## రెండు

రా : ప్రతిష్ఠ రేపు కాబోలు!

జ : కాదు ప్రభూ!

రా : అయిన మరి?

జ : ప్రతిష్ఠ నేడే జరిగితీరుతుంది ఏలినవారి సంకల్పం అన్యథా జరుగజాలదు. 

రా : విచిత్రం. చాలూమూలా తెలియని కుర్రకుంక ఏదో అన్నాడని రగడ జరగాలా?

జ : దేవరవారు అలా సెలవిస్తే నేను చెప్పగలిగినది లేదు. దేవాలయ నిర్మాణం అంత సామాన్యంకాదు ప్రభువులు అంత తొందరపడగూడదు.

రా : నిమిష నిమిషానికి మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే యీ ప్రపంచంలో ఒక్కటీ మనం చెయ్యలేము. నీ క్రింద పనిచేసే శిల్పులు ఎంత ఘోషించారో తెలుసునా?

జ : ఏలినవారు ఏమి సెలవిస్తున్నారు?

రా : శిల్పులు అలాంటి అగ్నిహోత్రంలో వేగలేమన్నారు. అయినా ఏమి ఆజ్ఞాపించానో తెలుసునా? ఆయన ఆజ్ఞ నా ఆజ్ఞ అన్నాను.

జ : ధన్యుడను ప్రభూ!

రా : ఈ ప్రతిష్ఠాకాలాన్ని దాటవెయ్యవుకదా?

జ : లేదుప్రభూ!

రా : ఈ కుర్రకుంకతో మరి?

జ · ప్రజలలో భక్తిభావాన్ని నిక్షేపించటమేకదా, ఏలినవారి సంకల్పం?

రా . అవును

జ ఈ కుర్రవాడు నేడు ఇద్దరితో దోష ముందన్నాడు. అసలు అది దోషం కాక పోవచ్చును కాని ఆ అనుమానం నా నాటికీ ప్రజలలో వ్యాపించవచ్చును ఒకసారి మనసులో గిలి బయలుదేరిం తరువాత ఎంతపని అయినా చేస్తుంది. అందువల్ల భక్తిభావం శాశ్వతంగా నిలవటానికి శిల్పి ప్రయత్నించాలి. తాను నిర్దేశించిన సంస్కారం లోకంలో వ్యాపింపజెయ్యటం శిల్పి ధర్మం. అలా చెయ్యగలిగిననాడే అతడు శిల్పి, కళోపాసకుడు అవుతున్నాడు.

రా . ఇంతకూ వాదము తప్పదన్నమాట.

కం . జయము, జయము మహారాజా! వారిని ఇక్కడకు కొని వచ్చాను. ప్రవేశ పెట్టవచ్చునా?

రా · (జక్కన వంక ఆందోళనతో చూస్తాడు )

జ . అవశ్యం ఆస్థాన శిల్పులనుకూడ పిల్చుకొనిరా.

కం · చిత్తం (వెళ్లుతాడు.)

రా : ఆచార్యా! శిల్పులు దేనికి?

జ : న్యాయవిచారణకు, శాస్త్రార్థం చేస్తూవుంటే విని తెలుసుకొనటానికి.

రా : విచిత్ర్య వ్యక్తివయ్యా!

కం : (ప్రవేశించి) మహారాజా! వీరే శిల్పులు.

శిల్పి : విజయీ భవ! ఆచార్యవరేణ్యా, నమస్కారం.

కే : (రాజును ఆశీర్వదిస్తూ) సంకల్ప సిద్ధిరస్తు!

(శిల్పులు అంతా ఉచితస్థానాలకు చేరుతారు)

రా : వారే శిల్పాచార్యులు – వీరు శిల్పులు.

కే : చిత్తం.

రా . కూర్చోండి, ఆచార్యా! కార్యక్రమ మేమన్నా ఉన్నదా?

జ . అవును ప్రభూ! ఇప్పుడే వీరికి విన్నవిస్తాను (శిల్పులతో) పూజ్యులారా, మన మిన్నాళ్ళనుంచి సాగిస్తూవచ్చిన కృతిలో దోషమున్నదట. (కేదారునితో) ఈ అభియోగం మీదేకదా?

కే : అవును.

జ . రాజా, తమరు ఇక విచారణ ప్రారంభించవచ్చును.

శిల్పి : దోషమా (రిచ్చపోతారు.)

రా : (కేదారునితో) వత్సా!

శిల్పి : ప్రభూ!

రా : ఎవరది మాట్లాడునది! (నిశ్శబ్దం) దోషమున్నదా, లేక భ్రాంతి పడ్డావా?

కే : భ్రాంతికాదు. కేవలం దోషం.

రా : నీ కులగోత్రాలు?

కే : చెప్పజాలను.

జ : పోనిండు ప్రభూ. తన కులగోత్రాలను తాను చెప్పుకోగూడదు. అది ధర్మదూషితం.

రా : ఎవరి ఆస్థానంలో ఉంటున్నావు?

కే : స్వతంత్రుడను.



రా : అయిన ఇచట విచారణకు తావులేదు.

కే : అన్యాయం ప్రభూ! కులగోత్రాలు లేనంతమాత్రాన, పేరు ప్రతిష్ఠలు లేనంత మాత్రాన ఒకవ్యక్తికి శాస్త్రగంధ ముండదనీ, కళా ధర్మము తెలియదనీ, నిర్ణయించటం అన్యాయం. కులగోత్రాలు లేనివారెందరు విఖ్యాత శాస్త్ర కారులు, శిల్పులు, కవులు లేరు?

రా : సుప్రసిద్ధ శిల్పాచార్యులతో అనామకులు వాదభిక్ష కోరటానికి వీలులేదు. ఇది మా ఆస్థానగౌరవానికి భంగం.

కే : మీ ఆస్థానంలో చేరకముందు మీ శిల్పాచార్యుల స్థితిగతులడుగవచ్చునా?

రా : ఆస్థాన శిల్పులతో అనామకుడుగా ఉండి కయ్యానికి కాలు దువ్వలేదు. ఆస్థానం అతని శిల్పనైపుణ్యాన్ని పరిశీలించి స్థానమిచ్చింది.

కే : ప్రభూ తమ ఆస్థానపదవినికాని, అర్థాన్ని కాని ఆశించుట లేదు. సమాజంలో నాబాధ్యతను నిర్వహించటంకోసం వచ్చాను. నావంటివాడు మీ శిల్పాచార్యులను వాదభిక్షను కోరగూడదా?

జ : ప్రభూ!

రా : శిల్పాచార్య, ఆగు. మా ఆస్థానానికి ఒక గౌరవం ఉన్నది. దానికి ఎవరూ భిన్నంగా నడవటానికి వీలులేదు

కే : అయిన నన్ను రప్పించుట దేనికి.

రా : క్షమాపణ చెప్పించుటకు.

కే : చెప్పకపోయిన?

రా : ( ఇలాంటి సమాధానం తనకు చెబుతాడని అనుకోక రిచ్చపోయి) ఏమన్నావ్?

కే : చెయ్యని తప్పుకు క్షమాపణ కోరలేను.

రా : ఈచర్య.

కే : శిల్పిధర్మం.

జ : ప్రభూ, కాలం గడచి పోతూవుంది

రా : నీ చర్యకు అర్థమేమో తెలుసునా?

కే : విధి నిర్వహణం.

రా : కాదు ప్రభుతిరస్కారం.



కే : ధర్మవిరోధి అయితే అంతే.

జ : వత్సా, కార్యార్థి పద్ధతి అదికాదు.

కే : ప్రతివాదికి భయపడి బుజ్జగించటం పద్ధతి కాబోలు!

రా . శిక్షాపాత్రుడ వౌతున్నావు.

కే : ఈ ద్రోహంకంటే శిక్షే మేలు

రా : చెప్పి ప్రయోజనం లేదు. మా ఆస్థాన గౌరవరక్షణకు ఒకటే దారి కనిపిస్తూ వుంది. దీనికి అంగీకరిస్తేనే మా శిల్పులతో వాదించటానికి వీలవుతుంది.

కే : ఏమని సెలవు?

రా : ఈ వాదంలో ఓడితివా ఆ శిరస్సు నీది కాదు.

కే : (ఉత్సాహంతో) ధన్యోఽస్మి.

జ : ధర్మం కాదు ప్రభూ!

రా : మా శిల్పి ఓడిపోతే రెండు చేతులు పోతాయి

కే : అన్యాయం.

---

శి    ఇందులో అన్యాయం ఏమి ఉంది

కే    : మీ శిల్పి చేతులు పోతే ఎంత నరక యాతన పొందుతాడో తెలుసునా? హృదయము పొంగి స్రవించే కళావాహినికి కట్టలు వేయలేని మొండి చేతులతో క్రుంగి పోతాడు. నే నంటేనో ఒక్కసారిగా యాతల పోతుంది. మళ్ళీ దిగులుండదు. సృష్టించాలన్న సంకల్పనా, ఆవేదనా నిరర్థకత ఏవీ వుండవు.

రా    : అతడు వయోధికుడు మా తీర్పు సర్వథా సమంజసమే.

జ    : మాకు కాలం అతిక్రమిస్తూవుంది. ఏమని మీవాదన.

కే    : మీకృతలో దోషముంది

జ    : పరిశీలించారా?

కే    : అవును ఒక దోషముంది.

జ    : లేదు రెండు దోషాలుండాలి మళ్లీ వెళ్ళి పరిశీలిస్తారా?

శి    : రెండుదోషాలా? ఆచార్యులకు తెలుసునన్నమాట!

రా    : అయిన మరి యీ వాదన దేనికి?

కే    : ( ఒక ప్రక్క కోపము, మరొక ప్రక్కన ఆశ్చర్యము) నాకు తెలిసినంతవరకు ఒకటే దోషం కనిపించింది. అలాంటి దాన్ని మీ వంటి ఆచార్యులు ఉపేక్షించ దగింది కాదు. వెంటనే సవరించండి. 245

శి    : విచిత్రంగా వుంది.

జ    : ఓటమి అంగీకరిస్తున్నారా?

కే    : ఓటమా – దీనిని ఓటమి అంటారా ప్రభూ!

జ    : సరే దోషమంటే ఏమిటి?

కే    : మీరు ఏనిర్వచనం ప్రకారం రెండుదోషాలున్న వన్నారు.

జ    · ముందు మీరేకదా దోషమని ఉద్ఘాటించినది.

కే    : దోషమనేది ఒక ప్రత్యేక పదార్థంగా లేదు కేవలం దేశకాల ప్రాత నిర్ణీతమైన అనుభూతిని, శాస్త్రాన్ని అధిగమించి నిర్దిష్టప్రయోజనానికి విఘ్నం కలిగించే దాన్ని దోషమంటారు.

జ    : అయితే శాస్త్రాలన్నీ చదువుకొన్నారా?

కే    : (ఎత్తిపొడుస్తున్నట్టుగా భావించి) అబ్బే భూగర్భ వాస్తు శిల్పశాస్త్రాలు, షడ్దర్శనాలు, నాట్యశాస్త్రం మాకు అచుంబిత విషయాలు.

శి (ఒండొరులతో) శిల్పానికీ, నాట్యశాస్త్రానికీ సంబంధమేమిటి?

కం : జయము మహారాజా! ప్రతిష్ఠాసమయం సమీపిస్తూ వుందట పురోహితులు–

రా ఆచార్యా!

జ : చిత్తం ప్రభూ (కేదారునితో) ఇంతకూ ఏదోషమున్నదంటావు?

కే · మీకు వాదం కావాలా? లేక దోషం కావాలా?

కం : మహారాజా! ఎవరో మూడుకాళ్ళ ముసలి ఏలినవారి దర్శనం కోరుతున్నాడు.

రా : ముసలీముతుకకు ఇప్పుడు దర్శనం వీలులేదు.

కం : (జంకుతూ) కేదారకుమారుని చూడాలని కోరుతున్నారు.

జ : వారికి తోడ్పాటు కావాలేమో ప్రభూ?

కే : మీరు పెద్దలు కావచ్చును మీ మాటలు మాత్రం పసిపిల్లవాడి మాటలులాగా ఉన్నాయి.

రా : కాలం అతిక్రమించిపోతూవుంది (లోపలినుండి ఘంటా రావం వినిపిస్తుంది మధ్యమధ్య మంత్రాలు వినిపిస్తూ వుంటాయి ) అదిగో ముహూర్త మాసన్న మౌతూవుంది.



జ · ఇంతకూ దోషమేమో చెప్పలేదు. ఇప్పటికైనా మించిపోయినది లేదు. పసివాడువు ఇంకా జీవితాన్ని అనుభవించ వలసినవాడవు క్షమాపణ కోరుకో. నా మాటలు విను.

కే . ఇది మీ ఆస్థానానికి గౌరవమా?

శిల్పి : కేవలం వాత్సల్యం.

కే : ప్రభూ! వాదార్థిని అవమానించుట ధర్మమా?

రా : ఇది అవమానమా?

జ : రంధ్రాన్వేషీ, దోషమేమంటివి?

కే : అలా త్రోవకురండి. (మెల్లగా) శిలాదోషము.

రా : ఏమిటి?

కే : అవును ప్రభూ, ప్రతిష్ఠ చేయదలచిన విగ్రహంలో శిలాదోషమున్నది.

శిల్పి : శిలాదోషమా!

జ : (అర్ధనిమీలితలోచనుడై కొంతతడవు మాట్లాడక) ఊ – శిలాదోషమా

(మళ్ళీ గంటలు, మంత్రాలు వినిపిస్తాయి )

కం  మహారాజా! పురోహితులు తమదర్శనార్థం –

రా : ఆచార్య ప్రతిష్ఠ నేటికి ఆగవలసిందేనా?

జ : (నిబ్బరంగా) ముహూర్తం ఆగదు

రా : ఈ మీనమేషాలతో నాకు నిమిత్తం లేదు. (కేదారునితో) ఓయీ విపరీతవాదీ, నీవు పేర్కొన్న దోషాన్ని వెంటనే ప్రత్యక్షంగా చూపించగలవా? లేక –

కే : మంచిగంధాన్ని తెప్పించండి.

రా : ఎవరది?

కం : చిత్తం ప్రభూ!

జ : పురోహితుల నడిగి పూజార్థం తీసిన మంచిగంధాన్ని తీసుకొనిరా.

రా : ఇంత చిన్నతనంలోనే విరక్తి కలగటం విచిత్రం.

కే : విద్యుక్తధర్మం.

రా . (కనికరంతో) ఒకసారి నీకోసం వేచివున్న వృద్ధుని చూస్తావా?

కే : కృతజ్ఞుడను అప్పుడే మృత్యువు నా చాయలకు రాజాలదు.

శి : (నవ్వుతూ) వృద్ధు బయట కాపలా కాస్తున్నాడు

కే · (కోపంతో) నోరు జార్చుకొన్నంతమాత్రాన ప్రయోజనం లేదు. (కంచుకి గంధపు గిన్నెతో వస్తాడు )

జ : గంధం వచ్చింది. ఇక దోషం వెలువడవలసివుంది.

కే : అదెంతసేపు భాగ్యం. ప్రభూ, ప్రతిష్ఠచేయనున్న విగ్రహానికి గంధం పూయిస్తారా?

రా : మామూలుగా పూస్తే సరిపోతుందా?

కే · విగ్రహమంతటా సమంగా పూయాలి.

రా . ఎవరుఁా అక్కడ?

కం : చిత్తం ప్రభూ!

కే  లేదు. సేవకుల వల్లకాదు. మీ శిల్పుల చేత పూయించండి.

జ : వారు నీకు అన్యాయం చేయవచ్చును. వారు ఏ బొడ్డుదగ్గరనో లేక మరొక చోటనో తక్కువ పూయవచ్చును

కే  లేదు శిల్పుల చేతులు అలా వ్యభిచరించవు వారిపట్ల నాకు విశ్వాసమున్నది.

రా : శిల్పులారా, మీరు త్వరగా పొండి

కే గంధం ఆ విగ్రహంమీద ఆరీ ఆరకముందు నాకు తెలియచేయాలి

శి : అలాగే. (వారివెంట గంధపుగిన్నెతో కంచుకి వెళ్లతాడు బయటికి వస్తారు.)

1–శి : విచిత్రంగా వుంది.

2–శి : నిజంగా విగ్రహశిలలో దోషముంటుందంటారా.

3–శి : ఉండవచ్చునేమో.

1–శి : సరేకాని బొడ్డుదగ్గర తక్కువగంధం పూయమని ఆచార్యులు సెలవిచ్చారా?

2–శి : ఆచార్యులు అలాంటి నైచ్యానికి పూనుకోరు.

3–శి : మరి ఆమాట దేనికన్నారు?

1–శి : మరిదేనికన్నట్లు?

3–శి : విగ్రహ నాభిస్థానంలో దోషముందేమో?

1–శి : ఆచార్యులకు తెలుసునంటారా?

5–శి : ఏమో తెలిసి తెలిసి యీదోషాన్ని ఉపేక్షిస్తాడని నేననుకోను.

248 3–శి : మొదటినుంచి ఏదో దిగులుతో, పరధ్యానంతో ఉన్నట్లు కనిపిస్తున్నాడు.

1–శి : ఏది ఎలా ఉన్నా రాజు చండశాసనుడు

3–శి : ఎవరు ఓడినా ఫలితం భయంకరం

2–శి : బొడ్డుదగ్గర గంధం పూయకుండావుంటే?

1–శి : అన్యాయం.

3–శి : ఆచార్యులపట్ల అనజ్ఞ శిల్పధర్మాన్ని అతిక్రమించరాదు

2–శి : ఈ ఘోరాన్ని, చూస్తూ చూస్తూ చేయవలసినదేనన్న మాట!

3–శి : ఎవరి రక్తాన్నో చూడకతప్పదు. (వెళ్లిపోతారు)

రా : భూమి సూర్యునిచుట్టూ తిరగటం లేదు సప్తగ్రహాలు స్తంభించిపోయిన ట్లున్నాయి

జ : ఇప్పుడేకద శిల్పులు వెళ్ళినది. వారు గంధాన్ని పూయాలి ఆ మీదట ఆరాలి.

రా : ఏమో ప్రకృతి అంతా స్తంభించిపోయినట్లున్నది పవనం కూడా బంధించి నట్లున్నది భుజమదురుతూ వుంది.

జ : అది కుడి భుజం.

---

కం : ప్రభూ (ప్రవేశిస్తాడు)

రా : గంధం పూత ముగిసినదా?

కం : ఇప్పుడే పూర్తి అయినది. ఇక ఆరవలసి వుంది. ఏలినవారు...

రా : చేతులు నలువుకుంటున్నావు దేనికి?

కం : ఆ వృద్ధు ....

రా . చూట్టానికి వీలులేదని చెప్పలేదా?

కం · చెప్పాను ప్రభూ. .. మీ దారుణశాసనాన్ని ఆయనకు ఎవరో చెప్పినట్లుంది. వీరికోసరం ఆయన తహతహ పడుతూ వున్నాడు.

రా : (కేదారునితో) మీకు బంధువా?

కే : మా గురుదేవులు.

రా : అయితే వెంటనే తోడ్కొనిరా.

కే : వలదు ప్రభూ!

ˆజ : ఎందుకని?

కే : వారు వస్తే నేను వాదించటానికి వీలులేదు.

రా . అయితే ముందే యీ పని చేస్తే తీరిపోయేది ప్రతిష్ఠ పూర్తి అయిపోయివుండేది

జ : వారు మిమ్ము మందలించారా?

కే · అవును.

జ : అయితే గురు తిరస్కారానికి కూడ దిగారన్నమాట.

కే · ధర్మం శాసించినప్పుడు తప్పదు

కం · ఏలిన వారు ఏమని సెలవిస్తారు.

కే : ఈ వాదం తేలేటంతవరకు వారిని తీసుకొని రాకు.

కం : అంతేనా.

రా : మరిగత్యంతరం లేదు.

జ : శిల్పులు వస్తున్నారేమో చూడు.

కం . అదిగో ఇద్దరు వస్తున్నారు.

రా ఏమైనది?

కే :

జ : అన్ని చోట్ల ఆరిపోయినదా?

1–శి : అంతట గంధం ఆరిపోయినది

జ : నిజమే?

కే : ఎక్కడా చెమ్మ మిగులలేదా?

2–శి : ఎక్కడా మిగుల లేదు–

1–శి : ఒక్కనాభి కమలంలో తప్ప.

కే : ఆచార్య తేలిపోయినదా?

జ : (తలవంచుకొంటాడు.)

రా : ( ఆశ్చర్యంగా) ఏమి తేలినట్లు?

కే : శిలాదోషమున్నట్లు. (శిల్పులవంక తిరిగి) శాణంతో నాభి కమలంవద్ద తొలవండి.

శి : (రాజు వంక చూస్తారు.)

250 కే : ఆలస్యం దేనికి?

శి : అలాగే. (వెళ్ళిపోతారు.)

రా : (ఆతుతరతో వచారుచేస్తూ) నిజంగా దోషమే! లేదు, లేదు అలా ఎప్పటికీ జరగదు. లోకోత్తరశిల్పి శిలాదోషాన్ని గమనించకుండా ఉంటాడా? లేదు – లేదు. ఎవరురా అక్కడ? ఎవరూ పల్కరేం? ఆ దివ్యసుందర విగ్రహాన్ని వికలంచేయటమే! ఎవరది? (సమాధానం రాదు.) సమాధానంకూడ లేదు రాజు పిలిస్తే పలికేవాళ్ళకూడ లేరు.

జ : ఏమి ప్రభూ?

రా : ఆ విగ్రహాన్ని వికలం చేయటానికి వీలులేదు.

జ : ఇప్పుడెవ్వరూ ఆవలేరు

రా : ఆంధ్రసమ్రాట్టు ఆజ్ఞాపిస్తూవున్నాడు.

జ : ఆంధ్రసమ్రాట్టు ఆజ్ఞాపించడు – ఆజ్ఞాపించజాలడు.

రా : లేదు వల్లకాదు ఎవరురా అక్కడ?

జ : వీలులేదు ప్రభూ, ద్రోహం.

రా   లేదు. ఆ విగ్రహాన్ని విలకం చెయ్యటానికి వీలులేదు. ఇది సమ్రాట్టు ఆజ్ఞ. (ఉగ్రుడై) ఎవరురా అక్కడ?

కం : చిత్తం ప్రభూ.

రా : విగ్రహాన్ని తాకవలదని శిల్పులకు చెప్పు. పో, త్వరగా పో!

జ : ఏయ్-కంచుకీ, ఆగు.

రా : పో, త్వరగా పో!

కం : (నివ్వెరపడి చూస్తాడు.)

జ : ఆగు!

రా : (మండిపడుతూ) ఆంధ్రసమ్రాట్టు ఆజ్ఞాపిస్తూవున్నాడు.

జ : వీలులేదు. ఒక క్షణం ఆగు. ఆచార్యుడు కోరుతూ వున్నాడు.

రా : ధిక్కారమా, పో.

కం : తలారి దగ్గరకు పొమ్మందురా?

రా : ఏమి ఆ పొగరు!

కం : కాదు-ప్రభూ...

రా : ఆఁ! అంతవరకు వచ్చినదా? సరే తలారి దగ్గరకు పో – తరువాత శిల్పుల దగ్గరకు వెళ్లు.

జ : తలారిదగ్గరకు వెళ్ళినతరువాత శిల్పులదగ్గరకు వెళ్ళగలవా?

కం : ఏలినవారి సెలవైతే చాలు. మొండెమైనా శిల్పుల దగ్గరకు చేరుతుంది.

కే : ఏమి రాజభక్తి!

కం : అరుగో శిల్పులు.

1-శి : ప్రభూ, ప్రభూ!.....

రా : ఏమిజరిగింది?

2-శి : విగ్రమనాభివద్ద శాణంతో తొలిచాము.

3-శి : కప్ప ఎగిరి బయటపడ్డది.

2-శి : నీళ్లుకూడ ఉన్నాయి ప్రభూ!

కం : కప్ప,' కప్ప! కప్పబయటకు దూకింది! ప్రాణంతోవుందా?

3-శి : ప్రాణం లేకపోతే ఎలా ఎగురుతుంది?

కం : తలకోల్పోయిన నేను మాట్లాట్టంలేదా?

2-శి : నీకు తల ఎప్పుడుపోయింది?

కం : ఒక్కక్షణం క్రిందటనే

3-శి : నిజంగా నీకు తలలేనట్లుగానే వుంది.

రా : (క్రుంగిపోయి) ఇక కర్తవ్యం? (ఎవరు మాట్లాడరు) జక్కనాచార్యా!

జ : ఆచార్యపదం నాకికతగదు ప్రభూ.....

రా : ఇక కర్తవ్యం?

జ : శిల్పకోవిదులు చెప్పాలి.

రా : ప్రతిష్ఠకు మార్గాంతరం లేదా? ఈ మహోత్సవం భగ్నం కావాలసినదేనా? జనులు హతాశులై తిరిగిపోవలసినదేనా? గౌరవందక్కే మార్గం లేదా?

కే : ఏలినవారు సెలవిస్తే ఈ జ్యోతిర్లింగాన్ని-

రా : జ్యోతిర్లింగమా

కే : (ఉత్తరీయం కొంగున భద్రంగా దాచిన లింగాన్ని బయటికి తీసి) ఇదిగో ప్రభూ!

252

రా : (అందుకొని చూస్తూ) కన్నులు మిరుమిట్లు కొల్పుతూవుంది వత్సా ఇది నీవు చెక్కినదేనా?

కే : లేదు. మా అమ్మది వచ్చేటప్పుడు వలదన్న కొలదీ నా ఉత్తరీయం కొంగున ముడిచింది

రా : దీనిని నాకు ఇచ్చివేస్తావా? (జక్కనతో) ఆచార్యా, ఆచార్యా అంటే పలుకరు కాబోలు జక్కనాచార్యా, ఇది ప్రతిష్ఠకు పనికివస్తుందా? (జక్కనకు అందిస్తాడు.)

జ : (దానిని పరిశీలిస్తూ వుంటాడు. అతని చెక్కిళ్ళవెంట రెండు అశ్రుబిందువులు జారుతాయి.)

రా : (రిచ్చవోయి) ఆచార్యా, ఆరాచ్యా!

జ : (గాద్గద్యంతో) మీ అమ్మా యీ జ్యోతిర్లింగాన్ని చెక్కినది?

కే : అవును. నేను పుట్టకముందు చెక్కినదట.

జ ధన్యోస్మి, ధన్యోస్మి అయితే నీకిప్పుడు 18 సంవత్సరాల అయిదు మాసాల ఏడురోజులన్నమాట

కే : (ఆశ్చర్యంగా) మీకెలా తెలిసిందీ!

జ : ప్రభూ, కృతార్థుడను, ఇక మీ ప్రతిజ్ఞను చెల్లించండి

రా : (మాట్లాడడు)

జ · సంకోచం దేనికి ప్రభూ? రాజప్రతిజ్ఞ వృథాకారాదు.

కే : ప్రభూ....

జ : లేదు రాజప్రతిజ్ఞ తప్పటానికివీలులేదు. ఎవరురాఅక్కడ?

కం : చిత్తం ఏమిసెలవు?

జ : తలారిని పిల్చుకొనిరా.

కం : ఈ వార్త చెబుతాను ఈ మొండంమాత్రం ఇంతదూరం తిరిగి రాలేదు.

జ : అయితే వెంటనే పిలుపించు. (బయటికి వెళ్లుతాడు)

కే : ప్రభూ! ప్రభూ. మీ ప్రతిజ్ఞ పాటించ నవసరం లేదు. పాటించాలని నేను కోరటం లేదు

రా : రాజాజ్ఞ ఎప్పుడూ భగ్నంకాదు

కే : నేను ఒక్కవరం కోరవచ్చునా? 253

రా : ఆయన చేతులు తప్ప.

కే : ఈ జ్యోతిర్లింగాన్ని ఇవ్వటానికి వీలులేదు.

రా : కోరిన ధనం ఇస్తాను.

కే : డబ్బుతో నాకు నిమిత్తం లేదు.

కం : ఆ వృద్ధు వస్తూవున్నాడు.

తా : బాబా, బాబా, పలకవేమిరా? (గట్టిగా) బాబా, బాబా, నీవు సురక్షితంగా ఉన్నావా? ఎవరది (రక్తంలో కాలు జారి పడతాడు.) అబ్బ, ఇస్, ఎవరది, పలకరేం? ఈ అంధునితో మాట్లాడగూడదా? వార్ధకంతో పరిహాసమా! బాబా, బాబా, (కాలికి శరీరం తగులుతుంది.) బాబా, నువ్వు కాదుగదా! లేదు, నా మనుమడు అంతనిర్దయుడు కాడు. బాబా, బాబా, (శరీరాన్ని తడివి చూస్తాడు.) ఎవరది? క్రూరులు–

జ నిజంగా క్రూరుడను

తా ఎవరది – ఎవరది? బాబా!

కే ఓయ్, వస్తున్నా

జ : నేను (ఆయాసంతో) నేను గురూ!

తా . నేను ..నేను – భ్రాంతిపడ్డానా!

రా : అదేమి?

కే : రాజశాసనం

జ : ఈ కంఠాన్ని..... 18 సంవత్సరాల ఆరుమాసాల క్రితం విన్నారు

తా : ఏమన్నావ్. (చతికిలబడి శరీరాన్ని తడువుతూ) ఎవరది? మఖాదేవ్! (పెద్దగా) మఖాదేవ్? నువ్వేనా? నిజంగా నువ్వే?

మఖా : నేనే గురూ.

తా : (మొండిచేతులను తడివి పుచ్చుకుంటాడు. మఖాదేవుడు బాధపడుతాడు) ఈ రక్తమేమిటి?

మ : పవిత్రురాలైన భార్యను అవమానించినందుకు ఫలితం.

తా : బాబా, నువ్వే చేశావా? నీ తండ్రిచేతులు నరికించావా?



కే : (నిలువునా నీరై) నా.... తండ్రిగారా? నాతండ్రి చేతులనే నేను ఖండించానా? .... ద్రోహిని, గురుద్రోహిని ... (ముఖం కాసేపు చేతుల్లో దాచుకొంటాడు ) తాతయ్యా, నువ్వు చెప్పినది పుక్కిటి పురాణం కాదన్నమాట! అవును.... తాతయ్యా నీవు చెప్పినట్లు నా గురువుల చేతులను ఖండించాను. మహాపాపిని.

జ : వత్సా, ఏడువకు, కళావీరుడైన తండ్రి కొడుకునుంచి ఇంత కన్నా కోరదగిన దేముంది? నిన్ను కన్నందుకు ఈ జన్మం చరితార్థమైంది నాయనా కొలుకుల నీళ్లు తుడుచుకో, ధర్మాన్ని నీవు నిర్వహించావు. ఈనాటికి నా తపస్సు పండినది. ఏడువకోయ్, ఏడువకు, ఈ పవిత్ర సమయంలో నీ తండ్రి ఆనంది స్తూవున్నప్పుడు ఇది తగదు.

దా : (సమీపించి) జక్కనాచార్యులు మీకు పితృపాదులా.

తా : అవును. తండ్రి చేతులు కొడుకు నరికించివేశాడు. బాబా, సంతృప్తి లభించిందా?

జ : గురూ, చిరంజీవిని అంటే ఫలమేముంది? తండ్రి ఇంతకన్నా కోరుకోవల సింది ఏముంది?

తా : బాబా, ఎవరు గెలిచారు?

కే . (గాద్గద్యంతో) నేను గెలవలేదు

రా (సాహంకారంగా) గెలుపు మాది.

తా : బాబా, తెలిసినదా రాజుల చిత్తవృత్తి? ముఖాదేవ్, ఇక ఈ కొలువులో క్షణం సేపు నిలువవద్దు ఇంటికి వెళ్లుదాం పద.

జ : గురూ, గురూ, ఏ ముఖంతో వచ్చేది శిల్పశ్రీని ఎలా చూచేది?

తా . అల్లుని-చేతులు నరికించిన తండ్రి కూతురు ముఖం ఎలా చూస్తాడు?

కే : మహా-గురుద్రోహిని

తా : లెండి – తండ్రి కొడుకులు జయలుదేరండి

జ : నేను ఆమెముఖం చూడలేను. ఈ మొండి చేతులతో ఆమెను దర్శించలేను.

తా : నిర్దయుడా! ఇంకా ఆమె హృదయం అర్థం కాలేదా? ఎన్నో ఏండ్లనుంచి అలమటించి పోతూవుందే. ఆమె బ్రతకటం నీ కిష్టంలేదా? లే, బయలుదేరు. బాబా, దారిచూపించవూ?

రా · పూజ్యులారా, కరుణించండి. ప్రతిష్ఠ భగ్నం కావలసిందేనా?

తా : ఈ దరిద్రదేశం ఇలా ఉన్నంతకాలం రాజుల ప్రతిష్ఠకు భగ్నంలేదు. బాబా, ముఖాదేవ్, పదండి.

కం · ఆచార్యా– ఆచార్యా! నాతల.

ముఖా : రాజుగారి అదుపులోవుంది పుచ్చుకో, 

కే : (జ్యోతిర్లింగాన్ని తండ్రిరక్తంలో తడిపి) రాజా, ఇదిగో! నా పితృదేవుల రక్తంతో అభిషిక్తమైన జ్యోతిర్లింగం నీ క్రౌర్యాన్ని శాశ్వతంగా ప్రతిష్ఠించుకో, తాతయ్యా మనం వెళ్లుతున్నాము

తా : నీ తండ్రికి, నీ తాతకు దారిచూపించు.

(ముగ్గురూ వెళ్లుతూవుంటారు )

(రాజు, కంచుకి, శిల్పులు నిర్విణ్ణులై చూస్తూవుంటారు.)

శి · ఆదర్శశిఖరాలు వెళ్ళిపోతున్నాయి!
ఆంధ్ర శిల్పకళలు, జారిపోతున్నాయి!

(తెర)

*1943, జూలై*

# ప్రతిమ

(బాసుని కృతిని తెనుగు సేత)

## అంకితము

రూపక తత్త్వజ్ఞులు, మిత్రులు

# శ్రీనార్ల వెంకటేశ్వరరావు గారికి

కంటకమ్ము్మలు కసికాటు లందుచునున్న,
క్రోఁతిమూఁక గోడుగుడువుచున్న,
మాధుకరము ప్రాలుమాలక సాగించు
దేశికేంద్రుఁ డొకఁడె దిక్కుమాకు.

# తారహారము

సువిభక్త ముఖాద్యఙ్గైః వ్యక్తలక్షణవృత్తిభిః
పరేతోఽపి స్థితో భాసః శరీరై రివ నాటకైః
– అవన్తిసున్దరీ కథా–శ్లో

దండ్యాచార్యుఁడు చెప్పినది అక్షరాల సత్యము. భాసుఁడు నాటకశరీరమున అమరుఁడైనాఁడు.

ఈ భాసమహాకవి ఎప్పటివాఁడను ప్రశ్నకు తేటయైన జవాబు కాళిదాసునకు పూర్వుఁడనునది. "ప్రథిత యశసాంభాసకవిపుత్ర సౌమిల్లకాదీనాం ప్రబన్ధాన తిక్రమ్యవర్తమాన కవేః కాళిదాసస్య క్రియా మివమాం ద్రష్టుం కథం పరిషదోబహుమానః?" అను మాళవికాగ్నిమిత్రములోని పంక్తివలన కాళిదాసునాఁటికి భాసుని నాటకములు ఆసేతు శీతాచలప్రఖ్యాతములై యుండెనని తెలియుచున్నది. కాళిదాసుని కాలమును పాశ్చాత్య విమర్శకులు గుప్తరాజుల కాలముగా నిరూపించి క్రీ.శ 5,6 శతాబ్దులకు నెట్టివేసి మరల మాళవికాగ్ని మిత్రమునందలి భరతవాక్యముచే భ్రాంతులై క్రీ.పూ. 180కి వెనుకకు త్రోసిరి కాని విక్రమార్కుని సభాలంకారము కాళిదాసను సత్యమును మాత్రము తదితర చారిత్రకసత్యమునువలెనే వారంగీకరింపఁజాలకపోయిరి సముద్రగుప్త విక్రమాంకుఁడు రచించిన కృష్ణచరిత ప్రస్తావనలోని కవిప్రశంసాశ్లోకములవలన మృచ్ఛకటిక నాటకకర్తయైన శూద్రకుఁడే శకులను జయించి తన విక్రమమునకు చిహ్నముగా క్రీ పూ. 52 లో విక్రమశకము నేర్పరచెననియు, అతనికే విక్రముఁడను నామధేయమును గలదనియు అతని యాస్థానకవులగు రామిల, సోమిలు లాతని జీవితచరిత్రమును రచించిరనియు, అతని సభలోనే శాకుంతలాది నాటకత్రయకర్తయైన కాళిదా సుండెననియు విదిత మగుచున్నది (కృ.చ. ప్ర.శ్లో.6–16) కావ్యచతుష్టయ కర్తయగు కాళిదాసు తన కావ్యుఁడై, సచివుఁడై, అధ్వర విధియందు బ్రహ్మయై కాళిదాసుఁడని మహార్థనామము నందిన హరిషేణుఁడని సముద్రగుప్తుఁడు స్పష్టముగా చెప్పెను (కృ.చ.ప్ర శ్లో 23–28) దీనినిబట్టి భాసుని ప్రస్తుతించిన నాటక కర్తయైన కాళిదాసు క్రీ.పూ ప్రథమ శతాబ్దిలోని వాఁడని స్పష్టమగుచున్నది. సముద్రగుప్తుఁడు భాసుని మునికవులలో పతంజలి తరువాత ప్రస్తుతించెను (కృ.చ ప్ర శ్లో 22–27). భాసుని ప్రయోగములు పాణినీయమునకు లొంగవు "అయంచ నాన్వయాత్పూర్ణం దాక్షీపుత్ర పదక్రమమ్" అని సముద్రగుప్తేఁడే వచించెను పాణినీయమునకు ప్రభూత ప్రచారము భాష్యకారుని తరువాతనే క్రమముగా కలిగినది



ప్రతిమ

అంతకుముందు ఇంద్రవ్యాకరణము, తదనుసారియైన కాశకృత్స్న వ్యాకరణము బహుళ ప్రచారములో ఉండెను

అందుచేతనే దేవబోధుఁడు-

యా న్యుజ్జహార మాహేన్ద్రా
ద్వ్యాసో వ్యాకరణార్ణనాత్
పదరత్నాని కిం తాని
పన్తి పాణిని గోష్పదే?

అని చెప్పవలసి వచ్చినది. కనుక భాషాప్రయోగదృష్ట్యా భాసకవి పాణినీయప్రభావ మెక్కువకానికాలమునకుఁ జెందిన వాఁడనుట సువచము. భాసుఁడు కేరళదేశీయుఁడైన సంస్కృత కవి. అతని నాటకములు ఉత్తరభారతమునఁగూడ ప్రసిద్ధములగుటకు కొంత ఎక్కువకాలము పట్టియుండును. కాళిదాసు నాఁటికీ ప్రశస్తి మిన్నుముట్టియుండెను. ఈ పర్యాలోచనము వలన భాసుఁడు పతంజలి సమకాలముననో, సమనంతర కాలముననో దక్షిణభారతమున జన్మించియుండవచ్చునని ఊహింపఁదగియున్నది. ప్రతిభాస్ఫోరకములైన ఆతని నాటకములు రంగస్థలోపజీవులకు పోషకములై వారిచే అఖిలభారతవ్యాప్తి నందింపఁ జేయఁబడి యుండవచ్చును. 261

భాసునికంటె ముందు నాటకము లేవైన నుండియే యుండును. ''పారాశర్య లాలిభ్యాం భిక్షునట సూత్రయోః'' (పా. 4.3.110). ''కర్మన్ద కృశాశ్వాదినిః'' (పా. 4.3.111) అను పాణినిసూత్రములు నటులకు సంబంధించిన సూత్ర వాఙ్మయ మున్నట్టు సూచించుచున్నవి. '' ఆఖ్యాతోపయోగే'' (1-4-29) అను సూత్రముపై భాష్యములో ''ఆతశ్చోపయోగః, యదారమ్భకా రఙ్గం గచ్ఛన్తి నటస్య శ్రోష్యామః గ్రన్థికస్య శ్రోష్యామ ఇతి'' అను పంక్తులు రంగస్థలమును, నటులను, ప్రేక్షకులను సూచించుచున్నవి. కంసవధ, బలిబంధ నాటకములు పతంజలిచే పేర్కొనఁబడినవి. శైలూష శైలూషీ పదములు వేద పురాణేతిహాసములలో కనిపించుటనుబట్టియు, నాట్యశాస్త్రమున అమృతమథన, త్రిపుర దాహములు పేర్కొనఁబడియుండుటచేతను నాటకరచన, ప్రదర్శనము వైదిక కాలమునుండియే యున్నట్లు విదితమగుచున్నది. స్త్రీలే స్త్రీ వేషములు వేయుచుండిరి కాని పురుషులు స్త్రీ వేషము వేయుటనప్పుడప్పుడు జరుగుచుండెను. వారికి భ్రకుంసులని సాంకేతికనామ మేర్పడియుండెను. కాని భాసునికి పూర్వముండిన నాటకము ఒక్కటియు మనకు లబ్ధముకాలేదు. కాళిదాసుకాలమున ఆసేతుశీతాచలమును ప్రసిద్ధముగా ప్రదర్శింపబడిన భాసనాటకములుకూడ బహుకాల

---

జి.వి. కృష్ణరావు

మజ్ఞాతవాసముచేసి కదా బయటపడినవి! కాలగర్భమునుండి యెప్పుడేమి వెలువడి యేభావముల నెట్లు మార్చునో యెవ రూహింపగలరు?

సూత్రధార కృతారమ్భై
ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే
భాసో దేవకులై రివ.

పై శ్లోకమునుబట్టి భాసుఁడే నాటకములకు సూత్రధారునితో గూడిన స్థాపనకు ఆముఖముగా నలంకరించుట ప్రారంభించిన వాడఁని స్పష్టపడుచున్నది. అతఁడే సువిభక్తముఖాద్యంగముగా నాటకములను తీర్చిదిద్దినాఁడని దండి కొనియాడినాఁడు.

భాసనాటకములను పేర నేఁడు 8 నాటకవములును, 5 ఏకాంకవములును లభించుచున్నవి. కాని సముద్రగుప్తుఁడీతని రచనలనుగురించి యిట్లు సూచించెను.



''భాసమాన మహాకావ్యః
కృత విశంతి నాటకః
అనేకాంక విధాతాచ
ముని ర్భాసోఽభవ త్కవిః''

(కృ.చ.ప్ర శ్లో. 22)

దీనినిబట్టి భాసుఁడొకటి రెండు మహాకావ్యములను గూడ రచించియుండుననియు, నవి కాలగర్భమున లీనమ్మై యున్నవనియు నూహింపదగియున్నది. ఇతడు రచించినవి ఇరువది నాటకములట. అందు 8 మాత్రమే నేఁడు మన కందినవి అంకములనేకము రచించెనట. వానిలో 5 మాత్రమే మనము పొందఁగలిగినాము.

ప్రతిభావంతుడైన కవి ప్రాఁతమాటలనే సరికొత్తగా నుడువఁగలడు. ప్రాఁతకధలనే అద్భుతముగా వినిపింపఁగలడు భాసుడు రామాయణ భారత భాగవతములనుండియు, లౌకిక గాధలనుండియు ఇతివృత్తములను గ్రహించి తన కల్పనతో మలచి వానికి పరమాద్భుతరూపము లొసంగినాఁడు.

వాల్మీకి వైభవనిదర్శన మాదికావ్యం
రంగే నిదర్శిత మయం సురసం చకార
వ్యాసస్య భారత మభారతయా సుదర్శం
కృత్వాచ తత్ర వివిధాః స్వకథా యుయోజ

(కృ చ ప్ర శ్లో 25)

ప్రతిమ

అని సముద్రగుప్తుఁడు ప్రశంసించినాఁడు

భానుని లౌకిక గాథాత్మకనాటములు అవిమారకము, చారుదత్తము, ప్రతిజ్ఞాయౌగంధ రాయణము, స్వప్న వాసవ దత్తము. భాసుని చారుదత్తమునే శూద్రకుడు మృచ్ఛకటిక కాధారముగా గ్రహించినాడు. స్వప్న వాసవదత్తము కల్పనా విషయమున నపూర్వము, నద్భుతవమునైనది. ''స్వప్న వాసవ దత్తస్య దాహకోఽభూన్నపావకః'' అన్న రాజశేఖరకవిసూక్తి దాని ఘనతకు తార్కాణము.

భారత గాథాత్మకములలో ప్రస్తుతము పంచరాత్రమనున దొక్కటే నాటకము లభించుచున్నది. ఇందు కురు పాండవ దాయము రక్తపాతరహిత విప్లవముగా విచిత్రముగా సాధింపఁబడినది. కథ విరాటపర్వములోనిదే కాని మలుపులు భాసుని నిరుపమానశేముషీ విశేషోల్లిఖితములు. అరణ్యపర్వము మధ్యమ వ్యాయోగమునకును, ఉద్యోగ పర్వము దూతవాక్యమునకును, ద్రోణపర్వము దూత ఘటోత్కచమునకును, కర్ణపర్వము కర్ణభారమునకును, శల్యపర్వము ఊరుభంగమునకును ఇతివృత్తము నందించినవి. ఇవి యైదును ఏకాంకములు. దేని కదియే రసఖండమైనను ఊరుభంగము రసవత్తమము.

భాగవత కథాత్మకము బాలచరితము. శ్రీకృష్ణజననము నుండి కంసవధము వరకుఁగల కథ ఇతివృత్తము. గోపికలతో కృష్ణుని చిలిపితనముల కిందు తావులేదు. 263

మిగిలినవి రామకథాత్మక నాటకములు రెండు · అభిషేకము, ప్రతిమ. అభిషేకములో కిష్కింధ సుందరకాండల ఇతివృత్తమునకు ప్రాముఖ్యము. ప్రతిమలో అయోధ్య, అరణ్యకాండలకు ప్రాముఖ్యము. రెండును రామపట్టాభిషేక పర్యవసానములే. రాముడు, వాలి, సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుఁడు – వీరి పాత్రచిత్రణము అభిషేక నాటకమున అద్భుతముగా నడచినది రావణాంజనేయుల సంవాదము ప్రశంసనీయము.

భాసుని రామాయణ నాటకములలో ప్రతిమ రసవత్తరము. భరతుఁడు ప్రతిమా గృహములో దశరథుని ప్రతిమను చూచి ఘోరవార్త తెలిసికొనుట ఒక వింతసన్నివేశము. ద్వితీయ, తృతీయాంకములు కరుణరసమునకు పరాకాష్ఠలు. మాయామృగము తాపసి వేషమున నున్న రావణుఁడు శ్రాద్ధోపయోగి కాంచనమృగమును వర్ణించుటతోఁ బ్రవేశపెట్టఁబడుట యొక కల్పన సీతాపహరణవార్త తెలిపి నిందింపఁబోయిన భరతుఁడు కైకవమ్మవలన ఆమె నిజమైన యభిప్రాయము తెలిసికొని ఆమె యెడల తన దురభిప్రాయమును మార్చుకొని క్షమాపణ కోరుకొనును. దశరథునకుఁ గలిగిన శాపము అమలులోనికి వచ్చుటకై రాముని పదునాలుగుదినములు వనవాసము

పంపవలయునని యడుగఁబోయి పర్యాకుల హృదయయై పదునాలుగేండ్లని ఆమె యడిగి యుండెను. ఈ విధముగా ప్రేక్షకుల దృష్టిలో కైకేయి యెడల సానుభూతి ఏర్పడుచున్నది చతుర్దశవర్షానంతరము రావణవధ చేసి సుఖముగా సీతతో తిరిగివచ్చిన రాముని కైకేయియే అభిషేకము పొందుమని కోరగా అతఁడంగీకరించును.

భాసుని రచనలో ముఖ్యలక్షణములు రెండు. ఒకటి : పతంజలి వాక్యములవంటి చిన్న చిన్న వాక్యములు అవి మిక్కిలి సహజముగా సూటిగా శ్రోతల హృదయములఁ బ్రవేశించును. రెండు : రంగస్థలపార్యానుకూలమైన సులభ సహజసుందర శ్లోకరచన. ఈ రెండు లక్షణములును శ్రోతల నాకర్షించి రంగోపజీవులకు విజయము చేకూర్చి భాసనాటకములకు యావద్భారత వ్యాప్తి తెచ్చిపెట్టినవి

''రూపకక్రమ మస్యైవకవయోఽన్వయయు ర్బుధాః'' (కృ.చ.ప్ర.శ్లో.26) అన్నాఁడు సముద్రగుప్తుఁడు. అంతే కాదు. భాసుని పంక్తులు, భావములనే ఉపయోగించు కొన్నారు తరువాతికవులు.

''సర్వ శోభనీయం సురూపం నామ.'' – ప్రతిమ

-''కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్?'' – శాకుంతలము



''హృదయేనేహ తత్రాంగై ర్ద్విధాభూతేవ గచ్ఛతి
యధా నభసి తోయేచ చంద్రలేఖా ద్విధాస్థితా.'' – బాలచరితము

''గచ్ఛతి పురశ్శరీరం, ధావతి పశ్చా దసంస్థితం చేతః
చీనాంశుక మివ కేతోః, ప్రతివాతం నీయమానస్య'' – శాకుంతలము

''యస్యాం న ప్రియమండనాపి మహిషీ దేవస్య మండోదరీ
స్నేహాల్లుంపతి పల్లవాన్నచ పున ర్వీజన్తి యస్యాం భయాత్.'' – అభిషేకము

''నాదత్తే ప్రియమండనాపి భావతాం స్నేహేన యా పల్లవమ్.'' – శాకుంతలము

''కాష్ఠా దగ్ని ర్జాయతే మథ్యమానాత్
భూమి స్తోయం ఖన్యమానా దదాతి
సోత్సాహానాం నాస్త్యసాధ్యం నరాణాం
మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి.'' – స్వప్న వాసవదత్తము

''కాష్ఠంహి మథ్నన్ లభతే హుతాశం
భూమిం ఖనన్ విందతి చాపి తోయం
నిర్బంధినః కించన నాస్త్యసాధ్యం
న్యాయేన యుక్తంచ కృతంచ సర్వమ్'' – బుద్ధచరితము

ప్రతిమ

చారుదత్తము నుండి అనేక శ్లోకములు మృచ్ఛకటికమున ఈషద్భేదముతో గ్రహింపఁబడియున్నవి ''యత్నేకృతేయదిన సిద్ధ్యతి కోऽత్రదోషః?'' అను అవిమారకములోని సూక్తి లోకోక్తిగా స్థిరపడినది.

బాణుఁడు చెప్పినట్లు భాసనాటకములు బహుభూమికములు. ఉదా: బాలచరితములో 30, ప్రతిజ్ఞాయౌగంధరాయణమున 20, స్వప్న వాసవదత్తమున 16, ప్రకృతి ప్రతిమా నాటకమున 28. సువ్యవస్థితములైన పెద్దనాటకసమాజములకే యీ నాటకముల నిర్వహణము సుకరము

ప్రకృత ప్రతిమానువాదకులు మిత్రులు డా జి.వి.కృష్ణరావుగారి వైదుష్యము చిరవిదితము వారీ యనువాదమున కొంత ప్రత్యేకత చూపియున్నారు సాధారణముగా నాటకములలో భావావేశమును దెలుపుటకుఁ దప్ప ఇతర సందర్భములలో పద్యము రుచింపదు కాని సంస్కృతమాతృకలో కొన్ని సాధారణ సందర్భములకుఁగూడ శ్లోకములు రచింపఁబడియున్నవి వానిని వచనములోనే అనువదించి కృష్ణరావు గారు ఔచితిని పాటించిరి. కొన్ని యెడల ఔచితికి అపకర్షకములుగా కనిపించిన వాక్యములను బ్రాకెట్టులో నుంచినారు.

ఉదా . పు 7, 42, 51, ఇత్యాది డా. కృష్ణరావుగారి పద్యములను వాదమైనను తీగసాగినట్లుండును. పరిశీలింపుఁడు 265

''పాలిత సత్యులైన గురుపాదులపై ధనువెత్తువాడనో!
... ... ... ... ...'' పు. 12
''వీనికి దుర్యశమ్ము ... ... ...'' పు 38
''అర్ధమందుకొనఁగ నలయు పాణితలమ్ము ...'' పు. 55

ఇట్లెన్నియైనఁ జూపవచ్చును

ఇట్టి ఉత్తమానువాదము కావించి వాగ్దేవికి మఱొక పూజాపుష్ప మర్పించిన మిత్రులు డా.జి.వి. కృష్ణరావుగారినభినందించుచు రసజ్ఞులు దీని కుచితోపయోగము గల్గింతురని విశ్వసింతును. ప్రతిమకీ తారహారము నలంకరించు నవకాశమొసంగిన డా. కృష్ణరావు గారికి కృతజ్ఞుఁడను.

గుంటూరు యన్.సి.యస్. వేంకటాచార్యులు

21-6-1966 శతావధాని

---

# ప్రధమాంకము

( నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును )

సూత్రధారుఁడు : మహీసుతాభవుఁడు, సుమంత్రతుష్టుండు, భ
రత సలక్ష్మణుండు, రావణారి,
యప్రతిమ విభీషణాత్ముండు, సుగ్రీవ
రాముఁడు ప్రతిసర్గ మోముఁగాక!

(తెరవంకఁ జూచి) పూజ్యురాలా, యొకపరి యిటురమ్ము.

నటి : (ప్రవేశించి) ఆర్యా, యిదే వచ్చితిని.

సూత్ర : పూజ్యురాలా, యీ శరత్కాలమును గూర్చి పాడుము.

నటి : ఆర్యా, అట్లే (పాడును)

సూత్ర : ఈ కాలమున
కాశ కాశేయ తటినీ నివేశ హంసి
266 సమ్మదమ్మునఁ జరియించు సైకతముల-
(తెరలో) ఆర్యా, ఆర్యా!

సూత్ర : (ఆలకించి) ఆఁ, తెలిసినది.
అవనినాధుని సౌధమ్మునందు ముదిత
యగుచు సంభ్రమించెడు ప్రతీహారివోలె
(ఇరువురు నిష్క్రమింతురు)
ఇది స్థాపన

ప్రతిహారి : (ప్రవేశించి) ఆర్యా! కాంచుకీయు లెవరిక్కడ?

కాంచుకీయుఁడు : (ప్రవేశించి) అమ్మా, నేనే. ఏమి చేయవలె?

ప్రతి : ఆర్యా, దేవాసురసంగ్రామమున నప్రతిహత మహారధులైన దశరధమహారాజా లాజ్ఞాపించుచున్నారు.
రాకుమారులైన రామచంద్రుల పట్టాభిషేకార్థము శీఘ్రముగా సంభారములు సమకూర్చుఁడు.

కాంచు మహారాజాజ్ఞాపించినట్లు సర్వము సిద్ధము

ప్రతిమ

అదిగో ఛత్రము, చామరమ్ము లవిగో, యామూల భద్రాసనం,
బదిగో పుష్పరధమ్ము, నందిపటహ మ్మా క్రేవ, తీర్థోదకుం
భదడం బల్లదె, మంత్రిపౌరగణముల్ పర్యాప్తులై నిల్చి, ర
ల్లదె పూజ్యుండు వసిష్ఠ దేశికుఁడు నధ్యాసించె వేదీస్థలిన్

ప్రతి · సరే --

కాంచు . ఆహో, రామచంద్రుని పట్టాభిషేకముచే ప్రజలు కృతార్థులగుచున్నారు.

ప్రతి : అయ్యా, త్వరపడుఁడు.

కాం : అమ్మా, అట్లే. (నిష్క్రమించును)

ప్రతి : (ముందునకు నడచి అవలోకించి) అయ్యా, సంభవకా, సంభవకా! మహా రాజుల మాటగాఁ జెప్పి పూజ్యులైన పురోహితులనుగూడ యథోపచారములచేఁ ద్వర పెట్టుఁడు. (మఱొక చోటికిఁ బోయి) సారసికా, ఓ సారసికా! నీవు సంగీతశాలకుఁ బోయి యీ శుభసమయమున కనుగుణమైన నాటకముతో సన్నద్ధులై యుండుఁడని నాటకీయులకు విన్నవింపుము. ఈలోన నేనును బోయి సర్వము సిద్ధమని మహారాజులకు నివేదింతును. (నిష్క్రమించును.) 267

(వల్కలము పట్టుకొని యవదాతిక ప్రవేశించును )

అవదాతిక : అబ్బా, యెంతకష్టము! నవ్వులాటకై నారచీర నపహరించి తెచ్చుచున్న నాకే యింత భయము కలుగుచున్నదే, పేరాసతోఁబరధన మపహరించు వారి కెట్లుండునో? ఎకసక్కె మాడవలయునని యుబలాటము. ఒంటరికత్తెకది యెట్లు సాధ్యము?

(సపరివారముగా సీత ప్రవేశించును)

సీత . (చేటితో) ఓసీ, చూడు, అవదాతిక వెల వెలఁ బోవుచున్నట్లున్నది. కారణమేమో?

చేటి . అమ్మగారూ, పరిజనము సులభముగాఁ దప్పు చేయును గదా! ఈమె యేదో తప్పిదము చేసియుండును

సీత లేదు లేదు ఎకసక్కెమాడఁగోరుచున్నట్లున్నది

అవ (సమీపించి) అమ్మగారికి జయము! నేను నిరపరాధను.

సీత . నిన్నెవరు ప్రశ్నించిరే యవదాతికా? ఆ చేతిలోని దేమి?

అవ . అమ్మా, యిది నారచీర.

సీత : ఏల తెచ్చితివి?

అవ : రంగాలంకరణము ముగిసిన వెనుక నశోకకిసలయమొక ట్మని నేపాథ్యపాలిని రేవమ్మగారినడిగితిని. ఆమె యిచ్చినది కాదు దానికి తగినశాస్తి జరుపవలెనని దీనిని దెచ్చితిని.

సీత : తప్పుచేసితివి, పోయి యిచ్చిరా.

అవ : అమ్మా, నవ్వులాట కొనర్చినవని.

సీత : పిచ్చిదాన! తప్పు లిట్లే పెంపొందును వెళ్ళి యిచ్చిరా.

అవ : చిత్తము. (వెడలఁబోవును)

సీత : ఓసీ, యిటురా....

అవ : (వచ్చి) అమ్మా!

సీత : ఇది నాకుఁగూడ నందముగా నుండునా?

అవ : చక్కనివారి కన్నియుఁ జక్కగానే యుండును. కట్టుకొనుఁడు

సీత : తెమ్ము. (తాల్చి) ఓసి, యిప్పుడెట్లున్నది?

 అవ : మీకుచాల బాగున్నది. నారచీర బంగారుచీరయైనది.

సీత : (చేటితో) ఏమే నీవు మాటాడవు?

చేటి : మాటతో నేమి? ఈ మేని గగ్గురులే చాటుచున్నవి.

సీత : ఓసీ, అద్దము తెమ్ము.

చేటి : చిత్తము, (పోయివచ్చి) అమ్మా, యిదిగో యద్దము.

సీత : అద్దమట్లుండనిమ్ము, (చేటిముఖముచూచుచు) ఏదో చెప్పఁదలచినట్లున్నావు?

చేటి : అమ్మా, ఒకమాట వింటిని. కంచుకి బాలాకయ్యగారు, 'అభిషేక మభిషేక' మనుచున్నారు.

రెం చే : (ప్రవేశించి) అమ్మా, ప్రియవార్త! ప్రియవార్త!

సీత : ఎందులకే యంత యుబలాటము?

రెం చే : రాకుమారులకు పట్టాభిషేకము

సీత : మామగారికిఁ గుశలమేకదా?

రెం.చే : వారే స్వయముగా నభిషేకము జరిపించుచున్నారు

సీత : ఇది రెండవ శుభవార్త. ఒడి పట్టుము.

ప్రతిమ

రెం చే · చిత్తము ( ఒడిపట్టును సీత తన యాభరణములను ఒలిచి యిచ్చును.)

చేటి · అమ్మా, నగారా మ్రోఁతవలెనున్నది!

సీత : అవును, అదే.

చేటి . ఒకసారి మ్రోగి యాఁగిపోయినది.

సీత : అభిషేకమున కాటంకమేమి కానోపునో! రాచనగరుల బహువిశేషములు పొడముచుండునుగదా!

చేటి . అమ్మా, రాకుమారునకు పట్టాభిషేకము గావించి మహారాజులు వనమున కేగుదురని వింటిని

సీత : అట్లేనియది యభిషేకోదకముగాదు – ముఖోదకము *

(రాముఁడు ప్రవేశించును)

రాము · (తనలో) మంగళతూర్యములు మొరయుచున్నవి. గురుజనము వచ్చి కూర్చున్నది భద్రపీఠముననేనుంటిని మూఁపుల పైకెత్తి వంచుచున్న కలశముల ముఖముల నుండి తీర్థజలములు జాలువాఱుచున్నవి ఆ సమయమున మహారాజా నన్నుఁబిలచి పంపివైచెను. అప్పటి నా నిబ్బరమునకు జనము విస్మితి పొందెను. తండ్రిమాటను కొడుకు పాలించినచో విస్మయ మందవలసిన దేమున్నది? ''వత్సా, యభిషేకమిప్పటికి విరతమగుఁగాక,' యని మహారాజా స్వయముగా నన్ను వీడుకొలువ నా మనస్సున భారము తొలఁగినట్లైనది అదృష్టవశముననే నెప్పటియట్లు రాముఁడనే. మహారాజా మహారాజే. (ప్రకాశముగా) ఇదిగో సీతను దర్శింతును. 269

అవ · రాకుమారులు వచ్చుచున్నారు. నారచీర యట్లేయున్నది.

సీత · ఆఁ, ఆర్యపుత్రులే! (లేచి) ఆర్యపుత్రులకు జయము!

రాము . మైథిలీ, కూర్చుండుము

సీత : అట్లే (కూర్చుండును)

అవ · అమ్మా, రాకుమారులవేష మప్పటిదే అదియబద్ధమేమో?

సీత అట్టివారు అబద్ధమాడరు. రాజాంతఃపురముల బహువృత్తాంతకలితములు గదా!

రాము మైథిలీ! యేమి చెప్పుకొనుచున్నారు?

---

* ముఖప్రక్షాళనోదకము

సీత · ఏమియులేదు, 'అభిషేక మభిషేక'మని చేటి చెప్పుచున్నది.

రాము : నీ కుతూహలము బోధపడినది. అభిషేకవార్త యధార్థమే గురుజనామాత్య ప్రభృతుల సమక్షమున మహారాజాకోసల రాజ్యావాసుల సంక్షిప్తసమావేశము జరపి పిన్ననాఁటి చనవుచేఁ దొడపై నన్ను గూర్చుండఁ బెట్టుకొని మాతృ గోత్రము స్పష్టముగా సంబోధించి రాజ్యము గ్రహింపుమని పలికెను

సీత : అప్పుడార్యపుత్రు లేమనిరి?

రాము : ఏమంటినని నీ యూహ?

సీత . ఇంచుకయు మాఱాడక నిట్టూర్చి మహారాజుపాదములపై నార్యపుత్రుఁడు వ్రాలె ననుకొందును.

రాము . చక్కగా నూహించితివి. ( తుల్యశీలురగు దంపతులరుదుగా నుందురు ) తండ్రిగారి పాదములపైఁ బడితిని. పైనుండి స్రవించు వారి బాష్పములతోఁ గ్రిందికిఁజాలువాఱు నా యశ్రువులతో నేకకాలమున నా శీర్షము, వారి పాదములుఁదడిసినవి.

సీత తరువాత?

రాము అప్పుడు నేను వారి యనునయవాక్యముల కంగీకరింపనైతిని వారు తమ యాసన్నజరాదోషములగు ప్రాణములపై నొట్టిడిరి

సీత · తరువాత తరువాత?

రాము . లక్ష్మణశత్రుఘ్ను లభిషేకఘటములుగైకొనిరి కన్నీరునించుచు మహారాజులు స్వయముగా ఛత్రముఁబట్టిరి. ఇంతలో తొందరగా మంథర వచ్చి మహారాజుల చెవిలో నేమియో చెప్పెను నేను మహారాజును గానైతిని

సీత : ఇదే నాకుఁబ్రియము మహారాజులు మహారాజులే, ఆర్యపుత్రు లార్యపుత్రులే

రాము : మైథిలీ, నగ లేల తీసివైచితివి?

సీత · లేదు, లేదు – ఇప్పుడే ధరింతును.

రాము ఇంతకుమున్నే తీసియుందువు. భుగ్నములైన కర్ణపాశములు, గౌరవతములైన ముంజేతులు, ఒకరవులు దొలఁగని యంగములు చాటుచునే యున్నవి.

సీత . మాట నెగ్గించుకొనుటలో ఆర్యపుత్రులు సమర్థులు

రాము అలంకరించుకొనుము నేను దర్పణము పట్టుకొందును అద్దమున పల్కల ములట్లు గనిపించుచున్నవి ఇవి సూర్యకిరణములా? ఆఁ, నవ్వుచేతనే గ్రహించితిని ఇది క్రీడయా, వ్రతదీక్షయా? అవదాతికా, యేమిది?

అవ  దేవా! అందముగా నుండునా లేదా యని చూడఁగోరి దేవిగారు ధరించిరి

రాము  మైథిలీ, యేమిది? ఇక్ష్వాకు కులవృద్ధుల యలంకారము ధరించితివా? మాకును ప్రియమే, తెమ్ము.

సీత  వలదు వలదు ఆర్యపుత్ర లమంగళ మాడఁదగదు.

రాము : మైథిలీ, యేల వారింతువు?

సీత : అభిషేక మాఁగిపోయిన యీ సమయమునవి యమంగళ ప్రదములట్లు తోఁచుచున్నవి

రాము : పరిహాససమయమున మనస్సును గష్టపెట్టుకొనకుము. నీవు ధరించినప్పుడే నా యర్ధశరీరము ధరించినది (తెరలో) అయ్యో, మహారాజా, మహారాజా!

సీత : ఆర్యపుత్రా, యేమది?

రాము : (విని) స్త్రీ పురుషులు గొల్లుమనుట మూలమునకే ముప్పువచ్చినట్లు. అదేమో వెంటనే తెలిసికొనుఁడు.

కాంచు : (ప్రవేశించి) రక్షింపుము కుమారా రక్షింపుము.

రాము . ఎవరిని? 271

కాంచు : మహారాజును.

రాము · మహారాజునా? అట్లయిన నేకశరీర సంక్షిప్తమగు పృధి వినని చెప్పుఁడు ఈ విపత్తి యెవరివలన?

కాంచు . స్వజనమువలన.

రాము . స్వజనమువలననా? కటకటా! ప్రతీకారమే లేదు. పగవాఁడు శరీరమున మొత్తును. స్వజనము హృదయమున మొత్తును ఇంత సిగ్గుచేటుగానున్న యీ స్వజనశబ్ద వాచ్యులెవరు?

కాంచు · పూజ్యురాలు కైకమ్మగారు.

రాము  ఏమి, అమ్మగారివలననా? అయిన నది శుభోదర్కమే కావలయును

కాంచు · అదెట్లు?

రాము  భర్త యింద్రసమానుఁడు. నేను పుత్త్రుఁడను ఆమెకుఁ గోరఁదగినది యేమి యుండును? అకార్యమున కేల యొడిగట్టును?

కాంచు  కుమారా, కుటిలములగు స్త్రీ బుద్ధులందు నీ ఋజభావ మారోపింపకుము అమె మాటలవలననే కదా నీ యభిషేక మాఁగిపోయినది?

---

రాము : ఆర్యా, అందు మేలే కలదు

కాంచు . అదెట్లు?

రాము : మహారాజునకుఁ దపోవనగమనము తొలఁగినది తండ్రిచాటు బిడ్డనై నేను బాల్యమనుభవింతును ప్రజలకు నవభూపతి శంకగలుగదు విశేషించి నా సహోదరులు పరిభోగవంచితులు గారు

కాంచు : పిలువని పేరంటమునకు వచ్చి భరతునకు రాజ్యాభిషేకము గావింపుమని యామె పలికినది. అందులోభము లేదా?

రాము : ఆర్యా, నాయందలి పక్షపాతమునఁ బల్కుచున్నారేకాని సత్యమును గుర్తింప కున్నారు. ఓలిగాఁబడసిన రాజ్యమును పుత్రార్థమై కోరినచో నామెలో లోభమున్నది! సోదరుల రాజ్య మపహరించు నాకుమాత్రము లేదు!

కాంచు : మఱి.....

రాము : ఇంక మాతృదూషణము నే వినఁదలఁచుకోలేదు. మహారాజు వృత్తాంతము చెప్పుఁడు

272 కాంచు : అప్పుడు శోకాతిశయముచే మాటాడలేక మహారాజు హస్తసంజ్ఞచేతనే నన్ను బంపెను. అభిమతమేదియో యుండును. అంతలోనే యాయన మూర్ఛిల్లెను

రాము : ఎట్టెట్టూ, మూర్ఛిల్లెనా?

(తెరలో)

"ఎట్టెట్టూ, మూర్ఛిల్లెనా" యనియా? రాజమోహము సహింపనో, దయను వీడి ధనువందుకొమ్ము.

రాము : అక్షోభ్యమైన లక్ష్మణార్ణవము నెవరో కలఁచిరి. (అతఁడు కోపించెనా నూర్వురపెట్టు )

లక్ష్మణు: (ప్రవేశించి) "ఎట్టెట్టూ, మూర్ఛిల్లెనా" యనియా? రాజమోహము సహింపవో, దయను వీడి ధనువందుకొమ్ము మృదుల స్వభావుని నెల్లవారు నిట్లే పరిభవింతురు మీకు రుచింపదేని నన్ను వదలుఁడు. మనలను వంచించిన యీ లోకమును యువతీరహితము గావింతును

సీత : శోకింపవలసిన యీ సమయమున సౌమిత్రి విల్లందుకొన్నాఁడు ఎన్నఁడును లేని యీ సంరంభ మేమి?

రాము : సుమిత్రానందనా, యేమిది?

లక్ష్మణు: ఏమా? క్రమప్రాప్తమగు రాజ్య మవహృత మగుచున్నది నృపుఁడో శోచ్యావస్థలో నున్నాఁడు ఇప్పుడును సందేహమా? ఇది క్షమయా, సంకల్ప రాహిత్యమా?

రాము : సౌమిత్రీ! నా రాజ్యభ్రంశమే నీకుఁ బనిపెట్టుచున్నచో. నీవు పసివాఁడవు. భరతుఁడు రాజైనను మేమైననునొక్కటే నీకుఁ జావనైపుణ మున్నదందువేని రాజగుభరతునిఁ గాచుకొనియుండుము.

లక్ష్మణు. అలుక నాఁపుకోఁజాలనైతిని. కానిండు, వెళ్ళుచున్నాను. (బయలుదేఱును)

రాము : నిటలతటీస్థితమైన లక్ష్మణుని వికటభ్రుకుటి విధివలె ముల్లోకములను దహించునట్లున్నది సుమిత్రానందనా!

లక్ష్మణు: ఆర్యా! (దాపునకు వచ్చును)

రాము : నీకు నిబ్బరము గలిగింపఁ జెప్పుచున్నాను. ఇప్పుడు చెప్పుము:

పాలిత సత్యులైన గురుపాదులపై ధను వెత్తువాఁడనో?
ఓలిధనమ్ము పుచ్చుకొనుచున్న పవిత్ర సవిత్ర మూర్తిపైఁ
గోలను బుత్తునో? భరతుఁ గూరిమిసోదరు దోషబాహ్యునిన్ 273
గూలుతునో? యెడంద రుచిగొల్పునదెయ్యది యీ త్రయంబునన్?

లక్ష్మణు: నన్నెఱుంగక యుపాలంభించుచున్నారు. మహాక్లేశముల కాస్పదమగు రాజ్య మెవ్వరు గోరుచున్నారు? ఆర్యుఁడు పదునాలుగేండ్ల రణ్యమున వసింపవలెనఁట!

రాము : కావుననే కాఁబోలు తండ్రిగారు మూర్ఛిల్లిరి. అహో, అశక్తత ప్రస్ఫుటమైనది. (సీతను జూచి) మైథిలీ, మంగళార్థముగా నీమె యొసంగిన వల్కలములిటు దెమ్ము. అన్య నృపులు తొడఁగి యాచరింపని ధర్మ మాచరింతును.

సీత : ఆర్యపుత్రులు స్వీకరింతురుగాక.

రాము : మైథిలీ, నీ పూనిక యేమి?

సీత : మీకు సహధర్మచారిణిగదా!

రాము : ఒంటరిగాఁగదా వెడలవలసినది!

సీత : కనుకనే మీవెంట వత్తును

రాము : వసింపవలసినది యరణ్యమున.

సీత : అదియే నాకుఁ బ్రాసాదము

---
జి వి. కృష్ణరావు

రాము : అత్తమామలకు సేవ చేయవలసియున్నది

సీత : వారికై దేవతలకు నమస్కరింతును

రాము లక్ష్మణా, యీమెను వారింపుము

లక్ష్మణు: మెచ్చఁదగుపట్టున నీమెను వారింప మనసుగొల్పకున్నది రాహుపీడ యందును తార చంద్రుని ననుసరించుచున్నది కూలుచున్న వృక్షముతోఁ గూడలత భూమిపైఁ బడుచున్నది. పంకలగ్నమైన గజేంద్రమును గరేణువు విడువకున్నది. మిమ్మనుసరించుచు నీమె ధర్మ మాచరించును. స్త్రీలు భర్తృ నాథలు గదా!

చేటి (ప్రవేశించి) అమ్మగారికి జయము! నేపథ్యపాలిని రేవమ్మగారు ప్రణామపూర్వ కముగా నివేదించుకొనుచున్నారు. 'అవదాతిక సంగీతశాలనుండినారచీరలను జించుకొని వచ్చినది ఇవిగో మతికొన్ని వాడని నారచీరలు, అక్కఱకు వచ్చుఁగాక.'' అని.

రాము : భద్రురాలా! తెమ్ము. ఈమె సంతుష్ట మే మర్థులము.

274 చేటి : రాకుమారు లనుగ్రహింతురుగాక ( ఇచ్చి నిష్క్రమించును రాముఁడు వానిని గ్రహించి ధరించును )

లక్ష్మణు: ఆర్యుఁడను గ్రహింపవలె వస్త్ర భూషణమాల్యాదులందు సగమిచ్చుచుండు మీరు నారచీరను నేఁడొక్కరే ధరించుచున్నారు. ఇదేమి న్యాయము?

రాము : మైథిలీ, యీతని వారింపుము.

సీత : సౌమిత్రీ, విరమించుకోవయ్యా!

లక్ష్మణు: అమ్మా, గురుపాదుల శుశ్రూషను మీ రొక్కరే చేయఁగోరుచున్నారా? దక్షిణ పాదము మీకు, సవ్యపాదము నాకు

సీత : ఆర్యపుత్రు లనుగ్రహింపుఁడు సౌమిత్రి సంకటపడుచున్నాఁడు.

రాము : సుమిత్రానందనా! వల్కలము తపస్సంగ్రామకవచము, నియమగజాంకుశము, ఇంద్రియాశ్వఖలీనము, ధర్మరథసారథి , గ్రహింపుము.

లక్షణు · అనుగృహీతుఁడను. (గ్రహించి ధరించును)

రాము . ఈ వృత్తాంతము విన్న పౌరులతో రాజమార్గము క్రిక్కిఱిసిపోయినది ఓసరిల్లుఁడు, ఓసరిల్లుఁడు

లక్ష్మణు ముందునేనరిగెదను. తొలఁగుఁడు, తొలఁగుఁడు.

రాము : మైథిలీ, మేలిముసుఁగు తొలఁగింపుము

సీత : అట్లే (తొలఁగించును)

రాము : బాష్పకలుషితముఖులైన యో పౌరులారా! యజ్ఞమున, వివాహమున, వ్యసనమున, వనవాసమున స్త్రీలను దర్శించుట దోషముగాదు ఈకలత్రమును స్వైరముగాఁ బరికింపుఁడు.

కాంచు : (ప్రవేశించి) కుమారా వలదు వలదు – వెడలి పోవలదు.

అగ్రజస్నేహి లక్ష్మణుం డనుగమింప
నతివతో నీవు వనవాస మరుగువార్త
నృపుఁడు విని జీర్ణకాననద్విపముభాతి
లేచి వచ్చు క్షోణీరేణులిప్తుఁ డగుచు.

లక్ష్మణు: ఆర్యా!

చీరమాత్రోత్తరీయముల్ చెరివి విపిన
మేగు మాయందు వీక్షింప నేమి గలదు?

రాము : మేమిచటు వాసిపోయినమీఁద భనమి
జాని కనుఁగాక మా శిరఃస్థానములను



(ఎల్లరు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము

# ద్వితీయాంకము

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచు ఓహో ద్వారరక్షణ నియుక్తులారా! మీ మీ స్థానములం దప్రమత్తులరై యుండుఁడు.

ప్రతి : (ప్రవేశించి) అయ్యా, ఇదేమి?

కాంచు : సత్యవాక్యరక్షణపరుఁడైన మహారాజు అరణ్యమునకుఁ బోవుచున్న రాముని వారింపఁజాలక పుత్త్రవిరహశోకాగ్ని సందగ్ధహృదయుఁడై యున్మత్తునివలెఁ బ్రలాపించుచు సముద్రగృహమునఁ బరుండియున్నాఁడు. ఆయన

ప్రలయవేలాచల న్మేరుపర్వతమ్ము
వోలెఁ, గాలాంతశుష్యదంభోధి భంగి,
విగత తేజఃపత ద్భానుబింబ మట్లు
పొలుచు శోక శిథిలదేహబుద్ధి యగుచు.

ప్రతి : అయ్యయ్యో, మహారాజున కెట్టి దురవస్థ వాటిల్లినది!

276 కాంచు : (కలయఁజూచి) ఆహో! రామచంద్రుఁడు వెడలిపోయినది మొదలుకొని యీ యయోధ్య శూన్యమైనట్లుకానవచ్చుచున్నది. ఏలయన-

కవణముమాని సింధురనికాయము కన్నుల నీరునించు, సైం
ధవములు హేషలందొఱఁగు, దైన్యముదోఁపగ నోగిరంబునన్
జవిసెడి బాలవృద్ధలలనాజన మేడ్పు విదాహివేదనా
రవము సదారసోదరుఁడు రాఘవుఁడేగిన త్రోవ సూచుచున్.

నేనుగూడ నిప్పుడే మహారాజు సన్నిధి కేగెదను. (ముందునకుఁబోయి పరికించి) సుదుస్సహమగు పుత్త్ర విరహసంభవదుఃఖము నిగ్రహించుకొని తమకుఁదామే యూఱటపొందుచు మహాదేవియు, సుమిత్రాదేవి యును మహారాజుల యొద్ద నున్నారు అహో యెంతటి కష్టదశ! అదే మహారాజు

పేరెలుంగు దోఁప విలపించు, హాహార
వమ్మునించు, నుదిలపడుచు లేచి
లేచి పడును, స్రుక్కి లివదక్కి రఘుకుల
దీపకమ్ము చన్న దిక్కు సూచు.

(నిష్క్రమించును)

ప్రతిమ

ఇది మిశ్రవిష్కంభము

( యథానిర్దిష్టముగా ఇరువురు దేవేరులతో రాజు ప్రవేశించును )

దశరథ · తండ్రీ, రామా, జగన్నయనాభిరామా! కుమారా, సర్వలక్షణగాత్రా, లక్ష్మణా! భర్తృనిహిత చిత్తవృత్తీ, మైథిలీ! అయ్యయ్యో, నాబిడ్డ లడవిపాలై పోయిరి అహో చిత్రము! భ్రాతృస్నేహముచేఁ బితృస్నేహము దిగనాడిన లక్ష్మణునిఁ జూడవలెనని యున్నది. అమ్మా, వైదేహీ! రాముఁడు పరిత్యజించెను లక్ష్మణుఁడు గర్హించెను అపకీర్తిభాజనమైన నన్ను నీవును వదలిపోయితివా? తండ్రీ, రామా! వత్సా, లక్ష్మణా! తల్లీ, వైదేహీ! బిడ్డలారా, ప్రతివచనమిండు అహో, శూన్యము! ఎవ్వరును నాకు బదులు చెప్పరేమి? కౌసల్యానందనా! యెచ్చటనోయి?

సత్యసంధ, జితక్రోధ, సాధుభావ
విగతమత్సరా, యో జగత్ప్రియ, గురుజన
సేవనాసక్తచిత్త, సౌశీల్యధామ
బదులు నాతోడ నొకసారి పలుకవన్న!



సర్వజన హృదయ నయనాభిరాముఁడైన రాముఁడెక్కడ? పితృవాక్యపరిపాలకుఁడెక్కడ? శోకార్తానుకంపనుఁడెక్కడ? రాజ్యైశ్వర్యమును దృణప్రాయముగానైన లెక్కసేయని కుమారుఁడెక్కడ? రామా, ముదుసలి తండ్రినైన నన్నువదలి యసంబద్ధమైన ధర్మము నీవేల యాచరింపవలయును? అహో, యెంత కష్టమెంత కష్టము!

భాస్కరుని చందమున రామభద్రుఁ డరిగె,
భాస్కరుని వెంట దివసమ్ముభాతి లక్ష్మ
ణుం డనుగమించె, నకట భాను దివసావ
సానముల ఛాయవలె సీత కానఁబడదు.

మున్నె సంతానహీనుగా నన్ను, నన్య
భూమిపాలపుత్త్రకునిగా రామచంద్రుఁ
గారడవిలోని బెబ్బులిగాఁగఁ గైక
నకట! చేయపై తేల? కృతాంతహతక!

కౌసల్య · ( ఏడ్చుచు) మహారాజా, మిక్కిలిగా దురపిల్లుచు బాధపడకుఁడు ప్రతిన తీఱఁగానే కొడుకులు, కోడలు తప్పక కనిపింతురు

దశ · నీ వెవతెవు?

కౌసల్య కొడుకునుగన్న గొడ్రాలను

దశ ఏమేమీ, సర్వజన హృదయనయనాభిరాముని తల్లివగు కౌలస్యవా?

కౌసల్య . అవును మహారాజా! ఆ మంద భాగ్యురాలను నేను

దశ రామునిఁ గడుపారఁగన్న నీ వుత్తమురాలవు. ప్రబలదుస్సహజ్వాలనతులమైన యీ దుఃఖమును ఇంద్రియ పాటవము గోల్పోయిన నేను సహింపలేను - సంహరింపను లేను. (సుమిత్రనుజూచి) ఈ రెండవయామె యెవరు?

కౌసల్య : మహారాజా! లక్షణ....

దశ . (తొందరగాలేచి) లక్ష్మణుఁడా? ఎక్కడెక్కడ? కనిపించుటేలేదు అహో కష్టము!

(ససంభ్రమముగా లేచి దేవేరు లిరువురును రాజును బట్టుకొందురు.)

278 కౌసల్య : మహారాజా! లక్ష్మణకుమారునితల్లి సుమిత్రయని చెప్పఁబోయితిని

దశ · ఓ సుమిత్రా, అహోరాత్రము వనమున రఘు కులశ్రేష్ఠుఁడైన రాముని నీడవలె వెన్నాడుచున్న నీ పుత్త్రుఁడు సత్పుత్త్రుఁడు.

కాంచు : (ప్రవేశించి) మహారాజానకు జయము! సుమంత్రులవారు వచ్చియున్నారు.

దశ : (త్వరితముగా లేచి) రామునితోడనా?

కాంచు : కాదు, రథముతో

దశ · వట్టి రథముతోడనా? (మూర్ఛిల్లి పడును)

దేవేరులు. ఊఱడిల్లుఁడూఱటిల్లుఁడు మహారాజా!

కాంచు · అహో కష్టము! ఇట్టి పురుషశ్రేష్ఠుల కిట్టి యాపదయా? విధి దురతిక్రమము. మహారాజా, ఊఱడిల్లుఁడూఱడిల్లుఁడు.

దశ : ( ఇంచుక తేఱుకొని) బాలాకీ! సుమంత్రుఁడొక్కఁడే వచ్చెనుగదా?

కాంచు : అవును మహారాజా!

దశ అహో కష్టము!

శూన్యమగుచు నిపుడు చొత్తెంచెనె రథమ్ము?
నులిసిపోయె నా మనోరథమ్ము,
తప్పఁగ్రుంకి చనదు, దశరథుఁ డోడి తెం
డనుచుఁ గాలమూర్తి పనిచె రథము

వేగమే యతనిఁ బ్రవేశపెట్టుము.

కాంచు : చిత్తము మహారాజా! (నిష్క్రమించును)

దశ : వనసంచారియగు రాముని తనివిదీఱఁ గౌఁగిలించుకొనుచున్న తటాక సమీరములు ధన్యములు.

సుమంత్రుఁడు : (ప్రవేశించి, సశోకముగా చుట్టును పరికించి)

భృత్యలోకమ్ము కర్మముల్ విడిచి రాము
నందుఁ జింది నెనరున బాష్పాకులాక్ష
మగుచుఁ జింతాతిదీనమై బెగడి యదిగొ
యేడ్చుచున్న పార్థివుని గ్వర్థించుచుండె.

(సమీపించి) మహారాజునకు జయము! 

దశ : అన్నా, సుమంత్రా! నా జ్యేష్ఠపుత్త్రుఁడు రాముఁడెక్కడ? కాదు, కాదు–సరిగ నడుగనైతిని. సుతవత్సల! నీ జ్యేష్ఠపుత్రుఁడగు రాముఁ డెక్కడ? గురుజన నిరతిశయ భక్తి వైదేహి యెక్కడ? ఆసన్న మరణుఁడు, సకలజనశోకార్ణ వకరుఁడు నైన యీ హతభాగ్యునకు జనకునకు నేదేని చెప్పిరా?

సుమ . వలదు వలదు మహారాజా, అమంగళ మాడవలదు అచిరకాలమందే దేవర వారు కుమారులను దర్శింపఁగలరు.

దశ . అవును, ఆయుక్తమే పలికితిని. ఈ ప్రశ్నము తపస్విజనమును గూర్చి యడు గఁదగదు. ఇప్పుడు చెప్పుము: తాపసుల తపస్సు వర్ధిల్లుచున్నదా? స్వాధీ నారణ్యములఁగ్రుమ్మరుచున్న వైదేహి ఖేదమందుట లేదుగదా?

సుమిత్ర. బహువల్కలాంతకృతశరీర, బాలయయ్యు ప్రౌఢ చరిత్ర, భర్తృ సహధర్మచారిణి యైన మా సీతమ్మ మాకును, మహారాజునకును నేమియుఁ జెప్పలేదా?

సుమ : ఎల్లరు మహారాజును ...

దశ : కాదు, కాదు. అట్లుకాదు. కర్ణరసాయనములు, పీడితహృదయౌషధములు నైన వారి నామధేయములు పేర్కొని చెప్పుము.

సుమ : చిత్తము ఆయుష్మంతుఁడు రాముఁడు

దశ : ఏమంటివి, రాముఁడనియా? ఇలడు రాముఁడు పేరు వినఁగానే స్పృశించి నట్లున్నది తరువాత తరువాత?

సుమ : ఆయుష్మంతుడు లక్ష్మణుఁడు

దశ : ఇతఁడు లక్ష్మణుఁడు తరువాత?

సుమ : ఆయుష్మతి సీత

దశ : ఈమె వైదేహి రాముఁడు, లక్ష్మణుఁడు, వైదేహి యని చెప్పుట యక్రమము.

సుమ : అయిన నేది క్రమ మందురు?

దశ : రాముఁడు, సీత, లక్ష్మణుఁడని చెప్పవలయును

కాననములు దోషకలితములై యుంట
కాపుగోరుచుండుఁగాన జనక
రాజపుత్రియచట రామలక్ష్మణులకు
మధ్యమందె యెపుడు మసలుఁగాత!

280 సుమ : చిత్తము. ఆయుష్మంతుఁడు రాముఁడు.

దశ : ఇతఁడు రాముఁడు

సుమ . ఆయుష్మతి జనకరాజపుత్రి

దశ : ఈమె వైదేహి.

సుమ : ఆయుష్మంతుఁడు లక్ష్మణుఁడు.

దశ : ఇతడు లక్ష్మణుఁడు రామా, వైదేహి, లక్ష్మణా! బిడ్డలారా, నన్నుఁ గౌఁగిలింపుడు. ఒక్కపరిరాముని స్పృశించితినా, ఒక్కసారి చూచితినా, గత ప్రాణుఁడమృతముచే జీవించినట్లు జీవింతునని తోఁచుచున్నది

సుమ : శృంగిబేరపురమున రథము డిగ్గి యయోధ్యా పురాభిముఖముగా నిలిచి మహారాజునకు శిరసా ప్రణమిల్లి విన్న వింపఁబోయి

ఏదో యర్థమ్ము చిరము చింతించి యధర
బింబములు ప్రస్ఫురింప బాష్పంబురుద్ధ
కంఠులగుచు నేదియును బల్కకయె వెడలి
పోయి రాత్మజుల్ కాంతారభూమి కపుడు.

దశ : ఏమేమి, ఏమియుఁ జెప్పకయే వనముకుఁబోయిరా? (గాఢమోహమున మునుఁగును.)

సుమ : (తొట్రుపాటుతో) బాలాకీ, మహారాజా లప్రతీకార్యస్థితిలో నున్నారని యమాత్యులకు నివేదింపుము

కాంచు : అట్లే. (నిష్క్రమించును)

దేవేరు : మహారాజా! ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁడు.

దశ : (ఇంచుక తేఱుకొని) కౌసల్యా, నన్ను స్పృశింపుము. నిన్ను కంటితోఁజూడలేకున్నాను. రాముని సన్నిధికేగిన బుద్ధియిప్పటికిని మరలిరాకున్నది. కుమారా, రామా! నిరంతరము నేను జింతించినదంతయు ఒక్క క్షణములో నిశ్శేషమై పోయినది. నీకు పట్టముగట్టి, యుత్తమ భూపాల ప్రాప్తిచేఁ బ్రజలను గృతార్థులఁజేసి, సహోదరులను నాత్మసమానులఁ జేయుమని నీ కాదేశించి, తపోవన ముకుఁ బోవనెంచితిని. ఈశ్వైక మటొకరీతిగాఁ జేసినది. సుమంత్రా, కైకేయితో



వెడలె రాముఁడనుము, ప్రియ మిట్లు సంధిల్లె
ననుము, తేని యుసురు లడఁగె ననుము,
వేగ పుత్త్రునిఁ బిలిపింపు మనుము, తన
పావ మెల్ల వింకఁబండు ననుము.

సుమ : చిత్తము.

దశ : (మీఁదికిఁజూచి) రామకథాశ్రవణ సందర్భచిత్తుఁడ నైననన్నోదార్పఁ బితరు లేతెంచిరి. ఎవరక్కడ?

కాంచు : (ప్రవేశించి) జయము మహారాజా!

దశ : జలము.

కాంచు : చిత్తము మహారాజా! (వెళ్ళివచ్చి) విజయము మహారాజునకు! ఇవిగో జలములు.

దశ : ( ఆచమించి, ఆకసమువంకఁ జూచి) ఈయన ఇంద్రసఖుఁడు దిలీపుఁడు. ఈయన రఘువు. ఇచట తండ్రిగారు అజులు. మీ రాకకుఁగారణ మేమి? మీతోఁ గలిసి వసింప నాకు సమయమయ్యెనా? రామా, వైదేహీ, లక్ష్మణా!

పితృసన్నిధి కేగుచున్నాను ఓ పితరులారా! ఇదిగో, ఇదిగో, వచ్చుచున్నాను.
(మూర్ఛాక్రాంతుఁడగును.)

(కాంచుకీయుఁడు శరీరమును యవనికతో గప్పును)

ఎల్లరు : హా మహారాజా! హా మహారాజా!

(అందరు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము

(సుధాకారుఁడు ప్రవేశించును)

సుధా . (ఊడుపు మున్నుగాఁగల పనుల ముగించి) సంభవకయ్యగారు చెప్పినపని చేసితిని ఇప్పుడించుకసేపు కన్నుమూయుదును (నిద్రపోవును)

భటుఁడు (ప్రవేశించి, చేటుని సమీపించి, కొట్టి) ఓరీ తొత్తు కొడుకా! పనిమాని పండు కొంటివా? (కొట్టును) -

సుధా : (మేలుకొని లేచి) కొట్టుఁడు కొట్టుఁడు!

భటు : కొట్టిన నేమిచేయుదువురా?

సుధా : అభాగ్యుఁడను, కార్తవీర్యునకువలె నాకు వెయ్యి చేతులు లేవు

భటు : ఉన్న నేమిచేయుదువు?

సుధా : నిన్ను చంపుదును.

భటు : రారా తొత్తుకొడుకా! నిన్ను జంపికాని వదలను (మరలఁ గొట్టును)

సుధా : (ఏడ్చుచు) దొరా, ఇంతకు నా దోసమేమో యడుగవచ్చునా?

భటు : లేదురా, నీవలన దోషమే లేదు! రాములవారికి రాజ్యము పోయెనని దిగులు గుడిచి దశరథులవారు మరణించిరి. వారి ప్రతిమాగృహము చూడనేఁడు కౌసల్యా దేవిగారు మున్నైన రాణివాసమంతయు వచ్చునని చెప్పితిని గదా – నీవిక్కడ చేసిన దేమి? 283

సుధా : చూడు దొరా! గర్భగృహమునుండి పావురాల వెఱయుచ్చులు తొలఁగించితిని. వెల్ల వేసిన గోడలపై గందముతో చేతిముద్రలు వేసితిని వాకిళ్ళకు పూల తోరణాలు కట్టితిని. కప్పురము చల్లితిని. ఇంక నేను చేయని దేమి?

భటు : అట్లయిన నిర్భయముగాఁ బొమ్ము. ఇప్పుడు నేనును బోయి యంతయుఁ జక్కఁబఱచితిమని యమాత్యులవారికి విన్నవింతును.

( ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము

## తృతీయాంకము

(భరతుఁడును, రథముతో సూతుఁడును ప్రవేశింతురు)

భర : (ఆతురతతో) మేనమామలకడ చిరకాల ముండుటచే నయోధ్యవార్త లెఱుఁగను. మహారాజులు తద్దయు నస్వస్థశరీరులని వింటిని. తండ్రిగారికి జబ్బేమి?

సూతు : హృదయతాపము

భర : వైద్యులేమనుచున్నారు?

సూతు : వారి కంతుపట్టకున్నది

భర : నిద్రాహారము లున్నవా?

సూతు : నేలపై పడక, ధారకము లేదు.

భర : ఆశ యున్నదా?

సూతు : అన్నిటికి నా దైవమే

భర : గుండె యదరుచున్నది. రథము త్వరగాఁబోనిమ్ము.

సూతు : ఆయుష్మంతుఁడా! యట్లే. (రథము నడపును)



భర : (రథవేగము నిరూపించుచు) ఏమి వేగము!

పరువిడునట్లు దోఁచుఁ దరుపంక్తి ప్రహీణవిభాగమై, మహో
ర్వర పెనుపొంగులెత్తిన పరస్వతిభంగి రథమ్ము గాడిలోఁ
దెరలు, నరప్రభావము గతించు, రథాంగము నిల్చినట్లుగాఁ
బరఁగుఁ దురంగ ధూళి వెనువట్టక ముందర ప్రాలుఁ దేరికిన్.

సూతు : ఆయుష్మంతుఁడా! వృక్షములు మసృణములై తోఁచుచున్నవి గావున నది యయోధ్య కావలయును.

భర : స్వజనదర్శనముకై తహతహపడుచున్న మనసు తొందరపాటు నేమన వచ్చును?

పరువడిఁ దండ్రిపాదములపై దలసేర్చినయట్లు, స్నిగ్ధతన్
వరవతి తేర్చినట్లు, సదనంబున సోదరవర్గ మెల్ల సం
బరపడి మూఁగినట్లు, మఱి మాతృమహస్సులఁద్రోఁగినట్లు, వై
ఖరిగని లక్ష్మణుండు వెటకారము లాడినయట్లు తోఁచెడిన్.

సూతు : (తనలో) ఎంత కష్ట మెంత కష్టము! కఠోరమగు తండ్రిమరణ మెఱుఁగక యీతఁడడియాసతో నయోధ్యా నగరముఁబ్రవేశింపమన్నాఁడు. ఎఱిఁగియుఁ జెప్ప లేకున్నాము.

ప్రతిమ

తండ్రిగారిచావు, తల్లి యైశ్వర్యలో
భమ్ము, నగ్రజన్ము ప్రవసనమ్ము
నన్న మూఁడువార్త లక్కటా యెవఁడు వా
విడిచి పుత్త్రకునకు నుడువఁగలఁడు?

భటు (ప్రవేశించి) కుమారునకు జయము!

భర · భద్రా, శత్రుఘ్నుఁడు నా యెదుర్కొలునకై యేతెంచెనా?

భటు : కుమారుఁడు వచ్చుచున్నాఁడు గురువులు తమకుఁ జెప్పుచున్నారు

భర : ( ఆవేగముతో) ఏమని?

భటు : ''కృత్తిక యింకను నొక్క గడియ మిగిలియున్నది. రోహిణి చొరఁబడిన వెనుక కుమారుఁ డయోధ్యను బ్రవేశించునది'' యని

భర : మంచిది నీవుపొమ్ము (గురువచన మెన్నఁడు నతిక్రమింపలేదు )

భటు . చిత్తము (నిష్క్రమించును.)

భర · ఇప్పుడెక్కడ విశ్రమింతును? సరే, కనఁబడినది. తోఁపు నడుమ వెలసిన దేవళమున ముహూర్తకాలము విశ్రమింతును. దాన దైవతపూజనము, విశ్రాంతియుఁ గలుగఁ గలవు విశేషించి కొంతతడవు విశ్రమించినపిదవ పురప్రవేశము కావింపవలయునని పెద్ద లందురు కనుక రదము నిలుపుము. 285

సూతు : ఆయుష్మంతుఁడా! యట్లే (రథము నిలుపును)

భర : (రథమునుండి దిగి) ఏకాంతమున గుల్మముల సేద దేఱ విడువుము

సూతు · ఆయుష్మంతుఁడా! యట్లే. (నిష్క్రమించును )

భర : (కొంత నడచి విలోకించి) పుష్పలాజలతో పూజలు జరిగినవి. వెల్లగోడలపై చందనపంచాంగుళముద్రలున్నవి. ద్వారములఁ గుసుమదామములు వ్రేలుచున్నవి హిమవాలుక చల్లియున్నది ఇది యుత్సవవిశేషమా, లేక యాస్తిక్య బుద్ధితో నిత్యము జరువఁబడు పూజానుష్ఠానమా? బాహ్యచిహ్నమగు నాయుధముగాని, ధ్వజముగాని కనిపింపకున్నది. కానిమ్ము, ప్రవేశించి తెలిసికొందును (ప్రవేశించి కలయఁజూచి) ఏమి శిల్పసౌందర్యము! ఏమి యాకృతలు భావస్ఫూర్తి! ఈ ప్రతిమలు దైవతోద్దిష్టములయ్యును మానుష విశ్వాసము కలిగించుచున్నవి ఇవి చతుర్దైవతమూర్తులా? ఎవరి మూర్తులైన నేమి? మనసెంతయు నాహ్లాదమందుచున్నది వేల్పులకుఁ దలవంచి నమస్కరించుట యుక్తము అమంత్రకముగాఁ జేయుసర్చనము వార్షల ప్రణామమైన నగుఁగాక

దేవకులి: (ప్రవేశించి) నిత్యపూజావసాయనమునఁ బ్రాణి ధర్మమనుష్ఠించుచుండఁగా నీ ప్రతిమలలోని మఱొక చిన్న ప్రతిమవలె నెవరో ప్రవేశించిరి కానిమ్ము, పోయి తెలిసికొందును.

భర : నమస్కారము

దేవ : వలదు వలదు, నమస్కరింపవలదు.

భర : ఏల వారించుచున్నారు? మాకుఁ జెప్పవలసిన దేమేనియున్నదా? లేక పెద్దలకు నిరీక్షించుచున్నారా? కాక యేదేని విశిష్టాచారము పాటింప వలయునా? కాక మీ కేదేమి నియమమున్నదా?

దేవ : అట్లుకాదు. వేల్పులన్న భావమున బ్రాహ్మణులు వీరికి నమస్కరింపరాదని చెప్పుచున్నాను. ఇక్కడున్నవారు క్షత్రియులు.

భర : అవును, ఏ క్షత్రియులు?

దేవ : ఇక్ష్వాకులు.

భర : (సంతోషముతో) ఇక్ష్వాకులా? అయోధ్యాధీశులా వీరు? అసురపుర ధ్వంసమున దేవతలకు బాసటగా నిల్చినది, స్వభుజవిక్రమముచే విశ్వవిశ్వం

286 భరము గెల్చుకొన్నది, మృగ్యమాణమృత్యువును జిరకాల ముల్లంఘించి స్వచ్ఛంద మరణము పొందినది, స్వకీయసుకృతములచే సపురజనపదముగా మహేంద్రలోకమున కేగినది వీరేకదా. ఏమి నా భాగ్యము! తలవని తలంపుగా నాకీ మహాదృష్టము ప్రాప్తించినది. ఇక్కడున్నవారెవరో చెప్పుఁడు!

దేవ : వీరు సన్నిహితసర్వరత్న విశ్వజిద్యాగానుష్ఠాన ప్రజ్వలిత ధర్మప్రదీపులైన దిలీపులు.

భర : ధర్మపరాయణులకు నమస్కారము. వీరెవరు?

దేవ : వీరు సంవేశనోత్థానసమయానుగ బ్రాహ్మణజన సహస్రప్రయుక్త పుణ్యాహ శబ్దరవు లగు రఘువులు.

భర : ఆహో, ఏతాదృశ రక్షనుగూడ నతిక్రమించిన మత్యువు ప్రబలముగదా! బ్రాహ్మణజనసమర్పిత రాజ్య ఫలులకు నమస్కారము వీరెవరు?

దేవ : వీరు ప్రియావియోగ నిర్వేద పరిత్యక్త రాజ్య భారులు, నిత్యావబృధస్నాన ప్రశాంత రజాలు నైన యజాలు

భర : శ్లాఘ్యపశ్చాత్తాపులకు నమస్కారము (దశరధుని ప్రతిమ నవలోకించుచుఁ గలఁగి) బహుమానవ్యాక్షిప్తమన స్కుఁడనై యవధరింపనైతిని చెప్పుఁడు! వీ రెవ్వరు?

ప్రతిమ

దేవ   వీరు దిలీపులు

భర   మహారాజునకు ముత్తాత తరువాత తరువాత?

దేవ  . వీరు రఘువులు

భర  . మహారాజునకుఁ దాత తరువాత?

దేవ  : వీరు అజులు

భర  · నాన్నగారికి తండ్రి ఏమంటి రేమంటిరి?

దేవ  : వీరు దిలీపులు, వీరు రఘువులు, వీ రజులు.

భర  : మి మ్మొకటి యడుగుదును బ్రతికియున్నవారి ప్రతిమలను గూడఁ బ్రతిష్ఠింతురా?

దేవ  : లేదు లేదు, కడచన్న వారివి మాత్రమే.

భర  : మంచిది, వత్తును.

దేవ  : ఆఁగుఁడు. స్త్రీ శుల్కార్థము ప్రాణములతోఁ గూడ రాజ్యమును విసర్జించిన దశరథుని ప్రతిమనుగూర్చి యేల యడుగరు?

భర  : హా తండ్రీ! (మూర్ఛిల్లి తేఱుకొని తనలో)



ఎంత శంకించుచుంటినో యంత జరిగె,
హృదయమా, తండ్రి మృతివార్త యిదిగో వినము!
ధైర్య మూఁదుము, శుల్కశబ్దమ్ము నిన్ను
దాఁకెనేని దేహము విశోధ్యమ్ము నీకు.

(ప్రకాశముగా) ఆర్యా!

దేవ  : ఆర్యశబ్దప్రయోగము ఇక్ష్వాకులకుఁ బరిపాటి. తాము కైకేయిపుత్త్రులు భరతులుగదా?

భర  : అవునవును, దశరథుని పుత్త్రుఁడగు భరతుఁడనేకాని కైకేయిపుత్త్రుఁడనుగాను.

దేవ  : ఇంక సెలవు

భర  : ఆఁగుఁడు తక్కినది వినిపింపుఁడు.

దేవ  . ఏమిగతి? వినుఁడు. పూజ్యులు దశరథులు మరణించిరి. సీతాలక్ష్మణ సహాయుఁడై రాముఁడే ప్రయోజనార్థ మడవి కేగెనో యెఱుఁగను.

భర  : ఎట్టెట్టూ, ఆర్యుఁడును వనమున కేగెనా? (గాఢ మోహమున మునుఁగును)

దేవ  . కుమారా, ఊఱడిల్లు మూఱడిల్లుము!

భర  : (తేఱుకొని) శుష్కసలిలమైన నదికిఁ దృష్టార్తుని వలెఁ బ్రియభ్రాతృవర్జితమై

యరణ్యప్రాయమైన యయోధ్యకుఁ బరుగిడుచున్నాఁడను ఆర్యా, సవిస్తరముగా విన్నచో మనస్సునకు స్థైర్యము గలుగఁగలదు కావున నిశ్శేష ముగాఁ జెప్పుఁడు.

దేవ రాజుగారు రామచంద్రుల కభిషేకము గావించుచుండఁగా' మీ యమ్మగారు చెప్పిరఁట...

భర : ఆఁగుఁడు. ఆ శుల్కదోషమును స్మరించి, ''నా కుమారుఁడు రాజగుఁ గాక.'' యని యనియుండును ఆర్యుని ధైర్యముగని వీతశంకయై, 'వత్సా, వనమున కేగు' మని చెప్పియుండును. ఆయన వల్కలముదాల్చి వెడలెను దానిని గని రాజు అనదృశమరణము పొందెను ప్రకృతులింకఁ దత్సదృశ ములగు నే నింద లారోపింతురో గదా! (మూర్ఛిల్లును)

(తెరలో)

అయ్యలారా! తొలఁగుఁడు, తొలఁగుఁడు

దేవ : (పరికించి) పుత్త్రుడు మూర్ఛిల్లిన కాలముననే దేవేరులు వచ్చిరి తల్లుల హస్తస్పర్శ మితనికి జలాంజలి యగుఁగాక!

(దేవేరులు, సుమంత్రుఁడు ప్రవేశింతురు)



సుమ : అమ్మలారా, ఇటు, ఇటు, ఇదె యనితరసౌధోన్నతమైన రాజుగారి ప్రతిమా గృహము. నియంత్రణములేక ప్రతీహారుల నిరోధములేక, ప్రణామముతో నిమిత్తములేక తెరువరు లుపాసించుచున్నారు (ప్రవేశించి చూచి) అమ్మలారా, మీకుఁ బ్రవేశింపఁదగదు. రాజువలెనున్న వయఃస్థుడెవఁడో పడియున్నాఁడు.

దేవ : శంకింపఁబని లేదు. ఈయన భరతుఁడు. ఆదుకొనుఁడు. (నిష్క్రమించును)

దేవే : (త్వరగా సమీపించి) హా వత్సా, భరతా!

భర : ( ఇంచుక తేఱుకొని) ఆర్యా!

సుమ : జయము మహా... (సవిషాదముగా) అహో, యేమి స్వరసాదృశ్యము; ప్రతిమ స్థులైన మహారాజులు మాటాడుచున్నారనుకొంటిని

భర : తల్లుల కిప్పుడెట్టి యవస్థ పట్టినది!

దేవే : నాయనా, ఇదీ మా యవస్థ. (ముసుఁగులను దొలఁగింతురు)

సుమ : అమ్మలారా, దుఃఖము నిగ్రహించుకొనుఁడు

భర : (సుమంత్రునిఁజూచి) ఇప్పటి నడవడికను బట్టియనుకొందును మీరు సుమంత్రులవారు గారా?

సుమ : అవును కుమారా, సుమంత్రుఁడనే

ప్రతిమ

ధరణివిభుఁడు సనియెఁ, జిరజీవదోషముల్
వెంబడింప మేలు విస్మరించి
యనుగమింపలేక మనుగడ సాగింతు
శూన్యరథముతోడి సూతవృత్తి

భర : తండ్రీ! (లేచి) తల్లులకు నమస్కరింపవలసిన క్రమ మెఱిఁగింపుఁడు.

సుమ : నాయనా, అట్లే ఈయమ రాములవారి తల్లి కౌసల్యాదేవిగారు

భర : అమ్మా, నిరపరాధి నమస్కరించుచున్నాఁడు

కౌసల్య : వత్సా, సంతాపరహితుఁడవుగమ్ము!

భర : (స్వగతముగ) ఈ మాట నన్ను గరిసించుచున్నట్లున్నది. (ప్రకాశముగా) అనుగృహీతుఁడను. తరువాత తరువాత?

సుమ : ఈయమ లక్ష్మణుల తల్లి సుమిత్రాదేవి గారు.

భర : అమ్మా, లక్ష్మణప్రతారితుఁడు నమస్కరించుచున్నాఁడు.

సుమిత్ర: నాయనా, యశోభాజనుఁడవుగమ్ము!

భర : అమ్మా, దానికై యత్నింతును. తరువాత?

సుమ : ఈయమ నీ జనని.

భర : (మండిపడుచు) ఓసీ, పాపీయసీ! గంగాయమునల నడుమ కుత్సితనదివలె నా తల్లుల నడుమ నీ వుండఁదగవు.

కైక : బిడ్డా, నే నేమి చేసితిని?

భర : ఏమి చేసితి ననుచుంటివా?

వీనికి దుర్యశమ్ము, వృధి వీవతికిం గృహమృత్యు, వన్నకున్
హీనము వల్కలమ్ము, ప్రజకెల్ల విలాపము, చిన్నయన్నకున్
గాననజంతుపంక్తి చెలికారము, తల్లుల కొట్టి గర్భశో
కానల, మింటికోడలి కనర్థము గూర్పవా లోకనింద్యవై?

కౌసల్య : నాయనా, సదాచారపరాయణుఁడవుగాదా, తల్లి కేల నమస్కరింపవు?

భర : తల్లియా? అమ్మా, నీవే తల్లివి ఇదిగో నమస్కారము.

కౌసల్య : కాదు నాయనా, అట్లుగాదు ఈమె నీ జనని

భర · ఒకప్పుడు, శీలగతదోషమునుబట్టి లోకము పుత్రుల నపుత్రులుగావించుచున్నది. ఇదిగో భర్తద్రోహముగావించు మాతల నమాతలఁ గావించు నపూర్వధర్మ మిప్పుడే లోకమున స్థాపింతును

కైక : వత్సా, మహారాజు సత్యసంధానము గాపాడఁగోరి యట్లంటిని

భర : (నిష్ఠురముగా) ఏమని?

కైక : నాబిడ్డ రాజుకావలెనని

భర : ఆర్యుఁడు నీకేమగును? నా తండ్రికి ఔరసుఁడు గాఁడా? క్రమానుసారముగా నభిషేకము పొందఁదగడా? భ్రాతృప్రియుఁడుగాఁడా? ప్రకృతులకు రుచింపఁడా?

కైక : నాయనా, శుల్కలుబ్ధను బ్రశ్నింపఁదగదు

భర : రాజ్యము వదలుకొని, వల్కలములు ధరించి, భార్యతోఁగూడి, పాదచారివై పోయి, వనవాసము గావింపుమని యాజ్ఞాపించితివి. ఇవియు శుల్కమం దున్నవా?

కైక : వత్సా సమయము వచ్చినప్పుడెఱిఁగింతును.

భర : అవయశమందు లోభమతివైన మముం దలపోయనేల? భూ
మిపపరిభోగకాంక్ష కుసుమించినచో నృపుఁడీయఁడో? ధరా
ధిపునకుఁ దల్లివన్న గణుతిం బడయం దమకంబు గల్గినన్

దపనకులధ్వజాండు గుణధాముఁడు నీకు సుతుండుగాఁడొకో?

ఘోరకృత్య మొనర్చితివి. రాజ్య లోభమున రాజు ప్రాణములనైన గణింపవైతివి. విపినములకుఁ బొమ్మని పెద్ద కుమారుని సాగనంపితివి నారచీర దాల్చిన జనకతనయను జూచి శీర్ణముగాని నీ హృదయము వజ్రకఠినము

సుమ : కుమారా, ప్రకృతులతోఁగూడి వసిష్ఠవామదేవు లభిషేక పురస్కృతులై వచ్చి, "నృపతిహీనులైన ప్రజలు కాపరులు లేని గోవులవలె విలయము పొందుదు" రని హెచ్చరించుచున్నారు.

భర : ప్రకృతులు నన్ననుసరింతురు గాక!

సుమ : అభిషేకము విడిచి యెచ్చటి కేగెదవు?

భర : అభిషేకమా; ఈమెకుఁ గావింపుఁడు

సుమ : నీ వెచటికిఁ బోయెదవు?

భర : లక్ష్మణప్రియుఁ డున్నచోటికి. అతఁడు లేని యయోధ్య యయోధ్యగాదు

(అందరు నిష్క్రమింతురు)

తృతీయాంకము

(చేటు లిరువురు ప్రవేశింతురు)

విజయ ఓసి నందినికా! చెప్పవే నీకు పుణ్యముండును నేఁడు ప్రతిమాగృహము చూడఁ బోయిన కౌసల్యాదేవి మున్నుగాఁ గల రాణివాసమునకు రాకుమారుఁడు భరతుఁడు కనిపించెనఁటగదా? దురదృష్టవంతురాలనైన నేను వాకిలి యొద్దనే యుంటిని

నందినిక రాజకుమారుఁడైన భరతుని మేమును గుతూహలముతోఁ జూచితిమి.

విజయ . కుమారుఁడు భట్టినితో నేమనియెను?

నంది . అనుటయా? రాకుమారుఁడామెను జూచుటకైన నిచ్ఛగింపలేదు.

విజయ . ఎట్టి యనిష్టము వాటిల్లినది! రాజ్యలోభమున రాకుమారుఁడు రామునకు రాజ్యభ్రంశము కల్పించి తనకు వైధవ్యము తెచ్చుకొన్నది. లోకమునకుఁగూడ నాశము గలిగించినది. భట్టినికి దయాదాక్షిణ్యాలు లేవు. పాపము మూట గట్టుకొన్నది.

నంది · ఓసీ, వింటివా? ప్రకృతులు కొనివచ్చిన యభిషేకమును వర్జించి కుమారుఁడు రామతపోవనమునకు వెడలి పోయెను. 291

విజయ . (విచారముతో) అయ్యో, కుమారుఁడుగూడ వెడలి పోయెనా! సరే, నందినికా, రా! వెళ్ళి భట్టినిని జాతము.

(ఇద్దరు నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము ★

---

★ ఈ ప్రవేశక మావశ్యకముగాఁ దోఁపకున్నది

# చతుర్థాంకము

(భరతుఁడు, సుమంత్రుఁడు, రథముతో సూతుఁడును ప్రవేశింతురు)

భ్రర : మహారాజు పుణ్యమాత్రసహాయుఁడై స్వర్గమలంకరించెను జగతికి మాఅట చంద్రుఁడైన రాముని నుదార తపోవనములందు సందర్శింప పౌరబాష్ప సలిలసంపాతాను గమ్యమానుఁడనై వెడలుచున్నాఁడను

సుమ : రాక్షసేంద్ర మానమథనుఁడైన నృపతికిఁ బుత్త్రుఁడు. యజ్ఞవినియుక్త విభవుఁడైన భూవల్లభునికి పౌత్త్రుఁడు, పితృప్రియంకరుఁడైన రామునకు సహోదరుఁడు నైన యీ భరతుఁడు రామానురూపమైన మార్గమను సరించుచున్నాఁడు.)

భర : అయ్యా!

సుమ : కుమారా!

భర : పూజ్యులు మా రామచంద్రులెక్కడ? మహారాజ ప్రతినిధి యెక్కడ? సార వంతులకు సన్నిదర్శనమైనవాఁడెక్కడ? రాజ్యప్రలుబ్ధయగు కైకేయికిఁ బ్రత్యా దేశమైన వాఁడెక్కడ? సద్యశోభాజనుఁడెక్కడ? ఆ నృపసూనుఁడెక్కడ?
292 ఆ సత్యానువ్రతుఁడెక్కడ? మా యమ్మకుఁ బ్రీతి సమకూర్ప లక్ష్మిని విసర్జించిన నా పరమదైవమును జూడఁ గోరుచున్నాను.

సుమ : మూర్తిమంతములైన సత్యము, శీలము, భక్తివలె నీ యాశ్రమపదమందే రాముఁడు, లక్ష్మణుఁడునున్నారు.

భర : (సూతునితో) రథము నిల్పుము.

సూతు : ఆయుష్మంతుఁడా, అట్లే. (రథము నిల్పును)

భర : (రథమునుండి దిగి) గుల్మముల నేకాంతమున సేదదేఱ విడుపుము.

సూతు : చిత్తము.

భర : తండ్రీ, నివేదింపుము, నివేదింపుము

సుమ : కుమారా, యేమని?

భర : రాజ్యలుబ్ధయగు కైకమ్మ కొడుకు భరతుఁడు వచ్చెనని.

సుమ : కుమారా, గురుజనాపవాదము పేర్కొనఁదగదు.

భర : అవును. అది న్యాయముగాదు. కావున నిక్ష్వాకుకుల కళంకమైన భరతుఁడు దర్శన మభిలషించుచున్నాఁడని చెప్పుఁడు.

సుమ అదియును నావలనఁగాదు భరతుఁడు వచ్చెనని మాత్రము చెప్పుదను

భర కాదు, కాదు పేరుమాత్రమే యుగ్గడించుచోఁ బ్రాయశ్చిత్తము చేసికోనట్లు భాసించును అయినను బ్రహ్మఘ్నుల నితరు లెఱుకపఱుతురా? కావున మీరు నిలువుఁడు నేనే నివేదించుకొందును. ఎవరక్కడ? నిర్ఘృణుఁడు, కృతఘ్నుఁడు, స్తోష్మధరుఁడు, ప్రియసాహసుఁడు, భక్తిమంతుఁడునైన భరతుఁడే తెంచెనని పితృవాక్య పాలకుఁడైన రామునకు నివేదింపుఁడు నిలువ వచ్చునో, వెడలిపోవలయునో కనుఁగొనుఁడు

(సీతా లక్ష్మణులతో రాముఁడు ప్రవేశించును)

రాము . (సంతోషముతో నాకర్ణించి) సౌమిత్రీ, వింటివా? వైదేహి, నీవు నాలకించితివి గదా? గాంభీర్యముచే మేఘనాదమును బరిభవించుచున్న యీ స్వర మెవ్వరిది? తండ్రి గారి స్వరమునుబోలి బంధుశంకను గలిగించుచు సస్నేహమై శ్రవః పేయముగా వినఁబడుచున్నది

లక్ష్మ · అవు నన్నయ్యా! ఈ స్వరయోగము నాకును బంధుస్నేహ ముత్పాదించుచున్నది. గభీరస్పష్టమై, ధీరమై, సమదవృష భస్నిగ్ధమధురమై, వక్షమున ననుపహతపంచార రభసమై, కంఠమున నవ్యక్తమధురమై, స్ఫుటకరణవ్యక్త నానావర్ణమై, సకలవర్ణముల కభయ మొసఁగ నుద్యమించినట్లున్నది. 29

రాము : ఎల్లభంగుల నిది యబాంధవుని స్వరము కాఁజాలదు నా హృదయము స్నిగ్ధమగుచున్నది. పోయి కనుఁగొమ్ము

లక్ష్మణు: ఆర్యా, అట్లే, (పరిక్రమించును)

భర : ఏమిది? ఎవరును బ్రత్యుత్తర మీయకున్నారు! కైక కొడుకు భరతుఁడు వచ్చెనని తెలసికొనిరా యేమి?

లక్ష్మణు· (పరికించి) ఈయన యార్యుఁడు రాముఁడా? కాఁడు కాఁడు. రూపసాదృశ్యము అర్యుని వదనమట్లే వదనము శశాంకమనోహరము. ఈ వక్ష మసురశరక్షతమైన తండ్రిగారి వెడఁద ఱొమ్మువలె నున్నది కాంతిపరీవృతుఁడు, తేజోరాశి, జగత్ప్రియదర్శనుఁడునైన యీ రాజు దేవేంద్రుఁడో, సాక్షాన్మధుసూదనుఁడో కావలయును (సుమంత్రుని జూచి) ఆఁ, పితృతుల్యులు!

సుమ ఓహో లక్ష్మణకుమారుఁడు!

భర అన్నగారు! ఆర్యా, నమస్కారము

లక్ష్మణు : రమ్ము రమ్ము, ఆయుష్మంతుఁడవుగమ్ము (సుమంత్రునితో) తండ్రి, వీ రెవరు?

సుమ : కుమారా, రఘువునకుఁ జతుర్థుఁడు, అజునకుఁ దృతీయుఁడు, ప్రఖ్యాతుఁడగు మీ తండ్రిగారికి ద్వితీయుఁడు, స్వకులక్షేతువైన మీ యన్నగారికి నీవలె నితఁడనుజుఁడు. కుమార భరతుఁడు.

లక్ష్మణు: రమ్ము, ఇక్ష్వాకుకుమారా, రమ్ము! మేలవుఁగాక చిరకాలము వర్థిల్లుము! అసురసమరదక్షులు, వజ్రసంఘృష్టచాపులు, ననుపమవీర్యులు నగు స్వకుల జాలకు తుల్య వీరుఁడవై రఘుమహారాజువలె యజ్ఞవిశ్రాంతకోశుడవై భ్రాజిత గుణభాజనుఁడవు గమ్ము!

భర : అనుగృహీతుఁడను.

లక్ష్మ : కుమారా, యిచ్చట నిలువుము నీరాక యార్యునకెఱిఁగింతును

భర : ఆర్యునకిప్పుడే నమస్కరింపవలెనని యున్నది త్వరగా నివేదింపుడు

లక్ష్మ : అట్లే. (రాముని సమీపించి) ఆర్యునకు జయము! ఆర్యా, భ్రాతృవత్సలుఁడైన మీ ప్రియభ్రాత భరతుఁడు వచ్చియున్నాఁడు అద్దమందువలె నతనిలో మీ రూపము పొడకట్టుచున్నది



రాము : వత్సా, లక్ష్మణా! భరతుఁడు వచ్చెనా?

లక్ష్మణు: అవును.

రాము : మైథిలీ, భరతుని వీక్షింప నీ కన్నులు విశాలములు గవించుకొమ్ము

సీత : ఆర్యాపుత్రా, భరతుఁడు వచ్చెనా?

రాము . అవును. తండ్రిగా రెట్టి దుష్కరకార్య మాచరించిరో యిప్పుడవగతమగు చున్నది భ్రాతృస్నేహమే యిట్లున్నదే, మఱి పుత్రవాత్సల్య మెట్టిదోకదా?

లక్ష్మణు. ఆర్యా కుమారుఁడు ప్రవేశింపవచ్చునా?

రాము : వత్సా, లక్ష్మణా! ఇందును నాత్మాభిప్రాయమను సరింపగోరుచుంటివా? త్వరితముగాఁబోయి కుమారుని సత్కరించి వెంటనే ప్రవేశపెట్టుము

లక్ష్మ . ఆర్యా, అట్లే.

రాము · కాదు, నీ వుండుము తనయునందలి వాత్సల్యముతో వెడుదుపోవు తల్లివలె నీ తుషారపూర్ణోత్పలపత్రనేత్ర హర్షాశ్రువు లాసారమట్లు వర్షించుచు భరతుని సమ్మానార్థము స్వయముగా వెడలునుగాక!

సీత    ఆర్యాపుత్రా, అట్లే (లేచి ముందునకుంబోయి భరతునిజూచి) ఏమీ ఆర్యపుత్రుండిచ్చటి కేతెంచెనా? లేదు, లేదు రూపసాదృశ్యము

సుమ    ఓహో కోడలు!

భర    ఈయమ జనక రాజపుత్త్రియా? అహో, జనక మహారాజుల తపస్సునకు సన్నిదర్శనమై హలాగ్రమున క్షేత్రోదరమునుండి పొడమిన స్త్రీమయతేజము అమ్మా భరతుండు నమస్కరించుచున్నాండు.

సీత    (తనలో) రూపమేకాదు. స్వరమునునట్లే యున్నది. (ప్రకాశముగా) నాయనా, చిరకాలము వర్ధిల్లుము!

భర    . అనుగృహీతుండను.

సీత    · నాయనా, బయలురేఱుము. అన్నగారికోరిక తీర్పుము.

భర    తండ్రీ, తా మిప్పుడేమి చేసెదరు?

సుమ    . నేను తరువాత వత్తును. రాజుగారు స్వర్గస్థులైన వెనుక రామునకును నాకును నిదియే ప్రథమదర్శనము గదా!

భర    అట్లే కానిండు (రాముని సమీపించి) `ఆర్యా, భరతుండు నమస్కరించు చున్నాండు. 295

రాము    (సంతోషముతో) రమ్ము రమ్ము ఇక్ష్వాకురాజ కుమారా, రమ్ము. మేలవుంగాక! చిరకాలము వర్ధిల్లుము!

బోరతలుపువోని పేరుటురముసాంచి
విపులబాహుల నను బెనచవన్న!
శారదేందుబింబసమమైన మొగ మెత్తి
శోకతప్తతనువు సాంకవన్న!

భర    : అనుగృహీతుండను.

సుమ    : (సమీపించి) ఆయుష ంతునకు జయము!

రాము    : హా తండ్రీ!

అమరుల కండగా నరిగి యాత్మబలమ్ములతోం బ్రతీపసం గ్రామ
తమసమియోర్ధ పాటవమునన్ సురదైత్యవరూధి నీనికా
యము నుతులందుకొన్న మహితాత్ముండు భూపతి మిమ్మువీడి స్వ
ర్గము గమియించి నేండు పితృరాజసమన్వితుండై సుఖించునే?

సుమ : (సశోకముగా)

ప్రభునిచావు, మీ ప్రవాసమ్ము, భరతుని
వగపు, లుప్తమైన వంశరక్ష
కన్నులార నిన్ని గనుగొంటిఁ జిరజీవ
దోషమార్ప బ్రతుకు ద్రోయుచుంటి.

సీత : మొదలే పొగలుచున్న యార్యపుత్రునిఁ దండ్రిగా రింకను బొగిలించుచున్నారు.

రాము : మైథిలీ, ఇదిగో నిగ్రహించుకొనుచున్నాను వత్సా, జలమందుకొమ్ము!

లక్ష : ఆర్యా, అట్లే.

భర : ఆర్యా, యిది న్యాయముగాదు క్రమానుసారము నేనే పోయివత్తును. (కలశము పట్టుకొని నిష్క్రమించి క్రమ్మఱఁ బ్రవేశించి) ఇదిగో జలము

రాము ( ఆచమించి) మైథిలీ, లక్ష్మణునకు శ్రమ తఱుఁగుచున్నది

సీత : ఆర్యపుత్రా, ఇతఁడును శుశ్రూషింపఁదగినవాఁడే కదా?

296 రాము : అవును, ఇక్కడ లక్ష్మణుఁడు, అక్కడ భరతుఁడు శుశ్రూషింపఁదగుదురు

భర : ఆర్యుఁడను గ్రహింపవలయును దేహముచే నిందును, గర్మముచే నందును మీ నామధేయముచేతనే మీ రాజ్యము పరిరక్షితమగును

రాము : వత్సా, కైకేయీ నందనా! అట్లనకుము తండ్రి పనుపున నేను వనమున కేతెంచితినిగాని దర్పముచేఁగాదు, భయముచేఁగాదు, విభ్రమముచేతను గాదు. మన కులమునకు సత్యమే ధనము. నీయట్టి వాఁడు కాపథమున వర్తిల్లునా?

సుమ : మరి యీ యభిషేకోదక మేమిగావలయును?

రాము : మా యమ్మ యభిహితము నభిషేకింపవలయును

భర : ఆర్యులు ప్రసన్నులుగావలె. గాయము రేఁపకుఁడు మీ రుద్భవించిన వంశమున నేనును నుద్భవించితిని. మీ తండ్రి నాకును తండ్రి మాతృ దోషము పురుషులకు దోషముగాదు ఆర్తుడైన యీ భరతునకు యథాయోగ్యముగా ననుగ్రహింపుడు!

సీత : ఆర్యపుత్రా! భరతుఁడు కరుణముగా వేడుకొనుచున్నాఁడు ఇంకను నేమి యాలోచించుచున్నారు?

రాము మైథిలీ, నిజ తనూజాని విశిష్టగుణము కాంచకయే స్వర్గమునకుఁ బోయిన మహారాజునకై వగచుచున్నాను. ఇట్టి గుణనిధిని బొందిన పురుషోత్తములకును విధి బలీయమగుచోఁ జెప్పునదేమి? వత్సా, కైకేయీనందనా! నీవలన సంతుష్టివడసితిని. నీవు నిష్కలుషాత్ముఁడవు నీమాట నన్ను లోఁగొన్నది నీ విఖ్యాతగుణములు నన్ను నిర్జించినవి మహారాజు మాట బొంకు సేయఁదగదు. నీయట్టివానిని బడసియుఁదండ్రిగా రాడితప్పినవారు కాఁదగునా?

భర మహారాజా, మీ నియమము ముగియువరకు మీ పాదములచెంతనే యుందును.

రాము · అట్లుకాదు మహారాజా ఆత్మసుకృతసిద్ధి పొందవలయును. కావున స్వరాజ్యము రక్షింపనిచో నొట్టు

భర · అక్కటా, మాటాడకుండఁ బలికితిరి కానిండు మాటయిచ్చిన, మీరాజ్యము రక్షింతును.

రాము వత్సా, యేమని?



భర నాచేత నుంచిన మీ రాజ్యమును జతుర్దశవర్షాంతమున మీరు పుచ్చుకోవలయును.

రాము అట్లే యగుఁగాక!

భర ఆర్యా, వింటివిగదా? అమ్మా, విన్నావుగదా? తండ్రీ వింటివిగదా?

అందఱు: మే మందఱము వింటిమి.

భర మఱొక వరమనుగ్రహింపవలయును

రాము · వత్సా, యేమది? నేనేమిత్తును? ఏమి యనుష్ఠింతును?

భర · నీ పాదోపభుక్తములైన యీ పాదుకలను శిరసా ప్రణతుఁడైన వీని కనుగ్రహింపుఁడు మీరు కార్యసిద్ధి పొందువరకు వీనికి విధేయుఁడనై యుందును.

రాము . (తనలో) సుచిరకాలమున కించుక యశ మార్జించి తిని నేఁడు భరతుఁడద్దాని నత్యల్పకాలమున సంపాదించెను.★

సీత : ఆర్యపుత్రా, భరతుని యీ తొలివేఁడికోలు మన్నింపుఁడు

---

★ ఈ వాక్య మన్యునిచేఁ బలికించుట యోగ్యమేమో!

రాము   అట్లే, వత్సా, గ్రహింపుము.

భర   · అనుగృహీతుఁడను. వీని కబిషేకము గావింపఁగోరుచున్నాను

రాము : తండ్రీ, భరతుఁడు కోరినదెల్ల నిర్వర్తింపుఁడు

సుమ . ఆయుష్మంతుడా, యట్లే

భర : (తనలో) అమ్మయ్య! ఇప్పటికి శీలముచే స్వజనమునకు విశ్వాసపాత్రుఁ డనైతిని. పౌరుల యనురాగము సంపాదించి లోకమునఁ దలయెత్తుకొనఁ గలిగితిని. స్వర్గస్థుడైన మహారాజునకుఁ బ్రియపుత్త్రుఁడనై గుణశీలులగు సోదరుల మన్ననకుఁ బాత్రమైతిని మహత్తర కీర్తి వడసి గుణవిశిష్టుల సల్లాపమునకు విషయము కాఁగలిగితిని

రాము : కైకేయీనందనా! రాజ్య విషయమున ముహూర్త మాత్రమైనను బ్రాలుమాల రాదు కావున విజయార్థమిప్పుడే నీవు తిరిగిపోవలయును

సీత : కుమార భరతుఁడిప్పుడే వెడలిపోవునా?

రాము : అతిస్నేహము తగదు. విజయార్థము కుమారుఁడిప్పుడే వెడలవలయును

298 భర : మిమ్ముఁ జూచుకోర్కె నెమ్మనమ్మున రేఁగఁ
బురమునందలి జన మరయుచుండు,
సాధుతరము మీ ప్రసాదమ్ము గొనిపోయి
కానిపించి ప్రీతి యానయింతు.

సుమ : ఆయుష్మంతుడా, ఇప్పుడు నేను జేయవలసినదేమి?

రాము : తండ్రీ, మహారాజునట్లు కుమారునిఁ గాపాడుఁడు!

సుమ : బ్రతికియుందునేని దానికై యత్నింతును

రాము : కైకేయీనందనా! మా ముందే మీరు రథమధిరోహింపుఁడు.

భర : ఆర్యుని యాజ్ఞ. ( ఇరువురు రథమెక్కుదురు)

రాము : మైథిలీ, రమ్ము, లక్ష్మణా, యరుదెమ్ము ఆశ్రమ ద్వారమువఱకైనను పంపివత్తము.

( అందరు నిష్క్రమింతురు )

ఇది చతుర్థాంకము

# పంచమాంకము

(సీతయుఁ దాపసియుఁ బ్రవేశింతురు)

(సీత పూజ్యురాలా, పూజాకుసుమాకీర్ణమైన యాశ్రమము సమ్మార్జించితిని. ఆశ్రమ పదసంపత్తి కనువుపడినంతో దేవపూజ కావించితిని. ఆర్యపుత్త్రుఁ డరుదెంచు వఱకు నీ మొక్కలకు నీరువోసి వాని యనురాగము వడయుదును.

తాపసి · నీ ప్రారంభ మవిఘ్నమగుఁగాక )

రాము : (ప్రవేశించి విచారముతో) తండ్రిగారును, నేనును లేని యయోధ్యను విడిచి నా యభిషేకముకొఱకు వలసిన సమస్తము గ్రహించి గుణనిధియైన భరతుఁడు నా యొద్దకరుదెంచెను. నే నతనిని గ్రమ్మఱ రక్షార్థ మచ్చటికే పంపితిని. మహత్తరమైన నృపభార మొక్కఁడే మోయుచున్నాఁడు అహో, ఎంత కష్టము! (ఆలోచించి) ఇది యిట్టిదే. ఈదృశశోకాపనోదార్థ మవస్థాసహ చారిణియగు మైథిలిని వీక్షింతును. ఆమె యెందుఁ బోయియుండును? (పరిక్రమించి చూచి) తడిసియున్న యీ చెట్లపాదులు మైథిలి దాపున నున్నట్లు సూచించుచున్నవి.

పాదులఁదోయముల్ నురువువాఱఁగఁగ్రుమ్మరు, తీవ్రదాహసం 
వేదన వ్రాలియుం బులుఁగుపిండులు వండులుద్రావ మాను, నీ
రూఁదిన బెజ్జముల్ విడిచి యుక్కిన పుర్వులు మెట్టఁబ్రాఁకు, ఈ
బోదెల నీరుతీసి తరుమూలము లొత్తును గ్రొత్తచారికల్.

ఆఁ, యిదిగో వైదేహి, ఎంతకష్టము!

అర్ఘ మందుకొనఁగ నలయు పాణితలమ్ము
కలశమూని యిపుడు గ్లాని కనదు
లతల కట్టె వనితలకుఁగూడ గహనమ్ము
గఱకుఁదనము లింత గఱపునేమొ?

(సమీపించి) మైథిలీ, తపస్సు వర్ధిల్లుచున్నదా?

సీత ఆర్యపుత్త్రునకు జయము.

రాము : ధర్మవిఘ్నముకాదేని వచ్చి కూర్చుండుము.

సీత : అట్లే (కూరుచుండును)

రాము ఏదో యడుఁగఁదలచినట్లు కనిపింతువు, ఏమది?

సీత · ఆర్యపుత్రులు శోకశూన్యహృదయులైనట్లు ముఖచ్ఛాయఁ దోఁచుచున్నది. కారణమేమి?

రాము : కౌండొకవిషయముగూర్చి విచారించుచున్నాఁడను కృలాంతబాణోపహతమై హృదయము గాయపడినది. నానాఫలములైన శోకశరములు తగిలినచోటనే తగులుచున్నవి.

సీత : ఆర్యపుత్త్రుల సంతాపమేమో?

రాము : రేపు తండ్రిగారి యన్వాబ్దికము కల్పవిశేషముచేఁ బితరులు తర్పణ మభిలషింతురు. దాని నెట్లు నిర్వర్తింపఁగలనా యని విచారించుచున్నాడను ఎట్లో యొకట్లు వారు తృప్తి పొందుదురు నా స్థితి వారెఱింగినదే అయినను దండ్రి గారికిని, రామునకును ననురూపమైన పూజ కావింపవలెనని యున్నది.

సీత : ఆర్యపుత్రా! భరతుఁడు శ్రాద్ధమును సమృద్ధిగా నిర్వర్తించును. అవస్థాను గుణముగా ఫలోదకములచే నార్యపుత్త్రులను నిర్వర్తింపవచ్చును. ఇది తండ్రి గారికి మిక్కిలి సమ్మతము కాఁగలదు.

రాము : మైథిలీ!

హరితదర్భలందుఁ గరములు గంపింప
ఫలము లేను విడువఁ బాఱఁజూచి
వనవివాస మెల్ల మనసులోన దెరలి
అచటఁగూడ తండ్రి యలమటించు.

300

(పరివ్రాజక వేషుఁడగు రావణుఁడు ప్రవేశించును)

రావణు : (తనలో) అనియతాత్ముఁడనైన నేను నిగ్రహవంతుని రూపము దాల్చి ఖర సంహారకృతవైరుఁడైన రాముని వంచించి స్వరపదశూన్యమగు హవ్యధారను బోలె జనక సుతనపహరించువాఁడనై వెడలుచున్నాఁడను. (పరిక్రమించి క్రిందికిఁజూచి) ఇదియే రాముని ఆశ్రమద్వారము అవతరింతును (క్రిందికి దిగి) అతిథి సముదాచార మనుష్ఠింతును. (ప్రకాశముగా)నే నతిథిని ఎవరక్కడ?

రాము : అతిథులకు స్వాగతము.

రావణు : స్వరముచే రూపము మిక్కిలి విశేషించుచున్నది

రాము : (చూచి) ఓహో స్వాములు! స్వామీ నమస్కారము

రావణు : స్వస్తి!

రాము : స్వామీ, యీ యాసనమలంకరింపుఁడు

రావణు : (స్వగతము) ఏమిది, ముదలగొనువాఁడనైతినే. (ప్రకాశముగా) మంచిది

రాము · మైథిలీ, స్వామికిఁ బాద్యము గొనిరమ్ము

సీత . అట్లే. (పోయి తిరిగివచ్చి) ఇదిగో జలము.

రాము స్వామిని శుశ్రూషింపుము.

సీత · ఆర్యపుత్త్రులయాజ్ఞ.

రావణు (మాయారూపము బయల్పడునని కలంగి) మంచిది, మంచిది. లోకము నందలి స్త్రీలలో నీమె యొక్కతెయే కదా యరుంధతి! ఈమెకు భర్తవని స్త్రీజనము నిన్ను సత్కరించుచున్నది.

రాము అట్లయిన తెమ్ము. నేనే శుశ్రూషింతును.

రావణు ఛాయను బరిహరించి శరీరము నుల్లంఘింతునా! అతిథి సత్కారము మాటలే చాటును పూజితుఁడను! కూరుచుండుము.

రాము · మంచిది.

రావ · (స్వగతము) బ్రాహ్మణాచారము నెఱపెదను. (ప్రకాశముగా) నేను కాస్యప గోత్రుఁడను సాంగోపాంగముగా వేదము, మానవీయమగు ధర్మశాస్త్రము, మహేశ్వరుని యోగశాస్త్రము, బృహస్పతి యర్థశాస్త్రము, మేధాతిథి న్యాయశాస్త్రము, ప్రాచేతసుని శ్రాద్ధకల్పముఁజదివితిని.



రాము ఎట్టెట్టూ, శ్రాద్ధకల్పమనియా పేర్కొంటిరి?

రావణు . ఎల్ల శ్రుతులకంటె శ్రాద్ధకల్పమునఁ గోరిక మెండుగా గనఁబడుచున్నదే?

రాము : స్వామీ, జనకునిఁ గోల్పోయిన స్థితిలో నిదియే కదా యాగమము.

రావణు : అట్లయిన సంశయింపనేల? అడుగుము.

రాము : స్వామీ, తర్పణక్రియవేళ దేనితోఁబితరులను దృప్తిపఱతును?

రావణు : శ్రద్ధతోఁనొసఁగిన దంతయు శ్రాద్ధమే.

రాము : స్వామీ, యనాదరముతోఁ జేయునది పితరుల కగ్రహ్యామే. కాని, మీవలన విశేషార్థ మెఱుఁగఁ గోరుచున్నాను.

రావణు : అయిన వినుము. ఉద్భిజ్జములలో దర్భలు, ఓషధులలో నువ్వులు, శాకము లలో గలాయము, మత్స్యములలో మహాశఫరము, పక్షులలో వార్ధ్రాణసము, పశువులలో గోవుకాని, ఖడ్గమృగముగాని జెప్పఁబడినవి. కాని.. ..

రాము : స్వామీ, కానియని యంటిరి. ఇంకను నేదియో యడుగవలసియున్నదా?

రావణు : అవును, ఉన్నది. అది ప్రభావసంపాద్యము.

రాము . స్వామీ, యట్లయిన నిదే నా నిశ్చయము

ఉభయమునకు సన్నిహితమై యున్నదేని
తివియకిప్పుడే దాని సాధించువాఁడ
తపము చాలదో యున్న దుత్తాల ధనువు,
ధనువు చాలదో యున్న దుత్తమమ్ము తపము

రావణు : ఉన్నవి హిమవంతమున

రాము : హిమవంతముననా? ఎట్లు?

రావణు . మంచుకొండ యేడవకొమ్మునఁ బ్రత్యక్షస్థాణువు శీర్షమునుండి జాలువాఱు గంగాంబువులను సేవించుచుఁ బవనజవములై వైడూర్యశ్యామపృష్ఠములు గలిగి కాంచన పార్శ్వములను మృగములున్నవి వైఖానస వాలఖిల్య నైమిశీయాది మహర్షులు దలఁచుకొన్న మాత్రమున నవివచ్చి విపత్తినందును వానిచే వారు శ్రాద్ధములు నిర్వర్తింతురు దానఁ దర్పితులై పితరులు బిడ్డలగన్న ఫలమను భవింతురు. ముదిమిని జయించి ప్రకాశమానులై స్వర్గము ప్రాపింతురు దేవతలతో సమముగా విమానావాసము పొందుదురు. ఆవర్తిల్లు విషయములు



వారిని బంధింపఁజాలవు.

రాము · మైథిలీ.....

హిమగిరి కాననమ్ముల సమిద్ధ మహౌషధి దీప్యమాన భా
గముల వసింపఁబోయెదము గాన యనుజ్ఞ యొసంగుఁడంచు వ
త్సములటు సాఁకికొన్న మృగశాబములన్, ద్రుమసంచయమ్ము, విం
ధ్యము, గహనమ్ము, గూరిమిలతాళుల వేఁడుము వీడికోళులన్

సీత : ఆర్యపుత్త్రుల యాజ్ఞ.

రావణు . కౌసల్యానందనా, పేరాస తగదు మానవుల కవి కనిపింపవు

రాము స్వామీ, హిమవంతమున నుండునుగదా?

రావణు : అవును.

రాము · అట్లయినఁ గనుఁగొండు–

స్వర్ణ మృగముల నా హిమక్ష్మాధరమ్ము
విగతతంద్రమై నాకుఁ గాన్పింపవలయు
లేదా మద్బాణముఖసమాలీఢమగుచుఁ
గ్రౌంచపర్వతత్వమ్ము భజించవలయు

రావణు : (తనలో) అహో! యేమి యితని దుస్సహ గర్వము!

రాము : (దిశ లవలోకించి) ఓహో! మెఱుపురాలినట్లున్నది.

రావణు · కౌసల్యానందనా! యిచటనే హిమవంతుఁడు నిను బూజించుచున్నాఁడు. అదిగో కాంచనపార్శ్వమృగము

రాము : ఇది స్వాములి ప్రభావము

సీత : ఆర్యపుత్రుల యదృష్టము.

రాము : స్వయముగా నిచ్చటికి వచ్చుట తండ్రిగారి భాగ్యము. మైథిలీ, పూజ కిది యోగ్యమని లక్ష్మణునకుఁ జెప్పుము

సీత : ఆర్యపుత్రా, తీర్థయాత్రనుండి తిరిగివచ్చుచున్న కులపతుల కెదురువోయి తోడితెమ్మని సౌమిత్రి నాజ్ఞాపించితిరిగదా?

రాము . అయిన నేనే వెళ్ళెదను.

సీత . ఆర్యపుత్రా, నే నేమి చేయవలె?

రాము స్వామిని సేవింపుము

సీత . ఆర్యపుత్రుల యాజ్ఞ (రాముడు నిష్క్రమించును.)



రావణు ఆఁ, రాఘవుఁడర్ఘ్యము గ్రహించి సమీపించుచున్నాడు పూజను సరకుసేయక పరుగిడుచున్న మృగమును జూచి యిప్పుడు విల్లెక్కిడుచున్నాఁడు ఏమి బలము! ఏమి వీర్యము! ఏమి సత్త్వము! ఏమి జవము! రామ నామాక్షరముల రెంటిచేతనే యీ జగమంతయు నిజముగాఁ బర్యాప్తమైనది ఒక్కదాఁటున నీ మృగ మమ్ముమ్రేటు దూరము దాఁటి జీబుటడవిలో దూరినది.

సీత : (తనలో) ఆర్యపుత్రులు దాపున లేమిచే భయముకలుగుచున్నది.

రావణు : (తనలో) మాయచే రామునిఁ దొలఁగించితిని. ఒంటరిగానున్న సీతను గూయిడుచుండ నమంత్రోక్తమైన యాహుతింబలెఁ దపోవనమునుండి యపహరింతును

సీత : పర్ణశాలలోనికిఁ బోదును. (పోఁబోవును)

రావణు (నిజరూపము దాల్చి) సీతా, నిలు నిలు!

సీత . (భయముతో) అయ్యో, యెవఁడితఁడు?

రావణు ఎఱుఁగవో, శక్రాదులను, సురాసురగణములను జయించినవాఁడను.

శూర్పణఖ విరూపకరణముఁజూచి, సోదరద్వయసంహార మాలకించి, దుర్మతియు, నప్రమేయబలుఁడునైన రాముని వంచనచే లోభపెట్టి, నిన్నప హరించు బుద్ధితో వచ్చిన రావణుఁడను.

సీత : ఏమి, రావణుఁడవా? (వెడలుచుండును)

రావణు : ఆఁ, రావణునికంటఁబడి యెందుఁ బోఁగలవు?

సీత : ఆర్యపుత్రా, రక్షింపుము రక్షింపుము! సౌమిత్రీ, రక్షింపుము రక్షింపుము!

రావణు : సీతా, నా పరాక్రమ మెరుగవుగాబోలు

అమరేంద్రుం బరిభూతుఁ జేసితిని, విత్తాధీశు నాకంపసం
భ్రమ గావించితి, సోము నీడ్చితిని, భాస్వత్పుత్త్రు నింబట్టిసాం
గము మర్దించితి, భీత దేవగణముల్ గారాడుటన్ స్వర్గలో
కము హేయంబగు; భూమి ధన్యయగు నీ క్ష్మాజాతవర్తిల్లుటన్

సీత : ఆర్యపుత్రా, రక్షింపుము రక్షింపుము! సౌమిత్రీ, రక్షింపుము రక్షింపుము!

రావణు . వేఁడుము వేఁడుము ఆ రామునో, యా లక్ష్మణునో, స్వర్గస్థుడైన దశరథ మహారాజునో శరణు వేఁడుము కుపురుషాశ్రయణము వలన ఫలమేమి? లేడిపిల్లలు బెబ్బులినే ధర్షింపఁగలవా?



సీత . ఆర్యపుత్రా, రక్షింపుము రక్షింపుము! సౌమిత్రీ, రక్షింపుము రక్షింపుము!

రావణు : విశాలనేత్రా, యేలయేడ్తువు? నీ యార్యపుత్రునట్లు నన్నును బరిగణింపుము విస్తారబలములు తోడ్పడినను, సురగణములు సాయపడినను, రాముఁడు నన్ను యుద్ధమునఁ గెలువఁజాలఁడు.

సీత . (రోషముతో) ఇదే శపింతును!

రావణు : ఆహో, యేమి పతివ్రతా తేజము! గగనోత్క్రమణమున సూర్యరశ్ములు కాల్పఁ జాలని నన్ను ఈమె నోట వెలువడిన యల్పాక్షరములు దహించుచున్నవి.

సీత · ఆర్యపుత్రా, రక్షింపుము రక్షింపుము!

రావణు · (సీతను బట్టుకొని) జనస్థానవాసులగు నో తపస్వులారా! వినుఁడు వినుఁడు.

అవనిజాతను బలిమిమై నపహరించి
యరుగుచున్నాడు వీఁడె దశాననుండు
క్షాత్త్రధర్మమ్ము దన కుపశ్లాఖ్యమైన
వెలువరించుత రాముండు విక్రమమ్ము.

సీత · ఆర్యపుత్రా, రక్షింపుము రక్షింపుము!

రావణు (పరిక్రమించి చూచి) ఓహో! స్వపక్షపవనోత్ క్షేపక్షుభితవనమండలుండై చండచంచువుతో నిదే జటాయువు పరుగున వచ్చుచున్నాడు ఓరీ, నిలువుము!

మద్భుజాకృష్ట ఖడ్గ సంపాతకృత్త
పక్షవిక్షతిచ్యుతరక్త వాహినీప్ర
సిక్తగాత్రుని నిన్నిదే చేర్చువాఁడ
ఘోరతర కృతాంత నిశాంత తోరణమున

( ఇరువురు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము

# షష్ఠాంకము

(వృద్ధ తాపసులు ఇరువురు ప్రవేశింతురు)

ఇరువురు తాపసులు . అయ్యలారా, రక్షింపుఁడు రక్షింపుఁడు!

మొ తా : నల్లకలువదండ నవ్వెడు మైచాయ
తమ్మితూండ్ల వెల్లఁదనము నేలు
పండ్లనవ్వు నిగుడ వాఁడె రక్కసితేఁడు
హరిణినట్లు సీత నపహరించు.

రెం తా . అది గదిగో పూజ్యురాలగు వైదేహి!
పెనఁగు భుజగనిభంగిఁ, గంపిల్లు పుష్ప
వల్లికనుమాడ్కి, రఘురామువనిత నదిగొ
పాపి పంక్తికంఠుఁడు తపోవనమునుండి
యార్ష సిద్ధినిబలె బల్మి నాహరించు.

ఇర్వురు. అయ్యలారా, రక్షింపుడు రక్షింపుడు!

306 మొ తా : (మీదికిఁజూడి) సంప్రార్థనమే తడవుగా 'దశరథుని ఋణమీఁగువాఁడను నేనుండగా నెందుఁబోయెదవురా దుర్మతీ!' యని దట్టించి పలుకుచు జటాయువు మింటి కెగసినాడు.

రెం తా : క్రోధమూర్ఛితనేత్రుఁడై యదే రావణుఁడు నిల్చినాడు

మొ తా : ఇక్కడ రావణుఁడు.

రెం తా : ఇక్కడ జటాయువు.

ఇర్వురు· అయ్యో, అంతరిక్షమున యుద్ధమారంభమయ్యెను

మొ తా : కాశ్యపా, కాశ్యపా! చూడు చూడు – క్రవ్యాదీశ్వరుని సామర్థ్యము! అచలుఁడై యతఁడు

పక్షద్వంద్వముసాఁచి యేచి రిపునిం ద్వంద్వంబునం దాఁకు, ను
గ్రక్షేపంబగు చండతుండమునఁ జిఙ్ఞం జీఱి వేష్టించుఁ, గ్రూ
రక్షిప్తాశనిభిన్న భూధరశిరావ్రాతంబులై వ్రాలఁద
ద్వక్షోమధ్యమమాంసముల్ డులుచు నాభాస్వన్న భాగ్రంబులన్

రెం తా అయ్యయ్యో, క్రుద్ధుఁడై రావణుఁడు క్రవ్యాదీశ్వరుని దక్షిణాంసమున ఖడ్గము వ్రేసినాఁడు.

ప్రతిమ

ఇర్వురు. పూజ్యుఁడు జటాయువు పడిపోయినాఁడు

మొ తా అహో కష్టము! పూజ్యుఁడగు జటాయువు

పగతుని మయూరకముఁబోలెఁ బాటిగొనక
స్వీయ వీర్యానుగుణముగా విక్రమించి
పంక్తికంఠుని తేజమ్ము పరిభవించి
హస్తిభగ్నమ్ము వనవృక్షమట్లు గూలె

ఇర్వురు ఇతనికి స్వర్గము గలుగుఁగాక!

మొ.తా . కాశ్యపా! రమ్ము పోయి రాఘవునకీ వృత్తాంతము నివేదింతము ( ఇరువురు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము★

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచు : కాంచనతోరణద్వారపాలకు లెవ్వరిచ్చట?

ప్రతి - : (ప్రవేశించి) అయ్యా, నేనే విజయను ఏమిచేయవలె?

కాంచు : విజయా, విజయా! నివేదింపుము నివేదింపుము! రామసందర్శనార్థము జనస్థానమునకు వెళ్ళిన సుమంత్రులవారు తిరిగివచ్చిరని కుమార భరతునకు నివేదింపుము 307

ప్రతి : అయ్యా, సుమంత్రులవారు కృతార్థులై వచ్చిరా?

కాంచు : అమ్మా, నాకుఁ దెలియదు హృదయస్థిత శోకాగ్నిశోషితవదనులై యున్న సుమంత్రులను జూడగాఁనే నా మనస్సు వ్యాకులమయ్యెను

ప్రతి : ఈ వార్తవిని నా హృదయము కలఁగుచున్నది

కాంచు : అమ్మా, యింకను నిలిచియుంటివే! శీఘ్రముగా బోయి నివేదింపుము.

ప్రతి : అయ్యా, ఇప్పుడే వివేదింతును (పోవును)

కాంచు . (చూచి) ఇదిగో సుమంత్రాగమనజనిత కుతూహలహృదయుఁడు, చీరవల్కలవసనుడు, చిత్రజటాపుంజపింజరితోత్తమాంగుఁడునై కుమార భరతుఁడిట్లే వచ్చుచున్నాఁడు.

---

★ ఈ విష్కంభము పంచమాంకవర్తి యగుట లెస్స

ఖ్యాత గుణనిధి, ప్రతిపక్ష కాలమూర్తి,
యినకుల ప్రదీపమ్ము, దేవేంద్రసముఁడు,
భ్రాతృదేశన స్వీకృత రాజ్యరక్ష
ణుండు, మదకలభేభయానుండు సుమ్ము!

(భరతుఁడు, ప్రతీహారి ప్రవేశింతురు)

భర : విజయా, సుమంత్రులవారు తిరిగివచ్చిరా! ఆర్యునిఁ జూచుటకుఁబోయిమున్న పాదుకలనే కాక వాగ్దానమును గూడఁబడసి వచ్చితిని. ఇప్పుడు సుమంత్రుల వారు జననయన మనోభిరాముఁడగు రామునిఁజూచి వచ్చిరా?

కాంచు · (సమీపించి) కుమారునకు జయము!

భర · సుమంత్రులవారెక్కడ?

కాంచు · కాంచనతోరణద్వారమునొద్ద.

భర · శీఘ్రముగాఁ బ్రవేశ పెట్టుము

కాంచు చిత్తము. (నిష్క్రమించును)

308 (సుమంత్రుఁడు, ప్రతీహారి ప్రవేశింతురు)

సుమ : (తనలో సశోకముగా) ఎంత కష్ట మెంత కష్టము!

అనుభవించితి నరనాథునస్తమయము,
కంటి భూపతి సుతుల శోకములనెల్ల,
వింటి సీతావియోగ మీ వీనులార,
బ్రతుకు బ్రతుకెల్ల దోసాలబండి యయ్యె.

ప్రతీ : (సుమంత్రునితో) రండు రండు, వీరుగో ప్రభువులు, సమీపింపుడు.

సుమ · (సమీపించి) కుమారునకు జయము!

భర : తండ్రీ, లోకావిష్కృతపితృ స్నేహమును గాంచితిరా? ద్విధాభూతమైన యరుంధతీచారిత్రమును వీక్షించితిరా? నిష్కారణావహితమగు సౌభ్రాత్రమును గంటిరా?

(సుమంత్రుఁడు చింతించుచు మిన్నకుండును)

ప్రతీ : రాకుమారు లార్యుల నడుగుచున్నారు.

సుమ . అమ్మా, నన్నా? (ప్రతీహారి నిష్క్రమించును)

భర (తనలో) ఖేదము మెండై యుండును సంతాపముచే హృదయభ్రంశ మొదవి నది (ప్రకాశముగా) మార్గమధ్యము నుండి తిరిగివచ్చితిరా?

సుమ కుమారా, రామసందర్శనార్థము నీ పనుపున జనస్థానమునకు వెడలిన వాఁడను, మార్గమధ్యమందే యెట్లు మరలిరాఁగలను?

భర : అలుకచేఁగాని సిగ్గుచేఁగాని వారు దర్శన మీయలేదా?

సుమ : కుమారా, వినీతులకుఁగ్రోధము, శిక్షితచేతస్కులకు సిగ్గును గలుగునా? శూన్యతపోవనమును జూచి వచ్చితిని.

భర : వారెచటికిఁ బోయిరఁట?

సుమ : వనౌకసుల నివాసము కిష్కింధయని యొకటి యున్నదఁట. అచ్చటికిఁ బోయిరఁట

భర : అక్కటా, వానరులు పురుషగుణవిశేషము లెఱుఁగనివారు గదా! అచట వారెంత కష్టపడుచున్నారో!

సుమ . కుమారా, తిర్యగ్జంతువులైనను పొందిన యుపకారము గ్రహించుచున్నవి.

భర : తండ్రీ, అదెట్లు? 309

సుమ : అన్నయగు వాలిచే రాజ్యమును, భార్యను గోల్పోయి శైలమందు వసించుచున్న సుగ్రీవుఁడు తుల్యవ్యధునిచే విమోచన మందెను.

భర : తండ్రీ, తుల్యవ్యధుఁడనుచున్నారు? అదేమి?

సుమ : (స్వగతము) అక్కటా, అంతయుఁ జెప్పినట్లేయైనది. (ప్రకాశముగా) కుమారా, మఱేమియుఁగాదు. ఐశ్వర్యభ్రంశతుల్యత యని నా తాత్పర్యము.

భర : తండ్రీ, యేల దాఁతురు? సత్యముచెప్పరో, దివంగతులైన మహారాజుపై నొట్టు.

సుమ · ఇంక గతిలేదు వినుము మునిజనార్థము మహారాక్షసుఁడైన రావణునితో వైరమేర్పడెను. అంత నతఁడు మాయాబలమున సీతనపహరించుకొని పోయెను.

భర : ఏమీ, అపహరించుకొనిపోయెనా? (మూర్ఛిల్లును)

సుమ ఊఱడిల్లు మూఱడిల్లుము

భర . (తిరిగి తేటి) అహో, యెంతకష్టము!

---

జి.వి కృష్ణరావు

జనకునిం బాసి, బాంధవజనముఁ బాసి
వనములోపలఁ బలుబాము లనుభవించు
మగువ నెడపి యగ్రజుఁ డుండు మబ్బులోన
పుల్లసిల్లిన యల్ల జాబిల్లివోలె.

అక్కటా, ఇప్పుడేమిచేయుదును? సరే, తండ్రిగారు నన్ను అనుసరింతురు గాక!

సుమ : కుమారా, అట్లే. (ఇరువురు పరిక్రమింతురు) కుమారా, తగదు తగదు, ప్రవేశింపఁదగదు ఇది దేవేరుల చతుశ్శాలము

భర : ఇందేనాకు పనియున్నది ఎవరిక్కడ? ప్రతీహారీ!

ప్రతీ : (ప్రవేశించి) రాకుమారులకు జయము! నేను విజయను.

భర : విజయా, మా రాకను అమ్మగారికి నివేదింపుము

ప్రతీ : ఏ యమ్మగారికి నివేదింతును?

భర : నేను రాజును గావలె నని యారాటపడుచున్న యామెకు.

310 ప్రతీ : (స్వగతము) ఏమి కానున్నదో? (ప్రకాశముగా) దేవా, చిత్తము (నిష్క్రమించును)

(కైకేయి, ప్రతిహారి ప్రవేశింతురు)

కైక : విజయా, నన్నుఁ జూడ భరతుఁడేతెంచెనా?

ప్రతీ : భట్టినీ, అవును. భర్తృదారకులైన రామచంద్రుల సన్నిధి నుండి సుమంత్రుల వారు విచ్చేసిరి. వారితోఁ గలసి రాకుమారులు భరతులు తమ్ముఁ జూడఁ గోరుచున్నారు.

కైక : (స్వగతము) ఏ యుద్ఘాతముతో భరతుఁడు నన్ను పాలంభించునో!

ప్రతీ : అమ్మా, రాకుమారులు ప్రవేశించవచ్చునా?

కైక : వెళ్ళి ప్రవేశపెట్టుము

ప్రతీ : చిత్తము. (పరిక్రమించి, దాకొని) రాకుమారులకు జయము! దేవరవారు ప్రవేశింపవచ్చును

భర : విజయా, నివేదించితివా?

ప్రతీ : చిత్తము

భర : ఇఁకఁ బ్రవేశింతము ( ఇరువురు ప్రవేశింతురు)

కైక   నాయనా, రామునిసన్నిధి నుండిసుమంత్రుఁడు వచ్చెనని విజయచెప్పుచున్నది.

భర   పూజ్యురాలికి నంతకంటెఁ బ్రియము దెల్పెదను

కైక   వత్సా, కౌసల్యా సుమిత్రలను బిలుతునా?

భర : వారు వినఁదగినది గాదు.

కైక . (తనలో) ఏమి కానోపునో! (ప్రకాశముగా) నాయనా చెప్పుము

భర : ఆలకింపుము

నీ నియుక్తిచే నేమహనీయుఁ డరిగె
స్వీయరాజ్యమ్ము విడనాడి విపినములకు,
నతని యర్ధాంగి యపహృతయయ్యె: నీ మ
నోరథమ్ము సాంగము నెఱవేఱె నేఁడు.

కైక   అయ్యయ్యో!

భర   నిన్ను గోడలుగాఁ దెచ్చుకొన్నకతన
సర్వసంపన్ను, లుత్తమాశయులు, మాన్యు
లైన యిక్ష్వాకుల కిదె సంప్రాప్తమయ్యె
దారుణతరమైన వధూప్రధర్షణమ్ము

311

కైక . (స్వగతము) చెప్పుట కిదియ సమయము (ప్రకాశముగా) వత్సా, మహారాజు లకున్న శాపమెఱుంగవు

భర : ఏమీ, మహారాజులు శప్తులా?

కైక : (సుమంత్రునితో) సవిస్తరముగాఁ జెప్పుము

సుమ . పూజ్యురాలి యానతి కుమారా పూర్వమొకప్పుడు మహారాజు వేఁటకుఁ బోయి కొండొక సరోవరమునఁ గలశము నింపుచు వనగజఘీంకారాను కారియగు శబ్దము గావించన మహర్షి చతుర్భూతుని మునితనయుని వనగజ శంకచే శబ్దవేధి శరమున హింసించెను.

భర · హింసించెనా? అయ్యయ్యో! తరువాత తరువాత?

సుమ   అట్టి దుస్థితిపాలైన మునితనయునిఁగని మహారాజు వార్తను మహర్షికి నివేదింపఁగా, రోదించుచు సత్యభాషణుఁడగు నా ముని తుదకు, 'నావలె నీవును బుత్త్రశోకమున మరణింతు'వని పలికెను

భర   ఎట్టి దుస్థితి వాటిల్లినది!

కైక   వత్సా, యీ నిమిత్తమున నెచు దోషము పాలైతిని పుత్త్రకుఁడు రాముఁడరణ్య

మునకుఁ బ్రేషితుఁడయ్యెను. అంతియకాని రాజ్యలోభముచేఁ గాదు పుత్ర వియోగము గలుగక శాపము నెఱవేఱదు

భర : పుత్త్రవియోగమే కదా ముఖ్యము? నన్నేల యరణ్యమునకుఁ బంపవైతివి?

కైక : మేనమామల యింట మెలఁగుచున్న నీ వినియోగ మలవాటయ్యెను

భర : మఱి పదునాలుగేండ్లని యేల పేర్కొంటివి?

కైక : తండ్రీ, పదునాలుగునాఁడులని చెప్పఁబోయి పర్యాకుల హృదయనై పదునాలు గేఁడు లంటిని

భర : లెస్సగా విచారించుటకుఁ బాండిత్యమున్నది. దీనిని గురుజన మెఱుఁగునా?

సుమ : కుమారా, వసిష్ఠ వామదేవాదు లెఱుఁగుటయే కాదు, అనుమతించిరి.

భర : వారు త్రైలోక్యసాక్షులు. అదృష్టవశమున పూజ్యురాలు నిర్దోష అమ్మా, భ్రాతృ స్నేహసంజాతక్రోధమున నే కావించిన దూషణములను క్షమింపుము అమ్మా, నమస్కారము.

కైక : వత్సా, పుత్త్రకుని యపరాధముల నే తల్లి క్షమింపదు? లెమ్ము లెమ్ము, నీ దోష మేమున్నది?

312 భర : అనుగృహీతుఁడను అమ్మా, సెలవు ఆర్యునకు సహాయార్థము నేఁడే రాజ మండలమునెల్ల సమకూర్తును

ధరణీభృత్సమ గంధసింధురతనూధ్వాంతోచ్ఛ్రయధ్వాంతబం
ధురమై, యుద్భట వాహినీశిబిర సందోహోత్థసంఘాదమై
పరగంజేసెద వార్ధితీరము; సుపర్వద్రోహియౌ పంక్తికం
ధరుతో నా జడధిం బడల్పఱుతు నుద్యత్సైన్యలాఘమ్ములన్

ఆఁ, శబ్దమువలె నున్నది. వెంటనే యది యేయో తెలిసికొనుఁడు.

ప్రతీ : (ప్రవేశించి) రాకుమారులకు జయము! ఈ వృత్తాంతము విని పెద్దరాణిగారు మూర్ఛిల్లినారు.

కైక : అయ్యో!

భర : ఎట్టెట్టూ, అమ్మ మూర్ఛిల్లెనా?

కైక : నాయనా, రమ్ము పూజ్యురాలి నోదార్తము.

భర : అమ్మా, అట్లే

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము

ప్రతిమ

# సప్తమాంకము

తాప · నందిలకా, నందిలకా!

నంది : (ప్రవేశించి) ఆర్యా, ఇదిగో వచ్చితిని

తాప : నందిలకా, కులపతులు విజ్ఞాపించుచున్నారు. "నిజదారాపహారియైన త్రైలోక్య విద్రాణుని రావణుని సంహరించి, రాక్షసగుణవిరుద్ధవృత్తుఁడు గుణవిభూషణుఁ డునగు విభీషణునకు బట్టాభిషేకము గావించి, దేవ దేవర్షి సిద్ధ విమలచారిత్రయగు సీతను గ్రహించి, ఋక్ష రాక్షస వానర ముఖ్యులువరివేష్టింప శరద్విమలగగనచంద్రాభిరాముఁడైన రాముఁడు వేంచేయుచున్నాఁడు కావున నేఁ డీ యాశ్రమపదమును విభవానుగుణముగా నలంకరించునది "యని.

నంది . ఆర్యా, సర్వము నలంకృతమే. కాని....

తాప : ఆ సంశయ మేమి?

నంది : విభీషణునకు సంబంధులైన రాక్షసులుగూడ నున్నారుగదా! భక్షణ విషయమున గులపతులు ప్రమాణము.

తాప : అనఁగా? 313

నంది : వారు భుజింతురుకదా?

తాప · అదియా, ఆందోళన పడనక్కఱలేదు. రాక్షసులు విభీషణునకు విధేయులుగదా?

నంది : రాక్షస సజ్జనులకు నమస్కారము. (నిష్క్రమించును)

తాప : (చూచి) అదే రామచంద్రుఁడు.

"జయంవంగుంఁగాక భూవర! ప్రశాస్యవముగావుత మన్యశత్రుసంచయంవము, భవద్విధేయమయి సాగునుగాత సమస్తభూతధాత్రి," యనుచు మౌనిలోకము నుతింపఁగ దేవరథమ్మునుండి భూదయితుఁడు రాఘవుండు వసుధాతలమందదెకాలు మోపెడిన్.

రామచంద్రులకు జయము! జయము!

(నిష్క్రమించును)

ఇది మిశ్రవిష్కంభము

(రాముఁడు ప్రవేశించును)

రాము . ప్రకటితబాహుశౌర్యుఁడగు రావణుప్రాణముఁజోపి, నిర్మలో
ర్మిక శుచిశుద్ధ శీలయగు మేదినికన్యక నాదరించి, మా
మక గురుదేవు వాక్యము సమస్తమునుందుదిముట్టఁదీర్చి, మౌ
నికులనివాసదేశము పునీతవనీతల మేగుదెంచితిన్

మునిపత్నులకు నమస్కరింప లోనికిఁబోయిన మైథిలి తడవౌనర్చు చున్నదే! ఆఁ, యదే మైథిలి "చెలీ, సీతా, జానకీ, కోడలా," యని స్నిగ్ధలై తాపసాంగనలు వయోనుగుణముగా సంబోధించి పలుకరించుచుండ జానకి మెల్లఁగా సమీపించుచున్నది.

(సీతయు, దాపసియుఁ బ్రవేశింతురు)

తాపసి : అదె నీ యజమానుఁడు, సమీపింపుము ఏ కాకినిగా నిన్నుఁజూడలేము (నిష్క్రమించును)

సీత : (తనలో) ఇప్పటికీ నమ్మరానట్లే యున్నది (సమీపించి ప్రకాశముగా) ఆర్య
314 పుత్రునకు జయము!

రాము : మైథిలీ, మన మొకప్పుడీ జనస్థానమందుంటిమి గుర్తున్నదా? బిడ్డలయట్లు పెంచిన వృక్షములు జ్ఞప్తికి వచ్చుచున్నవా?

సీత : గుర్తున్నది. నాఁడు వంగి లాలించిన చెట్లను నేఁడు తలయెత్తి చేడవలసివచ్చు చున్నది.

రాము : అవునవును. కాలము నిమ్నోన్నతము లేర్పఱచునుగదా ఆ సప్తవర్ణవృక్షము క్రింద ధవళవస్త్రధారి యగు భరతునిఁ జూచి లేళ్ళగుంపు భయపడి పాఱి పోయెను గుర్తున్నదా?

సీత . ఆర్యపుత్రా, చక్కగా స్మృతిపథమునఁ దోఁచుచున్నది.

రాము . ఈ తటాక మానాఁటి మన తపస్సునకు సాక్షి ఇచ్చటనే కూరుచుండి తండ్రి గారి తర్పణమునుగూర్చి యలోచించుచుండఁగా గాంచనపార్శ్వమృగము గనిపించినది.

సీత (భయపడి కంపించుచు) ఆర్యపుత్రా! వలదు వలదు, ఆ ప్రస్తావము తేవలదు

రాము · భయపడకు భయపడకు ఆ కాలము గతించినది (దిక్కులుచూచి) ఏమది?

గగనము దూటి లో(ధసమ గౌరములైన ధరాపరాగముల్
తెగకొని వాతధూతమయి దిగ్వలయమ్ముల నావరించు, ఢం
బుగ పటహస్వనాదిక విమూర్ఛిత శంఖరవమ్ము శాంతిధా
(త్రి గహనవాటినెల్ల నగరీకరణం బొనరించునేమొకో?

లక్ష్మ (ప్రవేశించి) ఆర్యునకు జయము! మిమ్ము దర్శించు కౌతుకముతో (భాతృ స్నేహుండైన భరతుఁడు మహాసైన్యము గొని తల్లులతో వచ్చియున్నాఁడు.

రాము : వత్సా, లక్ష్మణా! ఆ వచ్చినవాఁడు భరతుఁడా?

లక్ష్మ : ఆర్యా, అవును.

రాము : మైథిలీ, అత్తగారలను మున్నిడుకొని వచ్చుచున్న భరతుని గాంచుటకై నీ కన్నులు విశాలములు గావించుకొమ్ము.

సీత : ఆర్యపుత్రా, భరతుఁడు సమయమునకే వచ్చెను.

(తల్లులతో భరతుఁడు ప్రవేశించును)

భర : జలదముక్తమైన శారదేందువుభాతి
నఖిల ఖేదముక్తుఁడైన యార్యు
దారకలితు నిపుడు దరిసింప వచ్చితి
తనివివోలె బంధుజనము గొలువ



రాము : అమ్మలారా, నమస్కారము.

అందరు: వత్సా, చిరకాలము వర్ధిల్లుము! ప్రతిజ్ఞను నిర్వహించి కోడలితోఁ గుశలము గానున్న నిన్నుఁ జూచుట మా యదృష్టము.

రాము : అనుగృహీతుఁడను

లక్ష్మ : అమ్మలారా, నమస్కారము.

అందరు: నాయనా, చిరకాలము వర్ధిల్లుము!

లక్ష్మ : అనుగృహీతుఁడను

సీత . పూజ్యారాం(డకు నమస్కారము.

అందరు: అమ్మా, చిరమంగళవు గమ్ము!

సీత · అను(గహీతురాలను.

భర : ఆర్యా, భరతుఁడు నమస్కరించుచున్నాఁడు

రాము : రమ్ము రమ్ము, వత్సా, ఇక్ష్వాకురాజకుమారా! రమ్ము రమ్ము ఆయుష్మంతుడవు గమ్ము!

బోరతలుపువోని పేరుటురము సాచి
విపులబాహుల నను బెనచవన్న!
శారదేందుబింబసమమైన మొగ మెత్తి
శోకతప్తతనువు సాకవన్న!

భర : అనుగృహీతుఁడను అమ్మా, భరతుఁడు నమస్కరించుచున్నాఁడు.

సీత : ఆర్యపుత్త్రునితోఁ జిరసంచారివి గమ్ము!

భర : అనుగృహీతుఁడను. అన్నయ్యా, భరతుఁడు నమస్కరించుచున్నాఁడు.

లక్ష్మ : రమ్ము రమ్ము, వత్సా చిరాయువవు గమ్ము! ఏదీ, నన్ను గాఢముగాఁ గౌఁగిలించుకొమ్ము.

భర : అనుగృహీతుఁడను. ఆర్యులు రాజ్యభారము స్వీకరింపవలె

316 రాము : వత్సా, అదెట్లు?

కైక : నాయనా, యిది మా చిరాభిలషితమనోరథము

(శత్రుఘ్నుఁడు ప్రవేశించును)

శత్రు : వివిధ క్లేశములకుఁ బాల్పడి యమ్లానగుణ తేజుఁడై రావణుని హతమార్చిన యన్నగారిని సందర్శింప నా మనసు వేగిరపడుచున్నది. (సమీపించి) ఆర్యా, శత్రుఘ్నుఁడు నమస్కరించుచున్నాఁడు

రాము : వత్సా, రమ్ము, రమ్ము స్వస్తి ఆయుష్మతుఁడవు గమ్ము!

శత్రు : అనుగృహీతుఁడను, అమ్మా, నమస్కారము.

సీత : చిరకాలము వర్ధిల్లుము!

శత్రు : అనుగృహీతుఁడను. ఆర్యా, శత్రుఘ్నుఁడు నమస్కరించుచున్నాఁడు.

లక్ష్మ : స్వస్తి. ఆయుష్మంతుడవు గమ్ము!

శత్రు : అనుగృహీతుఁడను. ఇదే వసిష్ఠ వామదేవాదులు ప్రకృతులతోఁగూడి యభిషేకము మున్నిడుకొని మీ దర్శనము గోరుచున్నారు.

నిన్ను నానానదీన దానీతతీర్థ
వారి నభిషిక్తుఁ జేసి తపస్విగణము
లంబుసిక్తన వారవిందంబువోని
వదన మరయఁగోరుదురు సంభ్రాంతులగుచు

కైక · తండ్రీ, బయలుదేఱుము. అభిషేకమునకు సమ్మతింపుము.

రాము . అమ్మా, అట్లే (నిష్క్రమించును)

(తెరలో)

పూజ్యునకు జయము! స్వామికి జయము! మహారాజునకు జయము! దేవరవారికి జయము! భద్రముఖునకు జయము! ఆర్యునకు జయము! రావణాంతకునకు జయము!

కైక పురోహితులు, కంచుకులు నా పుత్త్రకుని విజయ ఘోషము వర్ధిల్లఁజేయు చున్నారు. ఆశీస్సులొసఁగి సత్కరించుచున్నారు.

సుమిత్ర ప్రకృతులు, పరిచారకులు, సజ్జనులు నా పుత్త్రకుని విజయము వర్ధిల్లజేయు చున్నారు.



(తెరలో)

జనస్థానవాసులగు నో తాపసులారా, వినుఁడు వినుఁడు!
ఆత్మ తేజాన రవి యాంధ్యమడఁచినట్లు
శత్రుజాతతమౌఘమ్ము సంహరించి
సకల శుభయుక్తయౌ ధరాజాతఁ బడసి
రాఘవుఁడు వెల్గు లోకాభిరాముఁ డగుచు.

కైక . బాగు బాగు, నా పుత్రకుని విజయఘోషణ వర్ధిల్లుచున్నది.

(అభిషిక్తుఁడైన రాముఁడు సపరివారముగాఁ బ్రవేశించును )

రాము . (మిన్ను సూచి) తండ్రీ!

దేవపురంబునందయినఁ దృప్తి వహింపుఁడు, దైన్యభావముం
ద్రోవుఁడు, మీయభీష్టములుతోయములై యభిషిక్తుఁ జేయఁగా
భూవర భద్రపీఠి మునఁ బొల్చితి, ధర్మము త్రోవనూప లో
కావన మాచరింతుఁ దనుయాత్రగ రాజ్యధురంధరుండనై

భర · పుణ్యతీర్థాభిషేకమ్ము పొంది, యాత
పత్రము వడసి, నిజమౌళిఁ బ్రసవదామ
మలర భూపతి బిరుదమ్మునంది, లోక
వంద్యుఁడగు నార్యుఁగని దృష్టి వడయకుంటి

శత్రు : ఆర్యు నభిషేకమునఁ జేసి యస్మదీయ
కులము నేఁడు వివర్జితకలుష మగుచు
చంద్రుపొడుపున వెలుఁగొందు జగముమాడ్కి
తిరిగి కాంతిప్రపూర్ణమై తేజరిల్లు.

రాము : వత్సా, లక్ష్మణా! రాజ్యము స్వీకరించితిని

లక్ష్మ : ఆర్యా, మా యదృష్టముచే వర్ధిల్లుచున్నారు.

కాంచు : (ప్రవేశించి) పూజ్యుఁడు విభీషణుఁడు, సుగ్రీవ నీలమైంద జాంబవద్ధనూ మత్ప్రముఖులును మిమ్మభినందించుచుంటిమని నివేదించుకొనుచున్నారు

రాము : సహాయుల ప్రసాదముచే వర్ధిల్లుచున్నాఁడనని వారికి జెప్పుము

కాంచు : మహారాజా, అట్లే.

కైక : ధన్యురాలను, ఈ యభ్యుదయోత్సవము నయోధ్యలోఁ జూడవలయునని
318 యున్నది

రాము : అమ్మా, అట్లే, అహో, యేమిది? సూర్యున ట్లీ వనమును మిఱుమిట్లు గొల్పు చున్నది! ఆఁ, అవగతమైనది. రావణుని పుష్పకవిమానమాకసమున కేతెంచి నది సంస్మరణ మాత్రమున సమీపింపవలయునన్న సమయమున్నదిగదా! ఎల్లరు నధిరోహింపుఁడు.

ఆప్తబంధుమిత్రులు వెంట నరుగుదేఱ
తరలువాఁడ నిప్పుడె యయోధ్యాపురమ్ము.

లక్ష్మ : తారకలతోడఁ దోఁచు చంద్రమునిఁబోలెఁ
గాంచుదురుగాక యిపుడె నాగరులు మిమ్ము.

(భరతవాక్యము)

జానకీదేవితో, బంధుజనముతో స
మాగతుండైన శ్రీరామునట్లు మామ
హీశ్వరుఁడు తా లక్ష్మీసమేతుఁ డగుచు
వసుమతీవలయమ్ము గాపాడుఁగాక!

(అందరు నిష్క్రమింతురు)

ఇది సప్తమాంకము

ప్రతిమ

# బొమ్మ ఏడ్చింది

320

# ఆవుల సాంబశివరావుకి

వేరె వివరింపవలెనేమి వీరికొలది
తామరనుమాట సరసవితాన మెరుగు
అన్న సాంబశివా యిదే యవ్వనమ్ము
కుతుకమున వడ్డిసడ్డీలు కొసరరాదు

## ఇందలి పాత్రలు :

ఆర్యనాగార్జునుడు

గౌతమీపుత్ర శాతకర్ణి

| | |
|---|---|
| ఆర్యదేవుడు<br>రాహులభద్రుడు<br>మాతృ చేటుడు<br>సమంత భద్రుడు<br>శాంతిమూలుడు<br>తారానాధుడు<br>ప్లాటినస్ | బౌద్ధభిక్షువులు |

మల్లనాగుడు

శివగుప్తుడు

వినయంధరుడు

గౌతమీ బాలశ్రీ

వాసిష్ఠి

విజయ

## ఒకటి

రాచనగరు. విశాలమైనగది అందులో ఒకప్రక్కన నిలువెత్తు పాలరాతిబొమ్మ ఆ బొమ్మ ముఖాన్ని వాసిష్ఠి తన ఉత్తరీయంతో మృదువుగా తుడుస్తూ నడుమ నడుమ దాని కన్నులలోనికి నిదానించి చూస్తూ ఉంటుంది ఆమెకు 16 లేదా 18 ఏండ్ల వయస్సు పసిడి తీగలాంటి మేను అందులో ఇంకా బాల్యచాపలం దోబూచులాడుతుంటుంది

''బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
రత్నత్రయం[1] ప్రణమామి
అభయదం కరుణార్ణవం
లోకేశ్వరం[2] భజామి.''

అన్నవాక్యాలు అంతకంతకు దగ్గరగా బిగ్గరగా లోపలినుంచి వినిపిస్తాయి ఆమె వెంటనే వెనుకకు జరిగి బొమ్మ-ముందున్న తెర జార్చి కనుమరు గౌనర్చి పూర్తిగా మళ్ళీ ఆలోచనలో పడుతుంది.

322 వాసిష్ఠి : విచిత్రంగా ఉంది. రాచనగరులే ఇట్టివా? లేక మానవ స్వభావమే ఇంతా? మూడుమాసాల క్రితం మాసిపోయిన భక్తి మళ్ళీ మోసులెత్తుతున్నది ఆనాడు ఎందుకు అంతర్ధానమైనట్లు? ఈనాడెందుకు ఈరిక లెత్తుతున్నట్లు? ఏమీ అంతు పట్టటం లేదు. విజయా, విజయా! (సమాధానంరాదు ) ఓ విజయా!

లోపలినుంచి వినబడుతుంది.

మాన కలశాయ, ప్రమిత ధర్మస్వరూప
సిద్ధ బోధాయ, సంతప్త జీవలోక
హర్షవర్షాయ, శమిత భవానలాయ,
భాద్రపద దర్శనాయ తుభ్యం నమోऽస్తు

మళ్ళీ నాటక మేదో ప్రారంభమైనట్లుంది కాకపోతే ఈ నాందీగీతం దేనికి? తప్పదు. నాటకమే కావాలి. ఏమి నాటకమో? ఈ మానకలశులు ఎవరు? బుద్ధభగవానునికి ఈ బిరుదున్నట్లు లేదే? విజయా, ఓ విజయా! పెద్ద సందేహం వచ్చిందే. ఓ విజయా? పలుకవేమే? (అలుకతో) మహాభట్టిని రానీ, నీ సంగతి తేలుస్తా! ''అత్తయ్యా, అత్తయ్యా! ఈవిజయ నీవు చెప్పిపోయిన ఒక్కపనీ చేయలేదు భిక్షువులను సత్కరించమన్నావా? ఈ మూడు నెలలలో ఒక్కభిక్షువునైనా కోట గుమ్మం

బొమ్మ ఏడ్చింది

త్రొక్కనీలేదు  అంతేకాదు అత్తయ్యా, పది రోజులనాడు ఎవరో ముగ్గురు భిక్షువులు వస్తే రాజభటులను పిలుచుకు వచ్చి చెరలో త్రోయించింది '' ఇలా చెప్పకపోతే నేను వాసిష్ఠిని కాదు  నీవు విజయవూ కాదు.

విజయ   (పరిగెత్తుకొని వచ్చి) అమ్మా, పిలిచారా?

వాసిష్ఠి   ఆదేశోల్లంఘనం రాజకులంలో క్షంతవ్యంకాదు

విజయ : మహాపరాధను. క్షమించండి. రాచనగరులో సందడి వినిపించింది. తెలుసు కొందామని ఇప్పుడే బయటికి వెళ్ళాను. (భర్తృదారిక కాళ్ళపై బడుతుంది.)

వాసిష్ఠి : ఇంతకూ ఒళ్ళు దగ్గరే ఉన్నదన్నమాట. లే లే. నేటికి క్షమిస్తున్నాము పిచ్చిదాన, ఇంత పిరికితనంతో ఎలా బ్రతుకుతావే? (నవ్వుతుంది)

విజయ : భర్తృదారిక అనుగ్రహమే ఉండాలి కాని, నా బ్రతుకుకేం?

వాసిష్ఠి : (నవ్వుతూ) నిజంగా బ్రతుకనేర్చావు  సరేకాని మానకలశమంటే కొలత పాత్రేనా? ద్రోణమా, మహాద్రోణమా?

విజయ : భర్తృదారిక పరిహాసమాడుతున్నారు.

వాసిష్ఠి · లేదు నిజంగానే అడుగుతున్నా. 323

విజయ : (భక్తి పూర్వకంగా) నాగార్జున దేవులు

వాసిష్ఠి : అంటే కోపంలో ఆయనను చెప్పి తరువాతనే  మీ మహారాజాను చెప్పాలన్న మాట!

విజయ : మహాభట్టిని మీ మాట వింటే....

వాసిష్ఠి : తన కొడుకును మించిన వాడున్నాడంటే మండిపడుతుందంటావు!

విజయ : అమ్మా, క్షమించండి! మహాభట్టారిక వద్ద విన్నదేమిటంటే జ్ఞానానికి ఆర్య నాగార్జునులవారు ప్రమాణమట  అందువల్ల ఆయనను మానకలశులంటారట.

వాసిష్ఠి : అలాగా! మరి మహారాజాలుంగారు అలా అంటారేమిటి?

విజయ : ఏమని?

వాసిష్ఠి : గౌతమ వాత్స్యాయనులే ప్రమాణమని

విజయ   క్షమించాలి. మహాభట్టిని వద్ద విన్నమాట మనవిచేశాను.

వాసిష్ఠి : (ఆలోచిస్తూ) అంటే అయ్యగారు లింగాలకు, అమ్మగారు సంగాలకు అంకి తులయ్యారన్నమాట  ఇంతకూ నువ్వు వెలుపలికి వెళ్ళి విన్నదేమిటి?

విజయ . అదే చెప్పుదామనుకొంటూ వుంటే

వాసిష్ఠి : నేను అడ్డు పడ్డానా?

విజయ : లేదు లేదు, అమ్మగారు! నేనే మరచి మరుత్రోవ త్రొక్కాను

వాసిష్ఠి : అబ్బబ్బ, చేయని తప్పు చేశామని అనుక్షణం భజనచేసే పరిజనంతో ఈ రాజలోకం ఏమి సుఖపడుతున్నదో?

విజయ : అమ్మా, అమ్మా! మహాభట్టారిక వస్తున్నారు.

వాసిష్ఠి : (తన చెవులను నమ్మలేక) ఏమన్నావు?

విజయ · మహారాజమాతగారు విచ్చేస్తున్నారు

వాసిష్ఠి · నిజమే?

విజయ : భర్తృదారికతో అబద్ధమాడగలనా?

వాసిష్ఠి : మా అత్తయ్య వస్తున్నదా, శ్రీశ్రీశ్రీ బాలశ్రీ?

విజయ . అవునమ్మా అవును. (వాసిష్ఠి తన మెడలోని హారాలు, మీది ఉత్తరీయం విజయకు ఇచ్చివేస్తుంది అంగుళీయకం ఇవ్వాలని యత్నిస్తుంది కాని



తొందరలో రాదు ఆమె పరుగెడుతుంది విజయ నిశ్చేష్టయై నిలబడిపోయి తేరుకొని) అమ్మా, అమ్మా, నిరుత్తరీయంగా (కొంత దవ్వు పరుగిడి ఆగి రోజుతూ) ఎక్కడ! చూపులేమో లేళ్ళవి, పరుగులేమో మత్తమాతంగాలవి. బక్కనరాన్ని ఎక్కడ అందుకోగలను!

తెరలో స్త్రీల కంఠం

జయము జయము మహాభట్టారికకు, స్వాగతం మహాదేవికి,
సుస్వాగతం మహారాజ మాతకు!

గౌతమి ప్రవేశిస్తుంది వయసు యాభైపైన నిండుతనం విగ్రహంలోను మాటలలోను తొణికిస లాడుతుంది.

వాసిష్ఠి : (దావున చేరి) అత్తయ్యా, అత్తయ్యా!

గౌతమి : భద్రలారా! మీ విజయఘోషతో మా హృదయం పరవశిస్తున్నది మీ రాజ భక్తియే మీకు వజ్రపాణి[3] రక్ష. ఇంక పోయి మీ మీ పనులు చూచుకోండి (గౌతమి తన యెదుట ఉన్న వాసిష్ఠిని చూచి కూడా పలుకరించదు గొంతు కర్కశత్వం వహిస్తుంది) విజయ ఎక్కడ?

విజయ · (రొజుతూ వచ్చి) జయము జయము మహాభట్టారికకు!

గౌతమి భర్తృదారిక పరిచర్య ఎప్పుడుమానావు?

విజయ · అపరాధం క్షమించండి. మీ రాక విని పరుగుపరుగున వచ్చారు.

గౌతమి · ఉత్తరీయమైన లేకుండానా?

వాసిష్ఠి విజయ తప్పిదమేమీ లేదు తొందరలో నేనే ధరించలేదు మహాభట్టిని సందర్శనానికి సముచిత వేషం ఆవశ్యకమని ఇప్పుడే తెలిసింది. అపరాధిని మీ ముందే ఉన్నది

గౌతమి : విజయా, మహారాజులను చూడవలెనని ఉన్నది. మమ్మే దర్శించమంటారో, ప్రభువులే దర్శనమిప్పిస్తారో కంచుకి వినయంధరులను కనుగొని వచ్చి చెప్పవలె. మేము భర్తృదారికా మందిరంలో ఉంటాము.

విజయ : చిత్తం (త్వరితంగా వెళ్ళిపోతుంది)

గౌతమి : (నవ్వుతూ) ఇవాళ మా కోడలుపిల్ల మా మీద అలిగినట్లున్నది!

వాసిష్ఠి : కోడిపిల్ల అలిగి ఏమి చేస్తుంది!

గౌతమి · మహారాజ ప్రాసాదంలో కోడిపిల్లలు కోతి పిల్లలూనా? ఆనంద మయూరాలు నర్తిస్తవి. సాతవాహన సార్వభౌముల నయనామృతవర్తులు భాసిస్తవి ఇంకా అలుకపోలేదు (భర్తృదారికా మందిరం సమీపిస్తుంది) 325

వాసిష్ఠి · అక్కడనే, ఆ ద్వారం వద్దనే! మహాభట్టారికకు నమస్కారం.

గౌతమి భగవతి షట్పారమితాదేవి[4] అనుగ్రహించుగాక! అవలోకితేశ్వరులు కల్యాణం చేకూర్తురుగాక!

వాసిష్ఠి · ధన్యాఽస్మి! ధన్యాఽస్మి రాజకుల సముదాచారం చెల్లినది కదా!

గౌతమి పిచ్చితల్లీ, ఏది నన్నొక్కసారి కౌగిలించుకో! మరొక్కసారి ఈ కౌగిలి ఏదో వింతగా ఉన్నది. ఏదీ ముఖం చక్కగా చూడనీ! ఎంత చిక్కిపోయావు? రాజ వైద్యులేమి చేస్తున్నారో? అయినా వారేమిచేస్తారు, నాచిట్టితల్లి నాకోసం బెంగ పెట్టుకొంటే (గద్గద కంఠంతో) అమ్మా, ఒక్కమాట చెప్పనా?

వాసిష్ఠి అత్తయ్య ఇవాళ వింతగా మాటాడుతున్నది

గౌతమి వింత కాదమ్మా, నిజం నాకు రెండేకళ్ళు ఒకటి సాతకర్ణి అతడు ఇప్పటికి ప్రయోజకుడయ్యాడు త్రిసముద్రపీత తోయవాహనుడనిపించుకొన్నాడు అపరాజిత విజయధ్వజుడయ్యాడు. ఇక రెండవది నీవు నీ విషయంలోనే

వాసిష్ఠి  నేను కానిపని ఏమి చేశాను?

గౌతమి  చేశావని కాదు. మన స్థితి, మన ధర్మం గుర్తుంచుకోవాలి నిద్రలోనైనా మరచిపోరాదమ్మా!

వాసిష్ఠి · ఇవాళ అత్తయ్య తత్త్వం ఉపదేశిస్తున్నారు

గౌతమి : అలాకాదు. మనం మహాసామ్రాజ్య పాలకులం జాతిని దిద్ది సంప్రదాయం నెలకొల్పవలసినది మనం మనమే సంప్రదాయం ఉల్లంఘిస్తే పాటించేవారెవరు? అది అలా ఉండనీ. కష్టసుఖాలు, రాగద్వేషాలు అన్నవి జీవులన్నింటికీ సామాన్యమే. కాని వాని అనుభవంలోనే క్షుద్రత్వం మహత్వమూను. క్షుద్ర జీవులు గిలగిలలాడుతాయి. మహత్వ సంపన్నులో, మిన్నువిరిగి మీద పడుతున్నా చలించరు అసలు వారేమి చేస్తున్నారో పరులు వీసమంతైనా పసికట్టలేరు. మనస్సులో కష్టసుఖాలు, రాగద్వేషాలు, ఊహాపోహలు కుమ్ములాడవచ్చు ఓహరి సాహరి పోరవచ్చు. కాని ముఖంలో అవి ప్రతిబింబిస్తే మనం లోకానికి బానిసలం కామా? వయసు వచ్చిన రాచబిడ్డకు వేరుగా చెప్పాలా?

వాసిష్ఠి : జరిగింది వింటే మీరిలా అనరు

326 గౌతమి : జరిగిందా?

వాసిష్ఠి : జరిగింది, జరుగుతున్నది!

గౌతమి : ఏమది?

వాసిష్ఠి : బొమ్మ ఏడ్చింది, ఏడుస్తున్నది!

గౌతమి : బొమ్మ ఏడుస్తున్నదా? ఏమిటమ్మా నువ్వంటున్నది?

వాసిష్ఠి · నా పేరు వాసిష్ఠి. మీ మేనగోడలిని మీ పేరు గౌతమీ బాలశ్రీ మామగారు శివస్వాతి ఇప్పుడు చెప్పండి. నాకు మతి పోయిందంటారా?

గౌతమి : మరి .. మరి ఆ......

వాసిష్ఠి : ధూపదీప నైవేద్యాదులతో అర్చిస్తూ ఉండవలసిందని మీ రాదేశించిపోయిన బొమ్మ.

గౌతమి : నిజంగానా, నిజంగానా?

వాసిష్ఠి : ఆ తెర తీస్తే మీకే కనిపిస్తుంది

గౌతమి  (తెర తొలగిస్తుంది) పాహి పాహి! నమో బుద్ధదేవాయ! ఆ కనుగొలకులలో ముత్యాలా తల్లీ! నాగార్జున భగవత్పాదుల అనుగ్రహంగా పొంది కొలుచు

కొంటున్నాము. నీ కృప కటాక్షంతో రాజ్యం సుభిక్షంగా శత్రుదుర్ని రీక్ష్యంగా ఉన్నది మా చిరంజీవి శక యవన పల్లవ నిషూదనుడై అసికాశ్మక ములకాది రాష్ట్రాల కధీశ్వరుడయ్యాడు. ఇదంతా నీ అనుగ్రహమే తల్లీ. కాదని కలలోనైనా అన్నామా? అయ్యో ఎంత తుడిచినా బాష్పబిందువులు పెల్లుబుకుతునే ఉన్నవి పైటకొంగుతో తుడిచి తుడిచి యీ కన్నులు గాయపరచలేను. భగవాన్! ఏమి ఈ వైపరీత్యం? గురుదేవులు ఈ దేవతా మూర్తిని అనుగ్రహించేటప్పుడు కూడ ఏమీ చెప్పలేదు ఈమె అలిగితే దుర్నిమిత్తాలు ఉద్భవిస్తవనలేదు. పూజించకపోతే అనర్థం వాటిల్లుతుందని హెచ్చరించలేదు అయినా భక్తికొలది నిత్యారాధనం సాగిస్తూనే ఉన్నాము ఇంతకూ ఏమి అపచారం జరిగిందో? వత్సా వాసిష్ఠీ, ఏమి జరిగిందమ్మా?

వాసిష్ఠి : మీరు వెళ్ళిన మాసానికో, మండలానికో శివగుప్తులు రాజధానిలో చాటించారు

గౌతమి ఏమని?

వాసిష్ఠి భిక్షాటనం దండ్యమనీ, దేవద్రోణ్యాది ఉత్సవాలు నిషిద్ధాలనీ.

గౌతమి అమాత్యశేఖరులు సార్థకనాములు!



వాసిష్ఠి : ఆ తరువాత ఒక పక్షంలోపున కొన్ని వందలమంది భిక్షువులను, ఉపాసకులను రాజభటులు చెరసాలలోవేశారట.

గౌతమి : రాచనగరిలోనివారిని కారను వేయించలేదా?

వాసిష్ఠి . ఆమాట వినబడలేదు. నాడు కూడ బొమ్మకంట తడిపెట్టలేదు.

గౌతమి · మరెప్పటినుంచి?

వాసిష్ఠి · సరిగా ఇది పదవరోజు

గౌతమి . ఆనాడేమి జరిగింది? చెప్పవమ్మా తల్లీ చెప్పు!

వాసిష్ఠి : అవలోకితేశ్వరులవలె ముప్వురు భిక్షువులు భిక్షాపాత్రలతో ద్వారంముందు నిలబడ్డారట. విజయ చెప్పింది నేను భిక్షకొని పరిగెత్తి సవినయంగా నమస్కరించి అనుగ్రహించవలసిందన్నాను ఇద్దరు భిక్షువులు తమపాత్రలు చాచారు మూడో భిక్షువు ఒక్కసారి నావంక చూచి వారిని వారించి ''భవతి. స్వస్థాభవ!'' అని చేయెత్తి ఆశీర్వదిస్తున్నాడు. ఇంతలో రాజభటులు వచ్చి వారిని తీసుకొనివెళ్ళారు కారాగారంలో వేశారని విజయ తరువాత చెప్పింది. అప్పటినుంచి బొమ్మ

గౌతమి : అలాగా! ఎవరక్కడ?

వినయ : అమ్మా నేనే - వినయంధరుడను.

గౌతమి : విజయ కనిపించలేదా?

వినయ : ఆమెవల్లనే విని మీ దర్శనం చేసుకొందామని వచ్చాను

గౌతమి : ఏమిటి విశేషాలు?

వినయ : సార్వభౌములేదో చదివించుకొంటూ తమ ఏకాంతతకు భంగం కలిగించ రాదని ఆదేశించారు ఇది నివేదించినట్లూ అవుతుంది, మహాభట్టారికను సందర్శించినట్లూ అవుతుందని వచ్చాను.

గౌతమి : సరే. ఈ ముద్రికచూపి పదినాళ్ళక్రిందట రాణివాసం ముందు బందీగ్రాహం పట్టుకొన్నవారిని వెంటబెట్టుకొనిరా.

వినయ : చిత్తం (నిష్క్రమిస్తాడు)

విజయ : మహాదేవిగారికి జయము. అమ్మా, అమ్మా! ఇప్పుడే శివగుప్తులు, మల్లనాగా మాత్యులు మంత్రాగారానికి వెళ్ళుతున్నారు

328 గౌతమి : (చీకాకుతో) అంతఃపుర పరిచారికలకు తల చుట్టూ కళ్ళు ఉండరాదే!

విజయ : పాదదాసిని క్షమించండి కన్నది తమకు మనవి చేసుకొన్నాను.

గౌతమి : పరిజనానికి తమ నియోగం తక్కమరొకటి కనిపించరాదు నీవీ మందిరం వెలుపల నిలిచి పరిచారికల నెవరినీ ఈ ప్రాంతాలకు రానీయకు.

విజయ : చిత్తం.

గౌతమి : అమ్మా వాసిష్ఠీ, విన్నావుగా! భిక్షువులు వస్తున్నారు.

వాసిష్ఠి : అలాగే అత్తయ్యా.

(వాసిష్ఠి అంసోత్తరీయం వేసుకొంటుంది. దూరంనుంచి మూడు గొంతుకలు వినిపిస్తాయి )

నమ స్త్రీ రత్నాయ!
యః ప్రతీత్య సముత్పాదం ప్రపంచోపశమం శివమ్।
దేశయామాస సంబుద్ధస్తం వందే వదతాంవరమ్॥

వినయ : జయము మహాభట్టారికకు! బందీలు.

గౌతమి : సరే, నీవువెళ్ళవచ్చును

వినయ : చిత్తం (నిష్క్రమిస్తాడు)

భిక్షువు ముప్పురు (ప్రవేశించి) స్వస్తి భవత్యై!

గౌతమి (విస్మయంతో) ఎవరు మీరు?

1వ భిక్షు తాము కూర్చుండే ఆనతీవచ్చును

2వ భిక్షు మీరడిగిన ప్రశ్నే నేడు మమ్మేమేము వేసుకోవలసి వస్తున్నది పదిరోజుల క్రిందటివరకు పరివ్రాజకులము ఇవాళ మేమెవరమో తెలియదు

3వ భిక్షు తెలియనిదేమున్నది? ఈనాడు భ్రష్టులము పాపభిక్షువుల దర్శనం తమవంటి వారికి తగదు

గౌతమి మేము పృథగ్జనులముకాని కల్యాణ మిత్రులము కాము

3వ భిక్షు ఇంతకూ పాపదేశనకు యోగ్యను కాననియే కదా తమ అభిప్రాయం? ఇంత తెలిసినవారివల్లనేనా బౌద్ధులకింత అపచారం! వజ్రపాణయే నమః!

గౌతమి . తమపేర్లు చెప్పలేదు

3వ భిక్షు ఇతడు మాతృచేటుడు, అతడు రాహులభద్రుడు, వైద్యవిద్యకోసం నన్నాశ్రయించారు మరి నాపేరు నాముఖమే చెబుతున్నది

రాహు పరిహాసకులు వారిని కాణదేవులంటారు కానిమిత్రులు మాత్రం ఆర్యదేవులనీ, స్థవిరదేవులనీ అంటారు తండ్రి శ్రీఫలులు మాతృభూమి సింగలం



గౌతమి భిక్షాటనం కటకంలో నిషిద్ధమని పూజ్యులకు తెలియదా?

మాతృ వచ్చిన తరువాత తెలిసింది

వాసిష్ఠి రాజశాసనోల్లంఘనం వ్రతం కాబోలు!

గౌతమి (మందలిస్తూ) వాసిష్ఠీ!

ఆర్య పసిపిల్ల, పోనిండి! మా గురుదేవుల అనుగ్రహానికి పాత్రురాలైన ఉపాసిక బాలశ్రీని చూచి పోవచ్చునని వచ్చాము

గౌతమి సుగృహీత నామధేయులు ఆ గురుదేవులెవరు?

రాహు మానకలశులు, మా ఉపాధ్యాయులకు బుద్ధపూర్ణిమనాడు ఉపసంపదో అనుగ్రహిస్తామన్నారు వారి సన్నిధికి పోతున్నాము.

వాసిష్ఠి తెలియక అడుగుతాను ఉపసంపద గ్రహించే వారు భిక్షను గ్రహించరాదా?

ఆర్య గ్రహించ వచ్చు, కాని (సందేహిస్తూ వాసిష్ఠి వైపు చూస్తాడు)

గౌతమి - అమ్మా, వాసిష్ఠి! వెళ్ళి విజయను ఒకసారి ఇటు పంపగలవా?

వాసిష్ఠి . అలాగే నత్తయ్యా! భిక్షువులకు నమస్కారం

ఆర్య :
రాహు . } ఆరోగ్యమస్తు! కల్యాణమస్తు!
మాతృ :

(వాసిష్ఠివెళ్ళిపోతుంది)

గౌతమి : కాని అంటూ సందేహించారు.....

ఆర్య : ఆమె దారుణ వ్యాధికి గురికాబోతున్నది.

గౌతమి : నమో బుద్ధాయ, నమోబుద్ధాయ! పీడితజీవలోకసేవాపరాయణులను ఒకటి వేడవచ్చునా?

ఆర్య : వారికి తోడ్పడటమే మా వ్రతం.

గౌతమి : (తెరను తొలగిస్తూ) పది రోజాలనుంచి యీ బొమ్మ .. చూస్తున్నారుకదా! చికిత్సనేమైనా సూచించగలరా!

భిక్షువు : (నిర్ఘాంతపోయి) వందామహే, వందామహే, వందామహే!

330 ఆర్య : తారాదేవ్యై[7] నమః. క్షమ్యతా మయం దురహంకారః ఇంతవరకూ దుఃఖమన్నది జీవులకు మాత్రమే ఆధి వ్యాధులవల్ల కలుగుతుందని భావించాను, రోగాలు రొష్టులు గండశిలలకు గూడ కలుగుతవని తెలియదు తల్లీతెలియదు. ఈ మహావైపరీత్యం భవరోగ చికిత్సా విశారదులకే తెలియాలి

గౌతమి . అంటే?

ఆర్య · భగవత్పాదులు నాగార్జునులకే తెలియాలి. మరి అన్యులవల్ల కాదు

గౌతమి : మంచిది. పూజ్యులారా! జన్మలో ఇంతవరకూ చేయిచాచి యెరుగని వ్యక్తి నేడు చేతులు మోడ్చి వేడుకుంటున్నది నిరపరాధులైన సద్భిక్షువులను మిమ్ము బాధించి మీ వ్రతాలను భంజించి మా రాజభటులు మహాపాపం ఒడిగట్టుకొన్నారు. ఈ ఒక్కసారికి వారిని క్షమించండని కోరుకొంటున్నాము

రాహు షట్పారమితలలో క్షమ ఒకటి తమకు తెలియనిదేమున్నది తల్లీ?

గౌతమి · మేము చేయగలిగినదేమైనా ఉన్నాదా?

ఆర్య లేకేమి? ఈ విమోచకుల సుగృహీత నామధేయం ఒక్కసారి వినా లని ఉన్నది

గౌతమి అది అంత ఆవశ్యకమా?

---

బొమ్మ ఏడ్చింది

ఆర్య    మా కున్న కోరిక అది

గౌతమి · అయితే ఈ హతభాగినియే బాలశ్రీ.

భిక్షువు  మహోపాసిక బాలశ్రీయేనా తమరు!

గౌతమి  అవును ఆ హతభాగ్యలము మేమే. మానకలశులకు మాసాష్టాంగ నతులు నివేదించ మనవి విజయా, ఈ కల్యాణ భిక్షువులకు దారి చూపించు!

భిక్షు  . మీకు భద్రమగు గాక!

ప్రబల భయదమ్ము యక్ష రూపమ్ము వ్రాసి
యరసి చిత్రకారుడు తానె యడలు నట్లు
ఆత్మ కల్పిత సంసార మందు బోధ
విరహితుండు సమ్మోహియై విహ్వలించు

(పద్యం చదువుకొంటూ భిక్షువులు నిర్గమిస్తారు)

గౌతమి : (నిట్టూర్చి) ఇదంతా మేము వ్రాసుకొన్న చిత్రమేనా!

(తెర)

## రెండు

### శాతకర్ణి ఆలోచనా మందిరం

వినయం (ముక్తకంఠంతో) విజిత అసికాశ్మక ములక సురఠ కుకుర విదర్భానూ పావరాంతక ఆకరానర్త విషయాధీశ్వరులు, వింధ్య పారియాత్ర శ్రీస్థాన మలయ మహేంద్ర చకోరాది పర్వత సుస్థితి సామ్రాజ్య ధౌరేయులు, పీత త్రిసముద్రతోయవాహనులు, వినివర్తిత చాతుర్వర్ణ్య సంకరులు, రామ కేశవార్జున భీమసేన తులిత పరాక్రములు, శ్రీశ్రీశ్రీ గౌతమీ పుత్ర శాతకర్ణి మహారాజులుంగారు

గౌతమి · వినయంధరా, ఏమది? మంత్రాగారమా, మహేంద్రజాలమా?

వినయం: క్షమించుతల్లీ! అలవాటు చొప్పున అని వేశాను

శాత : (నవ్వుతూ) వృద్ధ బ్రాహ్మణుడు కదా? అమ్మా నమస్కారం.

గౌతమి : సాతవాహన కుల యశోదీపకుడవై చిరకాలం వర్ధిల్లు నాయనా!

శాత : అమాత్య శేఖరులు మల్లనాగులకు, శివగుప్తులకు నమస్కారం
మహారాజుల శాసనమప్రతిహత మగుగాక!

332 మల్ల :

శివ :

శాత : మీవంటి మంత్రుల నీతిబలం, మాతృశ్రీ వాత్సల్యం ఉండగా మాకే కొరతా లేదు. కాని. .

మల్ల : మహారాజులు సమాసీనులు కావలె.

శివ : కంచుకీ, ద్వారపాలకులెవరు?

వినయ : మహారాజులు నన్నే వినియోగించారు. వెళ్ళుతున్నాను (నిష్క్రమిస్తాడు)

శాత · మా పశ్చిమోత్తర జైత్రయాత్ర సఫలమే క్షహరాటవంశ నిర్మూలనం కావించాము శక యవన పహ్లవ శీర్షాలతో కాలభైరవ పూజ కావించాము కాని.

శివ · పరమనాస్తికులైన బౌద్ధులు మిగిలిపోయారు

శాత శివగుప్తులు పొరబడుతున్నారు బౌద్ధులు ఆస్తికులట. ధర్మరతులట!

మల్ల · ఆత్మను, ఈశ్వరుని, జగత్తును ఒప్పుకోనివారు, సర్వమూ శూన్యమని చెప్పేవారు ఆస్తికులా?

శివ వేదాలను, వర్ణ వ్యవస్థనూ ఒప్పకోనివారు ఆస్తికులా! ధర్మరతులా?

బొమ్మ ఏడ్చింది

మల్ల    సర్వమూ శూన్యమైన వారికి ధర్మమెక్కడిది? ఆత్మశూన్యునకు ధర్మరతి దేనికి?

శివ : లోకవంచనకు! ఇంతకూ వారు ఆస్తికులెట్లట?

శాత : సమాసాన్నాస్తితా దృష్టిః ఫలంనా స్తీతి కర్మణః।
అపుణ్యాపాయికీ చైషా మిధ్యా దృష్టి రితి స్మృతా॥
సమాసాదస్తితా దృష్టిః ఫలం చాస్తీతి కర్మణామ్
పుణ్యా సుగతినిష్యందా సమ్యద్దృష్టి రితి స్మృతా॥

మల్ల : ఆలెక్కలో నాస్తికులెవరు?

గౌతమి : ప్రమాణ పారావార పారీణులైన మల్లనాగామాత్యులు ఒక సందేహం తీర్చవలె.

మల్ల : ఏమది?

గౌతమి · అందరూ ఆస్తికులు కారాదా? అయితే మీ అభ్యంతర మేమైనా ఉన్నదా!

మల్ల : అభ్యంతరమా? అందరూ ఆస్తికులు కావలెననియే కదా మా ఆకాంక్ష, ప్రయత్నమూను

శాత : అమ్మా, అసలు ప్రశ్న అది కాదు నాస్తికులము, అధర్మపరులము, అన్యాయాచారులము మనమేనట 333

గౌతమి : ఎవరంటున్నారు?

శాత : మరి ఈ వాక్యాలకు అర్థమేమిటి? మేము అపార్థము చేసుకొన్నామేమో నాగామాత్యులే వినిపిస్తారమ్మా!

గౌతమి : వారికి ఈనడుమ చూపు సరిగా ఆనటం లేదు ఆ వత్రం గుప్తామాత్యులు చదువుతారు.

శివ : అమ్మా, అలాగే

నీవు అతిభౌముడవు నేనా కేవలం భిక్షువును అయినా నేనొక్కణ్ణే నీ యందలి స్నేహంవల్ల లోకమందలి అనుకంపం వల్లా మిక్కిలి అప్రియమైనా హితం నీకు చెబుతున్నాను ఈ రాజ్యాన్ని వస్తూ నీవు వెంట బెట్టుకొని రాలేదు. రేపు పోతూ వెంటగొని పోలేవు ధర్మ మనుష్ఠించు. మద్యపానంవల్ల లోకంలో అవమానం, కార్యహాని, ధనక్షయం సంభవిస్తాయి మద్యంవల్ల మోహం, మోహంవల్ల అకార్యాచరణం జరుగుతుంది కనుక మద్యం పరిత్యజించు బద్ధలలో శుష్కిస్తున్న వారిని అనుదినంకాని ఐదురోజుల కొకసారిగాని విడిచిపుచ్చు. తక్కినవారిని కూడ యధా

యోగం వదలిపెట్టించు ఎవరినీ వదలకుండా ఉండవలదు విడుదల కానంత వరకు వారు నాపితస్నాన పానాన్నభైషజ్య వసనాలు పొందుతూ సుఖబంధనులు కావలె మోరపరాధులనైన లెస్సగా విచారించి చంపక హింసించక దేశాన్నుంచి బహిష్కరించవలె

మల్ల : చాలు, చాలు! పూజ్యులనోట అవాచ్యాలు వినలేము

శాత : అమ్మా! విన్నావుగా, ఇది ప్రశంసనమా, అభిశంసనమా? ఈ దేశానికి రాజు అంటూ ఒకడు ఉన్నాడా?

శివ : పాపం శమించవలె. ఈ అవద్యుని వ్రాతంలో అర్థవిద్య, రాజనీతి, రాజ్య పరిపాలన రాజసేవకులు, రాజ్యపాలకులులేరు

మల్ల : అర్థ విద్యే లేదా?

శివ : అర్థ శాస్త్ర ప్రణేతలకు నమోవాకాలు. ఈ అవాచ్యుడేమంటున్నాడో వినండి –

పరాతిసన్ధాన పరా క్షతా దుర్గతి పద్ధతి:।
అనర్థవిద్యా దుష్ప్రజ్ఞై రర్థవిద్యా కథం కృతా?

మల్ల : సర్వ శూన్యులకు అనర్థం అనేదికూడ ఉన్నదా? విశేషమే (అలుకతో నవ్వుతాడు)

334 శాత : ఇన్నాళ్ళు పాలుపోసి నాగుబామును పెంచాము. గతం త్రవ్వి ప్రయోజనం లేదు మా అభిప్రాయం వినిసాధక బాధకలు విశదీకరించండి సామ్రాజ్యంలో అవైదికమిక ఉండరాదు. శాఖోపశాఖలతో వాదోపవాదాలతో చిల్లర మల్లర మతాలతో క్షుద్రపక్షుద్ర దేవతలతో మా సామ్రాజ్యం వివాదగ్రస్తమై విచ్ఛిన్నం కారాదు ఏ రూపంతోను విభేదం తలయెత్తరాదు పుణ్యక్షేత్ర దర్శనం పేరుతో విదేశీయ గూఢచారులు మా భూమిలో ఈ గడియనుంచి అడుగు పెట్టటానికి వీలులేదు.

మల్ల : మహారాజులు అప్రతిహత సంకల్పులు

శివ : అవజితారాతుల కిదే సుముహూర్తం!

శాత : మరి మాతృశ్రీ ఆశీస్సులేమని?

గౌతమి . నాయనా! ఏ తల్లి కొడుకును ఆశీర్వదించదు? నీకేమి యిష్టమో చెప్పు నిండు హృదయంతో ఆశీర్వదిస్తాను మతమే కావాలో, మహా సామ్రాజ్యమే కావాలో చెప్పు.

మల్ల మహాభట్టారిక హృదయం అర్థం కావటం లేదు

శివ

బొమ్మ ఏడ్చింది

గౌతమి : నాయనా, శాతకర్ణీ! బిడ్డ శ్రేయస్సు కంటె ఈవయసులో తల్లికి మరొకకోర్కె ఏమి ఉంటుంది? మానవులలో కొందరు అంతర్ముఖులు మరికొందరు బహిర్ముఖులు అంతర్ముఖులకు మతం కావాలి బహిర్ముఖులకు ప్రాకృత సామ్రాజ్య మావశ్యకం. నీ యిప్పటి కౌమారం కూడ తదభిముఖమే. ఈ మంత్రిశేఖరుల ప్రవృత్తి కూడ అట్టిదే లేకపోతే వారు దండకాపథంలో ఎప్పుడో తపశ్చర్యంలో నిమగ్నులై ఉండేవారు వీరికీ, మాకూ సామ్రాజ్యం కావాలి. ఈనాడు చిరంజీవుల సామ్రాజ్యం సముద్రత్రయీ ముద్రితం. ఈ మహా సామ్రాజ్యం ఇంకా విస్తరించాలని మనం అంతా కోరుకొంటున్నాము.

శాత : అవునమ్మా, అవును.

మం : రాజ పత్నులు చెప్పింది యథార్థం.

గౌతమి · నగరైక రాజ్యంలో, రాష్ట్రిక మాత్ర సీమలో ఒకే మతం, ఒకే ఆచారం, ఒకే ఆదర్శం ఉండవచ్చును. లేకపోతే స్థాపించవచ్చును కాని మన రాజ్యం సంకుచితం కాదు. ఇప్పటికి ఆపారియాత్ర కృష్ణశైలం వ్యాపించింది. ఇంకా ఆ హిమాలయం వ్యాపించాలి



శాత . మంత్రులు అందరి ఆశయం అదేనమ్మా

గౌతమి . అందుకే అంటున్నాము. విభిన్నమతాలు, విభిన్నజాతులు, విభిన్న లక్ష్యాలు ఉన్నవి. వీటన్నిటినీ అణిచి వేయాలంటే సాధ్యమా? సామ్రాజ్య సుస్థితి విస్తరణాలు ఏమి కావాలి? ప్రకృతానికి వాటిని మానుకొంటారా?

శాత : లేదు, అలా జరగటానికి వీలులేదు.

గౌతమి : ఇంతకూ ఆ పరికథ పంపినవారు నాగార్జునులే కదా?

శాత · మరొక ధూర్తునికి అంత సాహసమా?

గౌతమి : ఆయన అలా ఎందుకు వ్రాశాడంటావు?

శాత : మీ భక్తివల్ల అతనికి కన్నులు నెత్తికెక్కాయి.

గౌతమి : ఆయనను మానకలశుడని ప్రపంచం జేపెట్టుతున్నది. అట్టి వానికి, తల్లి కొడుకు శ్రేయస్సుకోరుకొంటుందో, తన పక్షాన నిలుస్తుందో తెలియదుమ కోగలమా? విశేషించి లోకమంతా ఆయనను ఆరాధిస్తున్నది

మల్ల · క్షుద్ర విద్యలవల్ల మోసపోయి అత్యల్ప సంఖ్యాకులు ఇళ్ళెక్కికూస్తున్నారు

గౌతమి చర్చిత పురుషార్థత్రయులు క్షమించవలె ఏది శాస్త్రమో, ఏదికాదో చిరంజీవికి

మాకు అతిగహనం. పూజ్యులుమీరూ, మీ రాజు ప్రతికూలంగా ఉన్నా ధనకట కానికి ప్రాకారం ఆయనకట్టించారు శ్రీపర్వతంలో అంతటి విశ్వవిద్యాలయం వ్యవస్థాపించారు వేలకొలది విద్యార్థులు విభిన్న శాస్త్రాలు చదువుకొని పోతున్నారు. వేలకొలది రోగులు స్వాస్థ్యం పొందుతున్నారు మనం ఎన్నడైనా తోడ్పడ్డామా? ఆయన ఎన్నడైనా ఋణం మనలను యాచించాడా? తోడ్పడ నందుకు మనలను ద్వేషిస్తున్నాడా? వత్సా శాతకర్ణీ! మన చారులవల్ల అట్టి వార్తలు వినవచ్చాయా?

శాత : లేదు. కాని మరి యీ పరికథ?

గౌతమి : నిన్ను బౌద్ధం స్వీకరించ మనటం లేదు బౌద్ధులను అభిమానించమనటం లేదు. మతతత్త్వం దురవగాహం రాజులు దాని జోలికిపోరాదు ఉపేక్ష వహించాలి ద్వేషం తగదు. అది దహనంకంటె దారుణం ఉపేక్ష పాపం కాదు. సురాపానం మాను బిడ్డలవలె ప్రజలను కాపాడుకో ధర్మంతో ప్రజా నురంజనంతో రాజ్యం విస్తరించుకో అంటున్నాడు అంతమాత్రాన మనం కంటగించుకోవాలా? ఆయనపై కత్తికట్టాలా? ఇష్టం ఉంటే ఉపదేశంపాటించ వచ్చు లేదా నిరాకరించవచ్చు. ఆయన రాజద్రోహియై పరికథను చిరంజీవికి పంపాడనుకోము ఆ దుశ్చింత ఉంటే ఎప్పుడో శిష్యకోటికి దుర్బోధచేసి ఉండవలసినది. మహారాజా పశ్చిమోత్తర జైత్రయాత్రకు బయలుదేరిన వెంటనే అంతర్గతవిప్లవం ప్రోత్సహించవలసింది మాకలాతోచదు ఈ మూడు నెల్ల పర్యటన సందర్భంలో మరొకటి విన్నాము. కొత్తగా జయించిన దేశాలుతిరుగు బాటుకు సన్నద్ధమౌతున్నవట



శాత : సన్నద్ధ మౌతున్నవా?

మం : మన ప్రణిధులు చెప్పలేదే?

గౌతమి విజయోన్మత్తత కన్ను గప్పుతున్నది ఈ సందర్భంలో గృహచ్ఛిద్రాలు క్షేమం కరాలుకావు. ఈమాట ఉపాసికకాదు, మహారాజమాత అంటున్నది

శాత : అమాత్యులేమంటారు?

మం : మహారాజా! మాతృశ్రీ వాక్యం ఆలోచనీయం

శాత సరే! అతడు మిత్రుడో, అమిత్రుడో వెంటనే తేలుస్తాము

గౌతమి అలాగన్నారు బాగున్నది.

(తెర)

బొమ్మ ఏడ్చింది

## మూడు

శ్రీపర్వత బౌద్ధవిహారం దూరాన నుంచి

''గంభీర శూన్యతా ధర్మ మహా దుందుభి రాహతః
నిఃస్వభావ మహాశబ్దో శంఖశ్చ పూరితః॥
సర్వసంకల్ప హానాయ శూన్యతాఽమృత దేశనా॥
యాచ తస్యా మపి గ్రాహ స్త్వయాఽసా వవసాదితః॥''

అన్న శ్లోకాలు వినబడుతుంటవి

నాగార్జునుడు పద్మాసనస్థుడై ఆలోచనలో ఉంటాడు అతడు ఆజానుబాహువు. వర్చస్వి. భిక్షువు పరిపాటి చొప్పున ఉత్తరీయమైన చీవరం జందెవువాటుగా వేసుకొని ఉంటాడు వామభుజం సంఛన్నం. ధక్షిణభుజం అనాచ్ఛన్నం. కులపాలిక త్వరితంగా ఆవేశంతో ప్రవేశిస్తుంది.

కుల  తాతయ్యగారు, తాతయ్యగారు! మీరుకూడ కోపగిస్తున్నారా?

నాగా · (నవ్వుతూ) కోపగించుకోమంటావా తల్లీ!

కుల . అడిగించుకొని కోపపడేవాళ్ళను ఇవ్వాళే చూస్తున్నా,

నాగా  చూచావు గదా!

కుల · నిజం దాటేస్తున్నారు కోపం గాకపోతే పిలవగానే ఎందుకు పలకరు? 337

నాగా . వినిపించలేదమ్మా!

కుల . అయితే మిమ్మల్ని తాతగారూ అని పిలవవచ్చునా లేదా?

నాగా . శంక కలిగి పిలుస్తున్నావా, కలగక పిలుస్తున్నావా?

కుల : నాకసలే కోపం. తెలియనివి చిన్నవాళ్ళు అడుగుతారు. పెద్దవాళ్ళు చెప్పటం ధర్మం. ప్రశ్నకు మారు ప్రశ్న వేస్తె అది వెక్కిరింతా, సమాధానమా?

నాగా · (నవ్వుతూ) నేనూ అనేది అదే.

కుల : ఏమని?

నాగా : పెద్దవాళ్ల అడిగినప్పుడు పిన్నలు సమాధానం చెప్పాలి. పిన్నల సందేహాలు పెద్దలు తీర్చాలి అని

కుల · బాబోయ్! అర్థమయింది, అర్థమయింది, ఇందుకే లోకమంతా మిమ్ము పట్టి ప్రాసంగికులనీ, ప్రమాణం లేనివాళ్ళనీ అంటున్నది ఊరికే అంటుందామరి?

నాగా  (నవ్వుతాడు)

కుల . ఎందుకు నవ్వుతారు?

నాగా  లోక స్వభావాన్ని గూర్చి

కుల . అయితే ఓడిపోయారు (చప్పట్లు కొడుతూ) నాగార్జునులవారు నేడు ఓడిపోయారహోయ్! మీరంతా వినండి లోకానికి స్వభావం ఉందటహోయ్! అది నిఃస్వభావం కాదటోహోయ్!

నాగా : అలాగేనమ్మా నీ సంతోషం కన్నా నాకేమి కావాలి? కాని గెలుపు సంగతి ఎప్పుడైనా ప్రస్తావించానా!

కుల : లేదులే అయినా మీరోడిపోయారా, లేదా?

నాగా : ఎప్పుడో.

కుల : ఎప్పుడోడిపోయారు? ఎలా ఓడిపోయారు?

నాగా : (గంభీరంగా) బొమ్మ ఏడ్చినపుడు, ఆశ్రయం ఇచ్చినప్పుడు!

కుల : (కలవరపడి) తెలివితక్కువ వాగుడుతో మీకు చికాకు కలిగించాను. క్షమిస్తే గాని యీ పాదాలు వదలను. (దండప్రణామంచేసి కాళ్ళుపట్టుకొంటుంది )

నాగా : అమ్మా, కులపాలికా! నీవు కృతార్థవమ్మా భగవానుడు మంజుశ్రీ నిన్నను గ్రహించాడమ్మా! ఏదీ నీ ఎడమచేయి ఒకసారి చూడనీ నీకు సంపూర్ణ స్వాస్థ్యం చిక్కింది.

338 కుల . నన్ను ఈవిహారంనుంచి, పంపివేయటానికి అంటున్నారు నేను పోను. పోవాలని లేదు మా అత్తయ్య ఏమంటుందో ఆలోచించారా? 'ఓసి పాపిష్ఠురాలా, ఏదోచేసి ఉంటావు అందుకే ఆ పూజ్యపాదులు విహారంనుంచి తరిమివేశారు,' అంటుంది అసలు ప్రాణాలతో ఉండనిస్తుందా అంట?

నాగా : (నవ్వుతూ) స్వాస్థ్యం కోసమే కదా వచ్చావు? ఆ స్వాస్థ్యం చిక్కింది. ఇంక భయమందేనికి? నీ చెలికత్తె బుద్ధపాలితను పిలువు, చెబుతాను

కుల : ఏమని? ఈపిల్ల ఇక్కడ ఉండదగదు అనేగా?

నాగా : (నవ్వుతూ) ఆఁ.

కుల : భగవన్, భగవన్!

నాగా : ఎందుకమ్మా అంతభయం? '' ఈమెకు సంపూర్ణస్వాస్థ్యం చిక్కింది. ఇక ఇక్కడ ఉండరాదు,'' అని చెబుతాను.

కుల . ఉండరాదా?

నాగా . ఉండటం మంచిదికాదు. భిక్షువుల నడుమ ఏకాకినిగా వయసు వచ్చిన పిల్ల ఉండరాదమ్మా!

కుల అయితే నిజంగా మీకుగూడ కోపమే

నాగా	ఇన్నాళ్ళు లేనికోపం ఇవాళ వచ్చిందా?

కుల	. అవును, తాతయ్యగారూ అనిపిలుస్తున్నాగా!

నాగా	పిలిస్తే?

కుల	తప్పుగా! సమంతభద్రులు చెవినిల్లు గట్టుకొని చెబుతూనే ఉన్నారు

నాగా	· నీభాష వారికి తెలియదు. వారిభాష నీకు తెలియదు తెలియక ఒకరి నొకరు నొప్పించు కొంటున్నారమ్మా!

కుల	అర్థం కాకపోవటానికి నేను పైశాచి, వారు శబరభాష మాట్లాడటం లేదే?

నాగా	: భాష ఒకటే అయినా, ఒకరిభావం ఒకరికి అర్థం కావటం లేదు.

కుల	: అయితే భాష తత్త్వం చెప్పదా?

నాగా	. లేదమ్మా, లేదు. తత్త్వం అనభిలాప్యం.

కుల	· తాతయ్యగారి వాక్యాలన్నీ గూఢ ప్రహేళికలే. అందుకే పండితులు కూడ గిజగిజ లాడుతారు

నాగా	· (నవ్వుతూ) గూఢ ప్రహేళికలా!

కుల	సందేహమా?

గంతాన గచ్ఛతి తావ దగంతా నైవ గచ్ఛతి।
అన్యో గంతు రగంతుశ్చ కస్తృతీయోహి గచ్ఛతి?॥

పోతున్నవాడూ పోవటం లేదు! పోవనివాడూ పోవటంలేదు! ఈ ఉభయులకంటె అన్యుడు మూడోవాడు ఎవడు పోతున్నాడంటే గూఢ ప్రవేళిక అవునా కాదా?

నాగా	. సరే కాని, ఒక సారి బుద్ధపాలితను పిలువుతల్లీ!

కుల	దేనికి?

నాగా	: ''వెంటనే యీఅమ్మాయిని ఏ మహారాజా చేతనో పెట్టవలసింది జాగుచేస్తే తరువాత బాధ్యత నాదికాదు.'' అని మీ అత్తయ్యకు చెప్పమని చెప్పాలి.

(లోపలినుంచి స్త్రీ కంఠం)

అమ్మా కులపాలికా!

కుల	. అదిగో! బుద్ధపాలిత పిలుస్తున్నది తాతయ్యగారూ! ఇదే మీకు చెప్పటం. ఇప్పట్లో నేను విహారం విడిచి వెళ్ళను. (నవ్వుతూ) నకర్తాఽస్తి, నభోక్తాఽస్తి, పుణ్యాపుణ్యం ప్రతీత్యజం.

(వెళ్ళిపోతుంది ఆర్యదేవుడు ప్రవేశిస్తాడు.)

ఆర్య : మానకలశులకు నమస్కారం

నాగా : నాయనా ఆర్యదేవా! నేడు నీకంఠంలో ప్రశాంతత వినిపించడం లేదు.

ఆర్య : ఎవరో శివగుప్తులట! మహాభౌముల పనుపున తమతో మాట్లాడ వచ్చారట!

నాగా : మహాభౌములా?

ఆర్య : అది వారన్నమాట

నాగా : అయితే ఆ వచ్చినవారు అమాత్యులై ఉంటారు

ఆర్య : శివగుప్తులను తామెరుగుదురా?

నాగా : లేదు. నామాట నాకు అప్పగిస్తున్నారంటే వచ్చినవ్యక్తి రాజానకు అత్యంత సన్నిహితులో అమాత్యులో కావాలి ఏదైనా స్థితిగతులు శుభోదర్కంగా కనిపించటం లేదు. రాజమంత్రులు విచ్చేశారు మీసాన్నిధ్యం వేడుకొంటున్నా మని వృద్ధభిక్షువులను త్వరగా పంపు తరువాత ఆగంతుకులను తోడ్కొనిరా.

ఆర్య · ఇదివరకే ఆపని చేశాను అదిగో సంగీతి ఘంటిక. (గంభీర ఘంటారావం వినిపిస్తుంది).

సమంతభద్రులు, శాంతిమూలురు, తారానాధులు రానే వచ్చారు.

నాగా : సరే, నీవు శివగుప్తులను తోడ్కొనిరా!

సమ : మానకలశులకు నమస్కారం.

శాంతి : బోధిరూపులకు నమోవాకం

తారా : మాధ్యమక వాద స్థాపకులకు ప్రణామం.

నాగా . పూజ్యులందరికీ నమస్కారం. మహారాజా వద్దనుండి ప్రణిధులు వచ్చారు. దానికే యీసమావేశం.

ఆర్య : (శివగుప్తునితో ప్రవేశించి) మహాభిక్షువులకు నమస్కారం.

భిక్షులంతా: సంబోధిరస్తు!

ఆర్య : ధన్యోఽస్మి, అయ్యా, వారే పూజపాదులు నాగార్జునులు, వీరి నామధేయం శివగుప్తులు. మరి నాకు సెలవా?

నాగా : వత్సా, ఆర్యదేవా! భిక్షువులకు రహస్యాలా? నీవూ కూర్చో, అతిధులకు స్వాగతం. "లోకేశ్వరోఽను గృహ్ణాతు!" ఆ ఆసనం అలంకరించండి

(శివగుప్తుడు చిడిముడి పాటుతో చూస్తూ నిలబడతాడు)

నాగా : సముచిత సత్కారాలు చేయలేనందుకు చింతిస్తున్నాము తాము సమాసీను లైతేగాని వీరు కూర్చోరు

శివ : అలాగే త్రిసముద్రపీతతోయ వాహనులు సర్వరాజలోక మండల ప్రతి గృహీత శాసనులు, వినివర్తిత చాతుర్వర్ణ్య సంకరులు, రామకేశవార్జున భీమసేన తులిత పరాక్రములు శ్రీశ్రీశ్రీ శాతకర్ణి మహారాజులంగారు . .

నాగా : (మధ్యలోనే అందుకొని) ఇటీవలనే పశ్చిమోత్తర జైత్రయాత్ర నిర్విఘ్నంగా ముగించుకొని వచ్చారని విన్నాము భిక్షులోకం ఎంతో ఆనందపడ్డది వారికి కుశలమే కదా?

శివ : ఆఁ, కుశలమే

నాగా . రాజర్షిపత్నులు బాలశ్రీగారు నిరామయులే కదా?

శివ వారికీ భద్రమే భిక్షుగణాన్ని ముఖ్యంగా మిమ్ము సార్వభౌములు ఆజ్ఞాపిస్తున్నారు

ఆర్య . (చకితుడై) ఆజ్ఞాపిస్తున్నారా?

నాగా · (నిబ్బరంగా) ఆర్యదేవా! పాలకులు ఆజ్ఞాపిస్తారు పాలితులు శిరసావహిస్తారు, ఇది లోకధర్మం, నేడు క్రొత్తగా ప్రొద్దుపొడవలేదు. (శివగుప్తునితో) అయ్యా ఇంతకూ ఏమని వారి ఆజ్ఞ?

శివ : రాజ్య మభిరక్షితమైతేనే ప్రజలకు శాంతిభద్రతలు, శ్రద్ధావంతులకు నిష్ఠానుష్ఠానాలు ఆ అభిరక్షణకే మా జైత్రయాత్రలు, మాసైన్య విజృంభణలు. మావీర భటులకు మీ భిక్షువుల అమృతగుళికలు, ప్రాణరక్షకోచా చారాలు, ఆవశ్యకాలు. అందువల్ల భిషగ్వరులైన మీ భిక్షువులెల్లరూ మాస్కంధావారం అనుసరించాలని మాకోరిక 341

ఆర్య తాము సత్కార్యవాదులా, అసత్కార్యవాదులా?

శివ (తటపటాయించి) మేమా? ఎప్పుడూ సత్కార్యవాదులమే.

ఆర్య అయితే ఒకప్పుడూ అన్న భక్షకులు కాదన్నమాట.

నాగా కాణదేవా! ఏమది? స్థానాస్థానాలు లేవా? అతని మాటలు మరచిపోండి బోధిసత్త్వులు విన్నారుగా!

సమ స్కంధావారం అనుసరించటమంటే ఆయుధ ధారణం అనివార్యమే కదా?

శివ · అనివార్య మనలేము కాని అవసరం కావచ్చును

తారా · భటనైపథ్యం సంతరించుకోవాలిగదా?

శివ . (అపోహపడి) ఆసంశయ మక్కరలేదు మహారాజులే యేర్పాటు చేస్తారు.

నాగా · (విషాదంగా నవ్వుతాడు)

ఆర్య · గురుదేవులు క్షమించాలి శివగుప్తుల వారు ఒక్క గడియసేపు దిగంబరులై నాట్యం చేయగలరు

శివ (కత్తిదూస్తూ) నాట్యం చేయించగల ధీ రుడెవడిచ్చట?

శాంతి . మీవలె మేము ప్రవర్తించమనేకాదా అట్లంటున్నది?

శివ · ఏమన్నాము!

శాంతి . వస్త్రపరిత్యాగం మీకెట్లో చీవర పరిత్యాగం మాకట్లు

శివ · చీవర ధారణం ఆవశ్యకం కాదే?

ఆర్య · పశువులకుకూడ వస్త్రధారణం ఆవశ్యకం కాదు

సమ వత్సా ఆర్యదేవా! భిక్షువులకు పరుషాలు నిషిద్ధం. నీవు ఒరులకు చెప్పదగిన వాడవే కాని చెప్పించుకోవలసిన వాడవు కావు!

నాగా . ఆవేశాలవల్ల ఎవరికీ ప్రయోజనం లేదు శివగుప్తులవారు ఒకటి గుర్తించవలె జీవుల శోకాక్రందనలు వినలేక కరుణామయులై మహాయాన భిక్షువులు చీవరాలు గ్రహించారు ముండిత మస్తకులై భిక్షాపాత్రలను పట్టారు. దీక్షతో శక్తివంచనలేక సత్త్వసముద్ధరణకోసం దిగంతాలదాక తిరుగుతున్నారు భూలోకాన్ని స్వర్గలోకంగా, సంసారాన్ని నిర్వాణంగా మార్చాలని యత్నిస్తున్నారు ఈ ప్రారంభాన్ని మాన్పి, ద్వేషాగ్నులను ప్రజ్వరిల్లజేసి, జీవన మారణహోమాలు సాగించవలసినదని వారిని శాసిస్తున్నారు ఇది న్యాయ్యమా! శ్రేయోదయకమా?

342

శివ : కర్మసన్న్యాసం శ్రేయోదాయకమా?

నాగా · ఎవరు కర్మను త్రోసిపుచ్చారు?

శివ . భిక్షాటనమేమో? నిర్వాణానికి రాజమార్గం కాబోలు!

ఆర్య · అర్థమయింది!

శివ : ఏమిటది?

ఆర్య : కటకంలో భిక్షాటన నిషేధం కారాగార పూరణం

శివ . భిక్షువులను నిషేధించి బంధించారా?

నాగా అశ్వమేధ రాజసూయ నరమేధ పరాయణులకది అశ్రుతిగోచరమే. గత మిప్పుడు త్రవ్వటం అనావశ్యకం మహారాజు లిప్పుడు భిక్షువుల సాయం కోరుతున్నారంటే వారు కర్మిష్ఠులో కర్మభ్రష్టులో చెప్పనక్కరలేదు ఇక్కడ విహారంలో ఉన్నది ఏనాడో ఉపసంపద పొందిన భిక్షువులు, విద్యార్థులు,

చికిత్సకై వచ్చిన రోగులు  రోగులు కాని, విద్యార్థులుకాని మహారాజునకు ఉపయోగపడలేరు

శివ  అవును  అందుకే సార్వభౌములు భిక్షువరుల సేవనే అంగీకరిస్తున్నారు.

ఆర్య  . (కినుకతో) అంగీకరిస్తున్నారా?

నాగా  . అది రాచవారి మాటతీరు. విషయమది కాదు. సర్వసత్త్వ సముద్ధరణ దీక్షితులను పాక్షికదృష్టి సముపహతులై చికిత్సాపేక్షకులను మృత్యుముఖాన త్రోచి చీవరాలు పరిత్యజించి ఆయుధపాణులై స్కంధావారాన్ని అనుసరించమనటం ధర్మంకాదు  మహారాజులకు శ్రేయోదాయకం కాదు. ఆసేతుశీతనగ విస్తృత సామ్రాజ్యభారవహన క్రియాభిలాషులకు అభిమతామూ కాదు, అభిహితమూ కాదు.

సమ  : ఆచార్యులవారు చెప్పినది సత్యం.

తారా  : శుభోదర్కం.

ఆర్య  : మీకు, మాకూ, ఎల్లరకూ.

శివ  ఇంతకూ  శాసనాధిక్కారం శుభోదర్కమనే కదా మీ భిక్షుకలోకం అభిప్రాయం?



నాగా  · అట్లేల చెప్పుకోవలె?

శివ  ఎట్లు చెప్పుకోవలె?

నాగా  బౌద్ధమేనాడూ రాజసేవకులకూ ఋణగ్రస్తులకూ, రోగపీడితులకూ, ప్రవ్రజ్య అనుగ్రహించలేదు  రాచరికంపై కత్తికట్టలేదు  సర్వత్ర భిక్షువులు సుఖశాంతులు కోరుతున్నారు  వానికోసమే పాటుపడుతున్నారు. మీ ప్రభువులు మరొక విషయం ఆలోచించుకోవాలి. తమకు మతమే కావాలో, మహాసామ్రాజ్యమే కావాలో నిశ్చయించుకోవాలి. మతమే కావాలంటే మహాసామ్రాజ్యం దక్కదు. ఈ మాట ప్రభువు హితంకోరి చెబుతున్నాను.

శివ  : బెదిరిస్తున్నారా?

నాగా  . (విషాదంగా నవ్వుతూ) బడుగు బిచ్చగాండ్రు బెదిరించగలరా? నాతాత్పర్యం తమకుస్పష్టం కాలేదు  కాస్తఓర్పు అవసరం. జీవితంలో మూడంశాలున్నవి – ఒకటి పరహితం, రెండవది స్వహితం  మూడవది ఆత్మ హితం, లేదా మోక్షం. వీటినే దానశీలం, క్షాంతివీరం ధ్యానప్రజ్ఞలు అంటారు  బౌద్ధపరిభాషలో ఇవే పారమితలు  మతాలేవైనా, అభిమానాలెట్లున్నా దానశీల క్షాంతివీరాలు మానవ

మాత్రులకు సర్వసామాన్యాలు మతంపేర్లుచెప్పి వీటిని అతిక్రమించేవారు పరద్రోహులే కాదు ఆత్మద్రోహులు. నిజమైన మతం ధ్యానప్రజ్ఞా సమ్మితం ఈ మతంలో ఆత్మ శాసనం తక్క బాహ్యశాసనం చెల్లరాదు

భిక్షు · చెల్లదు.

శివ . ఇంతకూ సారాంశం భిక్షువులు రాజశాసనం పాటించరనే కదా?

నాగా . అది అపార్థమే అవుతుంది జాతి కులమత దేశాలతో నిమిత్తం లేక జీవకోటికి సేవచేయటానికి బద్ధ కంకణులైన బౌద్ధులు చీవరాలు పరిత్యజించి రాజపరివారం కాలేరు కాని మహారాజునకు తోడ్పడటానికి ఎల్లప్పుడు సంసిద్ధులే

శివ ఏవిధంగా?

నాగా క్షతగాత్రులను మా విహారానికి ఎవరు పంపినా మాభిక్షువుల పరిచర్య తప్పక లభిస్తుంది.

శివ . శత్రువులు పంపినా ఉపచరిస్తారు అంతేకదా?

నాగా . శ్రీపర్వత మెక్కడ ఉన్నది? మహారాజులవకాశమిస్తేకదా క్షతగాత్ర శత్రువులకు ప్రవేశం? పూజ్య భిక్షువులేమంటారు? అంతేకదా?



సుమ : మానకలశులు చక్కగా చెప్పారు

శివ : మరి మేము బయలుదేరవచ్చునా?

నాగా : మంచిది మహారాజునకు జయముగుగాక. పూజ్యులారా విహారద్వారందాక పంపిరండి.

శాంతి : సమంత, తారా. భగవన్, అలాగే.

(ముగ్గురు భిక్షువులు శివగుప్తుడు నిష్క్రమిస్తారు )

ఆర్య : ఆచార్యులవారు ఆశీర్వదించారు!

నాగా ఎవరిని?

ఆర్య · ఈ నోటితో చెప్పలేనివారిని, చెప్పరాని వారిని

నాగా · సంబుద్ధులు కరుణార్ణవులు ప్రజ్ఞావంతుడు వ్యగ్రుడు కారాదు. బుద్ధం శరణం గచ్ఛామి.

తెర

బొమ్మ ఏడ్చింది

## నాలుగు

విహారం ఇలకోళ్ళ చప్పుళ్ళు ఉండుండి, పెద్ద పెట్టున ఉరుములు, పాదాల సవ్వడి. అప్పుడే సమాధ్యవస్థనుంచి మేల్కొన్న నాగార్జునుడు కన్నులు విచ్చి ప్రాంతద్వారా భూమివైపు చూస్తాడు

నాగా . ఎవరది? ... ... వత్సా, ఆర్యదేవ! నీవేకదా? రావయ్యా, రా!

ఆర్య : గురేదేవులకు నమస్కారం

నాగా . యశస్వీభవ! వెలుపలనే నిలబడ్డావు?

ఆర్య · తమ ప్రశాంతతకు భంగం కలిగించటం లేదుకదా?

నాగా ఇంకెంత ప్రొద్దున్నదో?

ఆర్య గౌరకొయ్యలిప్పుడే పాడిచాయి

నాగా ఇప్పుడు వైద్యశాలలో ఉండవలసిన వాడివు కదా?

ఆర్య అవును ఉపాధ్యాయులకు అన్నీ గురుతే రాహులభద్రుని నిలిపి వచ్చాను.

నాగా నాయనా నీ మనస్సేదో వ్యాకూలంగా ఉన్నంట్లుంది! కారణం?

ఆర్య ఏమీలేదు ఈనాడు ఎటు చూచినా మహాయానానికి శత్రువులే ఇటు శ్రావక యానులు, అటు నైయాయిక వైశేషిక సాంఖ్యులు, మరొకవైపున శాక్తేయులు, వేరొకవైపున నిర్గ్రంధులు వీరు చాలరేమోనని మహాభౌముడీ శాతకర్ణి కూడ కత్తులు నూరుతున్నాడు ఒక్కవాదబలమే రక్షకమైతే నావంటి వాడొకడు చాలు కాని శాత్రవం పశుబలంతో విజృంభిస్తున్నది. ఈమహాయాన మేమవు తుంది? ఈ విహారాలు, ఈ భిక్షువులు, ఈ మహోన్నత శాస్త్రసంపద నామ రూపాలు లేకుండా మాడిపోవలసిందేనా? కొండంత దైవం మీరుండగా ఇది జరగటం దారుణం మీకు ప్రజ్ఞ ఉన్నది ప్రాభవం ఉన్నది. మహాయానంలో అచంచల శ్రద్ధ ఉన్నది. అయినా ఉపేక్షిస్తున్నారంటే ఏమనుకోవాలి, ఈ మహాయాన భిక్షుకోటి దౌర్భాగ్యం కాకపోతే!

నాగా . నాయనా, ఇప్పుడు మాటాడింది ఆర్య దేవుడేనా?

ఆర్య : కాదు కాణదేవుడు అదేకదా మీరనబోతున్నది?

నాగా : ఏమి జరిగిందేమిటి?

ఆర్య మీకు తెలియకుండా ఈ శ్రీ పర్వత విహారంలో ఏమైనా జరుగుతుందా? జరగటానికి వీలుందా?

నాగా నాయనా, ఆమూల బిక్షుదండం ఉన్నది కాస్త అందుకో

ఆర్య (జంకుతో) దేనికి?

నాగా · నాకూ ఒకసారి విలయతాండవం చేయాలని ఉన్నది

ఆర్య : క్షమించండి, ఆవేశంలో ఏదో అనివేశాను

నాగా : స్తిమితపడ్డావు కదా! ఇప్పుడు చెప్పు ఏమి జరిగింది?

ఆర్య : పదినాళ్ళ క్రిందట నేత్రవైద్యం కోసం ఒక రోగి వచ్చాడు.

నాగా : యువకుని వెంట బెట్టుకొని వచ్చిన వృద్ధేకదా? పేరేమిటి చెప్మా? ఆ సోమదేవుడేనా?

ఆర్య : అవును. కాని అతని అసలుపేరు అదికాదు.

నాగా : మరి

ఆర్య . వాత్స్యాయనుడు.

నాగా · వాత్స్యాయనుడా? ఏ వాత్స్యాయనుడు?

ఆర్య . ఎవని వాదఖండన కోసం విగ్రహవ్యావర్తిని తద్వ్యాఖ్య వ్రాశారో ఆ వాత్స్యాయనుడు స్వమత సమర్థన కోసం వితండవాదం విధించిన క్షుద్రుడు, పాలకులకు ధర్మా ధర్మాలతో పాపపుణ్యాలతో ప్రమేయం ఉండరాదని ఘోషించిన అనర్థ శాస్త్రకర్త



నాగా : అలాగా!

ఆర్య . అంతేకాదు. శాతకర్ణికి ప్రధానామాత్యుడు

నాగా : వాత్స్యాయనుడన్న మంత్రి ఉన్నట్లు వినలేదే?

ఆర్య వాత్స్యాయనుడన్నది మారుపేరు. అసలు పేరు మల్లనాగుడు

నాగా ఇదంతా నీకెలా తెలిసింది?

ఆర్య . అతని ప్రవృత్తి మొదటినుంచి అనుమానాస్పదంగా తోచింది నాల్గునాళ్ళ క్రిందట రాత్రివేళ దుర్భరమైన నొప్పులంటే మాదకద్రవ్య మిచ్చాను ఆ మత్తులో పడికొంత వాగి వేశాడు!

నాగా అతని పారం అతనికే అప్పగించావన్న మాట!

ఆర్య గురుదేవులు క్షమించాలి ఆస్థితిలో ఉన్న రోగికి మరల ఆ మందే ఇవ్వటం శ్రేయోదాయకం కాదని రాత్రులు నేనే పర్యవేక్షక విధి స్వీకరిస్తూ వచ్చాను బిగబట్టుకొని యీ రేయే నిద్రలో తతిమ్మా విశేషాలు కలవరించి వేశాడు

నాగా లలాగా?

ఆర్య ఇట్టివానికి స్వాస్థ్యం చేకూర్చి పంపటమంటే మృత్యువును బౌద్ధంపైకి ప్రయోగించటమే కదా?

నాగా . ఇప్పుడు ఏమి చేదామంటాము?

ఆర్య అపకారం చేయాలని యీ నోటితో చెప్పలేను. కాని చికిత్స మావల్ల కానిపని యని చెప్పివేసి వెంటనే విహారంనుంచి పంపివేయటం శ్రేయోదాయకమని తోస్తున్నది, ప్రక్కలో కాలనాగానికి తావివ్వలేము.

నాగా . (మాటాడడు )

ఆర్య : ఇంకా ఆలోచిస్తున్నారా?

నాగా : మనం పాషండులమనీ, పాపకర్ములమనీ ఆయన నమ్మకం. బౌద్ధ ఖండనానికి బుద్ధిబలం రాజకీయబలం సర్వం వెచ్చిస్తున్నాడు. రాజు మనసు విరిచి, చెరిచి, బౌద్ధులపై కత్తి కట్టించాడు అట్టివాడు చూస్తూ చూస్తూ విహారానికి ఎందుకు వచ్చినట్లు?

ఆర్య మనకు కళ్ళులేవనీ! ఉన్నా తెలికగా వంచించవచ్చునన్న దురహంకారం ఉండవచ్చును. లేదా బౌద్ధులు అహింసావ్రతులు కనుక తనకెట్టికీడు చేయరన్న నమ్మిక ఉండవచ్చును. కాదా రాజకార్య ప్రేరితుడై చికిత్స మిషతో విహార వృత్తాంతం కనిపెట్టటానికి వచ్చి ఉండవచ్చును లేదా సుఖజీవనలాలసుడై ఇతర వైద్యాలవల్ల రోగోపశాంతి పొందలేక తెగించి ఎలా జరిగితే అలా జరగనిమ్మని వచ్చి ఉండవచ్చును అన్నట్లు మరొక విషయం కులపాలిక ఎవరోగుర్తించారా? భగవన్! విహారమంతా గూఢచారి మయమే కల్లాకవుడెరుగని భిక్షువులపై గూఢచారులా? ఎట్టి దుర్గతి దాపురించింది! 347

నాగా : కులపాలిక ఏ రాజపుత్రికో అయివుంటుంది, లేకపోతే ఆ చనవు దర్పం, సంస్కారం ఉండవు నీకు మరే విశేషాలైనా తెలిసినవా?

ఆర్య : ఆమె ఎవరోకాదు ఉపాసిక బాలశ్రీ మేనగోడలు వాసిష్ఠి భవిష్య సామ్రాజ్ఞి.

నాగా : ఎలా తెలిసింది?

ఆర్య ఆమె సన్నిధిలోనే కటకంలో మమ్ము రాజభటులు బంధించారు. బాలశ్రీ గారు మమ్ము వదలి పెట్టించినప్పుడు ఈమె వారి వద్దనే ఉన్నది పేరుకూడ అప్పుడే తెలిసింది

---

నాగా . వింతగా ఉన్నది ఉపాసిక తాను నేరుగా తీసుకొని వచ్చి ఉండవచ్చును కార్య భారంవల్ల వీలుపడకపోతే పరిచారిక నిచ్చి పంపవచ్చును

ఆర్య · ఆమెకూడ మనలను శంకిస్తున్నదంటారా?

నాగా : లేదు. బౌద్ధమతమన్నా, నేనన్నా, ఎంతో భక్తీ శ్రద్ధ

ఆర్య : నిజమే లేకపోతే గౌరవించి మమ్ము విడిచి పుచ్చవలసిన పనిలేదు.

నాగా . మరి వీటన్నిటికీ సమన్వయం?

ఆర్య . అదే తోచటం లేదు.

నాగా : (నవ్వుతూ) జీవితం తర్కశాస్త్రమంత సుగమం కాదు తండ్రీ!

ఆర్య : (రిచ్చవడి) మరి యీ నాటకానికి అర్థం?

నాగా : గౌతమి కొడకునకు రాజ్యమప్పగించింది రాజు మతవివశుడై మంత్రులకు తల తాకట్టు పెట్టాడు. మంత్రుల దురహంకారంతో మనపైన కత్తికట్టారు భిక్షాటనం నిషేధించి కటకంలో భిక్షువులను, ఉపాసకులను బంధించారు అది యెరిగి నేను రాజునకు హితోపదేశం చేయవలసి వచ్చింది. దానికి శాతకర్ణి
348 నిప్పులు త్రొక్కి ఉంటాడు వెంటనే యీ విహార నిర్మూలనం తలపెట్టి ఉంటాడు ''నాయనా మరొకసారి ఆలోచించుకొమ్మని గౌతమి హెచ్చరించి ఉంటుంది మాతృభక్తి శాతకర్ణికి అవరోధమైపోయింది బౌద్ధుల రాజద్రోహాన్ని నిరూపించి తల్లిని ఒప్పించటానికి శివగుప్తునిచే ఆసందేశం పంపించాడు.

ఆర్య : శివగుప్తుని రాక ఆమె ఎరుగునంటారా?

నాగా : పిచ్చివాడా! నిరూపించ పూనుకొన్నవాడు పొక్కుతాడా?

ఆర్య · మరి మారుపేరుతో వాసిష్ఠిని ఇక్కడకేల పంపినట్లు?

నాగా : మన భిక్షువుల సంగతి ఆమెకు తెలుసు కోడలికి స్వాస్థ్యం చిక్కుతుంది వాసిష్టిని గుర్తిస్తే స్థితిగతులను ఆలోచించి రాజప్రాతికూల్యం గ్రహిస్తాము రాజ రహస్యావిష్కారానికి తాను నిమిత్తమాత్రురాలు కాదు గదా!

ఆర్య : అయితే శ్రీబాలశ్రీ మనకు ఉపకారమే చేసిందంటారు?

నాగా . సందేహమా?

ఆర్య . మరి యీదుష్టగ్రహమే అందోళనకరంగా ఉన్నది. ఒడలెల్ల కళ్ళుచేసుకొని

బొమ్మ ఏడ్చింది

చూస్తూన్న మల్లనాగునకు వాసిష్ఠి కంటబడకపోదు అతడుపోయి రాజునకు కలపన గంప అల్లి తలకు తగిలించక మానడు ఈ అనర్థం ఎలా పరిహరిస్తారు?

నాగా  అతడు వాసిష్ఠిని ఇదివరకే గుర్తుపట్టలేదని నమ్మకమేమిటి?

ఆర్య : పంపివేసినా ప్రమాదమేనంటారు. అయినా పాములకు పాలుపోయటం నాకిష్టంలేదు.

నాగా · వాసిష్ఠికి స్వాస్థ్యం చిక్కింది ఈ మాట చెప్పి "నీకు ఇంటికి పోవచ్చునమ్మా" అన్నాను ఆ అమాయక విహారం విడిచిపెట్టనంటూ మొండికెత్తి కూర్చున్నది.

ఆర్య : ఏమో నాచిత్తం కలవరపడుతున్నది

నాగా : వత్సా నీ సిద్ధాంతాన్ని నీవు విస్మరిస్తున్నావు. మనకోసం మనం ఆశించవలసినది, సాధించవలసినది ఏమున్నది?

(సన్నగా ఘంటారావం వినిపిస్తుంది.)

ఆర్య : ఏమిటి? ఈవేళ కాని వేళ ఘంటారావమా? గురుదేవుల విశ్రాంతి సమయమని తెలియదా?

నాగా : నీవలె ఎవరో ఉద్వేగభాజనులు వెళ్ళి తోడ్కొనిరా. 349

( ఆర్య దేవుడు నిష్క్రమిస్తాడు.)

నాగా : (నిట్టూర్చి) తథాగతులు కరుణాగర్భులు. వారి విలాసాలు చిత్రాతిచిత్రాలు.

సమ, శాంతి : ఆచార్యపాదులకు నమస్కారం.

నాగా : పూజ్యులకు నమస్కారం. ఈ వేళ వచ్చారు?

(అన్యదేశీయులు ప్రవేశిస్తారు.)

ప్లాటి : పరిత్రాయస్వ, పరిత్రాయస్వ, భగవన్, త్వమేవ శరణమ్, త్వమేవ శరణమ్.

అన్యదేశీయులు నలుగురు (మండెగాలు వైచి తలలొగ్గి)

బుద్ధం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి

( ఉచ్చారణ ముద్దగా ఉంటుంది )

నాగా  పాయాద్వః పద్మపణిః అదేమి తలలు వాల్చి వారు మండెగాలు వేశారు?

ప్లాటి : స్వదేశీయః ప్రణామ విధిరయం భగవన్!

---
జి వి కృష్ణరావు

నాగా    అప్యవగమ్యతే భాష్యతేచ సంస్కృతమ్?

ప్లాటి  . మయైన భగవన్

నాగా    సత్వైభి ః?

ప్లాటి    క్షమ్యతాం దేశభాషామపినతే జానంతి

నాగా  : భాష తెలిసిన మీరు సంస్కృతం వాడుతున్నారు?

ప్లాటి  · భగవానుని రచనలన్నీ సంస్కృతంలో ఉన్నవి కనుక తమకు ఆభాష ప్రియతమ మనుకొన్నాను.

నాగా  : నాయనలారా! తథాగతులకు ఎల్లభాషలు ప్రియాలే ఎల్లరూ ఇష్టులే. తామంతా సుఖాసీనులు కండి.

ప్లాటి  · చిత్తం (అంతా కూర్చుంటారు.)

నాగా  · ఈ నిశాంతంలో విచ్చేసిన తమకేమి కావలె? ఈ భిక్షువు లేమి చేయగలరు?

ప్లాటి    అభయదానం.

నాగా  . ( ఆశ్చర్యంతో) వింతగా ఉన్నది. సమంత భద్రులకేమైనా తెలియునా?

సమ  : కొన్ని వందలమంది క్షతగాత్రులైన వీరి అనుయాయులు మన రేవులోని నావలలో ఉన్నారట. మన వైద్య సహాయం అభిలషిస్తున్నారు

నాగా  : వీరిని వెంటబెట్టుకొని వచ్చారు!

సమ  : మావల్లకాదని ఖండితంగాచెప్పాను. వినిపించుకోలేదు తమదర్శనం ఎలాగైనా ఇప్పిస్తేగాని వీలులేదని కాళ్ళావేళ్ళా పడ్డారు కాదనలేక ఇలా తీసుకువచ్చాను

నాగా  : తమపేరేమోకాని....

ప్లాటి  : నన్ను ప్లాటినస్ అంటారు.

నాగా  : ప్లాటినస్! వైఖరినిబట్టి చూస్తే మీరు మీ అనుయాయులు ఈ దేశంవారు కాదు.

ప్లాటి  . భగవన్, బౌద్ధులు జగత్కుటుంబులని ధర్మదుందుభి ఉద్ఘోషిస్తున్నది ఆ ఘోషణం విని గంపెడాసతో వచ్చాము

నాగా  : మా ధర్మం మాకు ఉపదేశించటానికి!

ప్లాటి  . ప్రత్యక్ష బుద్ధభగవానులు మీరే అనుగ్రహిస్తే మాకు దిక్కెక్కడ? సానుష్ఠానంగా ధర్మం తెలుసుకొందామని తమసరన్నిధికి వచ్చాము

నాగా    అన్నిటికంటె మనోవాక్కాయ కర్మశుద్ధి బౌద్ధులకు అత్యంత ప్రధానం మీకీ విషయం తెలిసే ఉంటుంది!

ప్లాటి   చిత్తము  యథార్థం నివేదించాలనేకదా పూజ్యుల ఆశయం  అలాగే, కొంచం తాము సానుభూతితో ఆలకించాలి. నేను రోమకుడను  భారతవర్షం తత్త్వ విచారానికి ఆలయమని విని జిజ్ఞాసతో భూమార్గాన ప్రయాణాలు చేసి చేసి గాంధారం చేరుకొన్నాను  అక్కడ బుద్ధదేవుల ధర్మఘోషణం విని తక్షశిల చేరాను  అచట  సంస్కృతం  తర్కం  అభ్యసించాను. అక్కడే భగవానుని కారికాయుగం విన్నాను

ఆర్య   ఏ కారికలు?

ప్లాటి  :  నిర్వాణస్యచయా కోటిః కోటిః సంసరణస్యచ।
నతయో రంతరం కించి త్సుసూక్ష్మమపి విద్యతే॥
న సంసారస్య నిర్వాణా త్కించిదస్తి విశేషణమ్।
న నిర్వాణస్య సంసారా త్కించిదస్తి విశేషణమ్॥

ఈ వాక్యాలు నాలో ఎన్ని ఆలోచనలు, ఎన్ని భావనలు రేపినవో చెప్పలేను. ఒక్కసారి మీ పాదాలచెంత వ్రాలి బుద్ధ బోధామృతం క్రోలాలనిపించింది  తక్షశిల వదలి పయనించి పయనించి బరుకచ్ఛం చేరుకొన్నాను.



ఆర్య   అచట వీరితో పరిచయమయిందా?

ప్లాటి  :  అవును  ఈ  యవనులతో  పరియమయింది  వీరిది మాది ఒకేదేశం కాక పోయినా ఇరుగుపొరుగు వారలం కావటంవల్ల మాతృదేశంలో ప్రవేశించినట్లం యింది  వీరితో ఉన్నాను  స్నేహం పెరిగింది  జీవిక వీరితో అల్లుకుపోయింది.

ఆర్య  :  అప్రస్తుతం విస్తరిస్తున్నారు

ప్లాటి  :  వీరు యవనభూపతుల సైన్యాధికారులట  తమ ప్రభువు పరాభూతికి ప్రతీకార చర్యగా గౌతమీపుత్ర శాతకర్ణి సైన్యాలను పెద్దపెట్టున ఎదుర్కొన్నారు. వేల కొలది క్షతగాత్రులయ్యారు  ప్రముఖనాయకులు సైనికులు గాయపడి చేసేది లేక  చీకటి చాటు  చేసుకొని  తప్పుకొన్నారు  పగళ్ళు  నిర్జన  ప్రదేశాలలో గడుపుతూ రేయి ప్రయాణాలు సాగిస్తూ ఎలాగో ఇక్కడకు  చేరుకొన్నాము. ఇదీ యథార్థ వృత్తం. ఆపైని భగవానుని చిత్తం.

సమ  .  రిక్త పయాస.

ప్లాటి  .  ఏమని సెలవు?

ఆర్య  ·  శాతకర్ణులకు లొంగి ఉంటే ఈ ప్రయాస తప్పేది కదా!

ప్లాటి : అంతకంటె సజీవాగ్ని పర్వతకుక్షిలోదుముకటం మేలు అతని క్రౌర్యం తమకు తెలియదు. ఆ హింసాకాండ ముందు నరకయాతనలు స్వర్గభోగాలు

నాగా : నాయనా ప్లాటినస్! ఇప్పుడేమీ చేయమంటావు? రాజసేవకులు ఋణగ్రస్తులు మున్నైనవారు ప్రవ్రజ్యకు అర్హులుకారు

ప్లాటి : భగవన్! తాము ఆప్తులని వచ్చాము ఆప్తులంటే పంచభయాతీతులుగదా వీరంతా ఉపాసకులు. శస్త్రం విడిచి రణభూమి పరిత్యజించినవాడే వీరి రాజ సేవకత్వం అంతరించింది. వీరిప్పుడు ఎవరికి సేవకులు? యవన భూపతికా ఆంధ్రసమ్రాట్టునకా? అది అలా ఉంచండి బుద్ధదేవుని పవిత్ర చరిత్ర తమకు తెలియనిది కాదు. దేవదత్తుని అమ్ముతోకూలిన హంసాన్ని గౌతమదేవులు కరుణించి కాపాడారు. నాడు మృగయాధర్మంకూడ వారికి అడ్డుపడలేదు. ఆ మహాకరుణ నేడు తిరిగి గర్జిస్తుందనీ, కొంగ్రొత్త మెఱపుతో దారిచూపు తుందనీ ఆనందం వర్షిస్తుందనీ వచ్చాము వారివి నేడు మోడ్పు కేళ్ళుకాని, ఆయుధాలు కావు. అవి ఆర్తనాదాలు కాని యుద్ధగర్జలుకావు. మీరెలా సెలవిచ్చినా పాటించటానికి సిద్ధమే పూజ్యులు మాటాడరేమి?

352 సమ : నాయనలారా, ఈ శ్రీపర్వతవిహారం ఎక్కడున్నదో మీకు తెలియనిది కాదు. ఆర్తసత్వలోకానికి ఇంత వరకూ మేము చేస్తున్న సేవ స్వల్పాతి స్వల్పం ఈ సేవయైనా సాగరాదంటారా?

ప్లాటి : బోధపడ్డది. హతభాగ్యులారా లెండి. ఎక్కడికి పోయిన పొద్దెదురే!

ఆర్య : ఆగండి. బోధపడ్డదనేగా తామన్నది.

ప్లాటి : చిత్తం.

ఆర్య : ఏమని?

ప్లాటి : బౌద్ధం రిక్తబోధమనీ, క్రియాశూన్యమనీ, అధికారానుజీవనమనీ! ఇకపోయి వస్తాము. సెలవిప్పించండి.

సమ : సర్వేదుర్గాణి తరంతు!

ఆర్య : (వెటకారంగా) సర్వేభద్రాణి పశ్యంతు.

ప్లాటి : తప్పకుండా – ఆలోకంలో (వెళ్ళుతుంటారు.)

నాగా : ప్లాటినస్!

(వారు అలాగే వెళ్ళుతుంటారు.)

ఆర్య : ఆచార్య పాదులు పిలుస్తున్నారు

బొమ్మ ఏడ్చింది

ప్లాటి (ప్లాటినస్ అతని అనుయాయులు ఆగుతారు )

ప్లాటి తాముకూడ ఆశీర్వదిస్తారా?

నాగా లేదు మీరంతా శపథం చేయగలరా?

ప్లాటి ఏమని?

నాగా మా యవనత్వం మరచిపోతున్నామని.

ప్లాటి మరచిపోయాము (అతడు అనుచరుల వంక చూస్తాడు. వారూ ఆమాటే అంటారు)

నాగా : అహింసామార్గం వీడము.

ప్లాటి (అనుచరులతో) .- కలలో కూడా వీడము.

నాగా : దేశీయ శాసనాలను ఉల్లంఘించము

ప్లాటి : శిరసావహిస్తాము

నాగా : ఇచటి ప్రజల కష్టసుఖాలలో పాలుపంచుకొంటాము.

ప్లాటి : వారి కష్టసుఖాలే మాకష్టసుఖాలు... ... భగవన్ మధ్యలోనే ఆగారు 353

నాగా : ఆర్యసత్యాలు నాలుగే.

ప్లాటి · మాకు మేమే మరొకటి చేయదలచుకొన్నాము. ఇప్పటినుంచి మేము మహాయానాధి రూఢులము.

నాగా : ఈ భిక్షువులు కోరటం లేదు

ప్లాటి : మీరు చెప్పినవన్నీ ఒప్పుకొన్నాము ఆ మాఒక్కచనువు ఇప్పించండి

నాగా : సరే, క్షతగాత్రులను వైద్యశాలకు చేర్పవలెనని సమంతభద్రులకు, శాంతిమూలురకు మనవి.

సమ, శాంతి · భగవాన్ అలాగే.

(సమంతభద్రుడు, శాంతిమూలుడు, ప్లాటినస్ అతని అనుచరులతో నిష్క్రమిస్తారు )

ఆర్య : పూజ్యుల హృదయం దురవబోధము

నాగా · (అతి ప్రశాంతంగా) అలాకాదు నాయనా బుద్ధభగవానుల తత్త్వం దురవబోధమని చెప్పు

(తెర)

---

జి వి కృష్ణరావు

## ఐదు

రాజప్రసాద ద్వారం శివగుప్తుడు, నాగార్జునుడు, ఆర్యదేవుడు, ప్లాటినస్ ప్రవేశిస్తారు వారికి వినయంధరుడు ఎదురుపడతాడు

వినయ మహామంత్రులు శివగుప్తులకు స్వాగతం

శివ : వినయంధరా, ఇక్కడున్నావేమి?

వినయ : ప్రభువుల ఆజ్ఞ!

శివ : ఏమని?

వినయ : తమ్ముా, వీరిని వెంటనే ధర్మమందిరానికి తోడ్కొని రావలసినది అని

శివ . అలాగా!

వినయ : వెనుక వస్తున్న ముప్పురిలో పూజ్యపాదులు నాగార్జునులెవ్వరు? దరహాస చంద్రికలు కాసే ఆ ఉత్తుంగ శృంగమేనా?

శివ . (కర్కశంగా) ధర్మానికి చెవులేకాని కన్నులుండరాదు. దారి చూపుము.

354 వినయ . (చిడిముడిపాటుతో) మహామంత్రులకు గుడ్డివాడు దారి చూపుతున్నాడు.

శివ : వినయంధరా! నీకు మతి చాంచల్యం పొడమ లేదుగదా!

వినయ : (నాగార్జునకు ప్రణమిల్లి) భగవన్! కంచుకీ వినయం ధరః ప్రణమతి.

నాగా : స్వస్తి! రాజానుగ్రహ పాత్రం భవ! నాయనా ఉపాసిక బాలశ్రీ కెట్లున్నది?

వినయ . పూజ్యులు అలా అడుగుతున్నారేమి? మహాభట్టారిక గారు భిక్షుసందర్శనార్థం నాసికా విహారానికి నాల్గునాళ్ళ క్రిందటనే వేంచేశారు

నాగా : అలాగా!

ఆర్య · విచిత్రంగా ఉన్నది!

వినయ : వీరెవరు?

నాగా : ఆర్యదేవుడు, మా అంతేవాసి

వినయ · అయ్యా, నమస్కారం.

ఆర్య : మహాభట్టారిక మాసత్కారార్థం మిమ్ము నియోగించిందా.

వినయ : లేదు పూజ్యులుగదా అని నమస్కరిస్తున్నాను

ప్లాటి : పచ్చిమోసం!

వినయ : (ఆశ్చర్యంతో) పచ్చిమోసమా? వింతగా మాటాడుతున్నారు వీరెవరు నాయనా?

ప్లాటి : భిక్షువును. పూర్వాశ్రమంలో నన్ను ప్లాటినస్ అనేవారు

వినయ : ఇప్పటిపేరు?

ప్లాటి : ద్రోహులు.

వినయ : ఏమన్నారు, భవద్రోహులనే కదా?

ప్లాటి : (బిగ్గరగా) ద్రోహులు, ద్రోహులు, ద్రోహులు!

శివ : ఎవరది, ఏమది? ఇది రాజప్రాసాదం. బిగ్గరగా మాటాడరాదు. ఈ భిక్షువులకు జ్ఞానోదయ మెప్పటికో?

ఆర్య : ఇది రాజప్రసాదం. ఇస్, బిగ్గరగా మాటాడరాదు. సత్యం చెప్పరాదు. మనసులో కూడ అనుకోరాదు. ఇక్కడ ఉన్నది అశ్వమేధాగ్నిజ్వాల రాజసూయ యజ్ఞకీల, నరమేధ హుతాగ్నిమాల ఎప్పుడూ ఇక్కడ రోచిస్సులే. ఇంక జ్ఞానోదయానికి తావెక్కడ? మ్లేచ్ఛుడా! ఇంకా పూర్వ వాసనలు పోలేదు!

శివ · ఏమంటున్నావు? (చర్రున కోశం నుంచి కత్తిదూస్తాడు ) 355

ఆర్య : ఎంత మంత్రులైనా రాజప్రాసాదంలో కత్తులు దూయరాదు. ధర్మాధికారి శిక్షించని అపరాధులను చంపరాదు చంపలేరు అయినా తెలియక అడుగు తాను తెలియని యీ మ్లేచ్ఛునకు వైదిక ధర్మ ప్రాశస్త్యం బోధిస్తున్నాను. తప్పా!

శివ మరణోన్ముఖులు ఏమైనా ప్రేలుతారు.

నాగా నాయనా! పొడిచిన సూర్యుడుగూడ అస్తమిస్తున్నాడు పరుషాలకేమి భాగ్యం! అస్వస్థయై మహాభట్టారిక వర్తమానమంపితే వచ్చాము అనివార్య కారణాల వల్ల ఆయమ తీర్థాంతరం వెళ్ళారు. ఇంతదూరం వచ్చాము కమక అతిభౌములను చూచి వెళ్ళుతాము. తాము అనుగ్రహించి ఒకసారి వారి సన్నిధికి కొనిపొండి.

శివ అచటికే పోతున్నాము.

(విజయనాదాలు వినవస్తవి)

ఆగమనిలయ, విజయీభవ! ఏకబ్రాహ్మణ, విజయీభవ! విజితాసికాశ్మక ముళక సురరకుకురానూపా పరంతక ఆకరానర్త విషయధీశ్వర, విజయీభవ! వింధ్య పారియాత్ర శ్రీస్థాన మలయ మహేంద్ర చకోరాది పర్వత సుస్థితి సామ్రాజ్య ధౌరేయ,

విజయీభవ! పీతత్రిసముద్ర తోయవాహన, విజయీభవ వినివర్తిత చాతుర్వర్ణ్య సంకర, విజయీభవ! రామకేశవార్జున భీమసేన పరాక్రమక్రమ, విజయీభవ! శ్రీశ్రీశ్రీ గౌతమీపుత్ర మహారాజ, విజయీభవ!

శ్లాటి . ఎచటినుండి ఈ ధ్వని. వంధిమాగధులు కానరారు.

ఆర్య సింహద్వార మావలివైపున, మనం ఈవలివైపున ఉపద్వార సమీపంలో ఉన్నాము.

శివ : వినయంధరా, ప్రభువులకు మారాక నీవేదిస్తావా?

వినయ : చిత్తం (నిష్క్రమిస్తాడు)

శివ : అభిక్షుదండాలతో ప్రవేశించరాదు.

శ్లాటి : మరి ఈ భిక్షాపాత్రలు తమ కీయవచ్చునా?

ఆర్య : తగదు తగదు. వారికి కావలసినది పునుక పాత్రగాని దారుపాత్రకాదు.

శివ : అవును మహాదేవునకు కావలసినది పునుక పాత్రే త్వరలోనే సిద్ధిస్తుంది.

ఆర్య : అవును. ఒకటికాదు, అనేకాలు.

శివ : చింతచచ్చినా పులుసు చావలేదు

356 వినయ : (ప్రవేశించి) మిమ్మూ భిక్షువులను వెంటనే ప్రవేశ పెట్టవలసినదని ప్రభువుల యాజ్ఞ

శివ : ఇదిగో.

నాగా : నాయనా, వినయంధరా!

వినయ : ఏమి సెలవు?

నాగా : ఈ దండం ఉపాసిక బాలశ్రీకి చేర్చగలవా? ఎందుకయ్యా కంటతడి పెడుతున్నావు.

వినయ : (గద్గద కంఠంతో) మహాభట్టారిక ఉంటే.

నాగా · (నవ్వుతూ) రాచకొలువులో తలనెరిసినా ప్రయోజనం లేదయ్యా! ఇంతకూ చేరుస్తావుగా.

వినయ . గొంతులో ఊపిరి ఉంటే అలాగే

ఆర్య : వృద్ధులకు శ్రమ యిస్తున్నాము ఈ దండ యుగంకూడ చేర్పించండి అయితే మరొక మాటకూడ చెప్పండి భిక్షువులు ఒక్కసారికాదు ఎప్పుడూ అపరాధం క్షమిస్తూ ఉండవలసిన వారేనని

బొమ్మ పడ్డుంది

అలాగే మరి సెలవిప్పిస్తారా!

చు లోకేశ్వరః

(వినయంధరుడు నిష్క్రమిస్తాడు)

శివ జయము జయము మహారాజునకు

శాత . శివగుప్తులకు నమస్కారం ఆ పీఠం అలంకరించండి భిక్షువులెక్కడ?

శివ అదుగో మొదటి వ్యక్తి నాగార్జునుడు ఆ ఒంటి కంటి మానిసి ఆర్యదేవుడు ఆ మూడవవాడు ప్లాటినస్, రోమక దేశీయుడు భిక్షుక నామం తెలియదు

నాగా పూర్ణకామోభవ రాజన్!

శాత . ద్విజునకు అంత్యజుని ప్రణామం వలె ధర్మాధికారికి అభియోజితుని ఆశీస్సు స్వీకరించరాదు

నాగా ఇంతకుమున్ను ఎలా స్వీకరించారు? సముచితాసనమిచ్చి ఎలా గౌరవించారు?

శాత · ఏమంటున్నారు? శివగుప్త లభియోజితులా? ఎవరిచేత?

నాగా . మాచేతనే వారికి ప్రభువు లిచ్చిన ఆజ్ఞయేమో?



శాత బంధించికొని రమ్మని

శివ మహారాజా!

శాత వారిని చెప్పనీ.

నాగా మమ్మును బంధించలేదు ఇది రాజశాసనధిక్కారం. రెండు మహాభట్టారిక గారు అస్వస్థులుగా ఉన్నారనీ మాదర్శనం కోరుతున్నారనీ మమ్ము వంచించి తోడ్కొని వచ్చారు మహాభట్టారిక స్థలాంతరంలో సుఖమున్నారు. స్వాస్థ్య సంపన్నులైన రాజవంశీయులపట్ల అందున మహారాజ మాతవట్ల అమంగళ వచనం మహాపరాధం

శాత మల్లనాగు లేమంటారు?

మల్ల రాజభృత్యులు కలలోనైనా రాజాజ్ఞ ఉల్లంఘించరాదు రాజునకుగాని, వారి ఆత్మీయులకుగాని అశుభం ఆకాంక్షించరాదు శివగుప్తా, ఇంకా ఆసన మందే ఉన్నావా?

శివ (ఆసనంనుంచి జారగిల బడతాడు) మహారాజులు క్షమించవలె (ఆ కంఠంలో గాద్గద్యం పలుకుతుంది.)

శాత : రాజశాసనానికి దయాదాక్షిణ్యాలుండవు స్వపరభేదం పొడమదు

ఆర్య : కాని ధర్మాధికారికి అభియోజితుని వాఙ్మూలం శ్రోతవ్యం.

శాత . కాదనటం దేనికి? గుప్తునకు చెప్పుకోవలసినదేమైనా ఉన్నాదా? మల్లనాగుల వంక చూచెదవేం? ఆదేశించినది మేము

శివ : చిత్తం: ప్రభువుల శాసనం శిరసావహించి అల్పపరివారంతో శ్రీపర్వత విహారానికి వెళ్ళాను. వందల కొలది ఉద్భట శత్రుభటచరులు ధృతచీవరులై కనిపించారు వారిని బంధించి కొనిరావటం ప్రమాదకరమనిపించింది. ప్రభు కార్యం భగ్నం కారాదు మహాభట్టారిక పేరు చెప్పితే వారు కటకానికి తమకై తాము వస్తారని అబద్ధమాడాను. ఇదంతా రాజ్యక్షేమానికి, కార్యసిద్ధికి చేసినపని. మరొక ద్రోహచింత లేదు.

శాత . మేము లోతుపాతు లాలోచించలేని దుర్బలుల మనియేకదా శాసనధిక్కారం కావించింది?

శివ : ఇంక ప్రభువులే దిక్కు.

358 శాత . తంత్రమెగి శాసన ధిక్కారమొనర్చిన యీ ద్రోహికి మరణదండన

మల్ల . మహారాజులకు మనవి. బ్రాహ్మణుడు హంతవ్యుడుకాడని శ్రుతి స్మృ
తులు ద్ఘోషిస్తున్నవి.

శాత . రాజ్యరహస్యము లెరిగిన ద్రోహిని శత్రువుల కప్పగించలేము ఆమరణ కారాగార వాసం విధిస్తున్నాము. ఎవరురా అక్కడ? కొనిపొండి.

(శివగుప్తుడు రోదనంతో నిష్క్రమిస్తాడు)

శాత . ఇంక ఇతని నేరం?

మల్ల : ఒకటి కాదు ప్రభూ!

నాగా : నాలుగు.

మల్ల · (విస్మయంతో) నాలుగా! ఒప్పుకొంటున్నారన్న మాట!

ఆర్య : అంధచరుని దృష్టిలో అంతే.

శాత అంధచరుడా? అంటే

ఆర్య · మల్లనాగామాత్యులు ఉలికి పడరాదు మహాకరుణామృతం క్రోలి కాకోలం ఉమియరాదు (చూపుడువ్రేలితో హెచ్చరిస్తాడు )

బొమ్మ పడ్డింది

మల్ల . కారులు వ్రేలకు చూపుడు వ్రేలికి చుక్కలు రాలవు

ఆర్య ఈచూపు ఇతః పూర్వమున్నదేమో మహారాజు లాలోచించాలి

శాత ఆమాట వాస్తవం వీరికి చూపు చాలమివల్ల ఒకప్పుడొక పత్రం వేరొకరిచేత చదివించవలసి వచ్చినది. ఇప్పుడు దృష్టిదోషం లేదని స్పష్టమే

ఆర్య . దానికి కారణం ఎవరు? ఏ అనుగ్రహం ఈ మానిసికి చూపు ప్రసాదించిందో విచారించ మనవి.

శాత : మల్లనాగులేమంటారు?

మల్ల : ప్రభుహితైషులపై దోషారోపణ శ్రేయోదాయకం కాదు. వంశపరంపరాగత రాజభక్తుని ఒకర్ని అప్పుడే కోల్పోయారు.

శాత : (కీనుకతో నవ్వుతూ) బెదిరింపులు వాస్తవకథనాలు కావు.

మల్ల : (జంకుతో) శ్రీపర్వత విహారంలో సాగుతున్నకుట్ర పసికట్టటం కోసం సోమ దేవుడన్న మారుపేరుతో వైద్యాలయంలో చేరాను. చేరకపోతే బౌద్ధులకుతం త్రాలు ఎలా తెలిసేవి? ''ముంటిని ముంటి చేతనే పుచ్చవలె'' నని శాస్త్రం.

శాత . ఈ విషయం మాకు నివేదించావా? 359

మల్ల : క్షుద్రవిషయాలతో ప్రభువులను చీకాకు పరచరాదని మానివేశాను

శాత : బాగుబాగు. రేపు మాకు ప్రాణోపశమమే తల పెట్టరాదన్న నియమమున్నదా?

మల్ల : శివ శివా! మరి నీవేగతి ప్రభువుల కింక నివేదించుకొనలేను

శాత : అభియోగపత్రమెక్కడ?

మల్ల . చిత్తం. (రాజుకు పత్రం అందిస్తాడు)

శాత : బ్రాహ్మణుడవై బ్రతికిపోయావు ఈతనికిని ఆమరణవ కారాగార వాసమే విధిస్తున్నాము ఎవరా అక్కడ? ఇతనిని కొనిపొండి ఇరువురను ఒక్కచోటనే ఉంచరాదని చారపాలకునకు మా ఆజ్ఞ.

భటుడు· చిత్తం మహాప్రభూ!

(భటుడు మల్లనాగునితో నిష్క్రమిస్తాడు)

శాత ఇప్పుడు అసలు విషయం భిక్షువులకు తమపై ఉన్న అభియోగాలు తెలిసినవే కదా?

నాగా అవును మొదటిది ధర్మోపదేశం

శాత · మేము భిక్షువులము కాము మిమ్ము భిక్షకునూ పిలువలేదు

నాగా : నిజమే. పిలువక పోయినా లోకబాంధవుడు వెలుగు నివ్వడం లేదా? చిమ్మచీకటులు పటాపంచలు చేయటం లేదా?

శాత : మీవంటి తార్కికులు అసముచిత దృష్టాంతం ఇవ్వటం శోచనీయం

నాగా : నాయనా నీవు త్రిసముద్ర పీతతోయ వాహనుడవే అయిన నాల్గవ సముద్రం ఎరుగవు అతిభౌముడవే అయినా సార్వభౌముడవు కావు. అహంకారవిసర్జనం మేలే కాని కీడుకాదు. నా దృష్టాంతం బుద్ధ భగవానుడు. చర్మ చక్షువుకు గోచరించే అగ్నిగోళం కాదు.

శాత : యుక్తియుక్తమే కాని రాజధర్మం మీవాదాన్ని సైచదు క్షమించదు తరువాతి అభియోగం?

నాగా : చీవర పరిత్యాగ నిరాకరణ ఇది బౌద్ధ ధర్మ విహితం

శాత : విదేశీయ మ్లేచ్ఛులు దేశాన్ని ఆక్రమిస్తే మీ విహారాలెక్కడ ఉంటాయి?

ఆర్య · అట్టి మహోపద్రవం వచ్చినా ప్రతిక్రియ యోచించుకోవలసిన వారు భిక్షువులకాని ప్రభువుకాదు

360

శాత : అంటే ప్రభువు అధికారాన్నే ప్రశ్నిస్తున్నారన్న మాట! అంతేగా! తరువాత?

నాగా : కులపాలికాపరహరణం. ఇది మిథ్యారోపణమే. ఆమెను, బుద్ధపాలితను పిలిపించి విచారించవచ్చును.

శాత : రాచకొలమును రచ్చకీడ్వవలసిన అవసరం లేదు ఇది అపరాధంగా మేము పరిగణించము. తరువాత?

నాగా : పరభటులకు ఆశ్రయదానం.

శాత : మరి మీరాపని చేయలేదంటారా?

నాగా : పరులకు ఆశ్రయ మివ్వలేదు. దేశప్రజలకు, శాసనాలకు ఆశ్రయమిచ్చాము ఆర్తజీవులకు ఆశ్రయమిచ్చాము

శాత : మరి ఈ దేశానికి ప్రభువంటూ లేడా?

ఆర్య : మానవత్వమూ, శాంతిభద్రతలు అనేవి ఉన్నవి దానికోసమే బుద్ధభగవానుని ఉపదేశము, అమృతశాసనము

శాత : పాషండులతో వాదంలేదు ఈ దేశానికి ఈనాడు ప్రభువు గౌతమీపుత్ర శాతకర్ణి, కాని మీ బుద్ధుడు కాడు. మీరు కావించినది సామ్రాజ్యద్రోహం

దీనికి సముచిత దండన మరణశిక్ష కాని నాగార్జునుడు, నీవు పూర్వా
శ్రయంలో బ్రాహ్మణులు కనుక మీ యిద్దరిని దేశం నుంచి బహిష్క
రిస్తున్నాము ప్లాటినస్ మ్లేచ్ఛుడు అతనికి మరణదండనం స్వల్పశిక్ష.

ఆర్య ఒకే దోషాభాసానికి భిన్నశిక్షలు ఇదీ వైదిక ధర్మం!

శాత యెవరురా అక్కడ? వీరిని కొనిపొండి (శాతకర్ణి వెళ్ళిపోతాడు.)

ప్లాటి భగవాన్! ఇంక మీ కల్యాణ మిత్రత్వం ఈ దీనునకు కలుగదు ఇదే
నా అంత్య ప్రణామం.

నాగా (గద్గద కంఠంతో) నాయనా, నీకు లేనిపోని ఆశలు కలిగించాము వాటి
నన్నిటినీ మరచిపో!

ప్లాటి మీ అనుగ్రహం వల్ల మధ్యమాప్రతిపత్తిపొందాను. ఇప్పుడు నాకెట్టి విచారం
లేదు. నిర్విచారంగా ఉరికంబమెక్కగలను. కాని ఒకటే విచారం.

ఆర్య ఏమది?

ప్లాటి · ఈ అధికారోన్మతునకు ఎన్ని జన్మలకైనా సంబోధి కలుగుతుందా? మైత్రేయ
భగవానుడైనా కాపాడగలడా? అని నా విచారం. 361

నాగా : సోపధినిర్వాణుని నోట వెలువడవలసిన మాట చెప్పావు ఏది ఎక్కసారి
కౌగలించుకో!

భటులు. ఇంక పెద్దలు జాగుచేయరాదు

ప్లాటి : పినదేవులకు నమస్కారం

ఆర్య : నమస్కారం మనం సద్భిక్షువులము. కంట తడి పెట్టుకోరాదు. మరి సెలవు

(ప్లాటినస్ భటులతో నిర్గమిస్తాడు)

(పరుగు పరుగున వాసిష్ఠి వస్తుంది)

వాసిష్ఠి . తాతయ్యగారు! తాతయ్యగారు!

నాగా · వచ్చావా తల్లీ!

వాసిష్ఠి మీరు వెళ్ళిపోతున్నారటగా! ఇప్పుడే విజయ చెప్పింది.

నాగా విజయ ఎవరు?

వాసిష్ఠి : బుద్ధపాలిత అని చెప్పానే, ఆ అమ్మాయి. ఆనాడు మీ వద్ద పెద్ద
అబద్ధమాడాను క్షమించరూ!

నాగా : బుద్ధభగవానుడు కరుణామయుడమ్మా ఆయన అందరినీ క్షమిస్తాడు

వాసిష్ఠి : ఈ దుష్టప్రభువును కూడా!

నాగా : క్షమిస్తాడమ్మా, క్షమిస్తాడు

వాసిష్ఠి : అయితే ఆ భగవానుడుకూడ మంచివాడుకాడు.

నాగా : తప్పు. అలా అనరాదు జీవలోకానికి ఆశారేఖ కావాలి నీవైనా శాతకర్ణిని ద్వేషించరాదు. అతనిలోకూడ మంచితనం వుంది నీవు తప్పక పెండ్లి చేసుకోవాలి.

వాసిష్ఠి : నేనా, ఆ క్రూరకర్ముణ్ణా?

నాగా : అట్లనకు తల్లీ, నీవు రాణివికావాలి. నీ కొడుకు మహారాజుకావాలి. మకి వెళ్ళమా?

( ఆర్యదేవుడు, నాగార్జునుడు సాగిపోతుంటారు.)

వాసిష్ఠి : తాతయ్యగారూ, తాతయ్యగారూ

362 నాగా : (ఆగి) ఏమి తల్లీ?

వాసిష్ఠి : మా యింట్లో బొమ్మ యేడుస్తున్నది

నాగా : అవునమ్మా తెలుసు అది అలాగే యేడుస్తూ ఉంటుందమ్మా ఆ బొమ్మ మానవుల మనస్సులో మెదలిన నాడె లోకకల్యాణం ఈ మాటే మీ అత్తయ్యతో చెప్పు.

వాసిష్ఠి : (గద్గద కంఠంతో) నమస్కారం.

నాగా : కల్యాణ ప్రాప్తిరస్తు ( ఆర్యదేవ నాగార్జునులు మెల్లగా నడుస్తుంటారు)

(తెరలోపలి నుంచి)

జయము, జయము! మహాభట్టారికకు

గౌతమి : (రేగినజుట్టు, జేవురించిన ముఖం, సందిట రెండు మూడు బొమ్మలు) తొలగు, దారి విడువు! (విజయ పరుగునవచ్చి అడ్డుపడుతుంది) కట్టెదుట నిలువకు నిలువున నీరవుతావు నిప్పునకైనా మిగులవు (విజయ జంతకుతూ ఓసరిల్లుతుంది గౌతమి శూన్యంలోకిచెవియొగ్గి) అన్నన్నా, ఏమది?

బొమ్మ ఏడ్చింది

మహారాజు బిడ్డవు, రత్నాల మొలకవు. పక్కటిల్లక కక్కటిల్లుతున్నావా? ఏడువకోయ్ ఏడువకు! అయ్యయ్యో పక్కవాడి బొమ్మ బ్రద్దలు కొట్టకు!

బొమ్మలోయ్ బొమ్మలు
చిన్నారి బొమ్మలు, పొన్నారి కొమ్మలు
రంగు రంగుల బొమ్మలు
కుందనపు బొమ్మ, చందనపు బొమ్మ
ఆడేబొమ్మ, పాడేబొమ్మ
కులికేబొమ్మ పలికేబొమ్మ
ఎగిరేబొమ్మ ఏడ్చేబొమ్మ

(లాలనగా) జో, జో!

విజయ · అమ్మా, అమ్మా! (లోపలకు కొనిపోయే ఉద్దేశంతో) ఆ రెండు బొమ్మలేమి చాలుతాయి? లొనికి రండి కావలసినన్ని అందిస్తాను.

గౌతమి : ఇవిరెండా? ఎవరు చెప్పారు? నేనెవర్ని? తధాతను, తధాగతను, సిద్ధార్థను. కళ్ళుమూసుకో, కోరుకో, కోరుకొన్నన్ని అప్పుతెచ్చుకో నేను ఇచ్చా. ఇన్ (వట్టి గుప్పిలి తెరుస్తూ) ఏమిచ్చాను! 

వాసిష్ఠి అత్తయ్యా, అత్తయ్యా (గౌతమి వినిపించుకోదు) మహారాజులు మహాభట్టారికలు మనసు మాడిపోతున్నా కక్కరాదు పొక్కరాదు

గౌతమి : నీ మగడు మన్నుకాలేదు బిడ్డ గడ్డకాలేదు (కర్కశ కంఠంతో) ఆగండి, ఆగండి! ఎవరురా రక్షకులు! కత్తులు! ఒడ్డండి, ఎదురొడ్డండి అలాపోతే ఈ దేశం ఏమి కావాలి? పారుబోతును సంసారం నిశ్చలమతికి నిర్వాణం తప్పదు గాక తప్పదు.

వాసిష్ఠి : అత్తయ్యా, అత్తయ్యా!

గౌతమి · ఏమి మామయ్యా (వాసిష్ఠి చేతులలో వాలిపోతుంది)

ఆర్య (దూరాననుంచి లీలగావిని) అహోభగవానుల తత్త్వం దురవబోధం.

నాగా : ( ఔపయోగికంగా ఆర్యదేవుడందు కొంటుండగా అంటాడు)

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

## సంకేతితార్థాలు

1. రత్నత్రయం · త్రిశరణములు (బుద్ధం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి )

2. లోకేశ్వర : బుద్ధుని పేరు. అవలోకితేశ్వర అని నామాంతరము మహాకరుణతో సమస్త సత్త్వలోకమును కాపాడువాడు

3. వజ్రపాణి : బుద్ధుని మరొకపేరు.

4. షట్పారమితాదేవి : దాన, శీల, క్షమా, వీర, ధ్యాన ప్రజ్ఞలు అను షట్పారమితలకు అధిదేవత.

5. కల్యాణమిత్ర : నూతన భిక్షువుల చర్యలను గమనించి సలహాలిచ్చు బౌద్ధగురువు.

6 ఉపసంపద · బౌద్ధ దీక్షానుసారము సన్యాస స్వీకారము.

7 తారాదేవి · బౌద్ధుల విద్యాధి దేవత



8. సత్కార్యవాదం : కార్యకారణ అభేదాన్ని చెపుతుంది ఆ పక్షంలో అన్నమలములు అభిన్నములు కావలసివస్తుంది.

*(రాసింది 1973లో అచ్చయింది 1979లో)*